# స్వ వి ష య ము

భాషామణీ తృతీయ సంవత్సరమునం దిది ప్రథమసంచిక.

ఈనెలనుండి తపాలాధికారు లిటువంటి పత్రికలకు టపాఛార్జీలో సదుపాయము చేయుటకు వీలులేదని ప్రకటించియున్నారు. అందుచే మామూలు Book post లోనే పత్రికలు చందాదారుల కందచేయ వలసియున్నది. అనగా మూడురెట్లు పోస్టేజీతో పంపవలసియున్నది. అదియునుగాక కాగితముల ధర చాలా పెరిగినది. సుమారు రెట్టింపైనది. ఈ రెండు కారణములచేతను పత్రికాప్రకటనమున పూర్వము కంటె హెచ్చు వ్యయము కానున్నది. అయినప్పటికిని దేశముయొక్క యార్థికపరిస్థితులను దలంచి పత్రికను మామూలు చందాకే చందాదారుల కందచేయ నిశ్చయించితిమి. కావున తామెల్లరును నిరుటి వలెనే పత్రిక నాదరించియు తమ మిత్రులను ప్రోత్సహించియు, మాకు సహాయపడుదురని నమ్ముచున్నాము.

ఇందు బ్రహ్మశ్రీ చి॥ లక్ష్మీనరసింహకవిగారిచే రచియింపఁబడిన దుందుభి యను హాస్యరసప్రధానమగు నవలయును బ్రహ్మశ్రీ సాగి నరసింహము M. A. గారిచే రచియింపఁబడిన శ్రీ చిద్విలాసమను నాటకమును ; యితర కవివరులచే రచియింపఁబడుచున్న ఖండకావ్యములును ప్రహసనములును ; చిన్నకథలును ప్రకటింపఁబడుచుండును.

రెండవ సంవత్సరమున చందాబాకీయున్న చందాదారులు తమ చందాలను త్వరలో మా కందచేయ ప్రార్థించుచున్నాము.

సంపాదకుడు

## భాషామణి కార్యాలయమున వెలకు దొరకు గ్రంథములు.



1. అపోహావేశము. (నాటకము)
   దుర్గాశంకరామాత్య ప్రణీతము ... రూ 0—12—0
2. దంభప్రదర్శనము
   దుర్గాశంకరామాత్య ప్రణీతము ... రూ 0— 8—0
3. జ్యోతిషశాస్త్రము (జాతక భాగము)
   సుబ్రహ్మణ్య ప్రణీతము ... రూ 0— 8—0
4. శాపము (ప్రథమభాగము) నవల
   చిలకమర్తి లక్ష్మీనరసింహ కవి ప్రణీతము ... రూ 0—12—0
5. శాపము ద్వితీయభాగము రూ 1— 0—0
   (రెండు భాగములు నొకేసారి కొనువారికి) రూ 1— 4—0
6. త్రిమూర్తులటాకీ హాస్యరస ప్రధానమగు చిన్న
   నాటకము 0— 4—0
7. భీమేశ్వర శతకము
   పెనుమెత్స సత్యనారాయణరాజుగారు రూ 0— 2—0

---

# లోకబాంధవోపాసన

అను

## సూర్యనమస్కార వ్యాయామము

వెల నాలుగణాలు

వలయువారు,

(గ్రంథకర్త)

జోస్యుల శ్రీరామమూర్తిగారు

ఉండి (పడమట గోదావరిజిల్లా) అని వ్రాయవలెను.

శా. బాధల్ వొందుటకే సృజించితివొ దేవా! నీ వయో! దేహులన్
వ్యాధిగ్రస్తము లంచుఁ బల్కుదురు దేహంబుల్ బుధగ్రామణుల్
పాథోధిం బడబానలంబునను జేఁపల్ గారె మర్త్యుల్? దయాం
భోధీ! యేవిధి రక్ష సల్పుదొ జనమ్ముల్? భక్తచింతామణీ.

శా. స్వాతంత్ర్యంబు లవంబు లేనికతన స్సర్వేశ! మత్కార్యముల్
నీతోపించు తెఱంగునం జరిగెడున్ నే వేడుకొందున్ నినున్
జేఁతల్ క్షేమకరంబు లౌనవె సదా చేయింపు నాచేత నిన్
జేతోబ్జంబున నిల్పి సల్పుదుఁ గ్రియల్ శ్రీభక్తచింతామణీ.

శా. ఏయేసాయము నాకుఁ గావలయు నేయేవేళ సంసారమం
దాయాసాయముఁ జేయఁగావలయు నాయావేళ నీవీశ్వరా!
యేయొక్కండును స్వశక్తి మండలవిభుండే నెట్లు జీవించు? నీ
వే యాధారము జీవకోట్లకుఁ గృపాబ్ధీ! భక్తచింతామణీ.

మ. తనుభారంబువహింపనోపద పదద్వంద్వంబు విశ్వంభరా!
ననునెట్టుల్ నడిపింతొ వార్ధకమునన్ వృద్ధత్వమాసాధనం
బనుకూలం బొనరింతొ! మాతృపితృకృత్యం బూనెదో యేమియో!
జనమున్ జేసెదొ నీదెభారము; మహేశా! భక్తచింతామణీ.

మ. సమయంబుం గనిపెట్టి సన్నిధిని వాంఛన్ వేఁడికో సర్ధరా
త్రమునం దొంటిగ నుండువంచు దరిఁజేరం దేవ! యోగీంద్రు
దము నిన్నప్పుడె చుట్టిముట్టతొడగెన్ ధ్యానింప లేశావకా
శము నీకుండదు తెప్ప వాల్పఁ బరమేశా! భక్తచింతామణీ.

మ. పయిపైసృష్టి మునుంగు వెట్టుకొని దేవా! లోపలం దాఁగి యె
ల్లయెడన్ మాయ, నమాయికప్రజల నేలా మోసగింపంగఁ జి
న్మయ! నీసత్యత సర్వలోకబహిరంతర్యామితల్ లేక సం
శయ మావంతయు, నమ్మఁజేయుఁ బ్రజ; నీశా భక్తచింతామణీ.

శా. నీసాహాయ్యము గల్గ దేహికి జగన్నిర్మాత! భూతేశ్వరా!
నీసర్గంబు సమస్తమున్ స్వకృతులన్ జేదోడు వాదోడగున్
త్రాసం బొందగనీక రాజువెనువెంటన్ రాణువై; భక్తి వి
శ్వాసంబుల్ దృఢసాధనంబు లది గాంచన్; భక్తచింతామణీ.

శా. దినమున్ నీభజనం బొనర్తును ద్వదాదేశంబులన్ నాశిరం
బునఁ దాల్తున్ భవదీయభక్తతతితోఁ బొత్తుం బొనర్తున్ సదా
నినుఁ జింతింతు మనంబునన్ నిఖిలమున్ నీవంచు భావింతు నీ
యనుకంపన్ మనుదున్; జగజ్జనక! దేవా; భక్తచింతామణీ.

మ. పురుగుల్ కీటకముల్ ఖగంబులు మృగంబుల్ మానుసుల్ వాశ్చరో
త్కర మన్నింటికి రూపముల్ గుణములున్ గ్రాసంబులాయుస్సు సం
చరణంబుల్ వివిధప్రకారముల నేచందాన గల్పించితో
పరమాశ్చర్య మొనర్చు నామదికి దేవా! భక్తచింతామణీ.

మ. ఇహవాంఛల్ మదిఁ దట్టనీక పరలోకేశా! భవత్పత్పయో
రుహచింతాపరచిత్తవృత్తిఁ దుదియూర్పుం బుచ్చ నాపై నను
గ్రహముం జూపుము భక్తవత్సల! పునర్జన్మవ్యథం బాసి క్లే
శహయుష్మత్పదమందు మందు భవనాశా! భక్తచింతామణీ.

మ. విను మేకాంతపువిన్నపంబొకటి గావింతున్ సువిశ్వాసతన్
మనముం జూడగలాఁడ వంచెఱుఁగుటన్ మానంబుచే నీశ! నా
మనవిన్ వ్యర్థము నీవొనర్పవని సంభావించి నిశ్చింతతన్
నిను ధ్యానించుచుఁ గాలముం గడుపుదున్ నే భక్తచింతామణీ!

శా. ఏపేరన్ నిను నేస్వరూపమున నేయేరీతిఁ బూజించినన్
నీపై భక్తియె చూతుగాని మఱి దేనిన్ నీవు పాటింప; వో
పాపారణ్యకుఠార! సర్వమగు విశ్వంబీవె యౌటన్ నిరా
క్షేపం, బెట్లు భజించినన్ మనుతు రక్తిన్ భక్తచింతామణీ!

# లక్ష్మీసహస్రము
## (మచ్చుతునుకలు)

### ప్రారంభస్తబకము

గీ. శ్రీగణేశాత్మజాతుని, శ్రీగణేశు,
సర్వవిఘ్నవినాశకు, శాంతు, భక్త
కామితార్థప్రదాయకుఁ గరము గొలుతు
కావ్యనిర్విఘ్నసంపూర్తికై సతంబు. 1

చ. అతిమదదూషితాంధనరపాధములన్ సువచోవిలాససం
తతుల నుతించి చాలు, నొకదండమువారల కింక, నీదుసం
స్తుతుల నొనర్చి పాపభరశూన్యతఁ గాంచి యభీష్టసౌఖ్యవి
స్తృతుల నిహోర్ధ్వలోకముల నిమ్ముగఁ జూఱగఁ గొందు,శ్రీసతీ! 2

శా. వాణీజానిసుతుండు, వేదమయమావాహంబు, తల్పంబుగా
ర్వాణీశబ్దనియంత, తమ్ముఁడు కళావంతుండు, నీ కేనొని
ద్రాణప్రజ్ఞుఁడ, సంస్తవంబులనినున్ రంజింపఁగాఁ బూనితిన్,
మాణిక్యాపణమందు గుంజలను నమ్మంబూనిన ట్లమ్మరో! 3

చ. ప్రవిమలగాత్రి! పండితపురందరరంజకమైన మత్కృత
స్తవమసహిష్ణుపామరముదంబునుఁ బొందకపోవుఁగాక, నేఁ
దివురను దాసిఁగోరి, స్వరధీశుస కింపగుయక్షగానముల్
చెవిటిమనంబు రంజిలఁగఁ జేయఁగఁజాలునె, యెన్నఁడైననున్. 4

చ. సరసిజవాసినీ! కునృపసంఘమహాస్తుతికూపజాలమం
దరయమిఁగాలుజాఱి పడి యంధునిరీతిగ, నేఁడు వేంకటా
ధ్వరికవి త్వద్గుణస్తవసుధారస మానఁగఁబూనె; తింత్రిణీ
కరసవిశేషపాయి పులకండరసంబునఁ జొక్కురీతిగన్. 5

ఉ. కాలునఁగన్ను లేదు, మఱి కన్నులచే వినలేను, శీర్షముల్
నాలుఁగునైదునాఱునయినం గన; పుట్టను బుట్ట లేదు, కం
జాలయ! యిట్టినేను గొనియాడఁగఁ బూనఁగ నిన్ను భూజనం
బేల హసింపకుండు మది నిట్టినభస్థలహర్మ్యకర్మకున్. 6

ఉ. ఏతఱినైన ధాతృముఖు లెక్కువయాదురుగాని, తల్లి! నీ
యాతతమైన సద్గుణమహత్త్వము లెన్నెడువేళ, నేను నా
ధాతృముఖుల్సమానమతిధారులమే, శశి రాత్రివేళఖ
ద్యోతము గెల్చినన్ పవలు దోఁచిన రెండును నొక్కఁడే గదా! 7

చ. పటుతరసంస్తవంబులను వాక్పతి పొందుఫలంబె నాకునున్
గటుతరసంస్తవంబులన కల్గును, తల్లి! య దెట్టు లన్న ప్ర
స్ఫుటజపదానహోమములఁ బొందుమహాద్భుతవైభవంబు నే
యటుకులమాత్రమే పిడికె డాదృతి నిచ్చి కుచేలుఁ డొందఁడే. 8

మ. అమరేశాదులు త్వద్గుణామృతము నిత్యం బాని ధన్యోత్తముల్
కమలా! నేను భవద్గుణాబ్ధిఁగణముల్మాత్రాన ధన్యుండ, న
య్యమరుల్ గ్రోలుదు రందునుండి యమృతాహారంబుఁ దృప్తిన్ చకో
రములో రెండును మూఁడుబిందువులమాత్రన్ దృప్తినిన్ బొందవే. 9

చ. ఇతరములైనకావ్యము లవెన్నియొ యున్నను తల్లి! యిద్దినీ
స్తుతగుణలేశమాత్రబుధతుష్టినిఁ బొందు నటంచు నెంతు నీ
పతిచరణాబ్జజాతయని భర్గుఁడు జాహ్నవి నుత్తమాంగమం
దతిముద మొప్ప మోయడె! మహత్తరతీర్థము లెన్ని కల్గినన్. 10

# లక్ష్మీసహస్రము

(మచ్చుతునకలు)

## ప్రాదుర్భావస్తబకము

ఉ. అక్కులశాబ్ధిలో జనన మందె మహోద్వయి నీదువెంట నం
దొక్కటి విష్ణువక్షమున నొప్పెను, రెండవదామహంబు తా
నక్కుఅకంఠమస్తమున కందము సంఘటియించెఁ దల్లి ! నీ
ప్రక్కజనింపఁగాఁ గనిన భాగ్యమహోన్నతి గాదె వానికిన్. 11

సీ. సుమనస్సమూహముం జూచి గోదానామృ
తాన్నదానంబుల నమరఁజేసె
విబుధమాన్యుండయి వెలసెడు మఘవంతు
నకు నుత్తమాశ్వదానం బొనర్చె
సన్మార్గులకు మణిసంతానఫలవృక్ష
ములునాదిగలదానములను జరిపె
జడదారియై దిగ్వసనుఁడైన సర్వజ్ఞు
నకు సితాంశుకదాన మొకఁడొసంగె

గీ. నీజనకుఁడైన దుగ్ధాబ్ధిరాజు నిన్ను
పరమపురుషున కొసఁగెడుకొఅకు పరిణ
యవ్రతారంభదీక్షితు డైనవేళ
నలఘుసంపద్విధాత్రి, దుగ్ధాబ్ధిపుత్రి. 12

ఆ. గీ. నీదుమోముచంద్రునిం, బలుకమృతంబు
కరములును పదములుఁ గల్పవృక్ష
పల్లవములఁ బోలు తల్లి! వ్యర్థ మగునె!
అన్నఁబోలు చెల్లె లన్నమాట. 13

ఉ. ఇంచినరీతి మందరమహీధ్రము దిర్దిరఁదిర్గ దల్లిరో!
యంచితమైన ధింధిమితయన్ ధ్వని మద్దెలమ్రోఁతగాఁగ నా
చంచలభంగికావిపణసారసనేత్రలు మేజువాణిఁగా
వించిరి వాయువన్ నటునిప్రేరణ నీజననోత్సవంబునన్. 14

గీ. అమరనదిచేతఁ జల్లనౌహరుశిరమున
శశివసించెను; కరుణచేఁ జల్లనైన
హరియురంబున నుంటి వీవంబ! మీరు
పుట్టినింటికి తగునిల్లు మెట్టినారు. 15

గీ. అమ్మహావిష్ణుభుజమధ్యమనెడు మేటి
యత్తవారింటి కీ వేగునపుడు నీకు
సారెగా రత్నములను విస్తారముగను
నొసఁగె; నీతండ్రి రత్నాలయుండు తల్లి! 16

ఓమ్ నమో భగవతే జ్ఞానానందాయ

# శ్రీ చిద్విలాసము



(త్యాగికృతము)

[ శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యవర్య,
శ్రీ జ్ఞానానందగిరియతీంద్రుల కంకితము. ]

## ప్రథమాంకము.

జ్ఞానానందమయం దేవం నిర్మలస్ఫటికాకృతిమ్ ।
ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవ ముపాస్మహే ॥

నాంది

ఉ. ఎవ్వఁడు సంసృతిన్ విడిచి యింతయు వీడనియట్టు లుండు దా
దవ్వులనుండియున్ మిగులదగ్గఱ నున్నటు తోఁచుచుండుఁ దా
నివ్వరవిశ్వమంత నటియింపఁగఁ జేయును సూత్రధారియై
యవ్విధి ముఖ్యదుర్లభు ననంతుఁ దలంతు నభీష్టసిద్ధికిన్ ॥

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించి)

సూత్ర—(స్వగతము) ఈ కోటీశ్వరస్వామి తిరునాళ్లకు మానాటక సమాజము వచ్చినదని విని యుత్సవాగతులు రసజ్ఞులునగు పెద్దలు మమ్ములను 'చిద్విలాస'మను నాటకమును బ్రదర్శింప నాజ్ఞాపించిరి. అందువలన నీ సభ్యులయెదుట మానటన కౌశలమును జూపవలసి యున్నది. నటిని బిలిచి పాత్రధారణమున కనువగు ప్రయత్నముఁ జేసెదను. (చూచి) నటీ! నటీ!

(తెరలో) ఆర్యపుత్రా! ఇదే వచ్చుచున్నాను.

నటి—(ప్రవేశించి) అనుక్షణము నటీ! నటీ! యని పిలుచుచుండిన వంటపనుల నెట్లు చేసికొనఁగలను? ఏమి సెలవు?

సూత్ర—వంటపనుల కేమి? ఎప్పుడునుండునవియే యవి - రసికులగు నీ సభాసదుల కోరికపై నిప్పుడు చిద్విలాసమును బ్రదర్శింపవలెను.

నటి—(ఆలోచించి) ఆ! జ్ఞప్తికివచ్చినది. గ్రంథకర్త యూరు పేరులు లేని 'త్యాగి' గదా!

సూత్ర—అవును! అశాశ్వతములగు నామరూపము లెన్ని యున్నను నొక్కటియేయని 'త్యాగి' చిహ్నముతో నాయన తృప్తినంది నాఁడు.

నటి—మఱియేవో గ్రంథములను గూడ వ్రాసెనట గదా!

సూత్ర—వ్రాయ కేమి; కథాకావ్యసచ్చిదానందాదికములు గలవు

నటి—వానికి నంతగాఁ బ్రసిద్ధియే లేదే?

సూత్ర—అవున ట్లే సంభవించును.

గీ. మంచిపొత్తము లెల్లగడించుఁ గీర్తి
క్రమముగా వృద్ధియయి పెద్దకాలమునకు।
నప్రయోజనములు లేచి యడఁగునపుడె
కుక్కగొడుగులు తలలెత్తి కూలునట్లు॥

అదియుఁగాక కేవల మింద్రియలౌల్యమునకై వ్రాసిన గ్రంథములు లౌకిక స్వల్పసుఖములవలె బుద్బుదప్రాయము లగుచుండును. కావున నీకవి కేవలపారమార్థికబుద్ధితో భగవదాజ్ఞచే దీనిని హిమగిరి శిఖరప్రదేశములయందు వ్రాసెను.

నటి—కేవల పారమార్థికబుద్ధితో నున్నవారు నాటకముల నెట్లు వ్రాయగలరు?

సూత్ర—ఈశ్వరానుగ్రహముచే నన్నియు సాధ్యమగును.

ఉ. కొందఱు వేదభాష్యములఁ గొందఱు తత్స్మృతులన్ ఋషీశ్వరు
లొందఱు శాస్త్రజాలములఁ గొందఱు పూర్వపురాణసంఘముల్
కొందరు కావ్యము ల్మఱియుఁ గొందఱు నాటకముల్ రచించి రా
యందఱుప్రజ్ఞకాతఁడె యనంతుఁడు కారణమెల్లభంగులన్.

నటి—అయిన మీరు నొకనాటకమును వ్రాయరాదా?

సూత్ర—వ్రాయ కేమి? ఎన్ని నాటకములు వ్రాసినను నాడినను నిహమే గాని పర మావంతయు గోచరించుటలేదు. ఈనాటకము నాడిన తరువాత వైరాగ్యముఁజెంది తపమునకై హిమాలయముల కేగె దను. అప్పుడన్నియు సాధ్యపడును.

నటి—అయ్యో! ఇఁక నాగతియేమి? పిల్లలెట్లు జీవింతురు?

సూత్ర—అందఱకు నా చిదానందస్వరూపుఁడే దిక్కు.

(తెరలో) ఓహో! ఎవరో చిదానందనామస్మరణము చేయు చున్నారు.

సూత్ర—(నిరూపించి) అదిగో యప్పుడే మనసూర్యుఁడు శ్రీ చిదానంద యోగిపాత్రమును ధరించి వచ్చియున్నాఁడు.

ఇఁక మనమాలసింపరాదు. సత్వరమేగి నీవు మోహినివికమ్ము. నేను గంధర్వుఁడనయ్యెదను.

నటి—చిత్తము. (అని నిష్క్రమించును.)

సూత్ర—నేనును సిద్ధపడెదను. (అని నిష్క్రమించుచున్నాఁడు.)

(ఇది ప్రస్తావన)

---

# శ్రీ చిద్విలాసము



## ప్రథమాంకము

---

### 1 వ రంగము—కుండిననగర బాహ్యారణ్యము

[ శ్రీ చిదానందయోగి ప్రవేశించి, నిరూపించి ]

శ్రీ—(తనలో) ఓహో! ఎవరో చిదానంద నామస్మరణముఁ జేయుచున్నారు. నాతో వారికేమైన పనిగల్గియుండునా? (ఆలోచించి) లేదు. లేదు. ఇది ప్రస్తావవశమున వారి నోటవెలువడిన మాటయే గాని భక్తితో నుచ్చరించిన పలుకుగాదు. ఈలోకమున సామాన్యముగ నందఱకు నన్నిపనులుండును. భగవచ్చింతన చేయువారును బ్రహ్మవిచారము చేయువారు నరుదు. శ్రీశంకరాచార్యులవారు చెప్పినది సముచితము.

బాలస్తావత్క్రీడాసక్తః । తరుణస్తావత్తరుణీసక్తః ।
వృద్ధస్తావచ్చింతాసక్తః । పరేబ్రహ్మణికోఽపినసక్తః॥

భజగోవిందమ్. (అని పాడి)

ఎక్కడి హిమాలయములు? ఎక్కడి కుండిననగరము? అచ్చటి నుండి యీ యాంధ్రదేశమునకు వచ్చుటకెన్నియో దినములు పట్టినది. పరిపూర్ణులగు మహర్షులకు బ్రహ్మానందము నిత్యమునొసంగు హిమాలయము లెక్కడ? మాయావిలాసమునకు మిక్కిలి యాటపట్టగు నీ పురమెక్కడ? కేవల మీశరీరమునకు సంబంధించిన ప్రారబ్ధమున నిచ్చటికి రావలసి వచ్చినది. లేకున్న

సీ. మందశీతసుగంధసుందరమలయవా
యులను వర్జింపనెట్లలవియగును ?
నవసుధానీకాశ ధవళనీహారాంబు
వులను వర్జింప నెట్లలవియగును ?
సుమనోమనోహర సుస్వాదు ఫలవృక్ష
ములను వర్జింప నెట్లలవియగును ?
మృదులశయ్యా సుఖాస్పద సైకతస్థల
ములను వర్జింప నెట్లలవియగును ?
గీ. అలవియేవీడ స్వర్ధునీ కలితశోభ ?
యలవియేవీడ గిరిగహ్వరాళిసుఖము ?
లలవియేవీడ ఋషిసమూహముల మైత్రి ?
యలవియేవీడ నచటి బ్రహ్మానుభూతి ?

అయినను బ్రసంగవశమున ననుకొంటిఁగాని ద్వంద్వాతీతస్థితిలో నన్నిస్థలములును సమానములే.

ఇచ్చటికి వచ్చినందులకుఁ బ్రయోజనముగ లోకులు తరించు నుపాయ మరయవలసియున్నది. బెల్లమున్నచోటికిఁ జీమలు చేరునట్లు నేనిటనున్న మూడుదినములలో నాకడకు వేలకువేలు ప్రజలువత్తురు. వారు సంసార సాగరమగ్నులై తరణోపాయముగానక దుఃఖించు చున్నారు. కావున రాగద్వేష రహితమును, సచ్ఛీలసంవర్ధకమునైన యోంకారమతము నుపదేశించి వ్యక్త్యనుగుణములైన సాధనముల బోధింపవలెను.

(ఆలోచించి) అన్నట్లీ రెండుదినములలోనే ముగియఁగల నాటక మొకటి గలదు. అదిముందే నిర్ణీతమైయున్నది. నామాయావిలాసము

నకు నేనే యానందించి యాయాపాత్రముల నాదరించుటయు సంభవించును.

ఇఁక నొకటి రెండు నిమిషములలో నొక శిష్యుఁడు రానున్నాఁడు. అంతలో స్వేచ్ఛగ నొక్కమాఱు భగవన్నామ స్మరణము చేసెదను.

"ఉ. మూఁపున వామకుండలము మోవి నొకించుక మోడ్పునందమున్
జూపెడునోరచూపు సొగసుంబొమనొక్కట నిక్కగన్పడన్
గ్రేఁపులు సొక్కఁగల్పకము క్రిందఁద్రిభంగిగ నిల్చియంగుళీ
వ్యాపిత వంశపూర్తియయి వర్తిలు మోహనమూర్తిఁ గొల్చెదన్"

ఇది విష్కంభము.

[అంతట దూరమునుండి శిష్యుఁడు ప్రవేశించును.]

శిష్యుఁడు—(తనలో) ధన్యోఽస్మి ధన్యోస్మి. అక్కడ నెవ్వరో యొక మహానుభావుఁడు దివ్య తేజముతోఁ బ్రకాశించుచు భగవత్సంకీర్తనముఁ జేయుచున్నాఁడు. నాపంట పండినది. ఇదే సమీపించి సాష్టాంగదండప్రణామము చేయుదును. (సమీపించి) (అంజలి ఘటించి) శ్రీయోగిచంద్రా, మహాత్మా, మీరు తప్ప నన్నుఁ దరింపఁజేయ దిక్కెవరును లేరు. ఇవే సాష్టాంగదండప్రణామములు. అభయమిచ్చినఁగాని లేవఁజాలను. (పాదములపైఁ బడును.)

శ్రీ—అభయమిచ్చితిని. లెమ్ము. (లేవఁదీసి) నీ వింక నాకడ నిశ్చింతగ నుండవచ్చును. కాని లోకములో ననేకులు నావంటి బైరాగులుందురుగదా. నేనే తరింపఁజేయుదునని యెట్లు నమ్మితివి.

శిష్యుఁడు—నే ననేకులను జూచితినిగాని యిట్టి యావేశ మెప్పుడును గలుగలేదు. నా కొక యనిర్వాచ్యానందము కలిగినది. దానికి నాహృదయము సాక్ష్యము.

శ్రీ—నీ వెప్పటినుండి మార్గదర్శకునికొఱకుఁ దిరుగుచున్నావు.

శిష్యుఁడు—ఆఱుమాసములనుండి.

శ్రీ—అయిన నీపూర్వవృత్తాంతమును సంగ్రహముగఁ జెప్పుము.

శిష్యుఁడు—నేను శిష్టాచారముగల యొక బ్రాహ్మణకుటుంబమునకుఁ జెందినవాఁడను. వేదశాస్త్రాధ్యయనము గావించియుఁ బట్టణ నివాసమును, ఉద్యోగము నాకాంక్షించి యీయూరుఁ జేరితిని. ఉపాధ్యాయుఁడనుగఁ గొంతకాలమునుండి తుదకొక న్యాయవాది వద్ద లేఖకుఁడ నైతిని.

శ్రీ—ఎవరియొద్ద..

శిష్యుఁడు—ఈయూరిలోఁ గందర్పరావుగారను వకీలువద్ద. అక్కడ ధనార్జనమునకై నేను సలిపిన యకార్యములకు లెక్కలేదు. కందర్పరావుగారును వారి భార్య మోహినియు నిరంతరమన్మథో పాసకులు. దుష్టులు. వారికొఱకు నేను గావించిన ద్రోహములు చెప్ప నలవిగానివి. తుదకొక దినమున నాకపారవైరాగ్యము గలిగినది.

శ్రీ—విరక్తుఁడవై యేమి చేసితివి.

శిష్యుఁడు—నిద్రాహారములు వర్జించి బంధువుల నిర్బంధములకు లొంగక గురువు నన్వేషించుచుండఁ దమ సందర్శనముతో నా జన్మము సఫలమయ్యెను.

శ్రీ—మంచిది. నీకుఁ దగు సాధనము నుపదేశింతును. నే నిట మూఁడు దినము లుందును. ఈ యవకాశమున వచ్చు భక్తులకు నీవును మన యోంకారమతము నుపదేశించుటలో నాకుఁ దోడ్పడవలెను.

శిష్యుఁడు—మహాభాగ్యము. చిత్తము.

శ్రీ—అటుపై హిమాలయముల కేగి తపము గావించినచో నీసమస్య లన్నియు విడిపోయి ముక్తి లభించును.

శిష్యుఁడు—చిత్తము. అనుగ్రహింపఁబడితిని.

శ్రీ—ఈలోపలనే కందర్పుని కాముకత్వమునకుఁ దగిన ఫలముగూడ దృగ్గోచరమగును.

శిష్యుఁడు—దేవా! ఏమగును?

శ్రీ—ఈ లౌకికవిషయములను గూర్చి యిఁకఁ బ్రశ్నింపకుము. నీబుద్ధి యాధ్యాత్మికములయందే ప్రసరింపవలెను. నేను భగవత్సంకీర్తనము గావించుచు నిన్నిప్పు డొక యేకాంతస్థలమునకుఁ గొనిపోయెదను. నావెంట రమ్ము.

సత్సంగత్వే నిస్సంగత్వం
నిస్సంగత్వే నిర్మోహత్వమ్ ।
నిర్మోహత్వే నిశ్చలతత్త్వం
నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః ॥ భజగోవిందమ్.

(అని పాడుచు ముందు యోగి వెడలును. వెనుకనే బద్ధాంజలియై శిష్యుఁడును నిష్క్రమించును.)

[తెర పడును]

ఇది ప్రథమరంగము.

---

మణి

# దుందుభి

మొదటి యుల్లాసము.

అవతారములయందు హిందువులకు గల విశ్వాస మసాధారణము శ్రీమన్నారాయణుఁడు దుష్టసంహారంబును శిష్టసంరక్షణంబును జేయుటకు యుగయుగంబులయందును నవతరించెనని మన పురాణేతిహాసములు ఘోషించు చున్నవి. అందుచేతనే శ్రీహరి నీచమనక మత్స్య కూర్మ వరాహ నరసింహాది జలచర భూచరావతారములను దాల్చెననియు పిమ్మట వామనాది మానవావతారముల ధరించెననియు మనవారు నమ్మి యాయవతారములు విగ్రహములు చేయించి యాలయములు గట్టించి వానినారాధించి తత్ చరిత్రములు పఠించి ధన్యులగుచున్నారు. హరియేగాక హరిని నిరంతరము బాయక యుండు శ్రీమహాలక్ష్మియు భూలోకమున మానవాంగనారూపమున జన్మించెనని గాథలు చెప్పుచున్నవి. విష్ణుదేవుఁడు రాముఁడైనప్పుడు లక్ష్మి సీతాదేవియయ్యెను ఆయన యదువంశమున వాసుదేవుఁడైనప్పుడు రమాదేవి రుక్మిణియైజన్మించెను. దీనినిబట్టిజూడ స్త్రీలు కూడనవతారము లెత్తుదురని తేలుచున్నది. భగవంతుఁడొక్కఁడే అవతారములు ధరించినట్లు గనబడదు. నారాయణుని పరిజనముకూడ భూలోకమున నవతరించినట్లే మనము గ్రంథములలో జదువుచున్నాము. పద్మనాభుఁడు పవ్వళించుటకుపానుపైన ఫణిరాజు శేషుఁడు మనుష్యుఁడై పతంజలియనుపేర పుడమిమీఁదపుట్టి, పాణిని రచియించిన సంస్కృత వ్యాకరణమునకు మహాభాష్యము వ్రాసెనని పెద్దలు చెప్పుచున్నారు. ఆశేషుడే విష్ణుడవతారములనెత్తి భూలోకమునకు పోయినప్పుడు ఆయన

నెడబాసియుండలేక రామావతారమున లక్ష్మణుఁడై పుట్టి యావజ్జీవము రామునికిఁ బరిచర్యలు చేసి కృతకృత్యుఁడయ్యెనట. ఆ శేషుఁడే భగవంతుఁడు కృష్ణావతారమెత్తినప్పుడు, బలరాముఁడై ప్రభవించి తమ్మునకన్నివిధముల తోడ్పడెనట. ఆ శేషుఁడే కలియుగమున శ్రీవైష్ణవ మతముద్ధరించుటకై రామానుజాచార్యుఁడై శ్రీపెరుంబుత్తూరు గ్రామమున బుట్టి వేదవ్యాసుని బ్రహ్మసూత్రములకు శ్రీభాష్యమనుపేర గొప్ప వ్యాఖ్యానము వ్రాసెనని విశిష్టాద్వైత మతస్థులు నమ్ముచున్నారు. ఇట్లే ముఖ్యప్రాణదేవుఁడను నామాంతరముగల వాయుదేవుఁడు శ్రీవిష్ణుసేవ జేయదలచి రామావతారమున హనుమంతుఁడై యవతరించి కృష్ణావతారమున భీమసేనుఁడై యుదయించి కలియుగమున, దుర్మతముల ఖండించి విష్ణుమతమును సంస్థాపించి లోకమునను గ్రహించుటకై కన్నడదేశమున ఉడిపి, అను గ్రామమున మధ్వరాయలై ప్రభవించెనని ద్వైతమతస్థులు విశ్వసించుచున్నారు. అవతారము లంతతో బోలేదు. నారాయణుఁడు కంఠమున ధరించు వైజయంతి యను పుష్పమాలకూడ భూమండలమున ద్రవిడదేశమున శ్రీరంగక్షేత్రమునందు తొండరడిప్పొడి యాళ్వారనుపేర మానవాకృతిని ధరించి రంగనాయకస్వామివారి కైంకర్యములుచేసినట్లు పన్నిద్దరాళ్వారి చరిత్రములలో గనబడుచున్నది. అవతారములందు విశ్వాసము వైష్ణవులకేగాక శైవులకుగూడ కలదు. శివునివాహనమైన వృషభము వైష్ణవాది పాషండమతములను నిర్మూలించి పవిత్రమైన పరమశైవమతమును జగన్మండలమున సంస్థాపించుటకై బసవేశ్వరుఁడై పుట్టి శైవమతము నుద్ధరించెనని లింగధారులు మొదలగువారు నమ్ముచున్నారు. ఈ విధంబుననే భగవంతుఁడైన జుహోవా కుమారుఁడు యేసుక్రీస్తయి పుడమిమీద పుట్టి తన్ను నమ్మిన మానవకోటిపాప

ములనెల్ల తానేభరించి వారిని నరకవిముక్తులఁజేసి తన్నిమిత్తము తన ప్రాణముల ధారవోసి శిలువమీాద మృతినొందెనని క్రైస్తవుల ధృఢ విశ్వాసము. ఒక పరమభాగవతోత్తముఁడు గోవింద భజన తత్పరుఁడై జయదేవుఁడను పేర వంగదేశమునబుట్టి గీతగోవింద మను పేర కృష్ణలీలలు గేయములుగా వ్రాసి మరియొకజన్మమున నారాయణతీర్థులను పేర ధరణిపై నుద్భవించి కృష్ణలీలాతరంగములు రచియించి మూఁడవజన్మ మున లీలాశుకుండను పేర నవతరించి కృష్ణకర్ణామృతము రచించెనని దేశమున గొప్ప వాడుక గలదు. కపిలమహాఋషి నారాయణావతార మని భాగవతముననే చెప్పబడినదికదా? వైకుంఠమునందు ద్వారపాలకు లైన జయవిజయులను నన్నదమ్ములు నిత్యముక్తులు పరమభాగవతులు నైన సనక సనందనుల శాపముచేత మూఁడుపర్యాయములు రాక్షసావ తారములు దాల్చిరని విష్ణుపురాణగాథలు విశదీకరించుచున్నవి. వారు మొట్టమొదట హిరణ్యాక్ష హిరణ్యకశిపులై జన్మించి రెండవ సారి రావణకుంభకర్ణులై ప్రభవించి మూఁడవసారి శిశుపాల దంత వక్త్రులై భూమండలమున పుట్టి సాధుజనులను హరిభక్తులను నానావిధ ముల హింసించి తుట్టతుదకు హరిచేత తెగటారి స్వస్వరూపములను పొందిరని భాగవతము ప్రకటించుచున్నదిగదా! శ్రీమధ్వరాయల వారు స్థాపించిన యుత్తమమతమగు ద్వైతమతమును పాడుచేయుటకై మధ్వరాయలవారు పూర్వజన్మమున ద్వాపరయుగమున భీమసేనుఁడై యున్నప్పుడు వానితో విరోధపడిన యొకరాక్షసుడు కలియుగమున శంకరాచార్యులై పుట్టి మధ్వమతమునందు తప్పులుపట్టి ఖండించి మనసులోనున్న వెనుకటి అక్కసున్కొంత తీర్చుకొనెనని మధ్వవిజయ ములలో నున్నది. పైనుదహరింపఁబడిన గాథలు చూడగా మేలుచేయు టకేగాక కీడుచేయుటకుగూడ కొందరు జన్మముల నెత్తుచుందురని

స్పష్టమగుచున్నది. అందుచేత దుష్టమతులైన రాక్షసాదులుకూడ భూలోకమున నేదోకొంత యపకారము జనులకు జేయుటకు నవతరించుచుందురని మనమునమ్మవచ్చును. అట్టివారిగాథలు వ్రాయుటకు పురాణములు నిర్మించుటకును వ్యాసవాల్మీకులవంటి మహానుభావులు దివ్యజ్ఞానవంతులు పరోపకారపరాయణులు నేటికాలమున లేరు. ఉన్నపక్షమున నీ రాక్షసుల యవతారములనుగూడ వర్ణించియుందురు. వ్యాసాదిమహాఋషులు వ్రాయకపోయినను మనలో కవులయినవారు పూర్వము కొందరు మండగుల యద్భుత చరిత్రములను నేదో విధముగ చాటుధారాపద్యములుగా వర్ణించియుండిరి. అందొక ఉదాహరణము చిత్తగింపుడు ప్రకాశరాయడను మంత్రియొకఁ డేరాజు కడనో యమాత్యుఁడై యుండి జారుఁడై భూజనులను భాధపెట్టినట్టు కవి యొకడీక్రింది పద్యమును మిక్కిలి చమత్కారముగా వ్రాసెను.

చం. ఇరువదిచేతులుం దలలు నెక్కువతక్కువ యంతెకాని పీ
డరయగరావణాసురుని యంతటివాఁడు ప్రకాశరాయఁడీ
శ్వరపదభక్తికిన్ సమరశక్తికి ధర్మముపై విరక్తికిన్
బరవనితానురక్తికిని బ్రాహ్మణుసొమ్ము హరించుయుక్తికిఁ.

ఇందు వర్ణింపఁబడిన విధముగ ప్రకాశరాయఁడొక్కడే గాక రావణాసురుని యవతారముల నెత్తిన చండశాసనులు ప్రపంచమున పలువురుగలరు. అట్టివారిలో నొకఁడైన చింతలపాటినీలాద్రిరాజును గురించి కూచిమంచిజగ్గకవి చంద్రరేఖావిలాపమను ప్రబంధమునువ్రాసి యాతనిదుర్గుణములను పెక్కువిధముల వర్ణించెను. మరియు గోదావరీ మండలమున నుండిన పిండిప్రోలులక్ష్మణకవి రావణదమ్మీయమను కావ్యమునువ్రాసి దమ్మరాజుయొక్కదౌర్జన్యములను వివరించెను. ఈ రెండును పురాణములనియు నీ గ్రంథములు వ్రాసినకవులు వ్యాసవా

ల్మీకులనియుఁ జెప్పవచ్చును. నేటికిగూడ పదితలలు నిరువదికన్నులు నిరువదిచెవులు నిరువదిచేతులు లేని రావణులు మనపట్టణములలో పల్లియలలోనువసియించుచున్నారు. అట్లే హిరణ్యాక్షులు హిరణ్యకశిపులు కుంభకర్ణులు నరకాసురులు తారకాసురులు బాణాసురులు వజ్రనాభులు మొదలగువారు ప్రతిదినము మనకంటబడుచుందురు. వారిదారుణకృత్యములు మనము వినుచునేయుందుము. అందుచేత దేవతలేగాక దానవులుగూడ భూలోకమున నవతరించుచుందురని మనము విశ్వసింపవచ్చును. అసురులయంశమున మానవులు పుట్టుచుందురని భగవద్గీతలో శ్రీకృష్ణభగవానులు చెప్పియుండలేదా ఈశ్లోకము చూడుడు—

శ్లో॥ దంభోదర్పోఽభిమానశ్చ, క్రోధఃపారుష్యమేవచ

రాక్షసాంశమున పుట్టినవారి లక్షణములు పైశ్లోకమున పేర్కొనబడినవి. రావణుని శిష్యులైన మారీచునియొక్కయు కాలనేమియొక్కయు నంశమున బుట్టిన యసాధారణ ప్రజ్ఞావంతులు శక్యమైనంత చెఱుపు జేయుచు లోకమున విహరించుచున్నారు. పురుషరాక్షసుల యవతారములేగాక రాక్షసాంగనల యవతారములు గూడ ప్రపంచమున మనము జూచుచున్నాము. దశకంఠునిచెల్లెలైన శూర్పణఖ సహజముగా వికృతరూపిణియయ్యు జగదేకసుందరుఁడైన రామచంద్రుని వలచి యాతని సాంగత్యము సంపాదించుటకు మనోహరాకారము ధరియించెనని రామాయణములోఁ జెప్పబడియున్నది. ఆ మెనేడులేకున్ననూ నీకలియుగమున వేలకొలది యవతారములు ధరించి తనయ మానుషచర్యలవల్ల లోకమును కొంతదుఃఖపెట్టుచు కొంతవినోదపెట్టుచు నున్నదని చెప్పుటకు సందియములేదు. ఈకలియుగమున ఆకారముచేతను గుణములచేతనుగూడ కొందరంగనలు చుప్పనాక యంశమున నవతరించిరని చెప్పదగిన పడతుకలు పెక్కండ్రుగలరు. సూర్ప

ణఖ యనగా చేటలవంటిగోళ్లుగలది. ఆమెయవతారములైన యీనాటి యంగనలకు చేటలవంటి గోళ్లు లేకపోయినను ప్రజ్ఞలో యామెతో నుపమింపదగిన లక్షణములున్నవి. ఈకథానాయకురాలైన దుందుభి సూర్పణఖయొక్క యవతారమేమోయని నాకుగూడసందియము తోచుటచే నవతారములనుగూర్చి యింతవట్టు వ్రాయవలసివచ్చినది. నాసందేహము యదార్థమగునో! కాదో! పాఠకమహాశయులు మా దుందుభియొక్క చిత్రచరిత్రము చదివినపిదప తమంతట తామే నిర్ణయింపఁగలరు.

---

రెండవయుల్లాసము.

---

దుందుభిశబ్దమునకు ముఖ్యమైన యర్థములు నాలుగు గలవు. దుందుభియనగా ధణధణ మ్రోగెడి భేరి, ఆపేరుగల రాక్షసుడుకూడ నొకఁడుకలడు. దుందుభియనునది యరువది సంవత్సరములలో నొక సంవత్సరము. అది వరుణదేవునకుకూడ పర్యాయపదము. ఈకథానాయకురాలు పుట్టినప్పుడు తల్లిదండ్రులు పేరుపెట్టలేదు. ఈమె మాతామహుని యింట దుందుభిసంవత్సరమున జననమందినది. ఆకారణమున మాతామహుఁడు ముద్దుపేరుగా దుందుభీ యని యీచిన్నిమనుమరాలినిపిలుచుచుండెడివాడు. దానింబట్టి యాగ్రామమందలి వారందరు పసితనంబున నుండియు నామెను దుందుభి, దుందుభి యని పిలువఁజొచ్చిరి. నాటనుండి యానామమే లోకమందు వ్యవహరింపబడియెను. తాతగారు ముద్దునకో పరిహాసమునకో యాపేరుతో పిలిచినను కథానాయకురాలి కానామము సార్థకమైనదని సందియములేక చెప్పవచ్చును. ఎట్లన దుందుభి

సంవత్సరజననము చేత దుందుభినామధేయము సార్థకమేకదా, దుందుభి యను రక్కసుఁడుగూడ కలడని చెప్పితినిగదా. ఈమెజననముచేత మానవ జాతికి జెందినను గుణములచేత రాక్షసజాతిలోచేరినదని ముందుముందు మీరేగ్రహింపగలరు. అందుచేత రాక్షసపరముగ జూచినను నానామ ధేయము ఆమెకు సార్థకమే. భేరీశబ్దమీమె కెట్లు సార్థకమగునని మీర డుగవచ్చును. ఆమె కంఠమెత్తి మాట్లాడెనా ఆధ్వని భేరీధ్వనివలెనే యుండును. కలహమాడెనా యామెకంఠస్వరము పదిభేరీలు మొఱసి నట్లుండును ఏతత్ కారణమునగూడ దుందుభిశబ్దము ఆమెకు సార్థకమే. మూడువిధములుగా పేరుసార్థకమయిన యప్పుడు వరుణదేవుని పరమ యిన యర్థము సార్థకము గాకపోయిన నేమిలోపము. అయిన నదిగూడ సార్థకమగునేమొ చూతము. వరుణదేవుని యాయుధము పాశము; ఆపాశముచేత పాపాత్ములనుబట్టి బాధించునని పురాణమందు ప్రసిద్ధ మైనది. ఈమెహస్తమునగూడ పాశమను గొప్పయాయుధము గలదు. అదియేపాశమనగా తొడపాశము. ఆడవారిమీద నామెకు కోపము వచ్చినప్పుడు చిన్నలనక పెద్దలనక యామెయెల్లవారికి తొడపాశము పెట్టుచుండును. ఆమెపట్టుకొన్న శరీరభాగము మిక్కిలియుబ్బి ఎఱ్ఱబడి కాలిన పనసగింజవలె నుండును. మగవారిలో జిన్నపిల్లలమీద నామె యీయాయుధమే ప్రయోగించును. పెద్దవారైనచో బుగ్గపాశము పెట్టును. పూర్వోదాహృతమైన కారణముచేతగూడ దుందుభిశబ్దము వరుణదేవపరమైనప్పుడు సయితము నీమెయందు సార్థకమైనదని చదు వరులు గ్రహింతురుగాక! అదిసరేకాని దుందుభిశబ్దము పుంలింగము గదా. ఆనామము స్త్రీకి పెట్టవచ్చునా? యని మీమనంబులు శంకా సంకలితములు కావచ్చును. ఆశంకలకు దగుప్రత్యుత్తరములు లేకపో లేదు. రాముఁడు, కృష్ణుఁడు, నారాయణుఁడు, గోపాలుఁడు, పద్మనాభుఁడు,

నరసింహుఁడు, అచ్యుతుఁడు, జనార్దనుఁడు మొదలగుపదములు పుంలింగ ములుగదా! అయినను మనదేశమున రామమ్మ, కృష్ణమ్మ, నారాయణమ్మ, గోపాలమ్మ, పద్మనాభమ్మ, నరసమ్మ, అచ్యుతమ్మ, జనార్దనమ్మ, అని స్త్రీలకు పురుషనామములు పెట్టుటలేదా? అలాగుననే ఉమ, గౌరి, సీత, శాంత, లక్ష్మి, మొదలగునవి స్త్రీలింగశబ్దము లయినను ఉమన్న, గౌరయ్య, సీతయ్య శాంతయ్య, లక్ష్మయ్య, మొదలగునవి పురుషనామములుగా మనవారుధరించుటలేదా? పురుషులను స్త్రీలుగాను స్త్రీలను పురుషులుగాను రూపరేఖావిలాసములలో గాకపోయినను నామములలోనైన మార్చునట్టియద్భుతశక్తి తక్కినదేశములమాట యటుండగా మన తెలుఁగుదేశమున నెల్లవారికిగలదు. ఈ నామములన్నియు దేశమున చెల్లుబడి యగుచుండగా మా దుందుభి నామము దేశమున నేల చెల్లుబడికాదో! ఏలదోషమగునో నేనూహింప జాలకున్నాను. వ్యాకరణశాస్త్రపండితులు శబ్దనిర్ణయ సమయమున నొండొరులతో వాదములు చేసుకొని పెనగులాడి యేకీభావము కుదరక తిట్టుకొనియో కొట్టుకొనియో సభాస్థలి విడిచిపోవుదురుగాక. మనకా బాధలేదు. అవియన్నియటుండగా దుందుభికడ ననేకపురుషలక్షణము లుండుటచేత నేశాస్త్రము ననుసరింపకయే వ్యాకరణమును సరకు సేయకయే పుంలింగశబ్దము ఆమెయం దన్వయించెనని చెప్పవచ్చును. ఆమె నామముయొక్క సాధుత్వమును మేమునిర్ణయింప నవసరములేదు. భాష్యాంతమువరకు వ్యాకరణము జదువుకొన్న యేమహాపండితుఁడు వచ్చి ఆమెయెదుట నిలిచి ఆమె పేరుసంగతి నెత్తనిండు వెంటనే యావిద్వాంసుడు యామెవాక్ప్రవాహములోబడి కడుదూరము కొట్టుకొని పోవలసినదే. లేదా మహామారుతముచేత నెగిరిపోవు దూదిపింజవలె నిలువలేక యెగిరిపోవలసినదే. దుందుభి యాంధ్రదేశ నారీమణు

శ్రీ

# లక్ష్మీ సరస్వతీ సంవాదము.



సరస్వతి—(ప్రవేశించి) అబ్బా! అత్త పోరువంటి పోరు ఎక్కడను లేదు గదా. అదెక్కడి కర్మమో గాని మా అత్తగారైన లక్ష్మీదేవికి నేనంటే గిట్టదు. తానున్న చోట నన్నుండనీయదు. నేనున్న దరికి తానురాదు. తానును ఒకయింటి కోడలనను సంగతి ఈ అత్తగారైన ఆడది మరచి పోతుందిగాబోలు. అదృష్టవశాత్తు ఆమెకు అత్తపోరు లేదని నామీద పగసాధిస్తోంది. కానీ! నాకూ మంచిదినములు రాకపోవు. పడ్డవారెప్పుడు చెడ్డవారు కారు. (ఒకవైపుచూచి) అదిగో! ఆవిడగారు ఎందుచేతనో ఇల్లాగే వస్తోంది. నన్ననవసరంగా తూలనాడిందా, వదలిపెట్టను. మాటకు మాట సమాధానం చెప్పి నోరెత్తకుండా చేస్తాను. ఊరుకుంటున్నకొద్దీ మరీ మీద మీదకు వస్తోంది.

లక్ష్మి—(ప్రవేశించి) ఏమే? సరస్వతీ! ఏదో గొణుక్కుంటూ ఇచ్చట వంటరిగా కూర్చున్నావు? నన్ను తిట్టుతూ కూర్చున్నావా యేమిటి?

సర—ఏమమ్మోయి! అత్తా! నువ్వు నాజోలికి రావొద్దు. నన్ననవసరంగా మాట లనొద్దు. బాగాజరగదు. చెబుతున్నాను.

లక్ష్మి—అబ్బో! ఏమే! ఎప్పుడూలేనిది యివ్వాళ మహాభీకరంగా వస్తోందే మాట. ఏమిటా మిడిసిపాటు?

సర—మిడిసిపాటు నీదా? నాదా? పెద్దదానవని నిన్నెంత గౌరవించినా, నన్నెప్పుడూ సాధిస్తూనే వుంటావు.

లక్ష్మి—ఏమిటే ? నాతో వాదన పెంచుతున్నావు ? నీ అంతరం, నా అంతరం చూసుకొని మాట్లాడు.

సర—నీ అంతరం నీది. నా అంతరం నాది. నీగొప్ప నీది. నాగొప్ప నాది. నీ ఎక్కువ లేదు. నా తక్కువ లేదు.

లక్ష్మి—అబ్బో ! మాటలు చాలా నేర్చావే ! ఇన్నాళ్లబట్టీ ఎక్కడికి వెళ్లింది ఈ గొంతుక ? నేను లేనిదే నీగతి యేమవుతుందో తెలుసునా ? నాసంగతి తెలిసుండీ యిల్లాగ మాట్లాడుతావేం ? నేను లేకపోతే జగత్తేలేదు.

సర—అవునమ్మా. అవును. నువ్వు లేకపోతే ప్రపంచకమే లేదు. అన్నింటికీ నువ్వేతయారు. ఏదొచ్చినా నువ్వేవుండాలి. ఎక్కడ దెబ్బలాట వచ్చినా అక్కడ నువ్వే సిద్ధమవుతావు. అన్నదమ్ములకు, అక్కచెల్లెళ్లకి, తండ్రికొడుకులకి, అందరికి ముళ్లుపెట్టి కయ్యాలలోకి దింపే కారకురాలవు నువ్వే. నీధర్మమా అని తలలు గూడా పగులుతాయి. ప్రాణస్నేహితులను పరమశత్రువులుగ జేస్తావు. ఇంతకూ, నిన్ననవలసిన పని యేమిటి ? హాలాహలముతో డబుట్టిన దానవు నీకు విషపుబుద్ధులు కాకపోతే మంచిబుద్ధులు ఎల్లాగ అబ్బుతాయి ? నీ అక్కగారి పొడే నీకు గిట్టదు. ఇంక ఇతరుల మాట చెప్పాలి ?

లక్ష్మి—ఏమే నీపొగరు! పెద్దచిన్న తారతమ్యంలేకుండా సమాధానం చెబుతున్నావు ? ఎంతదానవు కాకపోతే మా అబ్బాయి నోరు కట్టెయ్యగలవు ? (బ్రహ్మనోటియందు సరస్వతియుండును.) వెఱ్ఱి బాగులవాడు గనుక నోరెత్తలేకుండా వున్నాడు.

సర—నేను మీ అబ్బాయి నోరుకట్టెయ్యడం మాటకేంగాని, నువ్వు మా మామగారి గుండెలమీదెక్కి కూర్చున్న మహానుభావు

రాలవు గాదా ? (లక్ష్మి విష్ణు వక్షస్థలమున నుండును) పాపం. పరమశాంతమూర్తి ఆయనకాగా నిన్ను భరిస్తున్నాడు గాని మరొకడైతే నీతో కాపరం చెయ్యగలడా ?

లక్ష్మి—ఇదుగో ! చూడు, పిల్లా ! నువ్వు అట్టే అహంకారంగా మాట్లాడకు, నేనుంటేనే మనిషిఅయినవాడు తలయెత్తుకుని తిరిగే దీని. ప్రతివాడు నన్ను పూజచేసిన తరువాతనే ఇతరులను పూజించాలి. నేను అనుగ్రహిస్తేనే ఎవరికైనా వుంది. లేకపోతేలేదు. నేనున్నవాడికే బంధువులుంటారు, స్నేహితులుంటారు. అనేకమంది అతనికి పడికాపులు కాస్తారు. వాడిని ప్రజలు దేవుడులాగ పూజిస్తారు. నేను ఎవడిమీదనైనా ఆగ్రహించానా ! ఎవ్వరూ వాడిగడపైనా త్రొక్కరు. అంచేత, ఏదోనాతో మంచిమాటలాడుకో వలసిందేకాని, కజ్జాలుపెంచకు.

సర—అవునమ్మా ! నీగొప్పతనం నాకు తెలీదాయేమిటి ? నువ్వు యెవడిని దయగా చూస్తావో వాడికి అస్తమానూ భయమే. నువ్వు కొంపలో ఉన్నావంటే నీమీద దొంగలో, దొరలో కన్ను వేస్తారని వాడికి అనుమానం. ఇక నన్నాశ్రయించినవాళ్లకా నిర్భయం. వాడికి రాజులచేతా ప్రజలచేతా గౌరవం వస్తుంది. వాణ్ణి ప్రతీవాడు నెత్తిమీద పెట్టుకుంటారు. నన్నాశ్రయించిన పోతన మొదలయినవాళ్లు అందరూ మరణించినా నేటివరకూ వాళ్ల పేర్లు ప్రపంచకముమీద స్థిరంగా నిల్చిపోయాయి. ఇక నిన్నాశ్రయించిన వాడు, నేడు భోగి, రేపు రోగి, ఎల్లుండి జోగి. అవుతాడు. ఇవ్వాళ పొగడబడ్డవాళ్లచేతనే రేపు తిట్లుతింటాడు. వాడి బ్రతుకు ముందు ముచ్చట్లు వెనుక తప్పట్లు.

లక్ష్మి—ఓసి వెఱ్ఱిదానా! నీ తెలివితక్కువ చూస్తే నాకు నవ్వొస్తోంది. నిన్ను మాత్రమే ఆశ్రయించి నన్ను పూజించకపోబట్టి గదా పోతనాదులకు ఆమరణాంతము దరిద్రావస్థ అనుభవింపవలసి వచ్చింది? నేను దయ చూపబట్టి శ్రీనాథుడు మొదలయిన వాళ్లందరూ పైకిరాగలిగారు. ఇదివరలో నీవాళ్లమీద మధ్యమధ్య దయాగావుండేదాన్ని. నీకు కళ్లు నెత్తికెక్కినట్టే నీవాళ్లకి కూడా ఇప్పుడు కళ్లు నెత్తికెక్కాయి. అందుచేత క్రిందామీదా తెలీకుండా నీకోసం సాధనం అంతా వ్యర్థం చేస్తున్నారు. తమ యింట్లో వున్నది చాలకపోతే నగలమ్మి, భూములమ్మి ఇంకా అప్పుచేసి పెద్ద చదువులు చదివి చివరకి చిప్పచేతికి తెచ్చుకుంటున్నారు. అందుచేత నాకు కోపంవచ్చి నీవాళ్లకేసి చూట్టం మానేశాను.

సర—శ్రీనాథుడు మొదట నిన్నాశ్రయించి, కళ్లునెత్తికెక్కి చివరికి బోర్లపడ్డాడు. నీబుద్ధి చంచలం. ఇవ్వాళ దయగావుంటే కొండ మీద కెక్కిస్తావు. కోపంవస్తే అమాంతంగా అతఃపాతాళానికి దింపేస్తావు. నావాళ్లమీద కోపంవచ్చి వాళ్లనివదిలేశానన్నావు. అవును పాపం. తులసివాసన అసహ్యమై గంజాయికంపు ఇంపుగా తోచింది. అమృతాన్నివదలి సురాపానసంకోసం ఆసించావు. సుగంధద్రవ్యములతోగూడిన తాంబూలము వెగటయి, కారాకిల్లీలమీదకి, చుట్టబిడీలమీదకి మనస్సుపోయింది. ఇంట్లోచేసుకొన్న పిండివంటలుపనికిరాక ఇడ్లీసాంబారుల మీదకి భ్రమపారింది. పాపం. నీదయ అంతా ఇప్పుడు దొంగసాక్ష్యాలు ఇచ్చేవాళ్లమీద లంచగొండి అధికార్లమీద, సినీమా నాటకకంపెనీ ప్రొప్రయిటర్లమీద ప్రసరించింది. నావాళ్లు నీకు కనిపిస్తారా అమ్మా?

లక్ష్మి—నావాళ్లు నావాళ్లు అని మహాయిదిగా చెబుతున్నావు. నీ వాళ్లల్లోనున్న గొప్పతనం యేమిటి? అక్షరాలు రాకపోయినా ఆరవఘారం చదువుతున్నాననేవాడొకడూ, వాళ్లనీ వీళ్లని పట్టుకొని పైతరగతులలో పడేవాడొకడూ. వీళ్లేనా నీవాళ్లు? నీ మూలాన్ని నాడబ్బంతా ఖర్చుపెడుతున్నారు. జీతాలకనికొంత పుస్తకాలకనికొంత, ప్రయివేటు మేష్టర్లకనికొంత, ఇతరఖర్చుల క్రిందకొంత, ఈప్రకారం డబ్బంతాదిబ్బచేస్తున్నారు. పూర్వంనావల్ల భయంకొద్దీ నన్ను చులకనగా చూడకుండా నిన్నాశ్రయించేవారు. ఇప్పుడు పొగరెక్కువయై ధనవ్యయం ఎక్కువచేస్తున్నారు. అదీగాక, నీవాళ్లకు గౌరవం ఎక్కడ ఏడిసింది? ఉన్నది చదువుకోసం తగలేసుకొని అంతా ఒకవృత్తికోసమే బయలుదేరటం. అందరు ముష్టివాళ్లూ ఒకవీధికే వెళ్లితే బిచ్చం పెట్టేవాడెవరూ? పోటీలమీద పోటీలు. ఒకడు ఇరవైకి చేస్తానంటే మరొకడు పదిహేనుకే చేస్తానని పోటీ. ఇంకొకడు పదికేచేస్తానని పదిమందిచేత సిఫార్సులు తీసుకొస్తాడు. ఇంకొకడు టిఫినుఖర్చు ఇచ్చినా చాలంటాడు. ఇదంతా చూసి మాభాగుందని ఉద్యోగమిచ్చే పెద్దమనిషి ఊరుకేచేస్తావా అని అడుగుతాడు. సర్వీసైనా కలిసి వస్తుందని అందుకూ కక్కూర్తిపడే అప్రయోజకులు కొందరూ. ఇంతేగా, నీవాళ్ల ప్రతాపం? ఏమిచేసినా సరే నాలుగు డబ్బులు సంపాదించేవాడే మొగాడు. నలుగురూ ఏమనుకున్నా సరే నాలుగు రాళ్లు సంపాదించేవాడే మనిషి.

సర—అయితే డబ్బుసంపాదనంటావు, ఇక మనిషికి మంచి, మర్యాద, గౌరవం ఉండక్కర్లే? మనిషికి మానము ప్రధానము గాని ధనము ప్రధానముగాదు.

లక్ష్మి—గౌరవం, గౌరవం అని కళ్లుమూసుకుని కూర్చుంటే కడుపు నిండుతుందాయేమిటి? లోకులేమనుకున్నా సరే వెరవ వలసిన పనిలేదు. వెధవచదువు. చదువెవడికి కావాలి ఈరోజుల్లో? ఎంత చదువున్నా, నేను కనికరించాలి, నాద్వారా రావాలికాని ఉద్యోగాలు, ఇతరత్రా రావటానికి వీలులేదు.

పార్వతి—(ప్రవేశించి) ఏమిట్రా? అత్తాకోడళ్లు ఇద్దరు జగడమాడుతున్నారు?

లక్ష్మి—చూడవమ్మా! పార్వతీ! సరస్వతి తాను గొప్పదానవంటుంది. చిన్నది తనే గొప్పదైతే పెద్దదాన్ని నేనెంత గొప్పదాన్నవాలి?

పార్వ—ఊరుకోండర్రా! ఎప్పుడూ మీఇద్దరికీ జగడమే. ఒకమాటైనా కలిసవుంటారేమో అనుకుంటే యెప్పుడూ ఇదేవరస. మీరిద్దరూ సమానులే. ఇందులో ఒకరూ తీసిపోరు.

సర—చూడవమ్మా, ఎంతనోరుమూసుకొని ఊరుకున్నా ఎప్పుడూ నన్ను సాధిస్తూనేవుంటుంది. తనవాళ్లకి గౌరవంయెక్కడేడిసింది? అల్లాగే ఇతరవాళ్లుగూడా అనుకుంటుంది.

పార్వ—పోనిద్దూ. పెద్దదిఅంటేమాత్రం తప్పేమిటి? చిన్నదానవు పెద్దవాళ్లని గౌరవించవద్దూ. ఆమె నాశ్రయించినవాళ్లలో దానధర్మాలుచేసి గొప్పకీర్తి గడించినవారు లేరూ?

లక్ష్మి—అల్లాగ నాలుగు చివాట్లుపెట్టి తనవాళ్లకి నావాళ్లకి తేడాచెప్పు.

పార్వ—చాల్లేవమ్మా! నువ్వ్వాసరే. ఏదో చిన్నది ఏమైనా తప్పు చేస్తేమాత్రము నువ్వు పగసాధించాలాయేమిటి? సరస్వతి నాశ్రయించినవాళ్లలోమాత్రము గొప్పచదువులు చదివి మంచి ఉద్యోగాలు చేస్తూ కీర్తి గడించినవారులేరూ? సరుకు ఎక్కువగా

తయారైతే ధరలుపడిపోయినట్లు చదువుకొన్న వాళ్లసంఖ్య యెక్కు-వలవడంచేత వాళ్లకి గిరాకీలేదు. ఎమ్మేలు అమ్మమ్మలులాగ కాళ్లుసాచుకొని కూర్చున్నారు. బియ్యేలు, బియ్యపుకొట్లదగ్గర కాపలాకాస్తూన్నారు. ఇంజనీరింగు ప్యాసయిన పెద్దమనుషులు, చదువుకోసం ఖర్చుపెట్టిన డబ్బు కూడదీయలేనందున, మేడలుపీకి తాటాకు పాకలు వేయటంలో చాకచక్యం కనపరుస్తున్నారు. ప్లీడర్లకి, డాక్టర్లకీ వేషపుడాబేకాని, కానీకంగుమని మ్రోగటం లేదు. ఇక ఏదో చిన్న చిన్న మేష్టర్లు ప్రయివేట్లు చెప్పుకు నయినా, నాలుగు రాళ్లు సంపాదిస్తూ పొట్టగడుపుకుంటున్నారు. ఈపెద్దచదువులు చదివినవాళ్లగతే యిల్లాగవుంటే చిన్నచదువుల వారి సంగతి చెప్పనే అక్కరలేదు. గడ్డపారలు కొట్టుకుపోతూ వుంటే పుల్లివిస్తరాకు నాగతేమిటి అన్నట్టు.

సర్వ—అయితే నువ్వు చెప్పే తీర్పేమిటి ?

పార్వ—కనుక, మీరిద్దరూ సఖ్యతనుండమని చెబుతున్నాను. అల్లా వుంటే ఏదో తగుమాత్రం చదువు చదువుకొని, ఉన్నదానిని పాడుచేసుకోకుండా ప్రజలు బాగుపడతారు. గవిడిగేదెలు పోట్లాడి లేగదూళ్లకాళ్లు విరగకొట్టినట్టు, మీరిద్దరూ దెబ్బలాడి మధ్య ప్రజలను పీడిస్తున్నారు.

సర—అయితే, మాకు సఖ్యం కుదరటంయెల్లాగ ?

పార్వ—మీ ఆయన్ని అడుగు.

సర—సరిసరి ఆయన పని పిల్లలని పుట్టించటమేగాని (సృష్టి) వాళ్లని పోషించటం విషయం ఆలోచించరు.

పార్వ—అన్నింటికీ పెద్దవారు మీమామగారున్నారుగా. ఏదైనా ఆయనే తీర్మానం చెయ్యాలి. అయనదగ్గరకు వెళ్లండి.

సర—అవునమ్మా. నువ్వుచెప్పింది బాగానేవుంది. పోరునష్టం పొందు లాభం అన్నట్లు మేము స్నేహంగానేవుండటానికి ప్రయత్నిస్తాం. రావమ్మా అత్తా! పోదాం యింట్లోకి.

పార్వ—అదీ నచ్చినమాట. వెళ్లండి, ఆయన వచ్చే వేళయింది, నేనూ వెళతాను. అసలే కోపిష్టిమనిషి. వెళతానమ్మా, లక్ష్మీదేవీ.

లక్ష్మి—మంచిది వెళ్లిరా, రావే. సరస్వతీ పోదాం.

(నిష్క్రమింతురు.)

బారు పార్ధసారథి రాఘవేంద్రరావు
రాజమండ్రి.

## నవ్వులాటలు

తమ్ముడు—అన్నయ్యా! నీమాట లన్నీ అబద్ధాలే, పాలకొల్లులో బత్తాయికాయిలు చాలా దొరుకుతా యన్నావు. మొన్న నేను వెళ్లినప్పుడు అన్నివీధులు తిరిగాను. ఒక్కటీ దొరకలేదు.

అన్నయ్య—దొరుకుతాయంటే ఉరికేనా? ఖరీదుకీ,

తమ్ముడు—అల్లా అన్నివూళ్లలోనూ దొరుకుతాయి. ఆవూరు విశేష మేమిటి?

---

బాలుడు—అమ్మమ్మా! సుబ్బయ్యగారి రామానికి వాళ్లమ్మ చెప్పులుజోడు కుట్టించింది. నాకూ్కడా కుట్టించవు టే?.

అమ్మమ్మ—సరే, బాగుంది, వాళ్ల గేదె చచ్చిపోయింది. వాళ్ల మాదిగాడు కుట్టిపట్టుకువచ్చాడు.

బాలుడు—అమ్మమ్మా! అమ్మమ్మా! మనగేదె యెప్పుడుచచ్చి పోతుందే?

---

తల్లి—అమ్మాయీ! చంటివాడినోట్లో యేమిటి ఉన్నట్టుంది.

అమ్మాయి—నాలిక.—

మణి

# చాటువులు

## కాశీయాత్ర

చ. గరుపొడిచెన్ శరీరము నఖంబు మొదల్ తలదాఁక కాశికా
పురమును రైలు గంగపైఁ బోవుచునుండగఁ గాంచినంతనే
హర ! హర ! విశ్వనాథయనునట్టి మహానినదంబు లెంతయున్
గరము ప్రతిధ్వనించెఁ దృటికాలము విస్మృతిఁ జెందితిన్ మదిన్.

గీ. ప్రభవ జ్యేష్ఠంబున మొదటిపంచమితిథిఁ
దల్లిదండ్రులయస్థిక లుల్లమెరియ
వేడికన్నీటిధారల విడిచినాడ
గలగజలములఁ గేదారఘట్టమందు.

గీ. వజలు నెక్కాలు గుఱ్ఱాలబండు లిచట
వీనిఁ జూచినయంత హృద్వ్యథి మనకు
శైవశవవాహనంబులు జ్ఞప్తి వచ్చు
చెం బాకటిమాత్ర ముండదు శిఖరమందు.

గీ. అహము రాతిరి యనుమాట యనఁగరాదు
సంజగయు నెండగనియును బలుకరాదు
వారణాసీపురంబునభక్తగణము
విశ్వనాథుని సేవించు విషయమందు.

గీ. వారణాసీపురంబు సద్మములయందు
నాతపత్రంబు లెంతయు ననవసరము
సవితృబింబంబు మధ్యాహ్నసమయమందు
సన్నిసందుల కనఁబడదన్న నిజము.

గీ. కాశికాపట్టణంబున కట్టడంబు
లెదుగునొక్కొ తమంతటనేమొకాని

యీఱుకుపీథుల నంతంత యెత్తువఱకు
కట్టగలరయ్య ! శిల్పులుకల్లకల్ల. ౬

మ. కనినఁ బెంచినవారి యస్థికలు నీగంగన్ బడన్ వేయ నే
ఘనచింతాభరమానసుండయిన రాఁగా నాకు నానందమే
యనుసంధించితి వేగుచుంటి నిదె పుణ్యక్షేత్రమా ! కాశికా !
నిను నింకన్ గనుభాగ్య మున్నదియొ ! లేనేలేదొ యీపుట్టువన్ ౭

చ. వెనుకటిమాట యెట్లయిన వెళ్లగవచ్చును కాశికాపురం
బున కిపు డింతలోన వ్యయముఁ శ్రమ మప్పటికంటెఁ దక్కువే
యనఁదగు నైన నూటనొకఁడైనను పోఁడటు పోయివచ్చుటల్
ఘనదురితాపహారకముగా మది నమ్మియు నేమిచిత్రమో ? ౮

---

## శిశువు

సీ. అతిమనోహరఫుల్లసితమహోత్పలమట్టె
విలసితహరిణాంకబింబమయ్యొ
చెలువారుకలికిచెంగలువరేకులు నట్టె
తనరునిందీవరదళము లయ్యొ
విస్ఫురత్ పరిపక్వబింబఫలంబట్టె
రమ్యజంబూఫలరాజ మయ్యొ
రమణీయకమనీయకుముదపత్రములట్టె
దళితకల్హారపత్రంబులయ్యొ

గీ. బోరుకాడించి డోలిక పొత్తులందు
పండుకొనఁబెట్టి తిలకంబు ఫాలమునను
గనులఁ గాటుక దిద్దంగఁ గన్నతల్లి
కనులు చేఁబుల్కుకొనుపాలకందునకును. ౧

మణి

# లక్ష్మీసహస్రము

(మచ్చుతునుకలు)

## వక్షస్థలావస్థానస్తబకము

ఆ. గీ. నీపతి పడుకిల్లు నీతండ్రి, నీతమ్ముఁ
డొందుభూష, వేఱొకండు కన్న
నీవు సగముమేను నిర్వికారికిఁ గూడ
నాలివంక వారలాత్మజనులు. 17

మ. అతిపాపాత్ములమైన మాదృశుల నయ్యబ్జోదరుండేమి శి
క్షితులన్ జేయునో యంచు నీవు కరుణాసిక్తాంతరంగంబుచే
నతనిన్ మాపయినిన్ దయాకలితుఁ జేయంబూని నీవెప్డు నీ
పతి వక్షంబుననేవసింతువుగదే భక్తాభిరక్షాగ్రణీ! 18

గీ. జనని! గళశంఖమందుండి జాలువాఱు
హారలావణ్యనాకాపగాంబువులను
ప్రణయపూరితహృదయసామ్రాజ్యమునకు
నిన్ను నభిషిక్తఁగాఁ జేయు నీవిభుండు. 19

చ. అరయ శిరీషపుష్పసదృశాంగివి నీవతిపేశలంపు తా
మరసగృహంబు వీడి యల మాధవుబాణకిణాతికర్కశా
విరళము కౌస్తుభోపలనివేశకఠోరము నైనవక్షమున్
గరము సహించియుంట మముఁగావఁగఁబూనియ కా రమాసతీ! 20

శ్లో. బలివసుముషఃప్రహార్షా
దుచ్చోరస్థలము పేత్యకమలేత్వం

అస్మాకమపథగానాం
హరసే చిరకాలసంచితానర్థాన్.

క. బలివసుహరునుచ్చోర
స్థలమున వసియించి నీవు సారసనిలయా!
చెలఁగి హరింతువు మాచిర
కలితంబు లనర్థములను గడఁకన్ సతమున్. 21

ఆ. వె. అంబ! శశియు నీవు నబ్ధిఁ బుట్టితి రైన
నతఁడు కృష్ణధారియయ్యె; నీవొ
కృష్ణధృత వయితివి కీడొంద మేలొంద
గుణమె కారణంబు కొలముకాదు. 22

చ. ఇతరములైనమానికము లేవిధరించిన వానిలోన నీ
ప్రతిమను గాంచి నీవితరభామనొకర్తుకఁ జేరఁ దీసెగా
యిఁతడని కోపగింతువని యెంచి భవత్పతి యట్టిశంక కే
గతియును లేనినీసహజుకౌస్తుభమున్ ధరియించెనద్దిరా. 23

క. సరసీజాలయ వైనను
పరికింపఁగ సతము మునులభావములను, నా
మురహరు నురమున నాగమ
శిరములని వసింతు నీవు చిత్రము తల్లీ! 24

చ. నీకెటనొచ్చునో యనుచు నీపతి నిన్ను సుమాంగి! అొమ్మునన్
జేకొనెఁ గాని నీదయినచేరికచేఁ బులకాంకురావళుల్
మేకొన వానినిన్ గెలువలేకయె యంతటిశౌరి గూడ స్వే
దాకలితుండె యయ్యె జయమందగలారలె కంటకాళితోన్ 25

# లక్ష్మీసహస్రము
(మచ్చుతునకలు)



కారుణ్యస్తబకము

తే. గీ. మూర్తినొందిన కారుణ్యపూరమనఁగ
వెలసి, భక్తులకెల్ల నీప్సితము లిడుచు
హరియురోభూషణంబైన యట్టిపాల
కడలి రాముద్దుకొమరితం గరము గొలుతు. 26

ఉ. రావణుఁడాదియౌ పలుగురక్కసు లీభువిఁబాపవృత్తిన
త్యావిలమొందఁజేయఁగ దయాబ్ధివిగానఁ బ్రజాళినెల్లనున్
బ్రోవఁగఁ బూని యాజనకభూపుని జన్నపుభూమిగర్భమం
దీవుదయించినావు జననీ నుతియింపఁగలార మేనినున్. 27

ఉ. నీదయ నిశ్చయంబుగను నిర్దయ యేమన నెంచిచూడదు
గ్ధోదధిపుత్రి! భూమిపయి నుద్భవమొందగఁ జేసి కట్టఁ బా
ధాదశనొందఁజేసెఁగదె తద్దయుకాలముదాక నిన్ను క్ర
వ్యాదపురమ్మునందు జగదార్తి నివృత్తినొసర్పఁ జేయఁగన్ 28

చ. స్వయముగ నేమియున్ దనకు సల్పనివాలిని స్వార్థమొందని
ర్దయుఁడయి చంపి నిందవడె రాముఁడు నీవో స్వబుద్ధిగానె య
త్యయములఁ జేసినట్టి దనుజాంగనలన్ మఱికాకమున్ దయా
మయివయి ప్రోచియుంటి వసమానదయానిధి వీవె జానకీ. 29

ఉ. నీసహవాసమే జనని! నీవిభురాముదయాభిరాముగా
భాసిలఁజేయు నేమన భవద్విరహుండయి స్త్రీవధంబునున్

జేసె నదోషి వాలివధఁజేసెను, నీసహవాసమందొ కా
కాసురుఁ ద్వద్వ్యథాకరు దయాకరుఁడై కడుఁబ్రోచెఁగావునన్. 30

కం. ఉరుతర తావకకరుణా
తరణియె లేకున్న జన్మదారిద్ర్యభయం
కరరోగమరణయుతమగు
వరుణాలయ మేముదాటవశమే తల్లీ ! 31

ఉ. హంసకులంబునన్ జననమందఁగ విష్ణువు క్రూరదానవ
ధ్వంసమొనర్ప ; రాక్షసకృతంబగుదోషసహస్రమోర్వస
ర్వంసహాయందు నీవు ప్రభనంబొసరించితివమ్మ పాప వి
ధ్వంసిని ! పిల్లకబ్బుతనతల్లిగుణంబులె యంచుఁదెల్పుచున్. 32

ఉ. నీదుదయారసమ్మునెడునిమ్నగ యుచ్చపదస్థులౌ గిరీ
శాదుల వంకకుం జనక యారసినీచపదస్థులైనయ
స్మాదృశులం దపార మనమానముగాఁ బ్రవహించు యుక్తమౌఁ
గాదె తలంపఁగా నిది యకారణకారుణికా ! మదంబికా ! 33

చ. అనుపమనిర్నిమిత్తకరుణా ! త్రుటియైనను నీవు నీపతిన్
వెనుకొనకున్న నాతఁడవినీతుల తప్పుల సైఁపఁడంచు నీ
వనుగుణమైనయట్టులుగ నయ్యవతారములందునీ పతిన్
బనివడి చేరియుందు వనపాయినివై దయయన్న నిద్దికా ! 34

క. కరుణావరుణాలయ ! భీ
కరసంసారాబ్ధిమునిఁగి కడనంటిన యీ
దురితాతిదురితు నను నీ
కరుణాతరణిన్ వెలార్చి కావుము తల్లీ ! 35

---

# జ్యోతిషము

## మేషలగ్న జాతకులు

స్వరూపములు :—పొడవై పల్చనై కోలగానుండు ముఖము. సన్ననిగడ్డము కణతలువెడల్పు వెంట్రుకలు పల్చనై సన్నముగా నుండును. ముఖముపై పల్లముగాగాని మచ్చగాని ఉండును. దేహము పొడవుగాను సన్నముగాను ఉండును. కండపుష్టి కలిగి అందముగా ఉండును. నేత్రములందు రక్తజీర లుండును. తీక్షణమైన చూపులు కలిగి కండ్లు బాగుగా తెరచియుండును. కనుబొమ్మలచివరభాగము వంగి యుండును. వీరు సాధారణముగా ఎరుపువర్ణముగా ఉందురు.

వీరుసన్నముగాను బక్కపల్చగాను ఉందురు. పొడుగగు మెడ, ముతుక వెంట్రుకలు కల్గియుందురు.

స్వభావలక్షణములు :—వీరు అతిసులభముగా కోపము తెచ్చుకొందురు. కాని వెంటనే మార్చుకొందురు, తాము చేయుపనుల యందు ఉత్సాహము కగిలి యుందురు, వీరు కొందరికి యజమానులై యుందురు. లేనియెడల ఒకానొకఅంశమున ప్రాముఖ్యత కలిగియుందురు. మంచిపలుకుబడి కలిగి వీరు చేయుపనులయందు మంచిచాకచక్యము కలిగి తెలివితేటలు కలిగి యుందురు. కార్యసిద్ధి పొందుదురు. సత్యసంధత కలిగి శక్తికలిగి యుందురు. దుఃఖములను అంటనీయకుందురు. యేపనియైనను సరే మంచిపట్టుదలతో చేయుదురు. మంచికార్య దీక్షగలిగి ఉందురు. అసంపూర్తిగా చేయుట యిష్ట ముండదు.

మరికొన్నిలక్షణములు :—వీరికి తొందరయు కోపమును అతిశయమును కలిగియుండును. అది కావలెను, ఇదికావలె, నని కోరికలు ఉండును. నిలుకడలేక ఉందురు పోరాటమునకు సిద్ధపడుదురు. కార్య

నిర్వాహణ విధానమునే అవలంబించగోరెదరు. వీరికి అతిశయ ముండును. అలంకారాభిలాష గల్గియుందురు. భోగేచ్ఛ మెండు. మిత ముగా భుజింతురు.

వీరు ధారాళముగా మాట్లాడుదురు. ధైర్యసాహసములు గల్గి యుందురు. దాతృత్వము గల్గియుందురు. సోమరులుగా గాక, తరచు ఏదోపనిచేయుచుందురు. ఒక్కొక్కప్పుడు కలహస్వభావము గలిగి యుందురు. తెలివి తేటలు మెండుగా కల్గియుందురు. చిన్నతనములో అనేకకష్టములు పొందుదురు. స్వతంత్రమును స్వేచ్ఛను కోరుచుం దురు. తమమనస్సునకు ఏదైనకార్యము న్యాయమనితోచిన సహాయ ముచేయదగిన కార్యమైనయెడల మిక్కిలిపట్టుదలతో కార్యసానుకూల మగువరకు పాటుపడుదురు. ఏకార్యమునైనను నిర్భయముగా చేయు దురు. ఉన్నతదశను పొందుటకు మిక్కిలి అభిలషింతురు? శౌర్యము కల్గియుందురు.

స్త్రీలలక్షణములు :— సత్యము పలుకుటయందు ఆసక్తిగల వారుగాను మిక్కిలి క్రూరమైన స్వభావముగలవారుగాను సర్వకాల సర్వావస్థలయందును క్రోధయుక్తులై యుండునట్టివారుగాను కఫప్రధా నమైన శరీరాప్రకృతిగలవారుగాను యెల్లప్పుడను నిష్ఠురముగా మాట్లా డువారుగాను సర్వదా స్వజాతివారియెడల బంధువులయెడల విరక్తులు గాను నుండుదురు.

మరికొన్నిలక్షణములు :—వీరు ప్రగల్భములు చెప్పువారును ప్రౌఢతనమునుసూచించి పనులుచేయుటలో సత్యంతాసక్తిగలవారును కార్యములు నిర్వహించుటలో ఇనుమడించిన శ్రద్ధాభక్తులు గలవారును మంచిరూపముచేత విలసిల్లుశరీరముగలవారును భర్తకు అత్యంతప్రియ వాల్లభ్యము నెరపునట్టివారును సర్వకాలసర్వఅవస్థలయందును అత్త మామలు మున్నగు గురుజనులను ప్రేమించు స్వభాముగలవారును గానుందురు.

## వృషభలగ్న జాతకులు

స్వరూపములు :—వీరు పొట్టియై లావైనమెడను కురుచయైన మెడను గలిగి యుందురు. చక్కని కళకాంతులుగల ముఖము బలమైన భుజములు పొట్టియు దట్టమైన వెడల్పైన చేతులు, కలిగియుందురు. పెదవులు పెద్దవిగా నుండును. నోరు విశాలముగా నుండును. ముక్కు రంధ్రములు పెద్దవిగానుండును. వెంట్రుకలు ఉంగరములుగా చుట్టి యుండును. కంటిపాపలు నల్లనై యుండును. దౌడలు విశాలముగా నుండును. వీరు కొంచెము పొట్టిగ సరిసమానమైన అవయవపుష్టిగలిగి అందముగా నుందురు, ఈలగ్నములో పుట్టినవారు సాధారణముగా ఎక్కువమంది చామనచాయగా ఉందురు.

స్వభావములు :—వీరు సాధువులై ఉపకారబుద్ధికలిగి యుక్తాయుక్త విచక్షణగలిగి న్యాయబుద్ధికలిగి యుందురు. స్నేహితులతో మంచిఅనుబంధము కలిగియుందురు. స్వధర్మచింతను కలిగి యుందురు. వీరు పూర్వాచారములను అనుసరించుకోర్కె గల్గియుందురు. మంచి శాంతము పట్టుదలయు నిలుకడయు గల్గియుందురు. సహవాసయోగ్యత గల్గియుందురు.

మరికొన్నిలక్షణములు:—వీరు ఎక్కువగా గౌరువింపబడుదురు. పలుకుబడి గలిగి యుందురు. వీరిపై చాలమందికి అభిమానముండును. మంచి రూపము కలిగి ఎక్కువకీర్తి సంపాదింతురు. అప్పుడప్పుడు కఫవ్యాదులచే బాధ నందుదురు. వీరికి సన్నిహితులతో మనస్పర్థలు కలిగియుండును. చిన్నతనమున సుఖములేక యుందురు. కాని యౌవ్వనమునను వృద్ధాప్యమునను సుఖముగా నుందురు. వీరు చాలకష్టము ననుభవింతురు. వీరు సంగీతమందు ఆభరణములయందు

అందమైన వస్తువులయందు అనురాగము కలిగియుందురు. శాంతస్వభావులును స్థిరమైన చిత్తమును మిక్కిలి ఓర్మిని కలిగియుందురు. ఎవరు చెప్పినను వినక వారికి తోచినట్లు చేయుదురు. వారిపనులయందును వ్యవహరింతురు. వీరు దయాళులై మంచిస్వభావము కల్గియుందురు. సౌఖ్యముకొరకు తాపత్రయపడుదురు. వారు మనస్సులోని ఉద్దేశములను పైకి తెలియనీయరు. ఏపనియైనను తొందరపాటుగా చేయక శాంతముగాను నెమ్మదిగాను చేయుదురు. నెమ్మదిగా కాలక్షేపము చేయుదురు. అనేకమంది స్నేహితులు కల్గియుందురు. అకస్మాత్తుగా ధనలాభముగాని ఆస్తినిగాని పొందుదురు. ధనవంతులుగను ప్రియవచనములుగలవారుగను అభిమానముగలవారుగను నుందురు.

స్త్రీస్వభావలక్షణములు:—సర్వదా వ్యవసాయపనులందు ఆసక్తిగలవారును పురుషునియొక్క మనోగతాభిప్రాయములను మెఱిగి తదనుకూలముగా మెలగి ప్రఖ్యాతిగడించునట్టివారుగను భర్తను అత్యధికముగా ప్రేమించునట్టి వారుగాను సమస్తములగు కళలయందు చేతిపనులు వంటపనులయందును నేర్పరులై తమయొక్క కులవర్గమునందును బంధువర్గమునందును స్నేహము గౌరవమును కలిగియుందురు. సర్వకాలములయందును భర్త వాక్యానుకూలముగాను నడచునట్టి వారుగాఉందురు.

మరికొన్నిలక్షణములు:—వీరు మిగులసుశీలురుగాను విద్యావివేకచతురులుగాను ఉండుటయేగాక ఆగమములు శాస్త్రములు మున్నగునవి అభ్యసించుటయందు మిగులఅనురాగము కలవారుగను తీర్థయాత్రాదులయందు సంసక్తమగు బుద్ధికలవారుగను పెక్కుమంది పుత్రపౌత్రాదులు గలిగి పతియందు మిక్కిలిప్రేమ గలిగి ధనసంచయము కలిగియుండువారుగాను నుందురు.

## ద్వి తీ య ర ం గ ము.

(బాలికాపాఠశాల. వకీలు కందర్పరావు భార్యయగు మోహిని కుర్చీలలోఁ గూర్చుండి యుందురు. ఎదుట లక్ష్మమ్మ—పార్వతి—సుందరి యను విద్యార్థినులుందురు. వారు లెక్కలు చేసికొనుచుందురు.)

మోహిని—(స్వగతము) నా పేరు మోహినినైయెనను ఈ సందర్భమున నా మోహము వ్యర్థమయినది. ఆధర్మారావు నెన్నిమాఱులో చూచితిని. కాని మాటాడుట కించుకయైన నవకాశము లభించుట లేదు. అతఁడు మాసంఘ సంస్కరణ సభలకు వచ్చినట్లే వచ్చి మాయమగును. ప్రార్థనకాలమువఱకైన నుండఁడు. ఆతఁ డున్నత విద్యాలయమున నుపాధ్యాయుఁడగుటవలనను సుప్రసిద్ధ న్యాయ వాదినైయెన నాభర్త కందర్పరావుగారి కాపాఠశాలపై నొకవిధ ముగ యాజమాన్యముండుట వలనను విధిలేక యట్లు వచ్చి పోవు చుండును. ఆతని కోరమీసలు—ఆచంద్రబింబమువంటి ముఖము. ఆ స్వర్ణచ్ఛాయ—ఆ యాజానుబాహువులు—ఆ దివ్యసుందరవిగ్ర హము ననుబోటి నిర్భాగ్యురాలికిఁ గాంచ నెట్లులభించును? ఈసంద ర్భములో సాధనము తోఁపకున్నది. (ఆలోచించి) ఆయన యింటికి నేనే వెళ్ళుదునన్న నెల్లప్పుడును నాతనిభార్య మాసివాయినపు ముత్తైదువు వలె వాకిటిలో సిద్ధము. అయిన నిట్లుచేసెదనుగాక. ఒకలేఖవ్రాసి పార్వతిచే నాతని బల్లపైఁ బడవేయింతును. అప్పు డది యాతఁడు చూచుకొనుట తటస్థించును. శుభస్యశీఘ్రమ్. (లేఖ వ్రాసి మడచి జేబులో నుంచుకొనును.)

(ప్రకాశముగా) లక్ష్మమ్మ! ఇంకను లెక్కకాలేదా? నోటిలెక్క యింతసేపా?

లక్ష్మి—అయినదమ్మా! మీ రేదో యాలోచించుచున్నారని యూర కున్నాము.
మోహిని—మీయందఱు పలకలు చూపింపుఁడు. (వారు పలకలు చూపింతురు.) లక్ష్మీ! పార్వతీ! మీరిరువురు సరిగాఁ జేసినారు. సుందరీ! నీలెక్కతప్పు. మొద్దుముండ! ఎప్పుడును దప్పులే. (చెంప కాయ వేయును. సుందరి యేడ్చును.) ఏడువరాదు. మఱియొక లెక్క.
ధర్మారావుగారు దినమున కిరువదియైదు మైళ్లచొప్పునఁ బ్రయాణముచేసిన 16 దినములలో వారెన్ని మైళ్లు పోఁగలరు?
పార్వతి—నాలుగు వందలు
మోహిని—అదిగో పలకపై వేయుమన్నది నోటితో నేలఁ జెప్పితివి.?
ఇఁక నిది చాలును. భూగోళములో నొక్క ప్రశ్న. సుందరీ!
సుందరి—అమ్మా!
మోహిని—ధర్మారావుగారీయూరిలో బయలుదేరి యెడతెగకుండ నొక సరళరేఖలోఁ బ్రయాణముచేసినచోఁ దుదకు వారెక్కడికిఁ
సుందరి—వారి యిష్టమువచ్చిన చోటికి. (జేరుదురు.?
మోహిని—ఛీ! మొద్దు! లక్ష్మి!
లక్ష్మి—సీమదేశమునకు.
మోహిని—కాదు. పార్వతీ!
పార్వతి—మఱల నీయూరే చేరెదరు.
మోహిని—ఎందువలన?
పార్వతి—భూమి గుండ్రముగా నుండుటవలన.
మోహిని—సెబాసు! ఈదినము పార్వతికి బహుమానము రాఁగలదు. ఇఁక వేళయైనది. పార్వతి తప్ప మిగిలిన వారిండ్లకుఁ బొండు.
(లక్ష్మి సుందరులు పోవుదురు.)

పార్వతీ! నీకిదిగో నాలుగణాలు బహుమానము. (పావలా యిచ్చును.) (పార్వతి తీసికొని పోఁబోవును) ఉండుండు. ఒక్కపని. ఈయుత్తరము (అని యుత్తరము చేతిలోనుంచి) సరిగా 9½ గంటలకు మీయింటి ప్రక్కనున్న ధర్మారావుగారిగదిలో బల్లపై నుంచవలెను. దీనినెవ్వరు చూడకుండ నుంచఁగలిగినయెడలఁ బ్రత్యేక బహుమాన మిచ్చెదను. అతిరహస్యము సుమా!

పార్వతి—వారికి సరిగా నెందుకుఁ దీసికొనిపోయి యీయఁగూడదు.?

మోహిని—ఆకారణములతో నీకేల? పెద్దలమాటల కడ్డుప్రశ్నలు వేయుట తప్పుకాదా! నేను జెప్పినట్లు చేయుము.

పార్వతి—పోనీ, పాఠశాలకేగి యిచ్చెదను.

మోహిని—అధికప్రసంగము వలదు. నామాట విందువా! వినవా!

పార్వతి—విందునమ్మా! నాదేమి పోయినది. అట్లే చేయుదును. నాకు సెలవిమ్మా. (నిష్క్రమించును.)

మోహిని— (తనలో) అమ్మయ్యా! ఇప్పటికి దీనికి బుద్ధి కుదిరినది. ఎక్కువ తెలివితేట లున్నను గష్టమే।

(ఆలోచన నభినయించి)

మోహిని—మా యమ్మాయి లక్ష్మికి వీణపాఠము చెప్పుటకై సరస్వతిగారికి వర్తమానమంపితిని. ఆమె 9 గంటలైనను రాలేదే? (ఆలకించి) అదిగో కాలిచప్పు డగుచున్నది. ఆమెయే కావచ్చును.

[అంతట సరస్వతి ప్రవేశించుచున్నది.]

....స్వతి—మోహినిగారూ! నమస్కారము.

మోహిని—ఓహో సరస్వతిగారా! నమస్కారము. ఇదె మీకొఱ కెదురు చూచుచున్నాను. మా యమ్మాయికి మీరు వీణచెప్ప

వలెను. మీఖ్యాతి నింతకాలము వినియు నదృష్టహీనతచే మిమ్మిం తదనుక పిలిపింపనైతిని. మీరు నెలకు రు 25—0—0 లకు తక్కువ యంగీకరింపరని విని య ట్లిచ్చుటకు సమ్మతించుచున్నాను. మా యిల్లు మీకుఁ దెలిసియే యుండును. సాయంకాలము వచ్చి మా యమ్మాయిని బరీక్షించి మీశక్తివంచన లేకుండఁ బాఠము చెప్ప వలెను.

సరస్వతి—అన్నియు మీరే చెప్పితిరి. ఇఁక నేనడుగవలసినది లేదు. అట్లే వత్తును. మీయిల్లు నేనెఱుఁగుదును.

మోహిని—సరే! మీరొక్క పద్యముగాని కీర్తనగాని పాడిన విన వలయునను కుతూహలముగ నున్నది.

సరస్వతి—తినఁబోవుచుఁ గూరరుచి యడుగనేల? అయినను గోరితిరి గావున నొక్కపద్యము పాడుదును.

"విమలయశోనిధీ! పురుషవృత్త మెఱుంగుచు నుండుఁజూవె వే దములును బంచభూతములు ధర్మవు సంధ్యలు నంతరాత్మయున్ యముఁడును జంద్రసూర్యులు నహంబును రాత్రియు నన్మహాపదా ర్థము లివి యుండఁగా నరుఁడు దక్కొన నేర్చునె తన్ను మ్రుచ్చిలన్"

మోహిని—ఆహా! ఎంతశ్రావ్యముగ నున్నది. నాజన్మము తరించినది.

సరస్వతి—మీ రతిశయోక్తిగ ననుచున్నారు. నాది సామాన్యపుఁ బాటయే. విశేషమేమియు లేదు.

మోహిని—మీకంఠము నిరుపమానము. దాని నట్లుంచి నేనొక్క సంగతి నడిగెదను. చెప్పెదరా?

సరస్వతి—అడుగుఁడు.

మోహిని—మీభర్తగారు 5 సంవత్సరముల క్రిందట దేశాంతర గతులైరఁట. ఏల?

సరస్వతి—భక్తిపరవశులై సంసారము త్యజించి యేగిరి. అప్పటి నుండియు మాప్రహ్లాదునికి నేనే కష్టపడి చదువు చెప్పించుకొనుచున్నాను.

మోహిని—అట్లు చేసికొన్న భార్యను బిడ్డను వీడుట న్యాయమా? ఎంతకఠినుఁడు.

సరస్వతి—మీరు వారిని నిందింపవలదు. అది వారికి న్యాయ మని తోఁచినది. వ్యక్తుల మానసిక పరిస్థితుల ననుసరించి వస్తువుల విలువ మాఱుచుండును.

మోహిని—పోనిండు. ఇంతచక్కని శరీరమే! ఇంత నవయౌవనమే! మఱల నేల వివాహమాడరాదు.?

సరస్వతి—అట్టిది నా కిష్టములేదు. అది హైందవధర్మవిరుద్ధము. మఱియు నీపరిస్థితులలో బ్రహ్మచర్యమునందే నా కెక్కువ యానంద మున్నది. తుదివఱకుఁ బతికై యెదురు చూచుట సతీధర్మము.

మ. భరమీసంసృతియంచుఁ గొందఱు నవప్రాయంబునన్ బెండ్లి మా
నిరి యింకెందఱొ సన్యసించి చని రెందేని న్విరాగస్థితిన్
తరణోపాయముగాఁగ దైవగతిచేతన్ వచ్చునేకాంత బం
ధురజీవంబును భాగ్యమట్లుగొనఁగా దోసంబు లే దెయ్యెడన్ ॥

మోహిని—మిమ్ము మతగురువులు వెలివేసెదరను భయమక్కఱలేదు. మేము భార్యాభర్తలము. పీఁటలపైఁ గూర్చుండి యెన్నియో యిట్టి వివాహములను నెఱవేర్చితిమి.

సర—చేసియుండవచ్చును. కాని కామాగ్ని కాహుతి వేసినకొలఁదియు నది పూర్వముకంటె నెక్కువగఁ బ్రజ్వరిల్లుచుండును. దాని యుపశమనము మోక్షోపాయ మని పెద్దలు చెప్పుదురు.

మోహిని—అట్లు చెప్పెడిపురుషు లనేకవివాహము లాడుటలేదా!

సర—పురుషు లాడవచ్చును. బ్రహ్మచర్యప్రతిష్ఠకొఱకు వారిని గూడ నట్టిపునర్వివాహములు మానుఁడని బోధింపుఁడు. జీవితమునందు వివాహమే పరమావధి గాదు. ఈ తుచ్ఛసుఖముల కతీతమైన పరమసుఖమొకటి కలదు. దానికొఱ కింద్రియజయమే ప్రధానము గాని యింద్రియలౌల్యము సాధనముగాదు.

చ. కనుగొన యౌవనంబు క్షణికంబగు బుద్బుదరీతి నట్టులే
యనయము స్వల్పకాలమున నంతమునందును సంగసౌఖ్యముల్
ధనభవనాది భోగములు స్థైర్యము లేసివి గాలిమేడ లెం
దును బరమొందు దక్క బహుదుఃఖకరంబులె యింద్రియార్థముల్.

ఉ. వీనికి నశ్వరంబులకు వేడ్కయొనర్పుచుఁ బెండ్లిపెండ్లి యం
చో నలినాక్షి! పొంగెదవయో! కొని తెచ్చికొనంగ నేటికిన్
దాను వివాహముల్ మఱఁగి దారినిబోయెడు నట్టికష్టముల్
మానని కర్మ మెట్లయిన మానదు నూత్న మిదేల చెప్పుమా!

మోహిని—అయిన మీతో వాదింపవలసిన విషయములు చాలఁ గలవు. వాదించి మిమ్ములను సంఘసంస్కరణమునకు సుముఖుల నుగఁ జేయఁగలనని నా కింకను విశ్వాసము కలదు.

సర—ఇంతవఱకుఁ బొరపడి మీతో వాదించినాను. ఈవిషయమైన వాదప్రతివాదములు నా కసమ్మతములు. ఇట్టి ప్రసంగములు తేనన్నప్పుడే నేను మీయింటఁ బాఠము సంగీకరించెదను.

ఉ. వాదము లేరితో సలుప, నత్తును బాఠముఁజెప్ప నంతియే
నాదువిధిన్ బొనర్చిన యనంతర మింటికిఁ బోదు సూటిగా
వాదము లట్టులుండ నిలువంబడఁ బూరుషు లున్నచోటులన్
మీఁదయ యున్న నీసరణి నేర్పుదు వీణియ మీగృహంబునన్.

మోహిని—అట్లయిన సరియే! మాకాగోడవలేల? పాఠమే మాకుఁ గావలసినది.

సరస్వతి—చిత్తము సాయంకాలము వచ్చెదను.

(నిష్క్రమించును).

మోహిని—(స్వగతము) ఆహా! ఏమి ఈమె సౌందర్యము. ఈమె కంఠస్వర మెంతమధురము. ఈజగన్మోహనాకృతిని జూచిన నాభర్త యూరకుండునా! అతఁడు రసికాగ్రగణ్యుఁడు. అయినను ఇంత పట్టణములో నింతకాలమునుండి తనపాతివ్రత్యమును గాపాడుకొనఁ గలిగిన తెలివితేటలున్న సరస్వతినిగూర్చి భయ మక్కఱలేదు. ఈమె పాఠము మాత్రము విడువరానిది. (ఆలోచన నభినయించి) ఈమెను బద్యము చదువుమన్న సర్వకర్మమునకును సాక్షులుగల రని పద్యము చదివినదే. అయిన నాప్రణయలేఖకును సూర్య చంద్రాదులే సాక్షులా! అహ్హాహా! (నవ్వి) వెఱ్ఱిపురాణములు. ప్రాణములేనిగోళములా సాక్షులు. రాత్రియుఁ బగలునుగూడ సాక్షులే? చాదస్తులు! పాపము! అమాయకులు! పూర్వపు మనుష్యు లెవరేది చెప్పినను నమ్మెడివారు. యుక్తాయుక్తవివేచ నము కొంచెమైనను లేదు. భీముఁడు బండెడన్నము తినెనఁట. శ్రీకృష్ణభగవానుఁడు కొండను వ్రేలిపై నిల్పెనఁట. 16000 మంది గోపికల నుంచుకొనెనఁట. ఈపుక్కిటి పురాణములను నమ్మి సంఘ సంస్కరణమునకు జంకుదురు.

(చేతి గడియారము చూచి) అప్పుడే 9½ యయినది. ఇంటికిఁ బోవలెను. ఈపాటి కాయుత్తరమును జేరియే యుండును. నాయదృష్ట మెట్లున్నదో! (ఆలోచనతో నిష్క్రమించును.)

(తెరపడును)

## తృ తీ య ర ం గ ము



(సరస్వతి గృహము—సరస్వతి కూర్చుండి యుండును)

సర—(స్వగతము) ఈయూర నాకు జీవనమునకు లోటులేదు. ఇరుగు పొరుగు ధర్మారావుగారు మంచివారు. బాలునకుఁ జదువు గలదు. కాని మానాయనగారు రామారావుగారు నన్నీయూరినుండి తీసికొని వెళ్లవలయునని మిక్కిలి ప్రయత్నించుచుందురు. వారు వృద్ధులయ్యు శ్రమయనుకొనక నేఁ డా ప్రయత్నముమీఁద నే యిచ్చటికి విచ్చేసిరి. వారి కేమి సమాధానము చెప్పుదును. (ఆలోచించి) ఏ మున్నది? ఎప్పటి ప్రత్యుత్తరమే! బాలునిచదువు చెడిపోవు నందును.

(చూచి) అదిగో! అప్పుడే ఇటు నాకడకు వచ్చుచున్నారు.

[అంతట రామారావు ప్రవేశించును.]

రామారావు—అమ్మా! ప్రొద్దుటినుండియు నీతో మాటలాడ నవకాశమే లేకపోయినది గదా! ఇతరులయిండ్లలో శ్రమపడి పాఠములు చెప్పనేల? సుఖముగాఁ దిని కూర్చుండవలసినదానవు. తల్లీ!

చ. పరువు గలట్టి విప్రవరవంశమునన్ జననంబు నంది తీ
వరయ వివేకులైన ప్రియవర్తులు సోదరు లున్నదాన వే
దురితములేని విజ్ఞగుణధుర్యుని యింటిని జొచ్చి సాధ్వివై
వరసుతుఁగాంచి యీగతిని వంతలఁ గుందగనేల? నమ్మరో!

పోనిమ్మా. మీరు కేవలము దరిద్రు లనుకొందునా! అదియును గాదు. తినుట కన్నమును గట్టుటకు వస్త్రమును బుట్టినయింటను మెట్టినయింటను గలవు. ఇంక నేమి కావలయును? నీకు మన గ్రామమునఁ బ్రొద్దు పోదనుకొంద మన్న,

మ. వరవీణన్ గొని నీవు రాలు గరఁగన్ వాయింపగా నేర్తు వం
దఱిలో మిన్నవు సాహితీగరిమ, నీధర్మంబునన్ మేము సుం
దరకావ్యశ్రవణంబొ గానరసమోదంబో కొన న్గందు మీ
కరణిన్ బ్రొద్దులు పోవె యీశ్వరకృపన్, గాసిల్లగా నేటికిన్.

సరస్వతి—అవును. తండ్రీ! బాలుని చదువో?

రామారావు—ఏమీ! మా బాలురు చదువుకొనుటలేదా! బడిచదువు గలదు. శాస్త్రాధ్యయనము చేయవచ్చును. అవకాశమున్న నీవద్ద సంగీతము నభ్యసింపవచ్చును.

సరస్వతి—కాని పేరుప్రతిష్ఠలు గడింప వలయునన్న నున్నతవిజ్ఞాన శాస్త్రములఁ జదువుట యావశ్యకము. అందులకుఁ దగిన యున్నత విద్యాలయములును గళాశాలలును ఇక్కడనే గాని లభింపవు.

రామారావు—అవునమ్మా! ఉన్నత విద్యలలో నుత్తీర్ణుఁడయి యుద్యోగముఁజేసి పేరుప్రతిష్ఠలు గడించిన నీభర్త బ్రహ్మానందము మనల నుద్ధరించిన దేమున్నది? నిన్నిక్కట్టుల పాలుసేసి భక్తి యను పేరువెట్టుకొని యెక్కడికో వెళ్లెనుగాదా! ఇంత కఠినుఁడని ముందే యెఱిఁగిన—

సరస్వతి—(మాటకడ్డమువచ్చి) వారిని మాత్రము నిందింపవలదు. వారి విజ్ఞానము దుర్వినియోగము కాలేదు. యౌవనముననే సంసార బంధములఁ ద్రెంచికొని ముక్తిమార్గము నన్వేషించుట యుక్తమని వారికిఁ దోఁచినది. అందువలన వా రావిధముగ మహాత్యాగము గావించిరి. మనము తరింపలేము సరిగదా! తరించువారి నేల నిందింప వలయును?

చ. దురితములన్ బొనర్చి బహుదుఃఖకరంబగునట్టి సంసృతిన్
మఱిమఱి చచ్చి పుట్టుచును మార్గముఁగాంచక చక్రనేమి య

ట్లరయ భ్రమించు లోకులకటా! భవబంధము ద్రెంచినట్టి యా
నరులను నిందసేయుదురు నల్వురతోఁ జెడనట్టి సాధులన్.

చ. ఇదిగో గృహంబుగట్టి మఱి యెంచెద నీశ్వరునం చొకప్పుడే
నిదిగో సుతుండు గల్గఁగనె యేగెదఁ గానలకం చొకప్పుడే
నిదిగో జరాప్రవేశముననే భర మీఁగుదునం చొకప్పుడే
యదియొ నెపంబు వూని వృథయౌనటు చేయరె జన్మమీప్రజల్.

రామారావు—సరే! అమ్మా! ఆయనమంచివారే వారిమీద యీఁగ ద్రవాలరాదు. ఆసంగతి యటుంచి మీబాలుఁడు చదువుననుకొందము. పూర్వమువలె నిపు డుద్యోగములేవి? చదివి యింటఁ గూర్చుండవలసినదే గదా! పైఁగ నీవిద్య చదువుటయన్న సామాన్యమా! ప్రబలప్రయాసము. అత్యధిక ధనవ్యయము. ముక్తిసంగతి నెంచకపోయినను భుక్తికైనను కొఱగానివిద్యకై యేల యింత వ్యయప్రయాసములు.

సరస్వతి—నాయనా! విజ్ఞానమును వాంఛించువారు కేవల ధనచింతఁ జేయఁగూడదు. అర్థము లభించిన లభించును. లేకపోయిన లేకపోవును. విజ్ఞానవాంఛకు విజ్ఞానలాభము పరమావధి యైనప్పుడే యది సార్థకమగును. అట్టి విద్యార్జనమువలన నిహపరములు రెండును గలుగును. కేవల కుక్షింభరుల విద్య విద్యయనిపించుకొనఁదగదు.

రామారావు—ఈకాలమున నెవ్వరు నీవిధమున విద్య నభ్యసించువారు లేరు. పదిమందినడచినదిగదా మార్గము.

సరస్వతి—మంచికిఁ బోల్చి చూచుకొనవలయును గాని చెడ్డకుదాహరణములకై వెదుకనక్కఱలేదు.

శా. ఆదర్శంబుగఁ గాంచనో వెదకి యెందైనన్ గడున్ విజ్ఞనే
ఆదర్శంబుగఁ బూననో నతని లేఁడా నీతిమంతుం డెటన్

వేదాంతజ్ఞుని మార్గదర్శినిగ నన్వేషించి కైకొమ్మ కా
దా ! దుష్టుల్ ధర వేనవేలు గలరాదర్శంబులే వారలున్.

రామారావు—నీకు సమాధానము చెప్పుట కష్టము. అయినను నా భావము నీ వర్థము చేసికొనవు. ఇంతదనుక నే నన లేకున్నాను. నీ కీయూరిలోఁ గన్ను నొచ్చినను గాలు నొచ్చినను దిక్కెవ్వరు? ఆపదవచ్చిన నడ్డుపడువా రెవ్వరు?

సరస్వతి—అట్లడుగుము. చెప్పెదను.

కలఁడీయూర మహానుభావుఁ, డిటనే గాంచంగనౌ తద్గృహం
బలరున్ సార్థకధర్మనాముఁ డగుచున్, త్యాగంబు శీలంబు పెం
పొలయన్ బోలిక లేక యెయ్యెడల నెంతో తోడు నీడౌచు భా
సిలెడున్, ప్రాణము నేని యీఁగడఁగు గాసిన్ బాప నాకెప్పుడున్.

ఆయన భార్య సతియను నామము గలది. మమ్ముల నత్యంత ప్రేమతోఁ జూచును.

రామారావు— అవునమ్మా ! ఎందఱైనఁ దల్లితోడు నెట్లగుదురు ?

సరస్వతి—తల్లితోడులకంటె నా ధర్మారా వెక్కువ యని విశ్వాసము గలదు. కనుకనే నే నింత ధైర్యముతోఁ జెప్పుచున్నాను.

రామారావు—ఇఁక భగవంతుఁడే నిన్ను రక్షింపవలయును. నేను జెప్పఁదలఁచినది చెప్పితిని. ఈ 3 గంటలకే నా ప్రయాణముః. అత్యావశ్యకమైన పను లున్నవి.

సరస్వతి—ఒక్కనాఁడైనఁ బూర్తిగా నుండవుసుమా ! పోనిమ్ము. పను లున్నవి గాఁబోలు. మన యబ్బాయి ప్రహ్లాదుఁడు గూడ పాఠశాలనుండి యింటికి వచ్చువేళ యైనది. అందఱము ఫలాహారము చేయుదము. లోపలికి రమ్ము.

రామా—సరే ! (ఇరువురు నిష్క్రమింతురు)

(తెరపడును)

## చతుర్ధరంగము

(ప్లీడరు కందర్పరావు గృహములో ముందుపంచ. కందర్పరావు రామశాస్త్రి కుర్చీలలోఁ గూర్చుండి యుందురు.)

రామశాస్త్రి—కందర్పరావుగారూ! మీయుపన్యాసము నేఁడు ప్రజలలోఁ జాల కలవరము గలిగించినది.

కంద—అందులకు సందేహమా! రామశాస్త్రీ! ఇంకను నెక్కువ కలవరము గలిగింపవలయునని నాయుద్దేశము.

రామ—వర్ణవ్యవస్థను నిర్మూలించుటయే మీయాశయము. వివాహములయందును భోజనాదికములయందును వర్ణభేదమున్న నేమి కీడు గలుగును?

కంద—రామాయణమంతయు విని రామునికి సీత యేమగునన్నట్లు ప్రశ్నించుచున్నారే! ఐకమత్యముకొఱకును శాంతికొఱకును వర్ణనిర్మూల మత్యావశ్యకము.

రామ—ఇప్పటికి 3000 సంవత్సరములనుండి మనదేశమున వర్ణభేదమున్నను వర్ణములలో నైకమత్యము లేకపోవుటగాని కలహములుగాని గోచరించినవా!

కంద—లేకపోవచ్చును. అప్పటివారికి విమర్శజ్ఞానములేదు. ఈనవయుగములో నట్టిభేదము పనికిరాదు.

ఉ. ఎన్నఁడో పూర్వకాలమున నెంచి విధించిన శాస్త్రధర్మముల్
గ్రన్నన మూఢమానవులు కారణమారయ కాచరింతు రీ
తెన్నున లోకమంధగతిఁ ద్రిమ్మర న్యాయమొ? నూత్నపద్ధతుల్
కొన్ని సృజించి వానిగయికొంటయె న్యాయమొ? యూహసేయుమా!

రామ—సహపంక్తి భోజనములవలనను వివాహములవలనను నైకమత్యము చేకూరునెడల నట్టియవకాశములుగల యన్నదమ్ములును

బావమఱఁదులును నేల కలహింపవలెను? బంధువులలో బంధువు లేల తలలు పగులఁగొట్టుకొనవలయును? ఇప్పటి యుగమున స్వార్థపరత్వ మెక్కువగుటచేఁ గలహములు సంభవించుచున్నవి కాని సహపంక్తి భోజనాదికములు లేకగాదు. వ్యాధి యొకచోటనుండ మందు నొకచోటఁ బ్రయోగించుచున్నారు.

కంద—మీయభిప్రాయము సరియైనది కాదు.

రామ—పోనిండు. మీకుఁ బాశ్చాత్త్యు లాదర్శప్రాయులు గదా! వర్ణవ్యవస్థలేని పాశ్చాత్త్యదేశములలో శాంతియున్నదా!

[మోహిని ప్రవేశించును]

మో—నాథా! మీరప్పుడే యుపన్యాసమందిరమునుండి యింటికి వచ్చినారా!

కంద—వచ్చితిని. (శాస్త్రిగారివైపు తిరిగి) శాస్త్రిగారూ! మనము చర్చింపవలసిన విషయములు చాలగలవు. మిమ్ములను మాయుద్యమములోనికి వచ్చునట్లు చేయఁగలనని నాకు విశ్వాసము గలదు. ప్రస్తుతము మన్నింపుఁడు. మఱియొక మాఱీ విషయమునుగూర్చి మీకు నచ్చునట్లు వాదింపఁగలను.

రామ—అట్లయిన నేఁటికి సెలవు పుచ్చుకొందును. (పోవును)

కందర్పరావు—మోహినీ! నేనువచ్చి చాలసేపైనది. ఇంతదనుక నీవెచ్చటికేగితివి? నిన్నువిడిచి యొక్కనిమిషమైన నుండజాలనని యెఱుఁగవా?

ఉ. ఏతఱి నీముఖాంబుజసమీక్షణమున్ బొనరింపకుందునో
యాతఱి నేను జన్మమిది వ్యర్థమటంచుఁ దలంతు నింతిరో
ఏతరుణంబు నీవదన మించుక చుంబనమేనొనర్పనో
యాతరుణంబునన్ హృదయమం దమృతాసవతృష్ణవర్థిలున్.

(ముద్దుపెట్టుకొనుచున్నాఁడు)

మోహిని—మీచే నిట్లనుగ్రహింపఁబడుటచే నాజన్మము సఫలమైన దని భావించుచున్నాను. మనవలె నింత యైకమత్యమున మెలంగు కుటుంబములు సంఘసంస్కరణమువలనఁ బెక్కులు బయలుదేరిననే గాని మనయుద్యమము వృద్ధిఁబొందదు. నేనిప్పుడే సూర్యారావు గారి బండిలో షికారు వెళ్లుచు నీవిషయమును గూర్చి చర్చించితిని.

కందర్పరావు—ఏమి ? మనకుఁగావలసినన్ని బండ్లుండ వారిబండిలో నేలషికారువెళ్లవలయును. నీకెన్నిమాఱులు చెప్పినను దెలియదు. నేను నీయందెంత మోహముతో నుందునో నీవు నామాటయం దంత యనాదరము చూపించుచున్నావు.

(పెడమొగము పెట్టుచున్నాఁడు.)

మోహిని—నాథా ! ఇటు చూడుఁడు. (అతనిముఖము తనవైపునకు బలవంతముగాఁ ద్రిప్పుకొని) ఇంతకాలము గడిచినను నాభావము నర్థముచేసికొనకపోవుట నాదురదృష్టము. ఇఁక స్త్రీ స్వాతంత్ర్యో పన్యాసముల సారాంశమిదియె కాఁబోలును. హృదయము ప్రధాన ముగాని యెవరిబండిలోనేగిన నేమున్నది ? ఎన్నఁడేని మీయందు దప్ప మఱియొకచోట ననురాగముంచితినని మీరు భావించుచో నేఁడే యాత్మహత్యగావించుకొందును.

కందర్పరావు—అంతమాట వలదు. నేను మాటవరుస కట్లంటినిగాని నీయందనుమానముగాని యపనమ్మకముగాని లేదు.

ఉ. నీమధురాధరామృతము నేననయంబును దృప్తితీఱఁగాఁ
గోమలి ! యానుదున్ సుఖముగూర్చెడి నీబిగియైన కౌఁగిఁటన్
భామిని ! సొక్కెదున్ విమలభావమునన్ మనబోఁటిదంపతుల్
భూమిని గానరారెటను బొంకిది గాదు త్రిశుద్ధిఁబల్కితిన్.

(కౌఁగిలించుకొనఁ బోవుచున్నాఁడు)

మోహిని—చాలులెండు ! మీసరసములు. ఈపంచలోనా ! ఇది పదు గురు వచ్చుచోటు. అదిగో ! మనలక్ష్మి యిటేవచ్చుచున్నది. (కౌఁగిటినుండి తప్పించుకొని లక్ష్మివైపునకు దిరిగి) లక్ష్మీ ! ఇటురమ్మా. ఇక్కడఁ గూర్చుండుము. (కుర్చీ చూపించును అందఱుఁ గూర్చుందురు) మీనాయనగారితో నీసంగతి చెప్పవలసి యున్నది.

కందర్పరావు—(తొందరతో) ఏమది ?

లక్ష్మి—నే నేమల్లరిచేసితినే ? నన్ను గొట్టించుటకు !

మోహిని—మఱేమియు విశేషములేదు. 5 సంవత్సరములనుండి సంగీతము చెప్పించుచున్నామన్న మాటయే గాని ఒక్కముక్కైన నంటలేదు. రాగమా ? తాళమా ? పాడినదేపాట ! కావున నేఁటి నుండి ప్రాతయుపాధ్యాయుని మాన్పించి వీణాగానమునఁ బేరు పొందిన సరస్వతిని బాఠము చెప్ప నేర్పాటు చేసినాను. ఆమెకు నెలకుఁ బాతికరూపాయలు జీతము. ఆమె వచ్చువేళయు నైనది.

కందర్పరావు—అంతజీతమే. నీకు ధనమన్న లెక్కలేదు. సంపాదించు వానికిఁ గాని డబ్బు విలువ తెలియదు. వ్యయమునందు యుక్తాయుక్తవివేక మక్కఱలేదా ?

మోహిని—పోనిండు. నేనును లక్ష్మియు నొక్కపూట భోజనము మానివైచి మీధనమునకు లోటులేకుండఁ జేయుదుము. పిల్లకు సంగీతము రాకపోవుట మనకు న్యూనత గాదా ! ఈయూరిలోకెల్ల గొప్పవారమని మనకుఁ బేరు ? ఒక్కదానికి నొక్కపిల్ల. దానికిఁ గానిచో మన ధన మెందులకు ? మీప్రేమలన్నియుఁ బైసామాట వచ్చునప్పటికిఁ బాఱిపోవును. పిల్లకుఁ జదువు చెప్పించుటకు స్వాతంత్ర్యము లేనిదానను మీతోఁ గాపుర మెట్లు చేయుదును ? ఇఁక నెవరిత్రోవ వారిది.

కందర్పరావు—అదిగాదు. మోహినీ! ఇంతలోనే యింత యాగడ మేల? (చెక్కిలి దువ్వి యోదార్చుచు) నీయిష్టమువచ్చినట్లే కానిమ్ము. నాకు మాత్రము పిల్ల చదువు గిట్టదా?

మోహిని—అదిగో! మన మనుకొనుచుండగనే యుపాధ్యాయిని విచ్చేసినది. (సరస్వతి ప్రవేశించును.)

సరస్వతిగారూ! దయచేయుఁడు, లక్ష్మీ! లోపలఁదివాచి పఱచి సంగీతపుస్తకములతో సిద్ధపడుము.

(లక్ష్మి లోపలికేగును.) (సరస్వతివైపుతిరిగి) ఈకుర్చీలో గూర్చుండుఁడు.

సరస్వతి—మనము లోపలికే వెళ్లుదము రండు.

(కందర్పరావు ఱెప్పవాల్పక సరస్వతిని జూచుచుండును.)

మోహిని—సరియే! మీయిష్టము. ఇప్పుడే లోపలికిఁ బోవుదము. (భర్తవైపుతిరిగి) సరస్వతిగారితో నెప్పటికిని సంఘ సంస్కరణాది ప్రసంగములు చేయరాదు. జ్ఞాపకముంచుకొనుఁడు. ఆమె తన పని తప్ప మఱియొక కార్యమునకుఁబోవునదిగాదు. ఆమె నెవ్వరును బలుకరింపఁగూడదను నియమముతోడనే యీపాఠము సంగీకరించినది.

(ఇరువురు లోపలికి నిష్క్రమింతురు.)

కందర్పరావు—(సరస్వతిం దలఁచి) ఆహా! నే నిప్పుడీలోకమున నున్నానా! స్వర్గలోకమున నున్నానా! నాకన్నులను నేను విశ్వసింపఁ గలనా? ఈమె మానవాకృతియా! అప్సరసయా! ఇప్పటి నాస్థితి యేదియో నేను నిర్ణయింపలేకున్నాను. నాహృదయమొక యవ్యక్తానందమున మగ్నమైనది.

లలో లెక్కింపదగియున్నది. విద్యచేతనా దానశీలముచేతనా సంపదచేతనా చక్కదనముచేతనా గుణగణముచేతనా బుద్ధివైభవముచేతనా యెందుచేత లెక్కింపదగినదని యడుగుటకు చదువరుల కధికారము గలదు. పైగుణములలో నేవియు నామెకడలేవనుట నిశ్చయము. ఆగుణసంపదలకు నామెకు నూరామడలదూరమున్నది. లోకమునకు రామునిచరిత్ర మెంతయవసరమో రావణునిచరిత్ర మంతయవసరమే సీతవృత్తాంతమెంత ముఖ్యమో సూర్పణఖవృత్తాంతముగూడ నంత ముఖ్యమే. నవరత్నము లెంతవర్ణనీయములో నత్తగుల్లలు నంతవర్ణనీయములే. మహానదిలోని తీయనీరెంత ప్రశంసాపాత్రమో సాగరమందలి క్షారజలము నంత ప్రశంసాపాత్రమే. కవిచాతుర్యమునకు త్రాచుబామెంత ఉపయోగమో వానపాము లంతఉపయోగమే సాధువృత్తిగల గంగిగోవు గ్రంథకర్తకెంతముఖ్యమో కనబడినయెల్లవారిమీద బడి కఱచు కొట్లకుక్కగూడ గ్రంథకర్తకంతముఖ్యమే. కాబట్టి విద్యావినయసంపన్నురాలైన నారీరత్నముయొక్క చరిత్రము వ్రాయుట కవికెట్టివిధియో తద్గుణసూన్యురాలైన పొలతుకచరిత్రముగూడ వ్రాయుట కవికట్టి విధియేసుడీ! ఈవిషయములు సమగ్రముగా సమాలోచించి దుందుభిచరిత్రము పాఠకమహాశయుల వినోదార్థము వ్రాయబడుచున్నది.

## మూడవ యుల్లాసము



దుందుభియొక్క జన్మస్థానమేదో తల్లిదండ్రు లెవరో వారెట్టివారో తెలిసికొనుటకు చదువరులు ఆసక్తులై యుందురు కావున తత్కథను ముందుగా వివరించెద. పూర్వము గోదావరీమండలములోనిదియై ప్రస్తుతము పశ్చిమగోదావరీ మండలములో చేరిన భీమ

వరము తాలూకాలో తోకలపూడియను గ్రామము కలదు. అది మిక్కిలి కుగ్రామము. ఆ తాలూకాకు పూర్వకాలమున ముఖ్యపట్టణమై యుండిన వీరవాసరమునకు తోకలపూడి రమారమి క్రోసున్నర దూర ముండును. వీరవాసరమునుండి పెనుమంత్రకుపోవు రాచబాటమీద తోకలపూడి యున్నది. బ్రాహ్మణగృహములు మూడు నాలుగు కంటె నెక్కువలేవు. నీటివసతికై యొక చెఱువును కొన్ని మంచినీటి బావులును గలవు. శివార్చకుఁడైన పూజారికుటుంబమును కరణము గారి కుటుంబమును గాక యీకథాప్రవృత్తినాటికి మఱియొక వెల నాటి బ్రాహ్మణుని కుటుంబముగూడ గలదు. ఆబ్రాహ్మణుని యింటి పేరు పామువారు. ఆయన పేరు సింగన్న. పామువారను గృహనామము మీకెట్లుకలిగినదని యొకసారి యెవరో ప్రశ్నింప సింగన్న యీక్రింది విధముగా నుత్తరము చెప్పెను. "మాపూర్వులలో నొకడు మంత్ర శాస్త్రమున మహాప్రజ్ఞావంతుఁడై పాదుకాంతదీక్ష గైకొని ప్రఖ్యాతి జెందెను. అనుగ్రహించుటకు శపించుటకు గూడ నాతనికి సామర్థ్యము గలదు. కోపముచే శాపమిచ్చెనా భూపాలుడు గోపాలుడు గావలసి నదే! కరుణించి దీవించెనా! బిక్షాధికారి లక్షాధికారి గావలసినదే! ఎంతగొప్పమంత్ర శాస్త్రజ్ఞుడు ప్రయోగము చేసినప్పటికి అతడు చిటి కెలో త్రిప్పివేయగలవాఁడు. అతడు ప్రయోగముచేసెనా ముల్లోకములు తిరిగినను మూడుకన్నులవాఁడుగాని నాలుగుతలలవాఁడుగాని వేయి నాలుకలవాఁడుగాని దానిని త్రిప్పలేడు. ఆయన సర్పమంత్రములో సాటి లేనివాడు పాములపాలిటికాయన గరుత్మంతుఁడని చెప్పవచ్చును. బరి మీద పఱువెత్తునట్టి కోడెత్రాచుసైతము ఆ మహానుభావుఁడు నిలు నిలుమని యాజ్ఞాపించెనా సర్వావయవములు స్థంభించినట్లు పాము పడగఎత్తి సలాముచేయుచు నిలిచిపోవలయును. పామెవ్వరిమీదనైన

పగబట్టెనా ఆయన మంత్రపించి విభూదియో మినుములో యిచ్చిన పక్షమున నవి గృహమునకు నాలుగుప్రక్కలా జల్లుకొని సురక్షితుఁడై నిద్రపోవును. పాముగరిచినమనుష్యుడు చచ్చిపోయిననుసరే కళేబర మున్నపక్షమున సర్వేశ్వరశాస్త్రి బ్రతికించినాడన్నమాటే, ఆతనిమంత్రము సంజీవనీ దివ్యౌషధివంటిది. పాముకరచినవాఁడు ఆయనకడకు రానక్కరలేదు. ఎవడో యొకడువచ్చి యావర్తమానముంజెప్పి సర్పదష్టుడైనవాని పేరుజెప్పినంజాలు. ఆవార్తవినగానే సర్వేశ్వరశాస్త్రి స్నానముచేసి జలముమంత్రపించియిచ్చి యది సర్పదష్టునిచే త్రాగించుమని చెప్పును. అదిత్రాగిరోగి నిద్రనుండిమేల్కొన్నట్లు లేచికూర్చుండును. రోగిత్రాగుటకు వీలులేనంత స్మృతితప్పియుండెనా యాజలము నాతనిమీద ప్రోక్షించిననూ లేచికూర్చుండును. ఆయన ప్రభావమును బట్టి ఆయనకు పాముసర్వేశ్వరశాస్త్రి యనుపేరు వచ్చినది. ఆయన సంతతివారమగుటచే నదియే గృహనామమైనది. ఇదిమాకు కేవలము పౌరుషనామము. ఎల్లవారికివలె మాకు నిరర్థకమైన గ్రామనామము రాలేదు. పూర్వము మాయింటిపేరు దివాకర్లవారు. దివాకరుఁడైన సూర్యభగవానుని మాపెద్దలారాధించి మెప్పించి ప్రఖ్యాతి పొందినందున, వారికి దివాకర్లవారని పేరు గలిగినది. కాబట్టి మావంశము అన్నివిధముల యాంధ్రదేశమున ప్రఖ్యాతి గాంచినది." అని సింగన్న తనవంశమును గురించి కోతలు గోయుచుండగా వినినవారు యివన్నియు కోతలని తమలోతాము ముసిముసినవ్వులు నవ్వుకొనుచు చాటున వానిమాటలను బరిహాసించుచుందురు. సింగన్న యత్తవారియూరు రాయకుదురు. అదిపల్లెయైనను నందు బ్రాహ్మణ కుటుంబములు అనేకముగలవు. పలువురు నియోగులు పలువురు వైదికి బ్రాహ్మణులు నాగ్రామమున సన్నోదకములు గలిగి సుఖముగాజీవించ

చుండిరి. అందు లంకమరిడయ్యావధాని యను నొకవెలనాటి విప్రుడు గలడు. ఆయనకు పెక్కండ్రు పుత్రికలు పుట్టిరి. అందు నాల్గవకుమార్తె మామిళ్లమ్మ. మరిడయ్య తనచతుర్థపుత్రికను తోకలపూడి తనగ్రామమునకు దగ్గరగా నుండుటచేతను సింగన్న నాలుగీగలవాడు నాలుగు తేగలవాడు. వానిపెద్దలు నామంగలవాండ్రు నీమంగలవాండ్రు నగుటచేతను నూరువరాలసొమ్ముపుచ్చుకొని మామిళ్లమ్మను సింగన్నకిచ్చి వివాహము చేసెను. మామిళ్లమ్మ రాయకుదురు గ్రామదేవత. ఆదేవత చాలామహిమకలదని సమీపగ్రామవాసులు చెప్పుకొనుచుందురు. ఆకారణమున, బ్రాహ్మణులు శూద్రులు మొదలైనవారు భయముచేతనో భక్తిచేతనో! యీదేవతకు మ్రొక్కుకొని మొగబిడ్డకు మామిళ్లయ్య యనియు, నాడుబిడ్డకు మామిళ్లమ్మ యనియు పేళ్లు పెట్టుచుందురు. గర్భవతియైనప్పుడు తనభార్యకు మిక్కిలి జబ్బుచేసినందున యీమెకు పుట్టినబిడ్డకు గ్రామదేవతనామముపెట్టుదునని మ్రొక్కుకొని యీకానుపున నాడుబిడ్డపొడముటచే చేసినప్రతిజ్ఞతప్పకుండ యమ్మవారిపేరుపెట్టుకొనెను. మామిళ్లమ్మకాలక్రమమున పెరిగి పెద్దదై తోకలపూడిలో భర్తతో కాపురము చేయుటకు వెళ్లెను. తోకలపూడికి రాయకుదురునకు రమారమి యరక్రోసుదూరముండును. కాబట్టి మరిడయ్య యుదయముననో సాయంకాలముననో ప్రతిదినము ఏపనిమీదనో బయటికి వెళ్లినప్పుడు పనిలోపని యనుకొని తోకలపూడి వెళ్లి గారాబుకూతురైన మామిళ్లమ్మను జూచి సేమమరసి వచ్చుచుండును. తాటిపేసెముతో రొట్టెగాల్చుకొన్నప్పుడును పెసరపప్పుపోసి పిండిచేసుకొన్నప్పుడును తండ్రి గిన్నెలోపెట్టుకొనియో తామరాకున పొట్లముగట్టియో నేయివేసి నంజుకొందుకు మాగాయయో ఆవకాయ పిండియో గూడవైచి అదిపట్టుకొని మరిడయ్య పుత్రికకు యిచ్చు

చుండును. మామిడిపండ్లకాలములో మామిడితాండ్రయు తాటిపండ్ల కాలములో తాటిచాపయు తల్లి తండ్రిచేతనో మరియొకరిచేతనో సూడిదగా పంపుచుండును. ఈవిధముగా కాపురము చేయుచుండ మామిళ్లమ్మకు దైవానుగ్రహమున కడుపుఫలించెను. ఆరుగురు కూతుళ్లు నిద్దరు కొడుకులుపుట్టిరి.

---

## నాల్గవ యుల్లాసము.

సింగన్నకు ప్రపంచములో గోష్పాదమంత భూమియైనను లేదు. అడిదము సూరకవిగారిని మున్నెవ్వరో మీకుమాన్యములు భూములు కలవా? యని అడిగిరట. ఆప్రశ్నకు కవిగారు మాకుగలమాన్యములు సామాన్యములు భూములురుద్రభూములుసనిప్రత్యుత్తరమిచ్చెనట. సింగన్నకుగల మాన్యములు భూములు నట్టివే. భవతిభిక్షాందేహి భవాన్ భిక్షాందేహి అనునట్టి యుపనయనమునాటి మాటను జ్ఞప్తియందుంచుకొని చెంబో జోలియో పుచ్చుకొని బయలుదేరువానికి లోకమంతయు మాన్యమే. సంపదగలవారి గృహములన్నియు వానికి పొలములే. ఆకారణమున సింగన్న భార్యకార్యమునకు రాకమునుపే చెంబుతెల్లగా తోముకొని సీతారామాభ్యాన్నమః అని తోకలపూడిలోను తోలేరు గ్రామమునను కొణితెవాడలోను యాయవారము చేయనారంభించెను. ఆయవారమెత్తుట యన్నివృత్తులలో శ్రేష్ఠమైనదిగదా! ఎందుకిట్లు బిచ్చమెత్తుచున్నావని అడిగిన "బ్రాహ్మణ్యాశ్యధనంభిక్షం" అని ధర్మశాస్త్రములు ఘోషించుచున్నవని వెంటనేప్రత్యుత్తరముజెప్పి బ్రాహ్మణుడు తాజేయుచున్నపని సర్వోత్తమమైనదని వాదించి తనవాదము స్థిరపరచుకొనును. అదిపెట్టుబడిలేని వ్యాపారము. ఇల్లిల్లు తిరుగవలసిన

శ్రమతప్ప యితరశ్రమ ఏదియులేదు. నాగలిపట్టుకొనిదున్ననక్కఱలేదు. వానలోదడిసి పొలమూడ్చనక్కఱలేదు చలిగడగడవడకించు సమయమున పొలములో పండుకొననక్కఱలేదు. కుప్పనూర్చనక్కరలేదు. ధాన్యము నిలువచేయుటకు గాదెలు కట్టనక్కరలేదు. ధాన్యము దంపుకొననక్కరలేదు. ఆయవారముచేయు బ్రాహ్మణునకు గృహయజమానురాండ్రు భక్తితో నెసటిలో పోసుకొనుటకు సిద్ధముగానున్న తెల్లని బియ్యము దోసెడు బియ్యముపెట్టుదురుగదా! కాళ్లుగాలకుండా చెప్పులుదొడుగుకొని తలకెండదగులకుండ తాటియాకుగొడుగు వైచుకొని ఠీవిగా నడచి తన తాతముత్తాతలసొమ్ము దాచబెట్టుకొన్నట్లు ప్రతిగృహమునకుబోయి చనువెక్కువగానున్న చోట్ల వంటయింటి గుమ్మము ముందరనే చెప్పులను విడిచి లోపలికిబోయి యింటనున్న యంగనలను అమ్మాయీ అక్కయ్య పిన్ని అత్త మామ్మ యని వావివరుసలుబెట్టి పిలిచి యిచ్చకములాడి ముఖప్రీతివాక్యములుజెప్పి తిథివారనక్షత్రములుజెప్పి వర్జముచెప్పి బియ్యము గ్రహించుటయే గాక కూరలు మొదలయినవి గూడ నడిగిపుచ్చుకొని యరటిపండ్లు మామిడిపండ్లు మొదలగు ఫలములను సంగ్రహించి యాయవారపు బ్రాహ్మణుఁడు బియ్యము మూటగట్టుకొని పోవుచుండును. మనుష్యరక్తము చవిగొన్న పెద్దపులి దానిని విడువజాలనట్లు యాయవారపు వృత్తికి అలవడిన బ్రాహ్మణుఁడు కొడుకుద్యోగము చేయున్నను దనవృత్తిని మానజాలడు. అనాయాసమై మిక్కిలి లాభకరమైన వ్యాపారమగుటచేతనే పాముసింగన్న యిరువది ఏండ్లు వచ్చినదిమొదలుకొని యీ వృత్తినే యవలంబించి దొరికిన బియ్యము వారమునకొకసారి విక్రయించి రొక్కముబుచ్చుకొని సొమ్ము నిలువజేయఁజొచ్చెను. చుట్టుప్రక్కలగ్రామములలో నెవ్వనియింట శుభకార్యమైనను నశుభకార్యమైనను సింగన్నయచ్చట భోజనము చేసి

తీరవలెను. అదిగాక షోడశబ్రాహ్మణార్థములుచేయును. పొత్తర్లబట్టును. నగ్నప్రచ్ఛాదనలు స్వీకరించును. అందుచేత సింగన్నయింట కావలసినన్ని చెంబులు గిన్నెలు పీటలు పరుపులు మొదలయినవి యుండును. కాని యతఁడు వానినెల్ల విక్రయించి రొఖ్ఖముచేయుచుండును. యీవిధముగా నాలుగువందల రూపాయిలు సంపాదించి లంకమరిడయ్య యొద్ద మామిళ్లమ్మను క్రయమునకు దీసుకొనెను. భార్య కాపురమునకు వచ్చినతరువాతగూడ నట్లేచేయుచుండెను. ఆయవారము ఆయననిత్యవిధి. వైశాఖమాసమున నెండ జగమునెల్ల గాల్చుచున్నను, శ్రావణభాద్రపదములలో నాకసము చిల్లివడినట్లు పెనువానలుగురియుచున్నను సింగన్న వర్షమునకు లెక్కసేయని దున్నపోతువలె తిరిగి యానాడు సమార్జింపవలసిన తండులములు సంపాదించితీరును. ఇల్లాలు కాపురమునకు వచ్చిన రెండుసంవత్సరములకే సింగన్నకు గూతురు పుట్టెను. మరిడయ్య కుమార్తెను రాయకుదురు తీసుకొనిపోయి పురుడువోసి మూడవమాసమున తల్లిని పిల్లను నత్తవారియింటికి పంపెను. అదిమొదలుగా మామిళ్లమ్మకు రెండేడ్లకొకసారి యొకకూతురువంతున వరుసగా నైదుగురు కూతులు పుట్టిరి. అందైదవదేమనదుందుభి. రామకృష్ణాది మహాపురుషులును సీతా పార్వతీ మొదలగు దివ్యాంగనలును జనియించినప్పుడు దిక్కులు ప్రసన్నములయ్యెనని దివినుండి పుష్పవర్షములు కురిసెనని గ్రహసంచారము సరిగానున్నదని పురాణకర్తలు వ్రాసియుండిరి. అట్లే దుష్టజనుల జననకాలమున గగనమునుండి కొఱవులురాలెననియు నిప్పులవాన కురిసెననియు నక్కలుకూసెననియు మహాకవులు వర్ణించినమాట పాఠకమహాశయులకు దెలియని విషయముకాదు. అట్లే దుందుభిజననకాలమున కొన్ని భయంకర దృశ్యములు కనబడెను, ఆమె దుందుభిసంవత్సర భాద్రపద బహుళామా

వాస్యనాడు రాత్రి రెండుజాముల వేళ జననమొందెను. ఆసమయమున కొండచిల్లిపడినట్లు మహావర్షము కుఱిసెను. బడబడమని యురుములు సెలరేగెను. తళుకుతళుకుమని కన్నులు మిఱుమిట్లుగొలుపునట్లు మెఱుపులు నభోమండలమున మాటిమాటికి దోఁచెను. ఫిరంగులు పేలినట్లు ఫెటిల్లు ఫెటిల్లున పిట్టపిడుగులు తాళవృక్షములమీఁదను కొన్నియిండ్ల మీఁదను పడెను. నక్కకూఁతలు పురిటియింటిలోనికే వినఁబడెను. అంత వఱకుదనకు కొడుకులు పుట్టకపోవుటచేత మాంమిల్లమ్మ మొగబిడ్డకు దనతండ్రిపేరు వెట్టుకొను భాగ్యము తనకు లేదని నిశ్చయించుకొని యాఁడుబిడ్డకే యాపేరు పెట్టుకోవలెనని తలంచి యైదవకూఁతునకు మరిడమ్మ యనిపేరుపెట్టెను. కాని మాతామహుఁడు దుందుభిసంవత్సరమున యాబాలిక జననమొందుటచే దుందుభియని ముద్దుపేరు బెట్టి పిలువఁజొచ్చెను. ఆబాలిక భూమిమీఁద పడినప్పుడే మంత్రసానికిని పురిటియింటిలోనున్నవారికిని మాత్రమేగాక చావడిలోను వీధియఱుగుల మీఁదనున్నవారికిని గూడ నాశ్చర్యము గలుగునట్లు పెద్దగొంతుపెట్టి ఏడ్చెను. వీధియరుగుమీఁద గూర్చున్న యొకవృద్ధబ్రాహ్మణుఁడు శిశువు యొక్కకంఠధ్వనివిని యిదేమయ్యా! దుందుభిమ్రోతవలెనున్నది! యనితక్కినవారితో బలికెను. ఇదిబ్రతికి బాగుండిన పక్షమున శూర్పణఖను మించునురా! యని మరియొక బంధువుఁడు పలికెను. యీవిధములైన మహదాశీర్వచనములతో దుందుభి ప్రభవించెను. జన్మకాలమందలి గ్రహముల బలముచేతను వృద్ధబ్రాహ్మణుల యాశీర్వచన ప్రభావమునను మరిడమ్మ దినదిన ప్రవర్ధమానయై పెరుగజొచ్చెను.

---

మహో

# ఝరీతరణము

తే. గీ. ప్రథితమేవాడరాజ్యసంభరణశాలి
వీరనిలయసిసోదియావారిధిందుఁ
డల్ల రాణాప్రతాపసింహాధిపుండు
చనెడు నొక్కఁడుఁ జైతకాశ్వంబు మీఁద. 1

తే. గీ. చటులధాటిఁ జూపువలె దూఱుటయె కాని
ఆలమునఁ బిక్కచూపనిమేలు తేజి
నాఁడు విడి హల్దిఘాటు రణస్థలంబుఁ
బఱచెడునలంఘ్యదైవవిపాకమునను. 2

తే. గీ. తతపరాజయానలశిఖాదహ్యమాన
హృదయుఁడై యేగుచుండె నుర్వీధవుండు
నడచుచున్నాఁడొ హయమెక్కినాఁడొ కాక
యెఱుఁగలేకుండఁ దనుదాను మఱచిపోయి. 3

తే. గీ. అరుగునది దుర్గమంబైనయటవిసీమ
త్రోవఁజూపలేఁ డొక్కపురోగముండు;
తటుకునను గొండకొమ్మున దారి యాఁగె
మిగుల నొఱకమై కొండయు ముగిసె నచట. 4

తే. గీ. తొంగిచూచెను తాడిలోతునను గ్రింద
నెడతెగనిఘోషమున సెలయేఱు పాఱు;
భయదమై మృత్యువదనగహ్వరము భాతి
నేఁబదడుగుల వెల్పున నెసఁగె లోయ. 5

తే. గీ. చెంత వినఁబడెఁ బెనుకేక లింతలోన
వెనుదిరిగి చూచె మన్నీఁడు; కనఁగనయ్యెఁ
"బోకు మోక్షత్రియుఁడ! పాఱిపోకు" మంచు
వెంబడించెడు రిపులయాశ్వికదళంబు. 6

తే. గీ. తొమ్మిదీసెల యెడము మార్తురకుఁ దనకు
నుఱుకవలె నద్దరికిఁ గాక దొరకవలెను

గఱకుఁదురకల క్రూరంపుఁగరములకును
దరమె యొక్కని కెదిరి యందఱను దఱుమ ? 7

అ. వె. వెల్లవారువంబు మెడఁదట్టె నారౌతు
వ్రాలి ముద్దుగొనియె ఫాలతలము
“ నాపటాణి మిన్న నాకూర్మిచెలికా !
మనలఁ దఱిసె నదిగొ మలకదండు— 8

తే. గీ. నీదురింఖాసముద్ధూత నిబిడధూళి
నందుకొనలేవుగద యెట్టిహయములైన
హెచ్చుఁగద మిక్కుట్టు లెచ్చు నీకు
ఏటిలెక్క నీకీవాఁగు దాఁటివేయ ? 9

తే. గీ. సురిగిపోవఁగ రాదది పిఱికితనము
ఏఱు తరియించి దాఁటింపు మీవిపత్తు ”
ననుచుఁ బురికొల్పెఁ బరమసాహసుఁ డతండు
ప్రాణములకంటెఁ బ్రియమైనవారువంబు. 10

తే. గీ. వల్లెయనురీతి శీర్షంబు నల్లనూఁచి
కాళ్లు నాల్గును ముందఱఁ గలుపుకొనియెఁ ;
దటమునంచునఁ ద్రుటిసేపు తాళి మావు
కొలిచెఁ గంటితో నావలీవలికి దవ్వు— 11

తే. గీ. కొమ్మకొనఁ బిట్టవెగురుచుఁ గూయులీల
సరగ నకిలించె నొకమాఱు జవనహయము
పెనుతుపానున లేచెడు వీచిచాయ
నాకసమునకుఁ జంగునఁ జౌకళించె. 12

తే. గీ. పీతివేగాతిశయముచేఁ బెల్లగిల్లి
దరిని గలగండ్రశిలలేట దొరలిడుల్లె ;
ఆహుమాయురాహుతుల గాయముల నల్ల
కలుషితము సేసె విమలమాసలిలమెల్ల. 13

ఆ. వె. కరము కదలకుండఁ గళ్లెమూడక యుండఁ
జలన మొందకుండఁ జరణయుగము
కూరుచుండె రాజకుంజరుఁ డలవోక
చెక్కుచెదరకుండ జక్కిపైని. 14

తే. గీ. నీలజీమూతమునఁ దటిన్మాలవోలెఁ
దళుకు మంచును మెఱసెఁ గత్తళము క్షణము;
దయ్యమో బూతమో నాఁగ ధరణిభర్త
కంటి కగపడకుండఁగాఁ గడచె నేఱు. 15

తే. గీ. ఈతగానితోఁ గెరటంబు భాతిఁ జక్క
ఏలికను బూని యద్దరి వ్రాలె జక్కి;
తత్ఖురభిపాతమునఁ జేసి ధరణిధరము
మ్రోఁగె సమ్మెటపెట్టున దాఁగలి గతి. 16

తే. గీ. ముక్కుపై వ్రేలుగదియించి బొమ్మలట్లు
మల తుదను నిల్చిపోయెను మలకపిండు;
బళిర సేబాసు బాపురే వహ్వ యనుచు
వారి నోళుల నొకపెట్టఁ బలుకు లొదవె. 17

ఆ. వె. మావునకును దగ్గ రావు తుండీతండ
రావుతునకుఁ దగ్గ మావు నిదియ
ఎవనివశము పట్ట నీశూరవరు నంచు
మరలె వెనుక కంత మలకపౌఁజు. 18

తే. గీ. అడుగు ముందున కిడలేక యాఁగిపోయెఁ
గలనమున డస్సియున్న యాకత్తలాని;
ఊఁదుచున్నను నిలక కాళ్లూఁగసాగె
గాలితాఁకునఁ బెనుతెల్లుకాఁడలట్లు. 19

తే. గీ. స్నానమాడిన చందాన మేననెల్ల
స్వేదజలబిందు మౌక్తికశ్రేణి పర్వెఁ;

గాలిమితిత్తుల యోజఁ బ్రక్కలను మిగుల
నెగురవేయుచు రోఁజె నాయెక్కిరింత. 20

తే. గీ. చప్పునను డిగ్గి యెకిమీఁడు సైంధవంబు
వర్మమాది తద్భార మూఁడ్వంగఁ దొడఁగె ;
అంతలోన నాసాంబ్రాణి యవనిఁ గూలె
వాన నానుగోడవలె గుభాలుమనుచు. 21

తే. గీ. “ చైతకా! చైతకా ” యంచుక్ష్మాతలేశుఁ
డనుఁగుమోమును దనయొడియందుఁ జేర్చెఁ
గనుల నీరొల్కఁ బుల్కుపుల్కునను దొరను
గాంచి యా తేజి కడసారి కన్నుమూసె. 22

తే. గీ. సుతులు తెగినను నమ్మినహితులు తెగినఁ
గుడిబుజమువంటి మొనగాండ్రు పడిన నాఁడుఁ
బాటిసేయను నీవు జీవముల నుంటఁ
బ్రాపు నాకేది నీవె నన్ బాయనింక ? 23

తే. గీ. ఓటమిని రాజ్యభ్రష్టత్వ మొకఁడె కల్గెఁ
గలుగఁగాలేదు ధీరతాస్ఖలన మేమి ;
అకట ! నీమృతిచే నిప్పుడదియు నొదవెఁ
బల్లటిలె మానసము ధృతిపాఁతుగదలి. 24

తే. గీ. భూరిపాపిష్ఠవస్తు వీబొమిడికంబు
తన్ను సేవించువిశ్వాసధనులవైన
నిండుప్రాణముల్ మాచుచునుండఁ గొనెను
స్వీయలాభపరాయణహేయబుద్ధి. 25

తే. గీ. నన్నుగాపాడి విడనాడినావె జీన
మయ్యయో యంచు ఱేఁడు చింతాబ్ధి మున్గె ;
అతనిస్మృతి పటాంతరమందునప్పుడు దోఁచెఁ
జైతకకృతంబు లద్భుతచర్యలెన్నొ. 26

ఐదవ యుల్లాసము



ప్రబంధకర్తలు కథానాయకురాలియొక్క గుణలోపములు వర్ణించుట శిష్టాచారము. అందుచేత మన కథానాయకురాలైన దుందుభియొక్క రూపరేఖావిలాసములు వర్ణింపకపోయిన పక్షమున గ్రంథకర్తపై దోషారోపణము చేయుదురు కావున నట్టివర్ణన చేయుట యవశ్యకము. మహాకవులు తమకథానాయికలను వర్ణించునప్పుడు వారి మొగము సంపూర్ణచంద్రమండలమనియు కనులుకలువరేకులనియు ముక్కుసంపంగిపువ్వనియు చెవులుచక్కిలములనియు క్రిందిపెదవి దొండపండనియు కంఠముశంఖమనియు బాహువులు తామరతూడులనియు కాళ్లరటికంబములనియు శరీరఛాయబంగారమనియు బహువిధములుగా వ్రాయుదురు. ఆవిషయమున కవులు సాధారణముగా యథార్థమును వర్ణింపరు. అందరు చక్కనిచుక్కలనియు నందరు గుణములప్రోవులనియు అందరికంఠములు కోకిలస్వరములేయనియు వారు వ్రాసియుండిరి. దుందుభినిగూడ అట్లే వర్ణించునెడల సత్యమునకు దూరమగునని యున్నదున్నట్లే వర్ణింప సమకట్టెదను.

పాముసింగన్న నలుపు ఆయనభార్యయైన మామిళ్లమ్మ వానికన్న నలుపు కాబట్టి వారిపుత్రికలందరు నలుపురంగు గలవారే. దుందుభియొక్క మేనిచాయ వర్ణనాతీతమైనది. మసిబొగ్గులు జీడిగింజలు దుందుభి శరీరఛాయముందు కొంచెమెఱ్ఱనై కనపడునేమో ఆ నలుపులో నైగనిగ్యములేదు. దేహఛాయయు తలవెంట్రుకల ఛాయయు నొక్కటే. ఆమెను జూచినవారు నేర్పుగలశిల్పి యెవ్వడో తారుతో నొకమనుష్యవిగ్రహముచేసి దానికి జీవము పోసెనేమోయనితలంతురు. ఆమె చిన్నప్పటనుండియు లావుగా నుండును. అందరి తలవెండ్రుకల

వలె నామెవెండ్రుకలు నల్లగానుండక కొంచెమెఱ్ఱగా నుండును. కన్నులు పిల్లికన్నులు. ముక్కు పెద్దదేగాని చివరసొట్టగలిగియుండును. మొగము బుంగమొగము. బుగ్గలు బూరెబుగ్గలు. పైపండ్లు కొంచెము ఎత్తుగా నుండును. మెడ అందరిమెడవలె సామాన్యముగానుండక పొట్టిదై వికృతముగా కనబడును. కాళ్లుచేతులు మడకత్తులని చెప్ప వచ్చును. శరీరమంతటా రోమకళమెండు. దుందుభి నేలమీద ప్రాక నేర్చిననాటనుండియు యింటిలోని సమస్తవస్తువులు పాడుచేయ నారంభించెను. లేచి విద్దెములు చేయనారంభించినప్పటినుండియు బిందెలువంచి నీళ్లుపారబోయును; చెంబులు పగులగొట్టును; బుట్టలువంచి ఉప్పు మొద లయినవానిని వొలకబోయును. మూడవయేట దుందుభి తనయింట తిరుగుచున్న చిన్నపిల్లిపిల్లతో నాడుకొని యాడుకొని చివరకు దానిని గొంతుపిసికి చంపెను. ఆలాగే మరియొకనాడు వీధిలో తమగుమ్మము ముందరతిరుగుచున్న చిన్నకుక్కపిల్లనుగూడ పరమపదమునకు పంపిం చెను. మూడేండ్లు నిండకముందే దుందుభియుండ రెండజ్ఞములు చేసిన దమ్మాయని చుట్టుప్రక్కల యమ్మలక్కలు, చెప్పుకొని నవ్వుచుందురు. ఈగలనుబట్టిచంపుటలో నామెకుగల సరదా వర్ణింపనలవిగాదు. చిన్న తనమందామెకు చిడుము పలుమారుపట్టుచుండును. గజ్జిపొక్కులు చితికినతరువాత వాటిమీదవ్రాలెడు ఈగలను పట్టుకొని చంపుచుండును. చిడుము పోయినతరువాత నామెమీద నీగలు వ్రాలకుండుటచే మక్షి కముల నాకర్షించుటకు చేతిమీదనో కాలిమీదనో ఆమెకొంత తేనె రాయును. అప్పుడు జుమ్మని యీగలు వ్రాలగా వానినిబట్టి గుప్పిడితో నలిపిపారవేయును. వీధిలో తమగుమ్మము ముందటినుండి పోవుచుండు నావులను గేదెలను దూడలను కఱ్ఱతీసుకొని తరిమి తరిమి కొట్టుచుండును. ఆడుకొనుటకు చుట్టుప్రక్కల నున్నవారి

పిల్లలు తమయింటికి పప్పుబెల్లములు తీసుకొని వచ్చినప్పుడు తానవియన్నియు తినివేయును. తానుదెచ్చిన వస్తువులు వారుముట్టి కొన్నపక్షమున వాండ్రను గిల్లి రక్కి కరచి తన్ని బాది వెడలగొట్టును. దుందుభి ఆడుకొనుటకు నితరులయిండ్లకు పోయినపక్షమున నాయిండ్ల లోని స్త్రీలు పురుషులుకూడ నేదోవొంకపెట్టి దుందుభినావలకు, పంపుచుందురు. దూరమునుండి దుందుభిని చూచినపక్షమున యిరుగు పొరుగువారు ముందుగనే తలుపులోపల గొళ్లెముపెట్టుకొందురు. అట్లు వారుచేయుటకు రెండుకారణములుకలవు. దుందుభి తమపిల్లలను గిల్లికొట్టునను భయ మొకటి. యింటిలోనున్న లక్కపిడుతలు, దొండ కాయలు, లక్కబొమ్మలు, నల్లచందనపుబొమ్మలు మొదలయిన ఆట వస్తువులను ఆమె దొంగిలించుకొని పోవునని రెండవభయము. అట్టి వస్తువులను హరించి ఆమెపట్టుకొని పోవుచుండగా చూచి యజమా నులు చేతిలోనుండి లాగుకొన్నపక్షమున దుందుభి పెద్దపెట్టున నేడ్చును. ఆరోదనము వినగానే తల్లిదండ్రులు మహాకోపముతో నిల్లువెడలివచ్చి "మాపిల్లను మీరు నిష్కారణముగా కొట్టినారు మాపిల్లనుచూచి నప్పుడు మీరుకన్నులలో నిప్పులు బోసుకొందురు. దానివంటిపిల్లలు మీకులేరా? మీయమ్మకడుపులుకాల" అని దూషించి దుమ్మెత్తి పోయుచుందురు. పిల్లచాటుగా దొంగిలించి తెచ్చినవస్తువులను తల్లి జాగ్రత్తగా దాచునెగాని మరలవాటిని యజమానులకెప్పుడు పంపదు. ఈదొంగతనము పిల్లలాడుకొను వస్తువులతోనే తుదముట్టలేదు. చేమంతి పువ్వు, మొగలిరేకు, జెడగంటలు మొదలయిన చిన్నచిన్న వస్తువు లనుగూడ దొంగిలించి దుందుభి తెచ్చి తల్లిచేతికో తండ్రిచేతికో యిచ్చును. దొంగతనము చేసినదని వారు బాలికను దండింపరు. అది మంచిపనికాదని బుద్ధిచెప్పరు. ఎవరుచూడకుండ మిక్కిలి జాగ్రత్తగా

తెచ్చినదని సంతసించి దాని తెలివి తేటలకు మెచ్చుచుందురు. ఐదేండ్ల వయసు వచ్చునప్పటికి దుందుభి పేరు వీధిలోనిపిల్లలకేగాక గ్రామములోని బిడ్డలకందరకు సింహస్వప్నమైయుండెను. కోపగించి యేబిడ్డనైన దుందుభి చరుపుచరచెనా మైదుగ్రవేళ్లు నచ్చుగ్రుద్దినట్లు దృఢముగా నంటుకొనవలసినదే. గ్రుద్దుగ్రుద్దెనా కొంతసేపు ఆబిడ్డ వంగినడువవలసినదే. నోరువిప్పి తొమ్మిదవయష్టకము మొదలుపెట్టెనా, పెద్దలుగాని పిల్లలుగాని దానిముందర నిలువలేరు. దుందుభికి వచ్చినన్ని తిట్లు చిన్న పిల్లలకు ఎవ్వరికి రావుసరిగదా నలుబది యాబది యేండ్లు కాపురము చేసిన స్త్రీలకు కూడ రావు. దుందుభికి మరిడమ్మ యని నామాంతరముండుటచే తోకలపూడిలోనున్న స్త్రీపురుషులందరు "మరిడమ్మ నిజముగా మరిడమ్మయే! దానిజోలికెవ్వరు పోగూడదు. మరిడమ్మ మరిడిజాడ్యములు మసూచికములు మొదలయిన రోగములు తెచ్చి ప్రజలను చంపుచుండును. పామువారి యాడబడుచు మరిడమ్మ ప్రజలను తిట్టి, కొట్టి చంపును. ఆమరిడమ్మ ఆవహించినప్పుడు దానికేవైన మందులు మ్రాకులు గలవు. ఈ మరిడమ్మపీడకు మందులులేవు మ్రాకులులేవు అనుభవించవలసినదే" అని చెప్పుకొని దుందుభికి, దానితలిదండ్రులకు, నొక నమస్కారముచేసి పోవుచుందురు.

---

ఆఱవ యుల్లాసము



హిందువులలో మగపిల్లవాఁడు పుట్టెననగానే జననీజనకులు మాతామహపితామహ ప్రముఖులకు బంధువులును మిత్రులును సంత సింతురు. ఆడపిల్ల పుట్టినదనగానే వారు పెదవి విరచెదరు. ఆపనివిచారసూచకమనుటకు సందియములేదు. ఆఁడుబిడ్డ కలిగినదని వినగానే శూరుఁడైన ఒకపురుషుఁడు నా బిరుదులలో నొక్కబిరుదు తగ్గినదిరా యన్నాఁడట. పుత్రికాజననము వలన కొంత నష్టము కలుగునని ఈ సామెత యొక్క భావము. ఇట్లనుకొనుటకు ననేక కారణములు గలవు. జాగరూకతతో పెంచవలసిన కష్టమటుండఁగ వయసు వచ్చునప్పటికి దానికి పనిపాటలు నేర్పవలెను, మంచిబుద్ధులు కరపవలెను. తగిన వయసు వచ్చినతరువాత వివాహము చేయవలెను. అది మిక్కిలి కష్టసాధ్యమయినపని. ఏలయన కన్య రూపమును గోరును. కురూపియైన వరుఁడు గుణవంతుఁడైనను ధనవంతుఁడైనను దానికి నచ్చఁడు. తండ్రి మంచి సంప్రాదాయముగల వరుని కోరును. గొప్పకట్నములు కానుకలు సమర్పించినగాని సత్కులప్రసూతిగలవరుఁడు లభింపఁడు. దానికి తగిన ధనముండక పోవచ్చును. రూకలరాశి క్రుమ్మరించనిచో మంచి సాంప్రదాయముగల వరుఁడు లభింపఁడు. తల్లి భాగ్యవంతుఁడైనవరుఁడు తనకూతునకు కోరును. పుష్కలముగా వరదక్షిణ లిచ్చినగాని భాగ్యవంతుఁడు దొరకఁడుగదా! ఇంతమంచి కోరికలు నెరవేరుట దుర్లభము. తల్లిని పెండ్లికూతును నొడంబడచి తండ్రి ఏదోవిధముగా వివాహము చేసెనా? గృహములో నెందరకో మనఃకలహములు బయలుదేరును. వివాహమైనతరువాత పిల్ల యత్తవారింటికి కాపురమునకు పోయిన దాదిగా తలిదండ్రుల మనసులు దుఃఖభాజనములుగా నుండును ఏలయన

మనదేశములో అత్తకోడరికము దుస్సహమైయుండును. అత్తగారైన లక్ష్మమ్మయు కోడలయిన సరస్వతియు నొకగృహమందుండుట దుర్లభమని మనపెద్దలు చెప్పనే చెప్పినారు. ఒకయొరలో రెండుకత్తు లిముడనట్లు మనదేశములో నొకగృహమందు అత్తయు కోడలును పోరులేక నివసించుట వింతలలోవింత. అత్తకోడండ్రు సఖ్యము కలిగి యున్నను మగడు తిరుగుబోతై త్రాగుబోతై గృహములు పొలములు విక్రయించి భార్యను కొట్టి తిట్టి బాధ పెట్టవచ్చును. కూతురియొక్క కష్టములు చూడలేక తలిదండ్రులు యావజ్జీవము కుందుచుందురు. ఇందుచేతనే కన్యాపితృత్వము కష్టభాజనమని యార్యులు వక్కాణించిరి. ఆకారణమున నాడుబిడ్డలు కలుగవద్దనియు మగపిల్లలు కలుగవలయుననియు మనవారు కోరుచుందురు. ఆడుబిడ్డలు కావలెనని మనసుపడువారు లేకపోలేదు. గాని అట్టివారు మిక్కిలి అరుదుగానుందురు. అట్టికోరిక గలవారు దశరథమహారాజువలె నన్యులయింటనుండి కన్యను దెచ్చుకొని తగినవరునకిచ్చి యతని కాళ్లుగడిగి తమగోత్రనామములతో కన్యాదానము చేసి ధన్యులగుచుందురు. అట్టివారు సకృతుగానుందురని పాఠక మహాశయులెరుగుదురు.

పాముసింగన్న విషయము జనవిరుద్ధమైనది. ఆడుపిల్ల పుట్టినప్పుడు పెన్నిధిగన్న పేదవలె నతడు మహానంద భరితుడగుచుండును. రెండుసంవత్సరముల కొకసారి, స్త్రీశిశువుతరువాత స్త్రీశిశువు గలుగుచుండ నతడేనుగు నెక్కినట్లు సంతోష సముద్రమున నోలలాడెనేకాని, అయ్యో ఆడుపిల్లకలిగినదా అని సామాన్యులవలె నొకతూరియైన విచారింపలేదు. మామిళ్లమ్మయొక్క నాల్గవకాన్పునకు గాబోలు కూతునకు పురుడు పోయుటకు తల్లి తోకలపూడి వెళ్లెను. అదివరకు ముగ్గురాడపిల్లలు ఉండుటచే నాసారియైన వంశము నిల్చుటకు మొగపిల్లవాడు

పుట్టినబాగుండునని మామిళ్లమ్మతల్లి మనసులో కోరుచుండెను. కాని యాపర్యాయముకూడ నాడుబిడ్డయే జనించుటచే నామె యీసారి కూడ నాడుముండయే పుట్టినదమ్మా! యని విసుగుకొనెను. ఆమాటలు దూరమునుండి సింగన్న విని మిక్కిలికోపముతో నత్తగారికడకుపోయి "ఏమమ్మా! నీకంత విసుగుగా నున్నదా? మగవాడుపుట్టి యుద్ధరించెడిదేమి. ఆడుపిల్లపుట్టి యుద్ధరింపకపోయెడిదేమి? నాకాడుపిల్లలే కావలెను. ఆడమాణిక్యాలు మగచెత్త అన్నారు పెద్దలు. ఆడుది గృహలక్ష్మి ఆడది సరస్వతీదేవి ఆడది పార్వతీదేవి ఆడపిల్లయే యింటికినిండు. మగపిల్లలు గడేకారివెధవలై బాధపెట్టుదురు కాని తలిదండ్రులను సుఖపెట్టుదురా ఏమిటి నీకిష్టమున్నపక్షమున విసుగుకొనక గసుగుకొనక మాటాడక పురుడుపోసి వెళ్లు అంతేగాని నాబిడ్డలను తిట్టకు. ఇష్టములేనిచో లేచిపో నీచాకిరిఎంత నీవెంత" అనినిష్ఠురోక్తులు పలికెను. అంతటితో నత్తగారు కిక్కురుమనకుండ నూరకుండెను. నాల్గవపిల్ల పుట్టినప్పుడు, నెలపురుడు వెళ్లినతరువాత సింగన్న భార్యను సమీపించి చేతితో వెన్ను నిమిరి "ఓసీ! నీవుమిక్కిలిమంచిదానవు నీబొజ్జ లక్ష్మీప్రదమైనబొజ్జ ముందుముందు వరహాలబొజ్జ యగును. ఉండిన నీవంటిపెండ్లామే యుండవలెను, పెయ్యదూడలనే యీనునట్టి యావువలె నీవాడుపిల్లలనే కని పిల్లలమంద పెరుగునట్లు చేయవే" అనిబుజ్జగించెను.

మామిళ్లమ్మబిడ్డలకు సమృద్ధిగా నేతిమజ్జిగలు లేకపోయినను మంచిమంచికూరలు భక్ష్యములు లేకపోయినను తలిదండ్రుల తత్వమును బట్టి మిక్కిలి యేపుగా పెరుగుచుండిరి. రవంత యుసిరిగకాయ పచ్చడి నంచుకొని యాపిల్లలు ప్రాతఃకాలమున తరవాణిలో పడవేసిన యన్నము పెట్టుకొని కొంచము ఉప్పువేసుకొని తినుచుందురు. మధ్యా

హ్నము పప్పుతోనో కూరతోనో తినుచుందురు. మధ్యాహ్నము వండినయన్నమే మధ్యాహ్నపు కూరతోనో పప్పుతోనో వారు భక్షించుచుందురు. అయినను వారు సారవంతమయిన భూమిలో పెరిగెడు కందదుంపలవలెను, పెండలపు దుంపలవలెను దృఢముగా నుందురు. దుందుభి పుట్టిన మూడుమాసములకు మామిళ్లమ్మయు సింగన్నయు పెద్దకుమార్తెకు పదిసంవత్సరములు వచ్చుటచే వివాహము చేయ సంకల్పించిరి. ఆవివాహవిషయమై సింగన్న యొక్కటే ప్రతిజ్ఞచేసెను. శివునివిల్లు నెవడువిరుతురో వానికే సీతనిచ్చి వివాహము చేయుదునని ప్రతినచేసిన జనకమహారాజువలెను, మత్స్యయంత్రము నెవడు తెగనేయునో వానికే తనపుత్రిక నిత్తునని శపథము గావించిన ద్రుపదరాజువలెను, సింగన్న తనకుమార్తె పదియేండ్లపిల్ల గనుక నేడాదికొకవందచొప్పున పదివందలరూపాయిలు మూటగట్టి ఎవడు తనచేతికిచ్చునో వానికే తనగారాబు కూతునిచ్చి వివాహము చేయుదునని దృఢప్రతిజ్ఞచేసెను. ఆప్రకారమే ప్రథమ పుత్రికకు యేబది సంవత్సరముల వయసుగల మూడవపెండ్లి వరుడు సంప్రాప్తించెను. అతడు వెయ్యిరూపాయిలు చేతికిచ్చి ఆడుపెండ్లివారికర్చు మొగపెండ్లివారికర్చు తానేభరించి పిల్లను అంతర్వేది తీసుకొనిపోయి నరసింహస్వామివారి యాలయములో వివాహమాడెను.

---

మ. మృదుద్రాక్షాసవ భవ్యపానమదవర్ధిష్ణుప్రమోదంబొ యి
యొ్యది పీయూషఘనాప్తిఁ గల్గు మదమో ఖ్యాతేంద్రజాలంబొ స్వ
ర్మదిరాక్షీరతిపారవశ్యమొ యపారంబైన కైవల్యమో
యెదియో చెప్పఁగరాని పూర్ణసుఖమం దీవేళనే మున్గితిన్.

చ. ఇది నరకాంతయేయయిన నింతటికాంతి నెసంగు టెట్లు కా
దిది సురకాంతయేయనిన నీక్షితిపైఁ జరియించు టెట్టులో
మృదుహృదయంబునన్ జగము మెచ్చ విధాతసృజించె నీసతిన్
గదియఁగ దీని నేనరుఁ డఖండమహాతప మాచరించెనో.

ఈమె సౌందర్యమునుగూర్చియు నీమె గానమాధుర్యమును గూర్చియుఁ బ్రజలు శ్లాఘించుట విని యవి యతిశయోక్తులని త్రోసి వేసితిని. ఇంతకాల మిట్టి దర్శనభాగ్యమైనను లభింపకపోవుట నాదురదృష్టము. [నది. అంతలోనే

అహో! క్షణకాలమైన నాయెదుట నిలువక యింటిలోని కేగి

చ. నునుజిగిమించి దేహజ వినూతనకాంతులు వెల్లియాచు నా
మనము గలంపఁగా ధవళమంజులశోభలఁ గన్నులింతలై
నను గనునంతఁ దళ్కుమని నాడుకనుల్ మిఱుమిట్లుసెందె నం
తనె హృదిమోహమగ్నమయినన్ బులకాంకితమయ్యె దేహమున్.

[మోహిని ప్రవేశించి]

మోహిని—నాథా! ఏమంత యాలోచనతో నున్నారు?

కందర్ప—(ఉలికిపడి మఱల యథాస్థితికివచ్చి) ఏదో యొక వ్యాజ్యము ను గూర్చి గాఢముగ నాలోచించుచున్నాను. అప్పుడే సంగీతపాఠము ముగిసినదా! సరస్వతిగారేరి? ఆమె గొంతే వినరాలేదే?

మోహిని—ఆమె కారంభశూరత్వము పనికిరాదఁట. అమ్మాయి కేమి వచ్చునో పరీక్షించినది. వెంటనే పెరటిగుమ్మమున వెడలి పోయినది.

కందర్ప—అమ్మాయి చదువునుగూర్చి యేమి చెప్పినది ?

మోహి—తాళములన్నియుఁ దప్పులఁట. గతు లెఱుఁగదఁట. ఇఁక రాగములమాట వేఱుగఁ జెప్పవలయునా! ప్రాతతప్పులు సవరించుటకే చాలదినములు పట్టుననియు, అయినను మొదటఁ గొలఁదిగఁ గ్రొత్తపాఠములనుగూడఁ జెప్పుదుననియుఁ జెప్పినది.

కంద—ఈవఱకు నేర్పినదంతయు దండుగయే ?

మోహి—అన్నమాటే ?

కంద—ఈమెచేత నొక్కపద్యమయినను బాడింపలేకపోయితివేమి ఇదియా తెలివి ?

గీ. తెలివితేటలుగలవారు తెంపుసేసి
లేని యవకాశముల నెట్టులైనఁ గొందు
రకట! యున్నట్టి యవకాశమైనఁగాని
జారవిడుతురు మతిలేనిజనులు తన్వి!

మోహి—ఆమె నిలచినగదా! పాడించుట. పోనిండు. నేను దెలివిలేనిదాననే. నన్నెవ్వరును వరింపనక్కఱలేదు. మీ తెలివిని వినియోగించి ఱేపు పాడించుకొనుఁడు.

(తెరలో గంట)

అదేగంట మ్రోగినది. చీఁకటి పడుచున్నది. బల్లలమీఁదఁ బళ్లెములలో భోజనము సిద్ధపఱచియే వంటవాఁడు గంటమ్రోగించియుండును. ఇఁక నాలస్యముచేసినఁ బదార్థములు చల్లఁబడిపోవును. సత్వరము లెండు. నేఁడు మీశరీరము స్వస్థముకానట్లు తోఁచుచున్నది (అని చేయిపట్టుకొనును.)

కందర్పరావు—ఏమియులేదు—(కష్టముగా మోహినితో నిష్క్రమించును.) (తెరపడును)

ఇది ప్రథమాంకము.

# శ్రీ చి ద్వి లా స ము



## ద్వి తీ యా ం క ము

---

[ప్రవేశము - పార్వతి—ధర్మారావుగారి యింటియెదుట—చీఁకటి పడు సమయము.]

పార్వతి—(స్వగతము) ఈ మోహినమ్మగారసాధ్యురాలు. చదువు చెప్పుట శూన్యము. గౌరవమునకై ప్రధానోపాధ్యాయిని యని పేరుపెట్టికొని మా ప్రాణములు తీయుచుండును. మిగిలిన యుపాధ్యాయినులు మాకుఁ బాఠము చెప్పరాదఁట. పెద్దతరగతికిఁ దానే యుండవలెనఁట. ఈ పిశాచమును వదలించుకొను నుపాయము గాన్పించుటలేదు. పైఁగా దొంగలు రకరకాలవాండ్రీమెకొఱకు వచ్చుచుందురు. వారి ముఖావలోకనమే మా చదువు. ఎప్పుడైనను గర్మము చాలక పాఠము చెప్పినను బ్రాణము విసుగుపుట్టునట్లుదాహరణము లన్నియు ధర్మారావుగారిపైననే. ఏడ్చునక్క నెత్తిపైఁ దాటికాయ పడినట్లీ యుత్తరము నానెత్తిపైఁ బడినది. దీని నెవ్వరు చూడకుండ ధర్మారావుగారి బల్లపైఁ బడవేయవలయును. ఈ పని చేయనిచో నాకు దెబ్బలు తప్పవు. ఏమి చేయుదును. ఈ యుదయ మీ ధర్మారావుగారి యింటిముందుఁ జాల మంది యుండుటచే నుత్తరము వేయలేకపోయితిని. ఇప్పుడైనను బరువు దీర్చుకొనవలెను. (నడచి) ఇదే సమయము. ఇక్కడ ధర్మారావుగా రింటిముందెవ్వరును లేరు. లోపలి కేగుదును.

ఆయనకూడ నింట లేరు. (లోపలికేగి మరల వచ్చి) అమ్మా! ఇప్పటికిఁ బని తీరినది. మోహినమ్మగారి ధర్మమున నీ దొంగ తనము చక్కఁగఁ జేయఁగల్గితిని. ధర్మారావుగారు వచ్చువేళ యైనది. ఇఁకఁ బాఱిపోవలెను. (పోవును)

ఇ ది ప్ర వే శ క ము

---

[ధర్మారావు గృహము. ఒక గదిలో ధర్మారావు లేఖ నొక దానిని బట్టుకొని పచారు చేయుచుండును.]

ధర్మారావు—(స్వగతము) నేఁడు నన్ను ధర్మారావును అధర్మా రావును జేయఁదలఁచితివఁటే పిశాచీ! లేఖ మొదటఁ 'ప్రియుఁడా!' అని సంబోధనము. లేఖ చివర మోహిని సంతకము.

నా చేతిలో నీ లేఖ పడులాగున చాకచక్యముతో బల్లపై నుంచుట—సెబాసు-నీవు నిజముగా మోహినివే—అయిన నా కేమి భయము—లేఖఁ జదివెదను. (త్వరగాఁ జదువును.)

ప్రియుఁడా! నీ దివ్యసుందరవిగ్రహము నప్పుడప్పుడు కన్నులారఁ గాంచుటయే కాని నీతో సంభాషణమున కైనను నోచుకొనలేదు. ఆ దుండగీఁడైన మన్మథుని పరితాపమున కోర్చి యింతకాలము నీకొఱకే జీవించియున్నాను. ఇఁక నాలస్యముచేసిన నాత్మహత్య నిశ్చయము. నన్ను నీయిష్టమువచ్చినప్పుడు నా పాఠశాలలోఁ గలిసి సంభాషింపుము. ఇవే గాఢాలింగనములు.

ఇట్లు
ప్రియురాలు
మో హి ని.

ఛీ——(లేఖను జింపి పాఱవేయును.) నాకుఁ గళంక భూయిష్ఠ జీవనము దెచ్చిపెట్టఁ దలఁచితివా!

మ. అరరే! యెంతటి సాహసంబది యిదా! న్యాయంబు! ఛీ యంగనా
పరుఁడంచెంచితొ నన్ను! మూఢుఁడనియే భావించితో యెంత కేన్
జోరశంకింపరు పంకజాక్షులిల నీచున్ జేసె దేనన్ను! మో
హారతింజెంది యిహంబునుం బరము నేనా కోలుపోనొప్పెదన్.

ఉ. ఎందఱఁ జూచితో యిటుల నెందఱఁ గూడితొ నింద్యరీతిగా
నెందఱ స్త్రీలపాలిటికి నీవు పిశాచమవైతొ! పొంది, యిం
కెందఱఁ జేసితో ధనవిహీనుల నెందఱ రూపుమాపితో
సుందరి యీదురంతమును సూక్ష్మముగన్ విననైన శక్యమే.

ఈలేఖకుఁ బ్రత్యుత్తరము లేదు సరిగదా! ఇఁక నీ మోమైనఁ జూడను. నీమగఁడు మాత్రము సామాన్యుఁడా? కందర్పవిలాసమున ఘనుఁడు నాగరకశిరోమణి.

అయ్యో! జ్ఞప్తికివచ్చినది. నాసోదరి సరస్వతి వీరింట నేఁడు సంగీతపాఠ మొప్పికొనినదఁట. నాకుఁ దెలిసినచో ముందే వలదని చెప్పి యుందును. ఆసాధ్వియెక్కడ-ఈచెడిప యెక్కడ?

సీ. సంగీతసాహిత్య సారస్య నిపుణత నే చాన యసమాన యింతపురిని
వినయ వివేకాది విశ్రుతగుణముల నే చాన సరిగాన నింతపురిని
భక్తినివేదాంత భావానుభవమందు నేచానకెనతాన యింతపురిని
పరమపాతివ్రత్య భవ్యశీలంబున నేచాన గుణియానొ యింతపురిని
ఏమహాసాధ్వి మాయింటి కిరుగు పొరుగు
గాన మేము కృతార్థుల మైనవార
మా సరస్వతియేడ యీ యతివయేడ
నక్కయెక్కడ యెక్కడ నాకజగము.

సతీ! సతీ! రావేమి?

సతి——తెరలో – ఇదే వచ్చుచుంటినార్యా! (వచ్చి) ఏమంత శీఘ్రముగఁ బిల్చితిరి.?

ధర్మారావు——సరస్వతి యింటిలో నున్నదా!

సతి——లే దెచ్చటికో వెల్లినది.

ధర్మారావు——ఇంత ప్రొద్దుపోయినను రాలేదా!

సతి——లేదు. సాయంకాల మూఁడుగంటలకుఁ గందర్పరావుగారింటఁ బేరమఁట. అటు తరువాత మఱియొకరి యింటఁ బేరము గలదఁట. ఆమె కొడుకుమాత్ర మింటిలోఁ జదువుకొనుచున్నాఁడు.

ధర్మారావు——నీవు వారింటికివెల్లి యామె వచ్చువఱ కచ్చటనుండి యామెను బిలిచికొనిరమ్ము. మాటలాడవలసిన విశేషములున్న వని చెప్పుము. తప్పక వచ్చును. సోదర ప్రాయుఁడనగు నాయం దామెకుఁ బూర్ణవిశ్వాసముకలదు.

సతి——చిత్తము. (నిష్క్రమించును.)

(మోహిని ధర్మారావు గదివెలుపలఁ బ్రవేశించు)

మోహి——(స్వగతము) భోజనమగుటయె తడవుగ నాథుఁడు తన విహారస్థలముల కరిగినాఁడు. నేనును నావిహారస్థలమునకు వచ్చితిని. కాని నామన మీధర్మారావునుగూర్చి మిక్కిలి శంకించుచున్నది. అంతమాత్రమున నేనీపని సాధింపక విడిచితినా నాజన్మము వ్యర్థమగును. (పరికించి) అదృష్టమన్న నట్లు కలసిరావలయును. సతి యిప్పుడే యెక్కడికో పోవుచున్నది. నేనిఁక లోపలఁ బ్రవేశింపవలయును. (ధర్మారావు గదిలోనికిఁ బ్రవేశించును.)

ధర్మారావు——(తనలో నాలోచించుకొనుచు) ఎవరు నీవు. స్త్రీ లింత రాత్రి యిచ్చటికి రానేల?

మోహి—ఎఱుఁగరా! నన్ను! మోహినిని. లేఖవలన మీకంతయుఁ దెల్లమైయుండును.

ధర్మా—ఆ తెల్లమైనది. తేటతెల్లమైనది. (పెదవి విఱుచును.)

మోహి—(ఆశ్చర్యముతో) ఆ! ఏమి! ఈతిరస్కారము. స్త్రీని సత్కరింపకపోఁగాఁ గూర్చుండుటకైనఁ దావీయ నవకాశములేదా! మీధర్మశాస్త్రమున? "కాంత తనంతఁ దావలఁచి వచ్చినఁ జుల్కనఁగాదె యేరికిన్." (అని చిఱునవ్వు నవ్వుచుఁ గుర్చీలో నాసీనయగును.)

ధర్మా—నేనిదె చెప్పుచున్నాను. నీచిఱునవ్వులకు నేను లోఁబడువాఁడనుగాను. వినుము.—

ఉ. గుణమును శీలమున్ గలిగి కోరిపరార్థఁగూర్చు మానవా
గ్రణులయెడన్ మహత్తరముగా దయఁజూపుదుఁ బ్రాణమేని నే
గణనయొనర్పకిచ్చెదను గావఁగవారిని, సాధుహింస దా
రుణముగఁజేయుదుష్టులకు రోయుదు వారినిజూడ జంకెదన్.

మోహి—ఏమి యీయరసికత! ప్రేమింపఁదగిన సుదతులనుగూడ రోయుదువా! నాశరీరము నీకు రోఁతపుట్టింపదు. దీనిఁగొనుము. ఇదే నీస్వాధీనము చేయుచున్నాను. (మీఁదికివచ్చును.)

ధర్మారావు—(నిలువరించి) దూరమునునుండి మాటలాడుము. నాచిత్తము నీపై లేనప్పుడు నీకేల యీదుడుకుఁ దనము?

మోహిని—అట్లు నిరాకరింపఁబడి నేనాత్మహత్య గావించికొనినచో నీకు స్త్రీహత్యామహాపాతకము రాదా!

ధర్మారావు—రాదు. ముమ్మాటికిని రాదు. పైఁగాఁ బుణ్యముకూడ వచ్చును.

మోహిని—(తనలో) ఇతనిని ప్రార్థించిన లాభములేదు. బెదరించి చూచెదను. (ప్రకాశము) నీయుద్యోగ మెక్కడ.

ధర్మారావు—పట్టణోన్నతవిద్యాలయమున. ఏల? ఇట్లడుగుచుంటివి?

మోహిని—దాని పాలకవర్గములో నాభర్తకు సంపూర్ణాధికారము గలదని నీకుఁ దెలియునా!

ధర్మారావు—తెలియును. అయిననేమి?

మోహిని—బాగుగ నాలోచనఁజేయుము. నన్నుగొని సమస్తసౌఖ్యముల నందుటయా! లేక నిరాకరించి యుద్యోగమునకును ప్రాణమునకును నీరు వదలెదవా?

ధర్మారావు—బాగుగనే యాలోచనచేసితిని. ధర్మముకొఱకు సర్వమునుద్యజింతును.

మోహిని—త్వరపడకుము. గడువిచ్చెదను. వెనుక చింతించుట వెఱ్ఱితనము. రేపు సాయంకాలములోపల నాపాఠశాలలోఁ బ్రత్యుత్తర మందఁజేయుము. అదిగో! నీసతియు సరస్వతియు వచ్చుచున్నారు. నేఁ బోయెదను. (పోవును).

ధర్మా—ఆహా! యేమి దీనిధైర్యము. స్త్రీలు చేయఁజాలని పని యేది?

సీ. తనపుత్త్రినకు రాజ్యమునుగోరి దశరథ
పతి ప్రాణములఁదీసెఁ బడతికైక
తనకామమును దీర్చికొనఁగోరి జానకిఁ
జప్పరింపఁగజూచెఁ జుప్పనాచి
తనయన్నఁ జంపినాఁడని దొసగింపక
యనిలజుకడఁ జేరెనాహిడింబ
తనకోరికనుదీరుపని పుత్త్రికునికాలు
సేతులు చిత్రాంగి చెండఁబంచెఁ

బాలుగుడిపెదనని గోపబాలుఁజంపఁ
దలచెఁ బూతన తాటకాదుల ప్రసక్తి
యేల రాక్షసభావంబు స్త్రీలసామ్య
షడ్గుణముగాదె వారలసాహసంబు.

అయినను సరస్వతివంటి స్త్రీరత్నములు గలుగుటచే స్త్రీజాతిని లోకులు పూజించుచున్నారు. (చూచి) అదిగో! సతీసరస్వతులు వచ్చినారు.

(అంతట సతియు సరస్వతియుఁ బ్రవేశింతురు.)

సోదరీ! సరస్వతీ! నీవింటికిరా నింతప్రొద్దుపోయిన దేల?

సరస్వతి—పాఠములవలనఁ బ్రొద్దుపోయినది. ఇంకను భుజింపలేదు.

ధర్మ—అయిన నిన్నెక్కువకాలము నిలుపను. ఆకందర్పరావు నింటఁ దెలియక పాఠ మొప్పికొంటివి. మిగులజాగ్రత్తగా నఁట మెలగవల యును సుమా! ఏనాఁటి విశేషము లానాఁడు మాకుఁ దప్పక తెలియఁజేయుచుండవలెను?

సర—సోదరప్రాయులైన మీరు నన్ను రక్షించుటకు బద్ధకంకణు లరైయుండ నాకు భయమెక్కడిది? అయినను నాకాయింట నేదో యొక యనుమానము తోఁచినది. ఇదమిత్థమ్మని దానిని నిర్వచింపలేకున్నాను. సరియైన చోటుగాదని నాకు స్పష్టమయిన వెంటనే మానివేయుదును. వారిభావములతో నాకుఁబనిలేదు. నా పని నేను జూచుకొందును.

ధర్మా—ఏమరియుండవద్దు. పోయిరమ్మ.

సర—ధన్యను. అన్నింటికి మీరే నాకు శరణ్యము. ఇఁక సెలవు. (పోవును.)

సతి—నాథా! పాకమంతయుఁ జల్లారినది.

ధర్మా—అవును. పదపద. వడ్డింపుము. వచ్చుచుంటిని.

(నిష్క్రమింతురు. తెరపడును.)

## ద్వితీయరంగము

[కందర్పరావు గృహము]

(ఇంటిలోఁ బాఠముఁ జెప్పుచుండిన సరస్వతినిజూచివచ్చిన కందర్పరావు ప్రవేశించును.)

కందర్పరావు—(స్వగతమున) మోహిని మంచిపనిచేసినది. సరస్వతి యీ యుదయమునఁ బాఠముఁ జెప్పవచ్చుట నాకు మిక్కిలి సంతోషదాయకమైనది. ఈ పాఠమున కెన్నిరూపాయ లిచ్చినను దండుగలేదు. ఈమె విద్యయందు నిజముగా సరస్వతియే. విశేష మేమన నందమున నీమెరంభ. యక్షకన్యలు గంధర్వకన్యలు నీమెకు సరిగారు, నిన్నను జక్కఁగాఁ జూడఁజాలని కొఱఁత నేఁడు తీర్చికొంటిని. ఆ గవాక్షమునుండి యామెను గన్నులారఁగాంచి వచ్చితిని. నాజన్మము ధన్యమైనది. ఈమెయే నాభావమున కను కూలించిన నాకిఁక నితరప్రపంచముతో జోక్యములేదు.

ఉ. ఆచిఱునవ్వుఁ దొల్కుమొగ, మాఘనవేణి భరంబు, రేఖలక్
శ్రీచెలువారు కంఠమును నిక్కుచనుంగవ, తళ్కుఁజెక్కు లా
హా! చెలినెన్నఁగా వశమె యాతనుమధ్యము పెన్నితంబమున్
జూచినఁ గందుమేని జిగిచూపుల సోయగమామెకే తగున్.

ఉ. ఈయెలనాగఁ గూడిన లభించినయట్టులె సర్వసంపదల్
పాయక యీమెఁజేర నఖిలక్షితిభాగము లందినట్లె యిం
కీయలివేణిఁ బొందిన నభీప్సితమెయ్యది తక్కువయ్యెడున్
వేయి వచింపనేమిటికి నిశ్చయ మీచెలిపొందు ముక్తియే.

అయిన నీమె భావమెట్టిదో కనుగొనవలెను. ముందు బెదరఁ గొట్టఁగూడదు. మనయింటిలో నొక భాగమున నుచితముగానుండ

నీమె నంగీకరింపఁజేయవలెను. తరువాతఁ గ్రమముగాఁ గార్యక్రమము సాగింపవలెను. తొందరపడినఁ గార్యభంగమగును. ఈ మదనతంత్ర మున నారితేరినవాఁడను గనుకనే యింతపరవశుఁడనయ్యు నేను ద్వర పడుటలేదు.

ఉ. ఒక్కెడఁ గ్రుమ్మరింపవలె నూరక సంచుల నొక్కచోట బల్
 లెక్కలఁ జూపఁగావలయు లేమల దౌత్యము జేయువారి నిం
 కొక్కెడ వంపఁగావలె మఱొక్కెడ శాంతతఁదాని పోవలెన్
 జిక్కులిటుల్ ఘటిల్లెడును జిక్కినఁ జక్కెరవింటివానికిన్.

నేను స్త్రీలను లోఁబఱచుకొనుటలోఁ గందర్పుఁడను సార్థక నామధేయముగలవాఁడను. కాని యీమె పురుషులఁజూచిన లేడివలెఁ బెదరిపోవుచున్నది. స్త్రీలు పురుషుల మోముఁ జూడఁగూడదను పూర్వాచారపరాయణత్వమువలన వచ్చిన పెద్దయనర్థమిది. ఈ బెదరు బాపుటకే నేను లోకమున స్త్రీస్వాతంత్ర్యప్రచారము చేయుట. కాని నా బోఁటులు స్వల్పసంఖ్యాకులు మాత్రము గలరు. మూఢజనసం దోహ మింకను బహుళముగా నున్నది.

(ఆలోచించి) కానీ యీమె బెదరుటలోనే కొంతమాధుర్య మున్నది సుమా!

ఉ. ఈహరిణాక్షి దిక్కులకు నిట్టటు చంచలదృష్టిఁ జూడఁగా
 నూహకు నందరాని తళుకొక్కటి యుద్భవమై మహాప్రభా
 వాహినిపాటి వెల్లువయి భావమునన్ స్మరబాణసంతతుల్
 మోహముఁ గ్రమ్మనాటెడు నపూర్వసుఖం బది యెందులభ్యమే.

నేనీ భావపరంపరలో మునిఁగియున్నచో నింతలోఁ బాఠము ముగించి యీమె వెడలిపోవును. ఆమె పాఠము ముగించుసమయము

గనిపెట్టి కొంచెము సంభాషించెదను. ఇది మంచితరుణము. ఇప్పుడు మోహినిగూడ నింటలేదు.

(చాటున నిలిచి చూచుచుండును. తెర లేచును. సరస్వతి లక్ష్మికిఁ బాఠము చెప్పుచుండును.)

సరస్వతి—లక్ష్మీ! చూచితివా! నీ ప్రాఁతపాఠములో నెన్ని తప్పులు గలవో. వానిని సవరించుట కింతసేపు పట్టినది. నీవు జాగ్రత్తతోఁ బ్రాఁతపాఠములను దప్పులు లేకుండఁ జదువుచుండవలెను. ఇప్పుడు క్రొత్త పాఠమును బాడి వినిపించి వ్రాసియిచ్చెదను. చక్కఁగా నాలకింపుము. తేపిందుఁ దప్పులుండఁగూడదు.

('సుజనజీవనా' అనుకృతిని వీణసహితముగాఁ బాడును. కందర్పుఁడు తన్మయుఁడై వినుచుండును.) ఇఁకఁ గృతివ్రాసెదను. నీపుస్తకము తెమ్మ. (పుస్తకమును దీసికొని కృతివ్రాయుచుండును కందర్పుఁడు తదేకదృష్టితోఁ జూచుచుండును.)

లక్ష్మి—అమ్మగారూ! మీ యక్షరము లచ్చువలె నున్నవి.

సరస్వతి—అవునమ్మ నిదానముగ వ్రాయవలెను. వంకరటింకరగ వ్రాయఁగూడదు.

కందర్పరావు—(స్వగతము) ఆహా! యీమె వీణానైపుణ్యము. ఈమె గళమాధుర్యము. ఈమె లేఖన కౌశలము. నన్ను మూర్ఛవోఁజేయుచున్నవి. నిజముగా సంగీతసాహిత్యముల నుద్ధరించుటకు సరస్వతియే యిట్లవతరించిన దనుటలో సంశయము లేదు.

ఉ. వీణకుఁ బ్రాణమిచ్చినటు వ్రేళులతోడను దంత్రి మీటు నా
వీణియ నాదమందు దస విస్ఫుటమంజుల కంఠరావ మీ
యేణవిలోలనేత్ర శ్రుతి కింపుగ మేళన మందఁజేయు గీ
ర్వాణపురంధ్రు లీఫణితిఁ బాడఁగ నేర్తురె మోహనమ్ముగన్.

సరస్వతి—వ్రాయుటయైనది. ఇఁక నేఁ బోయెదను, పాఠము గట్టిగాఁ జదువుము. ( పోవుటకు లేచును. )

[ అంతటఁ గందర్పరావు ప్రవేశించును. ]

లక్ష్మి—అట్లే చదివెదను. నా కాకలియగుచున్నది. లోనికేగెదను. సెలవిండు.

సరస్వతి—సరియే ( పోఁబోవును. లక్ష్మిపోవును. )

కందర్పరావు—సాధ్వీ ! మీ రొక్కక్షణ మాగుఁడు. మాఅమ్మాయి యదృష్టమున మీరు లభించినారు. వట్టి మూఢురాలు. మీ పుత్త్రికగా భావించి దీనిని గట్టెక్కింపవలెను.

సరస్వతి—నా చేతనైనట్లు ప్రయత్నింతును. ఆ మీఁద దైవమే కలఁడు. యత్నించువఱకే గదా మనవిధి.

కందర్పరావు—నిజమే. మీ యిల్లెక్కడ ?

సరస్వతి—సూర్యారావు వీధిలో ధర్మారావుగారింటివద్ద.

కందర్పరావు—అబ్బో ! చాలదూరమే. అందువలననే నేను మిమ్ముఁ జూచియుండలేదు. మీ రింతదూరము నడచి వచ్చుటకష్టము. ప్రతిదినమును మా బండి మీ యింటికిఁ బంపుచుందుము. అందుఁ బాఠమునకు రండు.

సరస్వతి—క్షమింపుఁడు. నేను బండియెక్కను. నడచి యే పాఠముల కేగుట నా నియమము.

కందర్పరావు—మీదే గ్రామము ?

సరస్వతి—మాది పూర్వము మింజూరు, చాల తడవైనది పోవలెను. పైగ నొంటరిగఁ బురుషులతోఁ బ్రసంగించు నభ్యాసము కలదాననుగాను.

కందర్పరావు—ఒక్కమాట మాత్రము చెప్పి వెళ్లుఁడు, మీ రద్దె యిండ్లలోఁ బాధపడఁజాలరు. మా యింటిలో నొకభాగ ముచితముగ నొసంగెదము. స్వేచ్ఛగానుండుఁడు.

సరస్వతి—ఉండఁజాలను (నిష్క్రమించును)

(కందర్పరావు తెప్పవాల్పక చూచుచుండును.)

కందర్పరావు—(స్వగతము) అహో! వెడలిపోయినది. మిక్కిలి బెట్టు పైనున్నది. ఎంత తొందరపడిన నంత యాలస్యమగునందు రిదియకాఁబోలును. నామనస్సిప్పుడు వశముగాకున్నది. నేనిఁక న్యాయస్థానమున కేగఁజాలను. నాపనులన్నియు నిఁకఁ గట్టిపెట్ట వలయును. ఈమెను స్వాధీనము గావించుకొనుటయను పెద్దపని నెఱవేరనిచో నాజీవిత మంధకార బంధురమగును.

చ. అరుగుదు నెందు నాహృదయమంతయు నీ చెలిపైని నిల్పి యే
వెరవున నాదువృత్తి నెఱవేరు మనంబిటు లూగుచుండ నే
తఱి యితరంబులన్ గనుదు తప్పక యిప్పుడు బుద్ధియిందె గాఁ
దరమె శమింపఁజేయ స్మరతాపదవానల కీలలన్ గటా!

అందువలన నీమెను సత్వరమే కలిసికొని నామనోభీష్టము నెఱేఁగించు నుపాయ మన్వేషింపవలయును. ఆమెను నాకనుకూలమైన రహస్యస్థలమునకు రప్పించినఁగాని నాకు మనశ్శాంతి యెక్కడిది.?

ఉ. కంటికి నిద్రవచ్చునె సుఖంబగునే రుచిరాన్నముల్ మనం
బంటునె వేలులక్షలగు నైహికభోగము లాలుబిడ్డలున్
గంటకులౌదు రీయెడను గామశరంబులు మేననాట వా
ల్గంటిని నెట్టసంగలిసి కౌఁగిటిలోపలఁ జేర్పకుండినన్.

తత్క్షణమే వెడలుదును. (నిష్క్రమించును.)

(తెర పడును.)

## తృతీయరంగము.

---

[ప్రహ్లాదుఁడు పుస్తకములతోఁ బ్రవేశము. సరస్వతి కూర్చుండి యుండును.]

ప్రహ్లాదుఁడు—అమ్మా! నాకీచదువు వలదే!

సరస్వతి—అదేమి నాయనా! మాటిమాటి కట్లనెదవు. ఏడ్చుచు నేరు వాకకు సాగినఁ గాడిమోకులు దొంగలెత్తుకొని పోయిరన్నట్లు మనముచేయుపనిని మనమే గర్హించినచో నొకదానినెట్లు నిర్వహింతుము.

ప్రహ్లాదుఁడు—దీనివలనఁ బుణ్యమా! పురుషార్థమా!

సరస్వతి—ఎందువలనలేదు. చూచుచుండలేదాపలువురను! మీనాయనగారికి ననుభవింప నిచ్ఛలేకపోయెనుగాని వారి కున్నతోద్యోగము లభింపలేదా!

ప్రహ్లాదుఁడు—భక్తిపరవశుఁడై యాయన మనలను విడిచెనని నీవే చెప్పుచుందువుగాదా! ఎముకలు విఱుచుకొని నీవు చేయుచున్న ఘనకార్య మేమున్నది.? నాకీకొఱగాని చదువుచెప్పించుటయే. ఇంచైదు సంవత్సరములనుండి చదువుచున్నాను. రామా! కృష్ణా యను పలుకే లేదు. ఈచదువువలన నుద్యోగములు సంపాదించుటది పూర్వకాలపుమాట. ఇంక నెందులకీవిద్య. భాగవతములో నేమి చెప్పినారో చూడుము.

> 'దేవదేవుని జింతించు దినము దినము
> చక్రహస్తునిఁ బ్రకటించు చదువు చదువు
> కుంభినీధవుఁజెప్పెడి గురుఁడు గురుఁడు
> తండ్రి హరిఁజేరుమనియెడి తండ్రి తండ్రి.'

సరస్వతి—అవును. నాయనా! ఈ భాగవతపద్యములే మనకొంపతీసినవి. నాకు భక్తిలేక కాదు. నిన్ను జదివించుట. ఇది 'భక్తిసాధన' మని నామాటవిని జాగ్రత్తతోఁ జదువుకొనుము. కావలసినచో సంస్కృతాంధ్రములను సంగీతమును నేనింటికడ బోధింతును.

ప్రహ్లాదుఁడు—నీవు బోధింపవు. బోధింపఁదలఁచినను ఆపిల్లికుక్కపాఠములతోడనే నాకుఁ బ్రొద్దుగ్రుంకును. మిగిలినవాని కవకాశ ముండదు. చిన్నప్పుడు మానాయనగారు చెప్పిన పద్యము లెంత మనోహరములు. ఆ భాగవతపద్యములు దాశరథీశతకపద్యములు జ్ఞప్తికి వచ్చిన నాయొడలు పులకరించును. నేఁటికిని వారి మనోహరకంఠస్వరము నాచెవులలో ధ్వనించుచుండును. నీకుఁ దెలియని దేమున్నది. కానిమ్ము. అయిన నొక్కటి వినుము. నీకాదినములు స్ఫురణమునకు రాఁగలవు.

ఉ. రామ! హరే! కకుత్థ్సకులరామ! హరే! రఘురామ! రామ! శ్రీ
రామ! హరే! యటంచు మదిరంజిల భేకగళంబులీల నీ
నామము సంస్మరించిన జనంబు భవంబెడఁబాసి తత్పరంధా
మనివాసులౌదు రఁట దాశరథీ! కరుణాపయోనిధీ!

(తెరలో గంటమ్రోగును)

సరస్వతి—అదిగో! గంట మ్రోగుచున్నది. ఇఁక నీభక్తి కట్టిపెట్టి బడి కేగుము. లేకున్న నాలస్యమైనందులకు నుపాధ్యాయుఁడు దండించును. ఇంట నున్నందులకు నేనును దండింతును.

ప్రహ్లాదుఁడు—తల్లిగారి యాజ్ఞ (చిఱునవ్వుతోఁ బరుగెత్తును.)

సరస్వతి—(స్వగతము) ఎట్టి గడియ నీకాఁపురమునఁ బడితినో గాని మొదటినుండియునాకుభయమేగదా! ఈకుటుంబమునభక్తిమెండు.

మణి

# ఆషాఢభూతి

## 1. రంగము

### రంగము—మఠము

[ ప్రవేశము—దేవశర్మ (సన్యాసి); శిష్యులు; ఆషాఢభూతి ]

అందరు—

శ్లో. భజగోవిందం భజగోవిందం । భజగోవిందం మూఢమతే
సంప్రాప్తే సన్నిహితే కాలే । నహినహిరక్షతి డుకృఞ్ కరణే॥భజ॥
నళినీదళగత జలమతితరళమ్ । తద్వజ్జీవిత మతిశయచపలమ్
విద్ధివ్యాధ్యభిమానగ్రస్తమ్ । లోకం శోకహతంచ సమస్తమ్॥భజ॥

(పాట ముగిసిన పిమ్మట, ఆషాఢభూతి దేవశర్మ పాదములకు నమస్కరించి పాదధూళి నెత్తిపైఁ జల్లుకొని, భయమునటించుచు వెనుకకు బోయి విసరుచుండును.)

దేవశర్మ—మిత్రులారా! మనకాలమెట్లు వ్యర్థమైపోవుచున్నది! కాలమనెడి సర్పము మృత్యువనెడి నోటిని తెరచుకొని మనలను మ్రింగివేయుటకు కాచుకొనియున్నది. ఉత్కృష్టమగు మానవజన్మమెత్తి చెప్పశక్యముగాని బాధలనొందుచు, తుదకు ఈశరీరమును మృత్యుదేవతకు బలియిచ్చుటకంటె అజ్ఞానమేమి కలదు? సకలదుఃఖములను బాసి, నిత్యానందస్వరూపుఁడగు భగవంతునిఁ జేరుటకు ప్రతి మనుజుడును ప్రయత్నము సలుపవలెను.

నారాయణుడు—స్వామీ! ఆభగవంతుని జేరుటకు సులభమార్గమును సెలవీయ వేడెదను.

దేవ—నాయనా! భగవంతుని జేరుటకు సులభమును మనోహరమును నగు భక్తిమార్గమే రాజబాట.

గోవిందుడు—గురూ! మాకు భక్తిలేదు గదా! మాప్రయత్నము లెట్లు సిద్ధించును?

దేవ—కుమారా! అట్లు సందేహింపబనిలేదు. తరుచుగా హరికథలు, భజనలు జరుగుతావుల కేగుట, భక్తుల సహవాసముచేయుట, జ్ఞానులను దర్శించుట మొదలగు సాధనములు భక్తిని యావిర్భవింపజేయును.

కేశవుడు—గురూజీ! భక్తి నలవరచుకొనుటకు ఇంకను యితరమార్గములను జెప్పుడు.

దేవ—నాయనలారా! మొదట మన యంతశ్శత్రువులైన కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములను జయించవలెను. వానిని జయించినవారికే భక్తి సులభసాధ్యము.

శ్లో. కామక్రోధశ్చ లోభశ్చ దేహేతిష్ఠంతి తస్కరాః
జ్ఞాన రత్నాపహారాయ, తస్మాజ్జాగ్రత జాగ్రత.
మఱియు,

శ్లో. ఆశయా బధ్యతేలోకః కర్మణా బహుచింతయా
ఆయుక్షీణం నజానాతి తస్మాజ్జాగ్రత జాగ్రత.

ఈప్రపంచమంతయు ఆశయను పాశముచే బంధింపబడియున్నది. జ్ఞానసంపాదన సరయువాడు ఈ యాశాపాశమును ఛేదించవలెను.

దామోదరుడు—స్వామీ! ఈ కామక్రోధాదులను జయించువిధానమును శలవీయ వేడెదను.

దేవ—ఈ అరిషడ్వర్గమునకును, ఆశకును మూలకారణములు రెండు. అవియేవన కాంతాకనకములు. ఈ రెంటికొరకును ప్రజలు చేయరాని పనులనుచేసి నీతిబాహ్యులై, తుదకు ఇహపరసౌఖ్యములను గోల్పోవుచున్నారు. ప్రతిమనుజుడును ముఖ్యముగ ఈ రెంటి

యందును వ్యామోహమును వీడవలయును. అట్టివానికే భక్తి చేకూరును. మఱియు, జాతిరత్నమైనను సానపెట్టక ప్రకాశింపనిరీతి సద్గురువునాశ్రయింపక మానవుని యజ్ఞానాంధకారము వాయదు. ఆయంధకారమునుండి యీవల బడినప్పుడే పరంజ్యోతి కానవగును.

శంకరుడు— ఓహోహో! ఏమి యమృతవాక్కులు! స్వామీ! మీవాక్కులు వినినంతమాత్రముననే మాజన్మలు తరించినవి.

సదాశివుడు—నిజము. నిజము!

దేవ—డాంబికముకొరకును, లోకవాంఛలకొరకును మానవుడు లేని వైరాగ్యమును జూపక సత్యవర్తనుడై మెలగవలెను.

ఆషాఢభూతి—ఓహో! ఏమినీతి!

దేవ—మోక్షము సిద్ధించుటకు సజ్జనసహవాసమే మూలసూత్రము.

శ్లో. సత్సఙ్గత్వేనిస్సఙ్గత్వం । నిస్సఙ్గత్వేనిర్మోహత్వం
నిర్మోహత్వేనిశ్చలతత్వం । నిశ్చలతత్వే జీవన్ముక్తిః

లెండు. మోక్షప్రదాతయగు శ్రీసద్గురుడైన భగవంతుని ఒకసారి ప్రార్థింతము. (అందరులేచి ప్రార్థనచేతురు).

దేవ—మిత్రులారా! కాలాతీతమైనది. నేటికి పోయిరండు. రేపు మరల గలసికొందము. (శిష్యులు నమస్కరింతురు).

దామో—స్వామీ! మాపాపములనెల్ల పరిహరింపజేయుభారము మీదే. శలవు తీసికొందము. చంద్రునకొక నూలుపోగు. ఈఫలములను గ్రహింపుడు.

దేవ—(చిఱునవ్వుతో) అయ్యలారా! మీరేల శ్రమపడెదరు. మీరిట్టివస్తువులను దెచ్చియుఁ ధనముల నిచ్చియు నన్ను మోమోటపరుపకుడు. మీరు చిన్నబుచ్చుకొందురు. కావున వానిని పరిగ్రహించి సత్కార్యములకొరకే యీధనమును వ్యయపరతును. పోయిరండు. (శిష్యులు నిష్క్రమింతురు).

ఆషాఢ.—(దేవశర్మకు సాష్టాంగపడి లేవకయుండును).
దేవ—బాలకా! లెమ్ము. నీవెవ్వరివాడవు? నీపేరేమి?
ఆషాఢ—మహాత్మా! నన్నీ పాపకూపమునుండి యుద్ధరింతుమని బాస చేసినగాని తమపాదములు విడువను.
దేవ—అట్లేయగుగాక. లెమ్ము. (ఆషాఢభూతి చేతులుజోడించి భయపడుచు నిలబడును).
దేవ—బాలకా! నీవెవ్వరవు? ఇంతచిన్నతనముననే ఇట్టి వైరాగ్యమును బొందకారణమేమి?
ఆషాఢ—మహాత్మా! ప్రజలు తమ మహాత్మ్యమునుగూర్చి వేనోళ్ల ముచ్చటించుకొనుచుండగా విని తమదర్శన మొకసారిచేసి పోవుదమని వచ్చితిని. అదియేమి చిత్రమోకాని, తమ ముఖారవింద సందర్శనమాత్రముననే నాహృదయమున నేదియో కలచినట్లయినది. అందుచే నే నీస్థలమునుండి కదలజాలక పోయితిని. తాము చిరకాలమునుండి గడించి నిక్షిప్తము గావించిన యర్థమును గ్రహింప నామనము వువ్విళ్ళూరజొచ్చెను. తాము శలవిచ్చిన విధమున గురుశుశ్రూషవలనగాని నాకామితార్థమును బడయజాలనని తలచి తమపాదసేవయే పరమావధిగ నెంచి తమ యంగీకారము కొరకు వేచియుంటిని. ఈదీనుని కోరికను నిరాకరించక చేపట్టి రక్షింపగోరుచున్నాను.
దేవ—(తనలో) ఈతడెవ్వడో అమాయకునివలె నున్నాడు. నేనేదియో మహాజ్ఞానినని యభిప్రాయపడుచున్నాడు. కానిమ్ము. (ప్రకా) కుమారా! కడుచిన్నవాడవు. కష్టమున కోర్వజాలవు. నీకీవైరాగ్య చింతయేల? ఇంటికిబోయి సుఖంబుండుము.
ఆషాఢ—మహాశయా! వైరాగ్యమునకు వయసుతో పనియేమి? వయసు హెచ్చినకొలది పాపచింతయు వృద్ధియగును. తమకు చెప్పు పాటివాడనుగాను.

దేవ—సరియే యిచటి నియమములకు భయపడి పారిపోవుదువేమో సుమా.

ఆషాఢ—దేవర యట్లనుమానింప బనిలేదు. ముందుముందు నా తత్త్వము తమకు బాగుగ విశదముకాగలదు.

దేవ—మంచిది. నీ పేరేమి ?

ఆషాఢ—స్వామీ! ఆషాఢభూతి యందురు.

దేవ—సరియే! ఇప్పుడు కొందరుస్త్రీలు మావద్దకు యోగాభ్యాసము చేయవత్తురు. నీవు లోనికిబోయి విశ్రాంతి గైకొనుము. మరల పిలచినప్పుడు రమ్ము.

ఆషాఢ—స్వామీ! తమపాదసేవ చేయుచు నిందేల యుండరాదు? వైరాగ్యసంపన్నులమగు మనకు స్త్రీపురుష భేదమేల?

దేవ—ఓరీ! నీ కింకను జ్ఞానము చాలదు. నా పలుకుల కెదురాడకుము.

ఆషాఢ—అపరాధము స్వామీ! ఇకముందు తమ కెన్న డెదురాడను. పరిపూర్ణమహాజ్ఞానులైన తమ్ము నట్లు పలికితిని. క్షమింపవలెను. (కాళ్లమీద పడును)

దేవ—లెమ్ము. లోనికిబొమ్ము.

ఆషాఢ—చిత్తము (లోనికిబోవును).

దేవ—(తనలో) ఈతడెవ్వడో మనకు తగినవాడు. మన చెప్పుచేతలలో నుండువాడు. వీనికిట్లే నమ్మకము బుట్టించుచు మనయధీనములో నుంచుకొనిన మనకనేకవిధములుగా నుపకరించును...ఆహా! ఎట్టి యుపన్యాసము లిచ్చి యెందరి కనుబ్రామచుంటిని? మనకు కాంతా కనకములు రెండును సమకూరుచున్నవి. ఇంక నిచ్చట కొంతకాలము మన వేదాంతనాటకము నాడి పిమ్మట నీ యూరికి స్వస్తిజెప్పి, తదుపరి నా గ్రామమున కేగి యాలుబిడ్డలం గూడి

సుఖించెదను. ఇప్పటికి డెబ్బదియయిదువేలు ప్రోగుపడినవి. మిగత పాతికయు పూర్తిచేసిన గాని ఈ నాటకమునకు భరతవాక్యము చెప్పరాదు. అటుపిమ్మట నా జీవితమును నిశ్చింతగ గడుపవచ్చును. అరుగో! శిష్యురాండ్రు వచ్చుచున్నారు. (ప్రకా)

శ్లో. కురుతే గంగా సాగర గమనమ్। వ్రతపరిపాలన మథవా దానమ్
జ్ఞానవిహీన స్సర్వమ తేన। ముక్తిం నభజతి జన్మశతేన.

(కొందరు వితంతువులు ప్రవేశించి దేవశర్మకు పరిచర్యలు జేయుదురు. దేవశర్మ ధ్యానము చేయుచు క్రమముగా వారిపై నోరుగును— తెరపడును).

---

రంగము 2.

---

మఠము: ప్రవేశము—ఆషాఢ భూతిపాదము లొత్తుచుండగా దేవశర్మ నిద్రించుచుండును.

ఆషాఢ—

శ్లో. పునరపి జననం పునరపిమరణం। పునరపి జననీ జఠ రేశయనం
ఇహసంసారే బహు దుస్తారే। కృపయాపారే పాహిమురారే.

(తనలో) ఇతడు నిద్రించుచున్నాడు. ఆహా! ధనపిశాచమా! నీ వెంతకైన తగుదువు. నీవు చేయరాని పనులు ఈ జగత్తున కానరావు.

ఆ. వె. ధనముపట్ల ప్రజకు ధర్మంబు లడుగంటి
సత్యవర్తనంబు సమసి పోవు
ఉచ్చనీచమనెడి యూహయించుక లేక
సొమ్ము మూటఁగట్టఁ జూచుచుండ్రు.

ఇందులకు దేవశర్మయే తార్కాణము. ఇతడే యననేల? ఇట్టి వారెందరు లేరు?

సీ. సప్తాహమంచును చందాలవేయించి
ధనము కూడఁగఁబెట్టు ధర్మప్రభులు;
అన్నదానపుమిష నధికమౌ విత్తము
దాచంగనేర్చెడి దానపరులు;
తమ వాగమృతముచే ధరణిప్రజలఁ గను
బ్రౌమి తిరుగు పరివ్రాజకులును;
స్వామి సేవకొఱకు సానిమేళము గూర్చ
బహు విరాళము లిచ్చు భక్తపరులు;
అకట! యీరీతి నెందఱో యవనిపైన
మోసకారులు జనియించి, మూఢజనులఁ
గన్నుఁ గప్పుచు ఫలములఁ గాంచుచుంద్రు
వీసమైనను పాపమ స్ఫీతిలేక.

అబ్బా! తద్దినము కొని తెచ్చుకొనినట్లు నాకీ కంచిగరుడసేవ యేల? ప్రతిదినము ఇతని పాదముల నిట్లే యర్ధరాత్రివరకు నొత్తవలయును. ఉలుకడు. పలుకడు. చాలుననడు. ఇప్పట్టున పారిపోవుద మన్న చేతకాని వాడనని మిత్రులు నవ్వుదురేమో. నేనువచ్చిన కార్యము సఫలము గాకుండ ఈ రంగము నెట్లు ముగింతును? ఈతని యుపన్యాసములను విని, ఇతని చర్యలను గాంచినకొలది యొడలు మండుచున్నది. కాంతాకనకములపై వ్యామోహమును వీడవలయు నట. తానుచేయు పనియేమి? ఎందరస్త్రీలను మోసపుచ్చుచున్నాడు? వారీతని పలుకుల కలరి వశీకృతలై తమ యాభరణాదులను, ధనమును సమర్పించుటయే గాక ఇతని కనేకవిధముల సేవలు సలుపుచున్నారే! కానిమ్ము. తగిన ఫలమనుభవింపకపోడు...ఇతడు ధనము నెచ్చట దాచుచుండెనో ఇంకను తెలియలేదు.

దేవ—(ఆవులించి, లేచి) జయ్ సీతారామ్. నాయనా, నీ వింక బోయి పరుండుము. చాలతడవైనది. నేను యోగాభ్యాసము చేయవలెను. పరులిచ్చట నుండరాదు.

ఆషాఢ—చిత్తము. (పోవుచు, తనలో) ఏమి చెపుమా ? నేడు పెందల కడనే వదలినాడు. అర్ధరాత్రి ఇతడు చేయు యోగాభ్యాసమేమి? నిద్రపోవు వానివలె నటించి ఇతనిచర్యల నరయుదును. (పోవును).

దేవ—(తనలో) ఇతడు వెళ్లినాడు. నిద్రించెనో లేదో చూచి తలుపులు బిగించవలెను. (లోనికిబోయి మరలివచ్చి తలుపులుమూసి) వెంటనే గాఢనిద్ర చెందినాడు. మనపని సాగించుకొనవచ్చును.

(దర్భాసనములో దాచిన నోట్లను పైకితీసి, బొంతను ముందు వైచుకొని నమస్కరించి)

తే. గీ. దేవదానవు లలనాడు దీక్షతోడ
క్షీరసాగర మథనంబు సేయుతఱిని
ఉజ్జ్వలంబగు కాంతితో నుద్భవించి
హరిని జేపట్టినట్టి యో యాదిలక్ష్మి
అందుకొనుమమ్మ నేజేయు వందనంబు.

తే. గీ. తల్లి ! నీమహాత్వము నెన్నదరమె నాకు
నిమిషకాలమునందు లోకముల నిట్టె
సంతసింపగజేయుదు వంతలోనె
దుఃఖవారాసి ముంచెదు తోయజాక్షి.

తల్లీ ! నీకొఱకై గాదె ప్రజలు అనేక కష్టముల పాలగుదురు ! మాతా ! నీవే నాయిలవేల్పువు. నిన్నీవిధముగ కాగితరూపమున ముద్రింపించినందున నాబొంతయందు నిన్ను పదిలముగా పరులెరుంగకుండ దాచగలుగుచుంటిని. ఇట్టి సదుపాయమును గలుగజేసిన ప్రభు

త్వమువారు వెయ్యేండ్లు వర్ధిల్లుదురుగాక. అయినను, ఇందు కొన్ని నగలు నాణెము లుండుటచే బొంత కొంతభారముగ నున్నది. బొంతా! నీవెంతదానవు? సాక్షాల్లక్ష్మిని నీహృదయరంగమున దాచగలుగు చుంటివి.... ఓహో! ఊహాప్రపంచమునబడి అసలు విషయమును మరచితిని.

(నోట్లను బొంతలోనుంచి కూర్పవోయుచు పాడును).

పాట—ఆహామేలైనబొంత । హరియించునెల్లచింత
సౌఖ్యంబునిచ్చునెంతో । చలివేయకుండసుంత ॥ ఆహా ॥
ధనమెంతయైననిందు । దాచంగనేర్పుగందు
బల్హాయిగానునుందు । బంగారుబొంత, ముందు ॥ ఆహా ॥
పైనంతజూడవలువ । భాగ్యంబులిచ్చుచెలువ
తలపంగదీనివిలువ । తెలియంగలేదునలువ ॥ ఆహా ॥

అమ్మయ్య. కుట్టుటపూర్తి అయినది. (తెరలోచప్పుడు)

దేవ— (కంగారుతో, బొంతనుచుట్టబెట్టి) ఆచప్పుడేమి చెప్పుమా?
(తెరలో) గురూజీ! గురూజీ! తలుపు! తలుపు! దొంగలు! దొంగలు!

దేవ—ఆ! దొంగలా! వచ్చుచుంటిని. (తలుపులుతీయును).

ఆషాఢ—(ప్రవేశించి) దొంగలు! దొంగలు! లెండు! లెండు!

దేవ—దొంగలా? నేనురాజాలను. నాయనా! నీవుపోయి చూచి రమ్ము.

ఆషాఢ—ఆదీపము నిటు తెండు. (తనలో) తలుపుసందునుండి ఇతని చర్యలను గాంచుచు, ఇంక నిద్రాదేవిబారికి దాళజాలక తొంద రగా పోవుచుండగా, కాలుతగిలి మూలనున్న పాలకుండ పై కెగిరి దానిపైనున్న పళ్లెముక్రిందపడి చప్పుడయినది. కుండ బ్రద్దలయి

నది. దాని నీవిధముగా సమర్థించెదను. (దీపము తీసికొని లోనికి పోవును).

దేవ—మనవద్దనున్న బొంతసంగతి ఏదొంగముండలైన కనిపెట్టలేదు గదా. మనవిషయమై ప్రజలలో కొందరికి భేదాభిప్రాయము కలిగి నట్లు చూచాయగా తెలిసినది. మనపరువు పూర్తిగ పోకపూర్వమే మనమీ యూరికి స్వస్తి చెప్పవలెను.

ఆషాఢ—(ప్రవేశించి) స్వామీ! మనిషియలికిడి ఎచ్చటనుగానరాదు. పాలకుండ బ్రద్దలైయున్నది. బహుశా మాయపిల్లి దానిని పడ ద్రోసియుండవచ్చును. తమకు నిష్కారణముగ యోగాభ్యాసము నకు భంగము కలుగ జేసితిని.

దేవ—లేదు. మంచిపనిచేసితివి. ఇట్లు మెలకువకలిగి యుండుట మం చిదే. నీవు ఈచప్పుడు విని లేచితివిగాబోలు.

ఆషాఢ—అవును స్వామీ! నేను గాఢనిద్రాపరవశుడనై యుండ పిడుగుపడినధ్వని వినబడినట్లాయెను. తమకెద్దియైన యాపద కలిగె నేమో నని భయముతో ముందుగా తమవద్దకు పరుగెత్తివచ్చితిని తమరు సురక్షితులై యుండరి. నాకంతియేచాలు.

దేవ—వెఱ్ఱివాడా! మనవద్దకు దొంగలేలవత్తురు? మనవద్దనేమి యున్నది? సన్యాసులము.

ఆషాఢ—అట్లనకుడు స్వామీ! ఉన్నదే చాలును.

దేవ—మంచిది. పోయిరమ్ము. ఇంకను, వేళయున్నది. నిద్రింపుము.

ఆషాఢ—చిత్తము. (పోవును)

దేవ—నాకును నిదురవచ్చుచున్నది. ఇంచుకసేపు పరుండెద. (పరుం డును). (తెర)

---

మణి

# లక్ష్మీసహస్రము

(మచ్చుతునుకలు)



కటాక్షస్తబకము

ఉ. కొందఱు పైఁడిపల్లకులఁ గూర్చొని యెంతయు వైభవంబు చె
ల్వొందఁగ సంచరింతురు ప్రభూత్తములై మఱికొందఱన్నయ
య్యందలముల్ వహింతురతియాప్యపుజీవన మొప్పఁ దల్లిరో
యందుకుఁ ద్వత్కటాక్షవిషయా విషయత్వమె కాదె హేతువౌ.

ఉ. పేదతనమ్ముఁ బాపఁ బృథివీపతులెందఱఁ జాటురీతిఁ బ
ద్యాదుల సన్నుతించిన మహాపటుమంత్రములన్ జపించినన్
వాదములన్ జయించుచుఁ బ్రపంచముఁ జుట్టినఁగాని, కానిసం
పాదనఁ జేయలేఁడు త్వదపాంగనిరీక్షణ లేక యెవ్వఁడున్.

ఉ. 'శ్రీక్షయ' యంచు నయ్యలికసీమ విధాతలిఖించునట్టి య
య్యక్షరముల్ ప్రతీపగతినారసి వారికి యక్షవైభవం
బక్షయ మొంద నిత్తువలయబ్జజువ్రాతయు సత్య మొందనీ
వీక్షణరూపభాగ్య మఱవీసమునోఁచినఁగాని తల్లిరో.

ఉ. ఓ హరిరాణి! లోకముల నొప్పుగ నేలెడి నీకటాక్ష మే
దేహిపయిన్ సతంబును ప్రతిష్ఠిత మొందఁగఁజేయు దట్టియా
దేహి జగద్ద్వయంబునను దేహిపదంబుఁ దొలంగిమించు; సం
దేహ మొకింతయేనియును దీనికిలేదు తలంచి చూడఁగన్.

శ్లో. వికచకమలశోభా విభ్రమోద్భాతిసీమా
మధు మిహ సదుపాస్యం తన్వతీ సుప్రసన్నం

శర దివ తవ వీక్షా శార్ఙ్గిణః ప్రాణకాంతే
శమయతి కిల మేఘాటోప ముజ్జృంభితాపం.

తే. గీ. స్వచ్ఛకమలానుభూతికి జననసీమ
యాచునిర్మలుసదుపాస్యునట్లువిధుని
సలుపుత్వదపాంగశరదృతుసమయ మెపుడు
జనని! యుజ్జృంభితాపమై తనరునట్టి
యాపదాటోపమును గడునడఁచుఁగాత.

ఉ. అష్టమమందు దుర్గ్రహము లాశనిభూజులఁగూడి యుండినన్
కష్టదశన్విధాతయలికంబున నొక్కి లిఖించినన్ భవ
ద్దృష్టియొకింతనాపయిఁగదించితి వేని యవేమిచేయు; భ
క్తేష్టద ! మంచుబిందులు దినేశకిరాజ్యము నోంపజాలునే.

ఉ. వానినుతింత్రుధన్యునిగఁ బండితులెల్లరు, వానిచేతనే
మానితమానువంశమతిమాత్రము, సద్గుణజాలమొందున
వ్వానినె, బుద్ధిమంతుఁడనవాఁడె, యరిందముఁ డన్నవాఁడె, యె
వ్వానికి నీకటాక్షలవభాగ్యమొకించుక గల్గునమ్మరో !

శ్లో. దేవి ! దుర్గతమరా తవ వీక్షా
కాలికా దిశతి కాంచనవృష్టిమ్
తస్య సిద్ధ్యతి సుకీర్తి రుదంచ
ద్ధీరసస్యవిభవశ్చ తత స్స్యాత్

తే. గీ. నీయపాంగకాదంబిని, నిస్వుఁడనెడు
మరువుననువర్ణవర్షంబు గురియదాన
నెక్కువసుకీర్తిగలుగు; నెంతేనిధైర్య
శాలియై తేజరిల్లు; నోజలజగేహ !

మణి

# లక్ష్మీసహస్రము

(మచ్చుతునకలు)



యత్నస్తబకము

చ. అనయము నీగురుస్తనమహాచలముల్ మునుముందు తాను చు
ల్కనగ వహింపవచ్చు నని కంజదళాక్షుఁడు భార మోర్వ సా
ధన నొనరింప నో యనఁగఁ దద్దయు సాగరమధ్యమందునన్
మునిఁగెడి మంధరాచలము మూఁపున తా ధరియించె నమ్మరో.

మ. మును తా నీయక యెద్దియున్ దనకు రాఁ బో దంచు లో నెంచి, తా
మును నిన్ బెండిలి యాడఁగాఁ దలఁచి తత్పూర్వంబె చక్రాతిచా
ననుగా మాఱిచి యక్షపాదునకుఁ గన్యాదానముం జేసె ష
డ్గుణసంపన్నుఁ డభీష్టదుండు నగునాగోవిందుఁడున్ జానకీ!

ఉ. నిందగుభర్త యెవ్వఁ డని నీపిత నీదువివాహగోష్ఠియం
దందఱు నెంచువేళలఁ ద్వదన్వయముఖ్యపురోధయాశతా
నందుఁడు వాక్సహాయము నొనర్చు నటంచును నెంచి సంతసం
బందఁ దదీయమాతృదృషదాకృతి మాన్చెను రాముఁ డమ్మరో!

ఉ. ఆవనజాప్తవంశకలశాంబుధిపూర్ణవిధుండు నీదుభ్రూ
సేవకుఁడైనమన్మథునిచేఁ గడునోటమి నొంది సంతసం
బావహిలంగఁ జేయఁగను నాతనికిన్ బ్రతిరోధియామహా
దేవునిచాపము న్విఱిచి తెచ్చి యుపాయన మిచ్చె జానకీ!

మ. అలమారీచసుబాహురాక్షసుల మాయాప్రౌఢిఁ శైత్యాశుగా
వళిఁ జల్లారిచి కౌతుకప్రదుని విశ్వామిత్రు సేవించి దో
ర్బలపాండిత్యముఁ జూపి భర్గునిధనూరత్నంబు ఖండించి యి
ట్టుల నెంతోశ్రమ నొంది నిన్బడసె నెట్టో రాముఁ డో శ్రీసతీ!

ఉ. మానధనైకజీవనులమధ్యను నగ్రగణీయయ్యు నేరికిన్
దానె శరణ్యుఁడయ్యు రఘుతల్లజుఁ డొక్కనికోఁతినిన్ ద్వదీ
యానయనార్థమై శరణమందె నయారె! మహీసుతా రవం
తైనను లెక్కసేయరు ఫలార్థులు గౌరవలాఘవంబులన్.

ఉ. రావణుఁ జంపి నిన్నుఁ గొనిరాఁగ సహాయ మొనర్చు నంచు సు
గ్రీవునకున్ ముదంబు నొనరింప నినాన్వయవార్ధిచంద్రముం
డేవిధినైనఁగాని తన కెగ్గుఁ దలంపనివాలిఁ జంపి దో
షావృతుఁడై కళంకయుతు డయ్యెను గాదె మహీతనూభవా!

మ. అలవైకుంఠపురంబులో శ్రుతులలో నమ్మౌనిరాణ్మానసో
జ్జ్వలసౌధంబులలో ఫణీంద్రునిఫణచ్ఛాయాప్రదేశంబులో
పల సౌఖ్యాంబుధిఁ దేలు నిర్మలపరబ్రహ్మంబు నీకై శిలా
స్థలులం బండెను ఋశ్యమూకమున నోతల్లీ! కపీశార్థియై.

చ. ఎలమి నిజాగ్రజుండయినయింద్రుఁడు వజ్రముధాక కోర్వఁగా
నిలువగలేనియట్టియవనీధరపంక్తులఁ బూడ్చె నంబుధిన్
వెలితిగ నంచు సోదరుఁ డుపేంద్రుఁడు దానికి శేషపూర్ణమున్
సలిపెను వానరాహృతరసాధరపంక్తులచేఁ ద్వదర్థమై.

మ. తనరన్ సేతువుఁ గట్టి నీకొఱకునై తా దాఁటి యబ్ధిన్ భవా
బ్ధిని దాఁటించెడి రాముఁ డెల్లర స్వయంతీర్త్వాపరాస్తారయే
త్తనురీతుల్ సగరాన్వయస్థులకు క్రొత్తైనే భువిన్ జాహ్నవిన్
జనకుల్ సద్గతిఁజెందఁ దెచ్చి యొకఁ డీసర్వావనిం బ్రోవఁడే!

చ. ఘనముగ యుష్మదానయనకార్యధురంధరులైనవారికిన్
మణికనకాంబరాదిబహుమానములన్ పొనరించి సర్వముం
బనివడి నిర్వహించి యతిమాత్రబహూకరణార్హుఁడౌవిభీ
షణునకు నంబ! రంగము నొసంగెను రాముఁ డహో! విచిత్రమా.

## రంగము 3.

మార్గము : ప్రవేశము—దేవశర్మ, ఆషాఢభూతి

దేవ—

శ్లో. జటిలోముణ్డీ లుఞ్చిత కేశః । కాషాయాంబర బహుకృత వేషః
పశ్యన్నపిచ నపశ్యతిమూఢో । హ్యుదర నిమిత్తో బహుకృత వేషః.

(తనలో) ఆహా! ఎన్నాళ్లకు నాకోరిక ఫలించినది. లక్ష్యపూర్తి అయినది. ఇంక నీ మాయానాటకము ముగింపవచ్చును. నాగ్రామము నకు బోయి సుఖంబుగ నుండెద. ఈ యాషాఢభూతికి ఇన్ని మెతుకులు పడవైచి, నాయింటనే పనులు చేయించుకొనుచుండెదను.

ఆషాఢ—(తనలో) ఎన్నివిధముల బ్రయత్నించినను నా కీబొంత చిక్కలేదు. ఇతనికి ఇంకను నమ్మకము బుట్టించి మా ప్రయాణము ముగియులోపల దీనిని సంగ్రహింపవలెను. లేకున్న నేను ప్రదర్శించిన ఈ నాటకమునకు ఫలితమేమి? దీని కేది మార్గము......ఆ! మంచి యుపాయము తట్టినది (ప్రకాశముగా కంగారుతో) గురూ! గురూ! అపరాధిని. రక్షింపవలెను. మహాపాపము చేసితిని.

దేవ—(కంగారుతో) ఏమి ముప్పు వాటిల్లినది, నాయనా!

ఆషాఢ—(ఏడ్చుచు) స్వామీ! ఏమి చెప్పుదును. మధ్యాహ్నము మనము బసచేసిన యింటివద్ద నాబట్టకు ఈ చీపురుముల్లు అంటు కొనినది కాబోలు. నే నక్కడ దానిని చూడలేదు. ఇప్పుడు చూచితిని.

దేవ—అయిన నేమి ప్రమాదము? నీశరీరమునకు గ్రుచ్చుకొనినదా

ఆషాఢ—శరీరమునకు కాదు, స్వామీ! హృదయముననే నాటినది. పరులధనము తృణమైనను గ్రహింపరాదని తాము పలుమారు బోధింతురుగదా. తమ శిష్యుడనైన నా కీపూచికముల్లు మహా భారముగ నున్నది. రేపు యమసన్నిధానమున ఏమని సమాధాన మీయగలము?

దేవ—వెఱ్ఱివాడా! పూచికముల్లులో నేమున్నది? దానిని దీసి యిచ్చట పారవైవుము. పాపమంటదు.

ఆషాఢ—శ్రీరామ! స్వామీ! మహాపాపము! మహాపాపము!

దేవ—అయిన నేమి చేయుదువు?

ఆషాఢ—పరుగెత్తిపోయి దానిని ఇంటివారికిచ్చి వచ్చెదను.

దేవ—మనము చాలదూరము వచ్చితిమే.

ఆషాఢ—ఎంతదూరము వచ్చిననేమి? పరుగెత్తిపోయి వారి సొత్తు వారికిచ్చి వచ్చెదను.

దేవ—మంచిది. పోయిరమ్ము. నీవు వచ్చువరకు ఇచ్చట విశ్రమించెద.

ఆషాఢ—చిత్తము స్వామీ! (తనలో) ఈదెబ్బతో నీతనికి బాగుగ నమ్మకము కుదురగలదు. ఈ పూచికముల్లును ఆదుబ్బులవెనుక పారవైచి, కొంచెముసేపు ఆగి వచ్చెదను. (పోవును.)

దేవ—(కూర్చుని) ఇతడెంత యమాయకుడు! నేను చేయు బోధన లన్నియు పొల్లుపోనీక జరుపుచున్నాడు. నేనో! ఆ! నామాట

కేమి? ఎన్ని వేషములు వేయకున్న ఈకాలమున ధనము లభిం చును. లేకున్న ఆలుబిడ్డల పోషించు నుపాయమేది? ఏ యుద్యోగముచేసి ఇంతధనము సంపాదింపగలను? నాయట్టివారికి ఇట్టి అమాయకులుండుటవలననే అదృష్టము ఫలించును......అబ్బ! ఈ బొంతను మోయజాలకుంటిని. ఇంక దీనిని ఆషాఢభూతిచే మోయించవచ్చును. మిగుల నమ్మదగినవాడు.

ఆషాఢ—(ప్రవేశించి) జయ్ సద్గురూ! అమ్మయ్య ఇప్పటికి బెంగతీరి నది. గురూజీ!

దేవ—నాయనా! వచ్చితివా? కొంచెము సేపు విశ్రమింపుము.

ఆషాఢ—వలదు స్వామీ! ప్రయాణము సాగింతము.

దేవ—దగ్గరనే యొక గ్రామము గలదు. రాత్రికట బసచేసి ఉదయముననే పయనము సాగింతము. అదిగో! సూర్యాస్తమయ మగుచున్నది. ఆజలాశయమునకు బోయి సంధ్యానుష్టానము గావించుకొని వచ్చెదను. నీవిచ్చట కొంచెము విశ్రమింపుము.

ఆషాఢ—చిత్తము.

దేవ—నాయనా! ఈబొంతను జాగ్రత్తగ జూచుచుండుము.

ఆషాఢ—మహాప్రసాదము. స్వామీ! పోయిరండు.

(దేవశర్మ పోవును)

ఆషాఢ—ఆహా! నేటికిగదా నాకోరిక ఫలించినది. బొంతరాజమా! నీకెంతయు కృతజ్ఞుడను. నావెంట రమ్ము. నిన్ను సద్వినియోగము చేసెదను. ఇంతవరకు దేవశర్మగారి చమటకంపుచే బాధపడు

చుంటివి... అతడు కనుమరుగయినాడు. ఇక మనము పలాయన మంత్రము పఠింపవచ్చును. వాయువేగమనోవేగముల బోయి మిత్రులంగలసి, ఇంతకాలము దేవశర్మను దైవసమానునిగా భావించి పూజించిన వారిలో కొందరి కీవృత్తాంతమును జెప్పి వారినిటకు తోడితెత్తును. వారువచ్చిన పిమ్మట దేవశర్మకు బుద్ధిగరపి అంతటితో ఈనాటకమునకు భరతవాక్యము చెప్పించెదను. నన్ను వెదకుచు ఈదేవశర్మ ఇందే యుండును. (పోవును)

దేవ—(ప్రవేశించి) ఆషాఢభూతీ! (చూచి) ఇతడెట కేగినాడు చెప్పుమా! ఆషాఢభూతీ! ఆషాఢభూతీ! ఆ! మోసము చేయలేదు గదా? అబ్బే. అత డట్టివాడుగాదే. ఆషాఢభూతీ! ఆషాఢభూతీ! (వెదకును) ఎందును కానరాడే. మోసము వాటిల్లినది. నిశ్చయముగ మోసపోతిని. అయ్యో! నేను త్రవ్వుకొన్న గోతిలో నేనే పడితిని. ఆషాఢభూతీ! ఇంకెక్కడ ఆషాఢభూతి. చేయిదాటిపోయినాడు. అయ్యో! అతని పలుకులలోని యర్థమును గ్రహింపజాలకపోతిని. మోసపోతిని. అయ్యో! ఆషాఢభూతీ! ఎంత మోసము చేసితివిరా? అయ్యో! నాబొంత. నాప్రాణపదమయిన బొంత. రత్నాలపేటిక నాబొంత. ఇంక నాబొంతను చూడను. చిలుకను పెంచి గండుపిల్లి పాలు చేసినట్లు లక్షరూప్యములు విలువగల బొంతను చివరకీ మాయావి పాలుచేసితిని.

సీ. అడిగిన యంతనె యర్థంబు సేకూర్చి
అమరతరువుభాతి నలరు బొంత;
రాతిరివేళల శీతబాధ నడంప
వెట్టఁగలుగఁజేసి వెలయు బొంత;

విశ్రాంతి గైకొను వేళల, మేనికి
హాయిగ, మెత్తగా నమరు బొంత;
తలదిండుగా నుండి, పలువిధంబుల నాకు
సుఖమును జేకూర్చుచుండు బొంత;
చింతలను బాపుచు మదికి సంతసంబు
తద్దయుం గూర్చుచుండు నా ముద్దు బొంత;
నాదు పెన్నిధి, యిల వేల్పు, నాదు లక్ష్మి,
నాదు ప్రాణంబు నన్వీడె నక్కటకట.

ఆషాఢభూతీ! ఆషాఢభూతీ! (ఏడ్చుచు వెదకును)...(వెఱ్ఱి వానివలె) ఆషాఢభూతీ! నీవు నాకెక్కడ దాపురించితివిరా! అదిగో ఎవ్వరో వచ్చుచున్నారు.

శంకరుడు—(ప్రవేశించి) గురూజీ! రామ్! రామ్.
దేవ—ఎవరు నాయనా! నీకేమైన ఆషాఢభూతి యెదురయ్యెనా?
శంక—ఏ యాషాఢభూతి స్వామీ?
దేవ—నాకు శుశ్రూష చేయుచుండువాడు.
శంక—ఇప్పుడే గ్రామాంతరమునుండి వచ్చుచున్నాను. ఏమి జరిగినది స్వామీ?
దేవ—మే మిరువురము గ్రామాంతరమునకు బోవుచుండగా మధ్య మార్గమున నన్ను మోసపుచ్చి నాబొంతను ఎత్తుకొని పోయినాడు.
శంక—బొంతల కేమి కొదువ గురూ! మాయింటికి దయచేయుడు. నాలుగు బొంత లిచ్చెదను.
దేవ—అయ్యో! నాబొంత యితర బొంతలవంటిది గాదయ్యా. ఆషాఢభూతీ! బొంతా! (ఏడ్చును)

శంక—(తనలో) ఈయన కేమైన పిచ్చియెత్తినదా ? అంతటి వేదాంతికి వెధవబొంతకొరకు అంత వంత యేల? ఇందేదైన రహస్య ముండునా ?

( ప్రవేశము : నారాయణుడు, సదాశివుడు, గోవిందుడు )

నారా—అదుగో నయ్యా, దుర్మార్గుడు. పట్టుకో.

శంక—నారాయణా ! ఏమది ? గురువుగారికి వెఱ్ఱియెత్తినట్లున్నది ?

గోవిం—వెఱ్ఱిగాదు. వాని బుఱ్ఱ. పరమనీచుడు.

శంక—హరి ! హరి ! అదియేమి గురువుగారి నట్లు దూషింతువు ?

సదా—గురువు కాదు. పరమదుర్మార్గుడు. అమాయకులను మోసము చేసిన మహామాయావి. బొంత పోయినదని ఏడ్చుచుండెనా ?

శంక—అవును. బొంత సంగతి యేమి ?

నారా—మనము ఇచ్చిన ధనమును, అమాయికలగు స్త్రీలవద్దనుండి గ్రహించిన ఆభరణాదులను సత్కార్యములకు వినియోగింతునని చెప్పి వానిని బొంతలోపల దాచియుంచి, తనయూరికి పట్టుకొని పోయి ఆలుబిడ్డలను పోషింప దలచినాడు. ఇట్టి దౌర్భాగ్యపు సన్యాసి పరివ్రాజక శిఖామణి యట.

శంక—అదెట్లు తెలిసినది ?

గోవిం—అతని ప్రియశిష్యుడయిన ఆషాఢభూతివలన

శంక—ఆదుర్మార్గు డీతనిమోసముచేసి బొంతను సంగ్రహించెనటగా.

నారా—అతడు గాదు దుర్మార్గుడు. అతడు నిజముగ మనలనందర నజ్ఞానమునుండి యీవల బడవేసినాడు.

(ప్రవేశము : ఆషాఢభూతి, స్నేహితులు)

ఆషాఢ—గురూజీ! నమస్కారము.

దేవ—ఆ! ఆషాఢభూతియేనా? (వెఱ్ఱిగా) నాయనా! బొంతయేది?

నారా—బొంత కాదు. నీబొంద.

ఆషాఢ—అయ్యా, అది సురక్షితముగనే యున్నది.

నారా—ఏమయ్యా! నీవుకోసిన కోతలకును, చేసిన చేతలకును సంబంధమేమయిన నున్నదా? ఇట్టిమోసకారులవల్లనే నిజమగు సన్న్యాసి యెవరో తెలియుటకష్టమగుచున్నది.

గోవిం—నడువుము. నలుగురిలో బెట్టి మొగము నీడ్పించెదము.

ఉ. జేగురుగుడ్డ గట్టి, మఱి చేతను దండము పట్టినంతనే
జోగులు పూజ్యులౌదురొకొ, సూక్తులు పల్కిన జ్ఞానులౌదురో,
భోగులు వీరు నిక్కముగ; మూర్ఖజనంబుల మోసపుచ్చగా
నీగతిసంచరించు కడునీచుని గాంచినఁ బాపమంటదే.

ఆషాఢ—అయ్యలారా! ఇతనిని మనమింక బాధించుట పాడిగాదు. చచ్చినపామును గొట్టుట మాసంఘధర్మము కాదు. దేవశర్మగారూ! అయినదేదో అయినది. మీరికముందైన మీకాలమును ముక్తిమార్గము నన్వేషించుటకై వినియోగింపుడు. ఏప్రజలనుండి మీరు ధనము గ్రహించితిరో ఆప్రజలకే ఆధనముచేరినది. దానిని సద్వినియోగముచేయుపద్ధతి నీతివిచక్షణులగు పెద్దలాలోచింతురు. మీరాధనమును పోగొట్టుకొంటిమని విచారింపకుడు. అందుచే మీపైనున్న పాపభరము తగ్గినది. నాతప్పును క్షమింపుడు.

దేవ—(దీనముగా) నాయనా! కండ్లు తెరచితిని. అజ్ఞానము నశించినది. నాయుపదేశములు వాక్యములందేగాని క్రియలయందు చూపనైతిని. ధనముసంపాదనకై ఇట్టి వ్యూహమును పన్నితిని. నీవు దానిని ఛేదించితివి. నీవే నాగురుడవు. నన్ను క్షమింపుము. నీయట్టివారు మీసంఘమున జేరి అడుగంటనున్న హిందూమతము నుద్ధరింతురుగాక! మీకు భగవంతుడు తోడ్పడుగాక!

ఆషాఢ—చిన్నవాడను. మీరట్లుపలుకుట భావ్యముగాదు. మీరు నిజముగ పశ్చాత్తప్తులైరేని, ఆసర్వనియామకుండగు భగవంతుడే మిమ్ముద్ధరింపగలడు. రండు. దేవదేవుని ప్రార్థింతము. (అందరు ప్రార్థనచేయుదురు).

బారు పార్థసారథి రాఘవేంద్రరావు. రాజమండ్రి.

---

(1)

డాక్టరు—నీకు చలిజ్వరము తగిలినపుడు పళ్లు జివ్వుమంటాయా!
రోగి—పళ్లు బల్లమీదే ఉంటాయిగా.

(2)

"ఏమోయి అల్లా ఉన్నావు?"
"తలకాయ నొప్పిగా నున్నది."
"ఈమందు వేసుకో"
"పనిజేస్తుందా యేమన్నాను?"
"తప్పకుండా చేస్తుంది. నేను ముప్పదియేండ్లనుంచి యిల్లాంటి నొప్పిచేత బాధపడుతున్నాను. ఈమందేగాని మరొకటి వాడలేదు."

ఏడవ యుల్లాసము

ప్రథమపుత్రికా వివాహమైన తరువాత రెండు సంవత్సరములకే పాము సింగన్న రెండవకూతురు పెండ్లి చేయవలసి వచ్చెను. పిల్లనిచ్చి పుచ్చుకొను వారి స్తితిగతులు బాగుండెనా యాడపెండ్లివారు వందలు వేలు రూకలు వరదక్షిణ లిచ్చెదమని పెండ్లికొడుకులకై వెదకుకొను చుందురు. స్తితిగతులు బాగుండనిచోట మగపెండ్లివారే పెండ్లికూతుల కొరకు వెదకుచుందురు. భాగ్యవంతుల విషయమున పెండ్లికొడుకుల కెక్కువకట్నములు కానుకలు కావలెనని మొగపెండ్లివారు పీకులాడు చుందురు. పేదలవిషయమున పెండ్లికూతురు తండ్రి కన్యాశుల్క మెక్కువ కావలెనని బేరమాడుచుండును. సింగన్నయొక్క రెండవ కూతును తమపిల్లవాని కిమ్మని యెందరెందరో గృహస్థులు స్వాయ ముగా నడిగియు రాయబారులచేత నడిగించియు ప్రయత్నము చేసిరి. సింగన్న గడియకొక మాట యాడువాడుకాడు. కన్యావివాహవిషయ మున నతడెప్పుడు నొక్కమాటమీదనే నిలబడుచుండెడివాడు. తన బిడ్డకు బదియేండ్లు వచ్చినవిగనుక, పదివందలరూపాయలు తెమ్మని యతడడుగ జొచ్చెను. ఎందరెన్ని చెప్పినను యెందరు బంధువులు ప్రతి మాలినను, అతడు బిడ్డలబేరములో వెనుకంజ వేయువాడుకాడు, మారుమాటాడువాడుకాడు. పెండ్లాము కావలసినవాడు వేయిరూపా యలు కుప్పబోసి పిల్లను తీసుకొని వెళ్లవలసినదే అని అతడు కంఠో క్తిగా చెప్పుచుండెడివాడు. వందరూపాయలు తక్కువ చేసుకొమ్మని కొందరు, యేబదిరూపాయలు తక్కువచేసుకొమ్మనికొందరు, ప్రార్థిం చిరి గాని, చిల్లిగవ్వ తక్కువైన పక్షమున నతడు కన్యనిచ్చుటకు అంగీ కరింపలేదు. ఆబేరమునకే ఒకపెండ్లికొడుకు సిద్ధమయ్యెను. పెండ్లి

కొడుకు వయస్సు తక్కువే. ముప్పదియేండ్లకంటె నెక్కువ వయస్సు లేదు. చిన్నతనమందు నొత్తుగా మశూచికము పడుటచే, మొగము గంట్లుగొట్టిన దిరుగటిఱాయివలె చూచువారికి అసహ్యమై భయంకరమై యుండెను. స్ఫోటకములోనే యొకకన్ను పూర్తిగాపోయెను. పువ్వుండినను రెండవ కన్నొకవిధముగ కనబడుచుండెను. పగలొకరి సాయము లేక తిరుగగలడు, కాని రాత్రి పరసహాయ మపేక్షణీయము. ఆమశూచికములోనే చేతులు మోరలుదిగి వంకరగా నుండెను. కుడి చేయి స్వాధీనములేదు. ఐనను ఎడమచేయి సరిగానుండుటచే, భోజనమేగాక తక్కిన పనులన్నియు నతడాచేతితోనే చేయవలసిన వాడాయెను. మశూచికములోనే వచ్చెనో అంతకు ముందే వచ్చెనోగాని మాటలో నత్తియుండెను. ఎన్నివక్రత లుండిననేమి రూపాయలలోను, బేరములోను, వక్రతలేనిపక్షమున సింగన్నకు పెండ్లికొడుకు నచ్చినాడన్నమాటే. పెండ్లికుమారుని జూచి మామిళ్లమ్మ పెదవివిఱచి కొంత నసిగెను, కాని, సింగన్న యూమెను, జీవాట్లుపెట్టి నచ్చజెప్పి యొడంబరచెను. వెనుకటివలెనే వరుఁడు రెండుపక్షములవారి ఖర్చులు తానే పెట్టుకొని వేయి రూపాయలు సింగన్నకిచ్చి, తనయింట నైదుదినములు వివాహము చేసుకొనెను. దక్షిణహస్తము సరిగాలేకపోవుటచే హోమములు మొదలగునవి అన్నియు వరుడు వామహస్తముతోనే చేసెను. కాని మంగళసూత్రము మాత్రము ముడివేయుటకు వీలులేకపోయినందున పురోహితుడే వానిమీదకర్తృత్వము పెట్టి యదిముడిపెట్టెను. ఎట్టెటో వివాహ మయ్యెను.

ఈవివాహమైన మఱిరెండు సంవత్సరములకు సింగన్న తృతీయపుత్రికా వివాహము చేయ సంకల్పించెను. పశువులవర్తకుడు తనయింట పెరిగిన యావులను, గేదెలను, విక్రయించినట్లే సింగన్న తనకడుపున

పుట్టి పెరిగిన యాడుపిల్లలను విక్రయించునట్టి వర్తకుడని పేరుపొందు టచే, వివాహార్థము కన్యలు కావలసినవారు, పెక్కండ్రు మూడవ పుత్రికను కూడ నడుగుచూ వచ్చిరి. అట్టివారిలో నొకమూగవాడు గూడ వరుడుగ సిద్ధమయ్యెను. మాటలు రానివానికి పిల్లను కట్టిపెట్టనా యని పూమిళ్లమ్మ కొంత సందేహించి తండ్రినలహా నడుగుటకు రాయకుదురు వెళ్లి సంబంధముమాట మరిడయ్యతోను తల్లితోను చెప్పెను. రాయకుదురునకు సమీపముననున్న కొణితెవాడ పెండ్లి కుమారుని స్వగ్రామ మగుటచే మరిడయ్య వానిని వానితల్లిదండ్రులను చక్కగా నెరుగును. అందుచేత నతడు కూతురుతో నిట్లు చెప్పెను. "అమ్మాయీ! చల్లావారిని నేను మొదటినుండియు యెరుగుదు. వారిది మంచిసాంప్రదాయము. ఈపెండ్లికొడుకు మూగవాడన్నమాట నిజమే, కాని వయసు ముదిరినవాడుకాడు. ముప్పదియేండ్లకన్న నెక్కువ లేవు. పిల్లవాడు స్ఫురద్రూపి. మాటలు రావన్నమాటే గాని యఖండ మయిన తెలివి గలవాడు. చేతితోను, కన్నులతోను మొగముతోను సౌంజ్ఞలుచేసి తనభావములు యితరులకు తెలియ జేయకలడు. మూగ వాండ్రకు లోకజ్ఞానము మిక్కిలి ఎక్కువగా నుండును. పొలమూరులో నొక మూగబ్రాహ్మణు డున్నాడు. వాడు భార్యతో లక్షణముగా కాపురము చేయుచున్నాడు. వానికిద్దరుకూతుళ్లు, ముగ్గురు కొడుకులు గలరు. కాదాయనంటే మూగవాడు గనుక మరిమూడువంద లెక్కు వగా సిమ్మని కోరుడు. చచ్చినట్లు తెచ్చి ఇచ్చితీరెదరు. మూగవాడను సందేహము మాత్రము పెట్టుకొనవద్దు. పదమూడువందల రూపాయలు మాటకేమిగాని, చల్లావారి వంశము నిలిపినదానవగుదువు. నీకును నీభర్తకు నీకన్యాదానమువల్ల పుణ్యమును, మంచిపేరును వచ్చును. వంశము నిల్పుటలో నెంతవిశేషమున్నదో నీవెరుగుదువా!" జనకుని

పలుకులువిని మామిళ్లమ్మ మనస్సులోని సందేహమును విడిచి మారు మాటాడక తోకలపూడివెళ్లి తండ్రిచెప్పినమాటలు భర్తతో జెప్పెను. సింగన్న మామగారి యాలోచనము బాగున్నదని పదమూడువందల రూపాయలు పుచ్చుకొని మూడవకూతును మూగవానికిచ్చి వివాహము చేసెను. వివాహము తనయింటివద్దనే చేయవలెనని మామిళ్లమ్మకు నభిలాష గలుగుటచే పెండ్లిఖర్చుల నిమిత్తము మరిరెండు వందలు పుచ్చుకొని సింగన్న స్వగృహమందే కన్యాదానము చేసెను. సంవత్సరద్వయానంతరమున సింగన్న చతుర్థపుత్రికా వివాహము చేయ తలపెట్టెను. తోలేరు గ్రామనివాసియైన యొకబాలునకు పిల్లనిమ్మని వాని తల్లిదండ్రు లడిగిరి. కాని ఆపిల్లవాడు కుంటివాడు. కట్టి పుచ్చుకొనిగాని నడువలేడు. సింగన్న పిల్లమీద పెట్టినధర వేయిరూపాయలుకదా, కుంటితనమున్నందుకు మరిమూడువందల రూపాయలు జరిమానావిధించి, మూడవపిల్లకు వలెనే, యీపిల్లకు పదమూడువందల రూపాయలు ధర నిర్ణయించి, సింగన్న తోలేరు గ్రామపు దేవాలయములోనే కన్యాదానము చేసెను. ఉభయపక్షముల వ్యయములు మగపెండ్లివారే భరించిరని వేరుగ చెప్పనక్కఱలేదు.

---

ఎనిమిదవ యుల్లాసము

---

దుందుభికి పది సంవత్సరములు నిండినవి, పదునొకండవ యేడు ప్రవేశించినది. తల్లిదండ్రులవలె బిడ్డ దృఢమై యేపుగా బెరుగుటచే పండ్రెండు సంవత్సరములు దాటిన బాలిక వలె కన్పించుచుండెను. ఆమె వివాహము నిమిత్తమై సింగన్న వేగిరపడ జొచ్చెను. ఆవేగిరపాటు కూతురు రజస్వల యగునను భయము చేత కాదు. శాస్త్ర

ములమీఁది ప్రమాణ బుద్ధిచేతనుకాదు. ఎప్పుడు వేయిరూకలో పంద్రెండువందలరూకలో చేతిలో పడునా యను నాత్రము చేతనే యతఁడు పెండ్లికి తొందర పడజొచ్చెను. ఆసారి మాయిల్లమ్మకు మును పెన్నఁడును లేని క్రొత్త కోరిక యొకటి యుద్భవించెను. ఆకోరికనామె భర్తతో నిట్లు చెప్పెను. "దుందుభి మనకు కడగొట్టు పిల్లకదా! అది అల్లారుముద్దుగా బెరిగినది, తక్కినపిల్లల పెండ్లిండ్లవలె కాక దీనిపెండ్లి మనయింటనే ఐదుదినములు చేసి పెండ్లివారికి యేదోవిధముగా యింత పప్పుఅన్నము పెట్టి పంపవలయునని నాకోరిక. పెండ్లికొడుకుల పంచన జేరియో, దేవాలయములకు పోయియో, మనమిదివరకు వివాహ ములు చేసితిమి కాని ముచ్చటగా వియ్యాలవారితో వేడుకలు జరుపు కొనుచు మనయింట వివాహము చేయలేదు. అదిగాక యేముసలి వానికో ముక్కవానికో మనము డబ్బుపుచ్చుకొని బిడ్డలను కట్టిపెట్టి తిమికాని, చదువుకొన్నవానికి చిన్నవానికి మనము పిల్లనీయలేదు. ఈపర్యాయము డబ్బుపుచ్చుకొనకుండ మంచిసాంప్రదాయముగల పెండ్లికొడుకును దెచ్చి దుందుభినిచ్చి ముచ్చట దీరునట్లు వివాహము చేయవలెనని, మనసు పడుచున్నాను. ఆలాగునచేసి నాముద్దు చెల్లింప వలెను." అని యింకనేమో చెప్పబోవుచుండ సింగన్న నేయిబోసిన యగ్గివలె మండిపడిలేచి భార్యనిట్లు చీవాట్లు పెట్టసాగెను. "నీముద్దు చెల్లింపవలెనా? నీముద్దు ముక్కలైనట్లే యున్నది. నీవంటి మొద్దు ముండకు ముద్దులు కూడనా? నీమాట వింటినా! నాకొంప నట్టేటిలో కట్టుకొనవలసినదే! ఏడిచినట్లే యున్నది, నీయాలోచన, పిచ్చముండా! ఈయాలోచన నీకు తోచినది కాదు. ఎవరో గిట్టనివాండ్రు నీమతి విరచినారు. నీకుడబ్బు చేదా! వెనుకటిడబ్బు వడ్డికి వేసినారుకదా? అదిచాలదా? అందువేమో? ఆడబ్బుపెట్టి భూములు కొని నీపేర

వ్రాయించెదను. దుందుభివల్లకూడా నేను డబ్బుపుచ్చుకోదలచుకొన్నాను. ఈడబ్బుపెట్టి నీకు ఒంటినిండ నగలు చేయించెదను. ఒక కంటె కాసులపేరు ఒడ్డాణము నీకీసారి చేయించెదను. ఇప్పుడు త్రెంపి పోయుటకు పుస్తెదప్ప మరేనగలు లేక నీవు తలవెండ్రుకల విధవ లాగు ఉన్నావు. అందెపోచయైన కాలికి లేదు. చెవులకు బావిలీలుగాని, బొగడలుగాని లేవు." అనుచుండ నంతలో మామిళ్లమ్మ అందుకొని "ఇదివరకు నలుగురి బిడ్డలవల్ల పుచ్చుకొన్న సొమ్ముమీది వడ్డీనైన పెట్టి నగలు చేయించినారా! యిప్పుడు నానగలమాట మీకు జ్ఞాపకము వచ్చినది కాబోలు, మీయిష్టమువచ్చినట్లు చేయండి నేనడ్డమురాను." అని ఆమె బదులు చెప్పుచుండగా సింగన్న యామెమాటకు అడ్డము పోయి యిట్లనెను. "చూడు! మనకు గోష్పాదమంత భూమియైనలేదు. ఆ సొమ్ముమీద వడ్డీపెంచి పదియకరముల కొండ్రకొనవలెనని సంకల్పించుకొన్నాను. కాలుచేతు లుడిగి మనము పెద్దవార మైనప్పుడు, నేనుసంపాదన చేయలేనప్పుడు, కొండ్రమీద పదివరాల సొమ్ము వచ్చెనా? మనకు గౌరవముగా కాలక్షేపము జరుగును. నేను సంసారము నిమిత్తమే సొమ్ముదాచినాను గాని చిల్లిగవ్వయైన నావెంట పట్టుకొని పోను. యావత్తుసొమ్ము నీ మొగముననే పెట్టి పోవుదును. దానిమాట అటుండనీ! యీసారి తప్పక నగలు చేయించెదను. నిన్ను జంపుకొన్నట్టే గాయత్రీసాక్షి ఇకమీద నీవు కంటెలు కాసులపేరులు వేసుకొని షోకుగా నడ్డితిప్పుకొనుచు గ్రామములో అందరికన్న గొప్పదానివై తిరుగవచ్చును. అప్పుడు నాతో మాట్లాడుదువా? గర్వపడుదువా?" "సరిలేతురూ! మీ వేషాలు, మీమాటలు, మీబూటకాలు, నేనెరుగనివి కావు. ఇచ్చకాలు, మచ్చికలు చెప్పి నానోరు మూయించ తలుచుకొన్నారు. నాకు నగలెందుకు నాకుమీరునగ

మీకు నేనునగ; తోకలపూడి గ్రామమునకు మనమిద్దరము నగలము. మీయిష్టమువచ్చిన సంబంధము తీసుకొనివచ్చి పిల్లకు పెండ్లిచేయండి. కాదనకుండ మీతో పీటలమీద కూర్చుండి కాళ్లుకడిగి కన్యధార పోసెదను." అనిమామిళ్లమ్మ యూరకుండెను. "సరే యీసారి దుందుభిపెండ్లి ముచ్చటదీర ఐదుదినములు ఇంటిలోనే చేసెదను. ఇది నీకు సమ్మతమేకదా! రెండుమాసములపాటు నేను గ్రామములో నుండను. జల్లిసీమలోను, రెడ్డిసీమలోను, నాకు కొంత పనియున్నది. ఇంటిలోనీవు పిల్లలనుపెట్టుకొని జాగ్రత్తగాఉండు." అనిసింగన్న పలికి నాలుగైదు దినములలో ప్రయాణమై జల్లిసీమకు పోయెను. జల్లిసీమ యనగా, కొల్లేరు సరస్సు సమీపమున నున్నప్రదేశము. ఆగ్రామములు ప్రస్తుతము కొన్ని తాడేపల్లిగూడెము తాలూకాలోను కొన్ని భీమవరము తాలూకాలోను నున్నవి. సరిపల్లె, నిడమర్రు, వల్లూరు, నిండ్రకొలను, అడవికొలను, మొదలైన గ్రామములు జల్లిసీమలోనివే. ఆ భాగమునకు పూర్వము బహిర్జల్లీపరగణా యనిపేరు. ఇప్పటికిని దానికి జల్లిసీమ యను పేరు జెల్లుచున్నది. జల్లిసీమవెళ్లుటలో సింగన్న యుద్దేశమిది, స్వగృహములోనే దుందుభి వివాహము చేయవలయునని భార్య చెప్పిన యాలోచన అతనికి నచ్చినది. కాని వడ్డికి తిరుగుచున్న సొమ్ము లోనుంచిగాని కాబోవు పెండ్లికొడుకువల్ల వచ్చుసొమ్మునుండిగాని గ్రుడ్డిగవ్వయైన అతడందుకు ఖర్చుపెట్ట తలచుకొనలేదు. సంపన్నగృహస్థులను వివాహముపేరుపెట్టి యాచించి యాసొమ్ము ఖర్చుపెట్టవలెనని యాతని సంకల్పము. సమీపమున నెన్నో గ్రామములుండగా దూరదేశము యేలపోవలయు నందురా? చుట్టుప్రక్కల పాతికముప్పది గ్రామములలో సింగన్న పిల్లలవర్తకము జేసి సొమ్ము సంపాదించి వడ్డీవ్యాపారము చేయుచున్న షావుకారయినాడని జనులాబాలగోపాల

మెరుగుదురు. ఆపల్లెలలోనే యతడు కొందరికి ప్రామిసరీ నోటుల మీదను, కొందరికి తణఖాపత్రములమీదను, కొందరికి వెండిబంగారపు తాకట్టువస్తువులమీదను బదుళ్లు ఇచ్చియున్నాడు. కావున నతని యాచనపేరిటి బూటకపు నాటక మచ్చట సాగదు. జల్లిసీమ దూరముగ నుండుటచే యక్కడిజనులు తనవృత్తాంతమెఱుగరు గావున, నా సీమలో భాగవతముకట్టి కలాపము వినిపింపవచ్చునని యతడు తలపెట్టి యా ప్రాంతములకు బోయెను. ఆసీమలో యతడు క్రొత్త వేసము వేసెను. మెడలోనొక రుద్రాక్ష తాళము దాల్చెను. ఎక్కడిదో ఒక పాతశాలువు సంపాదించి యది తలకుజుట్టెను. మామగారియొద్ద కృష్ణాజనము ఎరువు తెచ్చుకొని అది వీపుమీద ధరించెను. మొగమునిండ కడుపునిండ చేతులనిండ వీభూతి పిండికట్లు నిరంతరము ధగధగ మెరయుచుండెను. మకిలి పట్టిన పాత జందెములు తీసిపారవైచి, తెల్లని నూతన యజ్ఞోపవీతములు దాల్చెను. ఎవ్వరైన పలుకరించినప్పుడు తప్ప తక్కిన సమయములయందు పరమేశ్వర పరమేశ్వర యనుచు నెల్లప్పుడు భగవన్నామము నుచ్చరించుచుండును. ఊరక కూర్చున్నప్పుడు. స్ఫటికముల తావళము చేతపుచ్చుకొని త్రిప్పుచూ జపముచేయుచుండును. ఆనటనము నెరుగక, యతడుకాలనేమి యని యెరుగక జల్లిసీమలోని నాలుగువర్ణములవారును సింగన్న బ్రహ్మణ్యుడని, మహాతపశ్శాలి యని నమ్మి పొగడి గౌరవించిరి. సింగన్న జల్లిసీమలో యాచన సేయుటకు కారణమీ క్రింది విధముగా చెప్పుచూ వచ్చెను. "అయ్యా! నేను శ్రోత్రియ కుటుంబములో పుట్టిన బ్రాహ్మణుడను, మాతండ్రి తాతలు మహామంత్రవేత్తలు, పూర్వము మాకుటుంబమునకు మంచి వసతి వాడలు కలవు. ఏడాదికి వేయి రూపాయలు మాకు మాన్యములవల్ల వచ్చెడివి. మాతండ్రి తాతలు నిరతాన్నప్రదానము చేయుట

చేతను దానధర్మములు విశేషముగా జరిపి యుండుటచేతను, మా భూములు పోయినవి. లక్ష్మి పిసినిగొట్టుల యింటనే గాని దాతలయింట నుండనొల్లదుగదా! జీవనాధారము నాకు లేకపోవుటచే బ్రాహ్మణస్య ధనంభిక్షం అనిపెద్దలు చెప్పినారు గనుక, యాయావరము చేసి కుటుంబ పోషణము చేసికొనుచున్నాను. మాది నరసాపురము తాలూకాలో జేరిన చించినాడ గ్రామము కాపురము. నాపేరు సింగావధానులు. దరిద్రు నకు సంతాన మెక్కువ గదా! దేవుడు నన్ను శిక్షించుటకేమో యన్నట్లు నాకైదుగురు కూతుళ్ళను బ్రసాదించినాడు. అందు నలుగు రికి వివాహములైనవి. నీవు దరిద్రుడవు గనుక ఆడపిల్లలవద్ద నేదో పదివరాల సొమ్ముపుచ్చుకొని పెండ్లిండ్లు చేయుమని నాచుట్టములు నామేలుకోరినవారు చెవినిల్లు కట్టుకొని పోరిరి. కాని పిల్లనమ్ముకొనుట మహాపాతకమని శాస్త్రవిరుద్ధమని అపకీర్తికరమని ఒక్కపిల్లనైన నే నమ్ముకొనక నలుగురుపిల్లలను మంచివరులకిచ్చి కాళ్లుగడిగి కన్యాదా నము చేసితిని. పెండ్లివారి కానాలుగు దినములు నాకు తోచినట్లు పప్పన్నముపెట్టి గౌరవించి పంపితిని. ఆపప్పన్నమైనను ఏలాగు వచ్చిన దందురేమో నేను యాయావరము చేయుచున్న గ్రామములలోనివారు నన్ను దేవుఁడుగా భావింతురు. ఆకారణమున నాలుగు వివాహములకు గావలసిన సొమ్మంతయు నేనడుగకుండగనే వారంతటవారే యిచ్చి మాటదక్కించిరి. ఇప్పుడు ఐదవకుమార్తె పెండ్లి చేయవలసి యున్నది. పిల్లకు పదకొండు సంవత్సరములు నిండినవి. పూర్వకాలపు చాదస్తపు మనుష్యులము గనుక పిల్ల రజస్వల యగునేమో యని భయముచేత పెండ్లికొరకు తొందరపడుచుంటిని. మునుపటి గ్రామములవారినే మరల యాచించుట ధర్మముకాదని మోమోటపడి యీసారి జల్లిసీమకు మీదర్శనార్థమువచ్చితిని. ఈకన్యాప్రదానము మీరు చేయించవలెను.

కన్యాదానఫలము యింతింతయని చెప్పనలవికాదు. అది చేసినవారికే గాక చేయించినవారికి గూడ విశేష పుణ్యము గలిగించును. మీద మీచిత్తము. నీటముంచిన పాలముంచిన మీదే భారము." ఆ మాయ మాటలు నమ్మి జల్లిసీమలోని బ్రాహ్మణులును క్షత్రియులును, వైశ్యులును, శూద్రులును, చందాలువేసి పోగుజేసి నెలదినములలో సింగన్నకు రెండువందల రూపాయలు యిచ్చిరి. ఆలాగే పోలవరము జంగారెడ్డిగూడెము మొదలయిన రెడ్డిసీమ గ్రామములకు పోయి యాచించి మరిరెండువందలరూపాయలు సింగన్న దుందుభీ వివాహము నిమిత్తము తెచ్చెను.

---

తొమ్మిదవ యుల్లాసము.

---

తృణ కాష్ఠ జల సమృద్ధి గల గ్రామము మనుష్యులకు నివాసయోగ్యమని యార్యులు వక్కాణింతురు. అట్టిచోటనే యూరు కట్టుకొనవలసినదని శాస్త్రవేత్తలు చెప్పుచుందురు. మొగలితుఱ్ఱు గ్రామము కూడ నట్టిగ్రామములలో నొకటి. అదిమొదటినుండియు ప్రసిద్ధిగల యూరు. గోదావరీ మండలమున, నరసాపురము తణుకు భీమవరము మొదలగు తాలూకాలను కొంతకాలము యథేచ్ఛముగా పరిపాలనము చేసి బ్రాహ్మణులకు విద్వాంసులకు భూములు నగ్రహారములు విరివిగా నిచ్చిన శ్రీకలిదిండి వంశస్థులైన రాజులకు నది పూర్వము రాజధానియై యుండెను. కాలము మారిపోవుటచే నాంగ్లేయ ప్రభుత్వము వారు శ్రీకలిదిండి రాజుల సంతతివారి వద్దనుండి రాజ్యమును తీసికొని, వారికి పింఛనులిచ్చిరి. మొగలితుఱ్ఱులో గొప్పకోట యున్నది. అది యిప్పుడు సిథిలావస్థలో నున్నను, పూర్వవైభవమును చాటుచున్నది.

పూర్వపురాజుల సంతతివారు నేటికి నీకోటలో నివసించుచున్నారు. ఊరికిని కోటకును రమారమి ఒకక్రోసు దూరమున్నది. గోదావరి కాలువ వచ్చినతరువాత మొగలితుఱ్ఱు గొప్ప గ్రామమైనది. నరసాపురమునకది మూడుక్రోసుల దూరములో నున్నది. నరసాపురమునుండి యచటికి డింగీలు బాటసారుల నెక్కించుకొని కాలువ మీాద పోవును. నడువగలవారు శ్రమలేక రెండుగంటలలో కాలినడకను పోవచ్చును. గ్రామమిసుకనేల గలదైనను, కూరలు ఫలవృక్షములు మిక్కిలి యేపుగా నెదిగి కాయును. నరసాపురమునుండి మచిలీపట్నము పోవువారు, రైలు బండి రాకమునుపు కాలినడకను బండ్లమీాదను, మొగలితుఱ్ఱు మీాదుగా సముద్రపు టొడ్డు ననుసరించియు ప్రయాణము చేసెడివారు. ఆగ్రామమున దయ్యాలదాసుపేట యని ఒకపేటకలదు. ఆపేటలో చింతాచలపతి యనుపేరుగల వెలనాటి వైదిక బ్రాహ్మణుడుండెను. ఆయనకు చిరకాలను సంతానము లేకపోయెను. ఆయనభార్య సప్త సాగర యాత్రలు వ్రతములు అశ్వత్థప్రదక్షిణములు సమారాధనములు సంతర్పణములు చేయగా చేయగా, దైవానుగ్రహమున నొకకుమారుడు పుట్టెను. ప్రసవించుటకు నాలుగు దినముల ముందాయిల్లాలికి స్వప్నములో సర్పము కనబడుటచే కుఱ్ఱవానికి నాగన్న యని పేరు పెట్టిరి. లేకలేక గలిగిన బిడ్డడగుటచే నాగన్నను తల్లిదండ్రులు మిక్కిలి గారముతో బెంచిరి. స్థితిగొప్పది గాకున్నను తల్లిదండ్రులు తదన్నము తద్రసము తిని పిల్లవాడు కోరిన కోరికలెల్ల చెల్లించి ముద్దు సేయుచుండిరి. ఐదేండ్లు వచ్చినతరువాత కేశఖండనము, అక్షరాభ్యాసము జరిగెను. కాని పిల్లవాడు బడికొకనాడైన పోలేదు. మాతాపితలు గారముచేత వానిజోలికి పోరైరి. బడిపేరు చెప్పగానే నాగన్నకు తల నొప్పి, కడుపునొప్పి, పెద్దపెట్టున యేడ్పు మొదలైనవి చూపట్టు

చుండును. పంతులు బెత్తముపుచ్చుకొని యింటికివచ్చి గంజీకాలుపట్టించి నలుగురు పిల్లలచేత వానిని మోయించి బడికి తీసుకొని పోవుచుండును. ఆపని ఒకపూట జరుగగానే మరల బడికి పోవలసి వచ్చునని, నాగన్న యింటికేరాక పారిపోవు చుండును. అన్నము మాని ఎవరి అరుగు మీదనో నిద్ర పోవుచుండును. తల్లిదండ్రులు బిడ్డ యేమయినాడా యని నూతులు గోతులు, పొలములు వెదకుకొని వానిని గానక వగచుచుండురు. ఒకనాడు సీతారామపురము వెళ్లును. ఒకతేయి రుస్తుంబాదాలో కాపులపంచను, పండుకొనును. చలపతి నెరిగినవారు వానిని బట్టుకొని తండ్రికొప్పగించుచుందురు. తండ్రియు, బడిపంతులును, వానినెన్నో విధముల దండించిరి. ఒకమారు పంతులు వానిని బొండ నేసెను. గుంజీలుదీయించెను, కోదండము దీయించెను, వంగబెట్టి మీద పిల్లలను కూర్చుండ బెట్టెను. ఎన్నిచేసినను వానికి బుద్ధిరాలేదు. తల్లిదండ్రులు దాచుకొన్న డబ్బులు రూపాయలు దొంగిలించుకొని దూరపు గ్రామములకు పారిపోవ జొచ్చెను. ఆసొమ్ము ఖర్చుపడిన తరువాత తిరిగి యింటికి వచ్చుచుండును. తండ్రి బ్రతిమాలి వాని నెట్టెటో నాలుగుమాసములు యింటివద్దనుంచి బడికి పోవద్దని చెప్పి ఉపనయనము చేసెను. అది బాలునకు మిక్కిలి ఉపయోగకర మయ్యెను. ఎట్లన పారిపోయినప్పుడు పొరుగూళ్లలో బ్రాహ్మణార్థములు షోడశ, శ్రార్ధభోజనములు, చేయుటకు వీలయ్యెను. నాలుగు మాసము లయిన తరువాత వాడెప్పటియట్ల దేశసంచార మారంభించెను. పొగ చుట్టలు కాల్చుట యలవాటు చేసుకొన్నందున, చుట్టలకు డబ్బులేక పోయినప్పుడును, భోజనము దొరక నప్పుడును, వాడు గృహస్థుల కడకు బోయి “ అయ్యా ! నాతండ్రి చనిపోయినాడు, దినవారములు చేసికొనుటకు డబ్బులేదు. దిక్కుమాలినవాడను, ఏదైన సాయము

చేయండి " యని ఒకసారియు "అయ్యా! నాతల్లి చనిపోయినది, మాతండ్రి చాలపెద్దవాడు, నేటికి ఐదుదినములైనది శ్రాద్ధము చేసి కొనుటకు డబ్బులేదు సాయము చేయండి " యని మరియొక సారియు యాచించి కొంతసొమ్ము వారికడనుండి సేకరించి, చుట్టలకు, మిఠాయికి చొక్కాలకు, దానిని ఖర్చుపెట్టి దేశదిమ్మరియై తిరుగు చుండును. ఇట్లు చెప్పగా చెప్పగా బాలవాక్యం, బ్రహ్మవాక్యం, అన్నట్లు కొంత కాలమునకు నిజముగా తండ్రిచనిపోయెను. ఆవార్తకర్ణాకర్ణిని విని నాగన్న మొగలితుట్టు పోయి తండ్రికి శ్రాద్ధము చేసి తల్లిగతి యేమో కనుగొనక పదమూడవనాడే యిల్లువిడచి, దేశాటనమునకు బయలు దేరెను. అప్పటికి వానికి పదియారేండ్లుదాటెను. ఆవిధమైన యాచన చిరకాలము సాగలేదు. పెండ్లిచేసుకొందునని చెప్పి ధనసహాయము చేయుడని కొందరిని యాచించెను. ఈఫక్కియు చాలకాలము సాగ లేదు. పదునెనిమిదేండ్లు దాటినప్పటికి తల్లిగూడ మరణించెను. తల్లికు త్తరక్రియలు, చేసినతరువాత వానిని మేనమామలు తీసుకొనిపోయి కొన్నాళ్లు తమ యింట నుంచుకొనిరి. అక్కడికి వెళ్లిన తరువాత పది దినములు గడచెనోలేదో ! నాగన్న మేనమామ కొడుకు చేతి బంగా రపుమురుగులు దొంగిలించుకొని పారిపోయెను. కడుపుచించిన కాళ్ల మీదపడునను సామెత తలచుకొని మేనమామలు ఫిర్యాదు చేయక యూరకుండిరి.

ఇరువది సంవత్సరములు వచ్చునరికి జీవనాధారమైన వృత్తి యేమియూ లేక నాగన్న పాలకొల్లులో కావడి బుజమున పెట్టుకొని నీళ్లమోత ప్రారంభించెను. ఆవృత్తిలో నుండగా, నొక గృహస్థుని యింట వాడు వెండిగిన్నె దొంగిలించెను. ఆచౌర్యము పట్టుబడెను. నరసాపురము తహసీల్ దారుగారు వాని కారుమాసములు కారాగార

శిక్ష విధించిరి. రాజమహేంద్రవరము జైలులో నారుమాసములు గడపి, విడుదలయైన తరువాత కోటిలింగాల రేవులో గోదావరీ స్నానము చేసి ప్రాయశ్చిత్తము చేసికొని, యచటనే వంటబ్రాహ్మణ వృత్తి నవలంబించెను. కాని వంట చేతగాకపోవుటచే వాని నెవరును పిలువరైరి. జట్టులోవాండ్రు వానిని చేర్చుకొనరైరి. పిమ్మట గంగన్న తోను హనుమయ్యతోను, కలసి వాడు పీనుగుల మోయ నారంభించెను. రాజమహేంద్రవరములో నెవరియింట నేశుభాశుభకార్యములైనను పిలువకయే వారియింట భోజనము సేయుచు, అది దొరకనినాడు సత్రములలో చీటి వ్రాయించుకొని భుజించుచు, నదియు లేనినాడు శవవహనమువల్ల వచ్చిన డబ్బు ఖర్చుపెట్టి పూటకూళ్లయింట భుజించుచు, కాలక్షేపము చేయుచుండెను. ఆదినములలో వాడొక పల్లెదానిని జేరదీసి దానితో సంసారము చేయుచు ఉదయమున దానియింటనే చద్దిఅన్నము తినుచు, పీనుగులమోతకు పోవుచుండును. నాగన్న యాజానుబాహుడు దృఢశరీరము గలవాడు పీనుగులమోతలో నసమానుడు. కటుకుయొక్క రెండుకొమ్ములు వాడే పట్టి యిద్దరివంతు సొమ్ము వాడే పుచ్చుకొనును.

ఈవిధముగ నాగన్న కొన్నిసంవత్సరములు రాజమహేంద్రవరములో కాలక్షేపము చేసి తరువాత మునుపుంచుకొన్న పల్లెదానిని విడిచిపెట్టి ఒకచాకలిదానిని తీసుకొని కాకినాడ వెళ్లి యచ్చట పూటకూళ్ల తనము ఆరంభించెను. అదికొంతకాలము చక్కగానే జరిగెను. కానియాదాయమునకు మించిన వ్యయము చేయుచుండుటచే తుదకా వ్యాపారములో దండుగ వచ్చెను. బియ్యపువర్తకులకు పప్పు చింతపండు మొదలయిన సరకుల నిచ్చిన చిల్లరదుకాణదారులకు, పాలు పెరుగు నేయి పోసిన గొల్లవాండ్రకు చాలసొమ్ము బాకీపడి వారికది యీయ

లేకపోయెను. వాండ్రు తొందర పడి సొమ్ము తక్షణమే యిచ్చివేయ వలసినదని తిట్టి యిల్లుముట్టడి వేయుటచే వారిబాధ పడలేక రాత్రివేళ యానాము పారిపోయెను. ఋణప్రదాతల బాధలు పడలేని ఋణస్థులను యానాము కన్నతల్లివలె కడుపులో పెట్టుకొని కాపాడునుకదా! అధ మర్ణులకు యీశరణాలయముండబట్టియే కారాగృహ ప్రవేశము తప్పు చున్నది. నాగన్న యానాములో మిఠాయి దుకాణము పెట్టి, జీవనము చేయజొచ్చెను. అక్కడ కొంతకాలముండి, యొకబ్రాహ్మణ వితంతు వును, లేవదీసుకొని రహస్యముగా కాకినాడవెళ్లి పొగయోడయెక్కి రంగము వెళ్లెను. ఆమె తనతో గూడ నాలుగువేల రూపాయల విలువ గల నగలను వేయిరూపాయల రొక్కమును దీసికొని పోయెను. అందు చేత విదేశములో నాగన్నకు అన్నవస్త్రములకు వెలితి లేకపోయెను. రంగములో కొన్నిసంవత్సరములును, పిమ్మట మోల్‌మేనులోను వారిరు వురు, భార్యాభర్తలవలె జీవించిరి. మోలుమేనులో నుండగా నాబ్రాహ్మణ వితంతువు మరణమొందెను. పోవునప్పటి కామెకడ రెండువేల రూపాయ లుండెను. వానిని మెల్లగా సంగ్రహించి నాగన్న విదేశములో నుండుట కిష్టము లేక బర్మాదేశము విడిచి పొగయోడ నెక్కి కలకత్తా జేరి, కాశీ గయ ప్రయాగ హరి ద్వారము మొదలగు క్షేత్రములకు పోయెను. పిమ్మట నతడు స్వదేశ మునకు రాదలచి మొగలితుర్రు వెళ్లి, యచ్చటనుండి మేనమామల గారి గ్రామమైన, గొల్లపాలెము వెళ్లెను. అప్పటికి వానిచిన్న మేన మామ మాత్రమే బ్రతికి యుండెను. నాగన్నకప్పటికి యేబది యేండ్ల వయస్సు. మేనమామ యతని నాదరించి వెనుకటితప్పులు క్షమించి యింటనుంచుకొనెను. ఒకనాడు నాగన్న మేనమామతో నిట్లనియె "మామా! చిన్నతనమున తల్లిదండ్రులు చెప్పినట్లు వినక దుస్సహ

వ్యసనములుచేసి చెడిపోయి అన్నివిధముల భ్రష్టుఁడనైతిని. మిమ్ముఁవిడిచి పెట్టిన నాటనుండి నేను రాజమహేంద్రవరములో గొంతకాలము కాకినాడలోఁ గొంతకాలము కాలక్షేపముచేసి నేటివఱకు కాశీ మొదలగు పుణ్యక్షేత్రములు సేవించుటలోనే కాలము గడిపితిని. ఇకనైన ఒక యింటివాఁడను కావలెనని కోరిక యున్నది. ఈ ఘోటక బ్రహ్మచర్యము చేయ జాలను. గనుక నీవు నానిమిత్తము కష్టపడి తిరిగి ఎదిగినపిల్లను చూచి పెండ్లిచేసి నన్నొక యింటివానిని చేయవలెనని కోరుచున్నాను. ఎంతసొమ్ము గావలసిన నంతసొమ్ము కన్యాప్రదాత కిచ్చెదను. తోకలపూడిలో పాముసింగన్న యను బ్రాహ్మణుడున్నాడట. నీవక్కడికి పోయి, ఆసంబంధము వీలగునేమో చూడుము. అదివీలుగాకపోయిన మఱియొకటియైన జూడుము. ఏలాగో తంటాలుపడి వారు కోరిన సొమ్ము తెచ్చి యిచ్చెదను." అనవుడు మేనమామ యిట్లనియె, "అబ్బాయీ! నీకిప్పుడు పిల్ల నెవరిత్తురు? నీకేబది సంవత్సరము లున్నవి. తలముగ్గుబుట్టవలె నెరసినది. పండ్లూడి పోయినవి. శరీరము నిండ గేదెతామర బయలుదేరినది. ఏగృహస్థుడు చూచి చూచి తన పిల్లను, నీవంటి వానికి గట్టిపెట్టును? ఐనను నాశక్యమైన ప్రయత్నము నేను చేసెదను."

భక్తి వలదనను, గాని భక్తిలో మునిఁగి సర్వకర్మసన్న్యాసము చేయుట నా కిష్టము గాదు. (ఆలోచించి) కాని మహాభక్తుల చరిత్రము లన్నియు నిట్టి సన్న్యాసకథలతో నిండియున్నవి. అట్టివారిని జెట్టవట్టిన స్త్రీలకు దాఁటరాని యాపదలు దాపురించుచున్నవి. ఇహలోకమున నీబాధలన్నియుఁ బరలోకమున నుపకరించునఁట. ఏమో బంధువులు వలదన్నను, ఈ పట్టణములో నిట్లు శ్రమపడుచున్నాను. ఈ కుఱ్ఱవాఁడు విద్య సాంతముఁ జేయునని తోఁచుట లేదు. కందర్పరావా! దుష్టునివలెఁ దోఁచుచున్నాఁడు. నా కిఁకఁ బరమేశ్వరుఁడే దిక్కు.

శ్లో. హేగోపాలక! హేకృపాజలనిధే! హేసింధుకన్యాపతే!
హేకంసాంతక! హేగజేంద్రకరుణాపారీణ! హేమాధవ!
హేరామానుజ! హేజగత్త్రియ గురో! హేపుండరీకాక్ష మాం
హేగోపీజననాథ! పాలయ పరం జానామి నత్వాం వినా.

(తెరలో)

కా తే కాంతా కస్తే పుత్త్రః సంసారోఽయమతీవ విచిత్రః
కస్యత్వం వా కుత ఆయాతః తత్త్వం చింతయ తదిహ భ్రాతః.

భజగోవిందమ్ (పాట వినఁబడును. సరస్వతి యాలకించి) అదే! వీథిలో నెవరో పాటఁ బాడుచు నిటే వచ్చుచున్నారు. ఆహా! ఆకంఠ మెంత మనోహరముగా నున్నది. వాకిటిలోని కేగి చూచెదను.

[అంత శ్రీ చిదానందయోగి ('కా తే కాంతా' అనునది పాడుచుఁ బ్రవేశించును.] (పాట ముగిసిన తరువాత సరస్వతి యింటి ముందుగా మౌనియై యోగి పోవుచుండును.)

సరస్వతి—(తనలో) ఈ మహానుభావుఁడు జగన్మోహనాకారుఁడు. ఈయన రూపము నాపతిరూపమును బోలియున్నది. ఈతఁడు సంసారము నెట్లు త్యజించెనో? ఎట్లన నేల? నా నాథునివలెనే!

ఇప్పుడు జరిగిపోయిన కాల మంతయు జ్ఞప్తికివచ్చి యొక్క త్రుటిలో నానందమును వెంటనే ప్రస్తుతస్థితి జ్ఞప్తికివచ్చి దురంతదుఃఖమును గలుగుచున్నవి. (ఇస్సు........తలపట్టుకొనుచు మరల స్మృతికిఁ దెచ్చుకొని) అయ్యో! ఇంతలో నా మహాత్ముఁడు దాఁటిపోవునేమో! ఈయన పాట గూడ 'కాతేకాంతా' యనుట వింతఁ గొల్పుచున్నది. (ముందునకు వచ్చి ప్రకాశముగా) యోగిచంద్రా! ఇవే సాష్టాంగదండప్రణామములు. ఇదే మీకు స్వాగతము.

శ్రీచిదానందయోగి—ఓరి నారాయణ.

సరస్వతి—స్వామీ! భిక్ష మిడుదును. లోనికి విచ్చేయుఁడు.

శ్రీచిదానందయోగి—గృహస్థుల యిండ్లఁ బ్రవేశించుట మాకు ధర్మముగాదు వెలుపలనుండి భిక్ష గ్రహించెదను.

సరస్వతి—అది సామాన్యముగ సత్యమే! కాని యీ దీనురాలియెడ నసాధారణప్రేమఁ జూపి లోనికి వచ్చి భిక్ష గ్రహింపఁ బ్రార్థించుచున్నాను. [చేయవలదు.

శ్రీచిదానందయోగి—మంచిది. పంచలోనికి వచ్చెదను. ఆలస్యము

సరస్వతి—స్వామీ! (నడచి) ఈపీఠము నలంకరింపుఁడు. (పీఠము వేయును. యోగి పంచలోనికి వచ్చి పీఠము నలంకరించును. సరస్వతి భిక్ష గొనివచ్చియిచ్చును. యోగి దానిని దన సంచిలో వేసికొనును.)

సరస్వతి—ప్రభూ! మీరు, హిమాలయాది దివ్యక్షేత్రముల నెన్నిటినో కాంచి యుందురు. ఈ దీనురాలిభర్త బ్రహ్మానంద మనువారు సతీసుతుల విడిచి వైదేండ్లక్రిందట భక్తిపరవశులై యేగిరి. వారి జాడ లేమైన మీకుఁ దెలియునా?

శ్రీచిదానందయోగి—నాసంగతియే కాని యితరులసంగతి నాకుఁ దెలియదు. అయిన నావిధముగ భక్తిపరవశులై సంసారమును వీడిన వారు మరలవచ్చి సంసారము నంగీకరింతురని తోఁచదు. విష్ణు భక్తిని మఱఁగిన చిత్తమున కన్యములు రుచించునా?

సీ. మందార మకరంద మాధుర్యమునఁ దేలు
మధుపంబు పోవునే మదనములకు
నిర్మల మందాకినీ వీచికలఁదూఁగు
రాయంచ సనునె తరంగిణులకు
లలితరసాల పల్లవఖాదియై సొక్కు-
కోయిల సేరునే కుటజములకు
పూర్ణేందుచంద్రికా స్ఫురితచకోరకం
బరుగునే సాంద్రనీహారములకు
నంబుజోదర దివ్య పాదారవింద
చింతనామృత పానవిశేషమత్త
చిత్తమేరీతి నితరులఁ జేరనేర్చు
వినుతగుణశీల! మాటలు వేయునేల ?

సరస్వతి—(తనలో) నానాథుని పద్యమే యిది! కంఠమును నట్లేయున్నది. కాని మనుష్యునిబోలు మనుష్యులును, కంఠమును బోలిన కంఠములు నుండుట లోకసామాన్యమే. తగు నిదర్శనము లేనిదే నేనేమని యడుగఁ గలను.?

(ప్రకాశముగా) స్వామీ! నాకింకను నాభర్త రాఁగలడను నాశకలదు. ఈ పట్టణములో నొంటరిగ సంసారమును నిర్వహించుట కష్టముగనున్నది. మాబంధువులయూరి కేగుదమన్న నచ్చట నాబాలునకు విద్యయుండదు. దుష్టులకు నిలయమగు నిచ్చోట జాగ్రత్తతో మెలఁగవలసియుండును. నేను నిరంతరము భర్తృ నామసంస్మరణము గావించుచు నాయనకై కంటిలో వత్తినిడుకొనియెదురుచూచుచున్నాను.

ఉ. ఏమి వచింతుస్వామి! తుదియే గననట్టి దురంతదుఃఖమం
దామహనీయు పాదములయందె నిరంతరభక్తిఁ బూను చ
య్యో! మహితాత్మ! యిట్లు నిశయున్ బవలెంచక కుందుచుండ నె
ట్లీమన మూరడిల్లు వచియింపవె దీనదయాపరోత్తమా!

శ్రీచిదానందయోగి—సాధ్వీ! నీపతిభక్తి యగణ్యమైనది. నీసతీత్వము నిర్మలమైనది. కాని యీలోకమున దుఃఖములేనివారి నొక్కరిని వ్రేలుమడిచి చూపింపఁగలవా! ఏదో యొకవిధమున వగచువారే కాని నిత్యసంతుష్టులగు వారొక్కరును లేరు. తృప్తి లేనంతకాల మీదుఃఖ మిట్లే యుండును. నీయనురాగము పవిత్రమైనదయ్యు మోహరూపమైనదగుటవలన నీకు సంతాపహేతు వగుచున్నది. అందుచే మోహరహితమైన భక్తి యావశ్యకము.

ఉ. ఎందుల కీవిచారము సుఖించుటకే మనమయ్యేనేని నీ
యందలి మోహమున్ విడచి యాపతినామము బ్రహ్మముంగ నా
నందముతో భజింపుమది నవ్యసుఖంబిడుఁ దృప్తిఁ గూర్చుచున్
బొందుగఁ దత్త్వచింతనముఁ బూని యొనర్పుము ముక్తికై సతీ!

ఇటుఁ దడవయ్యెను. ఇఁక నేఁబోవలెను. (లేచి) రాగద్వేషము లీలోకమున సర్వదుఃఖముల కాకరమని నమ్ముము. ప్రజలు రాగద్వేష రహితముగ నెంతకాలము స్వీయధర్మముల నాచరింపరో యంతకాల మీదుఃఖము లోకమునకుఁ దప్పదు. ఏనాఁడెవ్వరికి రాగద్వేషములు నశించునో యానాఁడు వారికిఁ దృప్తియు నానందమును జేకూరుటయే కాక తత్పరిసరవాసులు గూడ సుఖింతురు. (దండకమండలములు గైకొని పోఁబోవును.)

సరస్వతి—స్వామీ! ఒక్కమాట సెలవిండు. అడుగఁగూడదు గాని మిమ్ములను లోకులేమని పిలుతురు?

శ్రీచిదానందయోగి—'శ్రీచిదానందయోగి' అని (ఈక్రిందిపాట పాడుచు నిష్క్రమించును.)

కస్త్వం కోఽహం కుత ఆయాతః కామే జననీ కామే తాతః
ఇతి పరిభావితనిజ సంసారః సర్వం త్యక్త్వా స్వప్నవిచారః ॥ భజగో॥

సరస్వతి—(స్వగతము) ఈమహర్షి నిజూచినఁ బరమానంద మైనది. నానాథుఁడేమో యని భ్రమకూడఁ గలిగినది. కాని నాపతి కెడమ చేతి చిటికినవ్రేలిపై నొకమచ్చగలదు. అది చిన్నప్పుడు చాకుతోఁ దెగి నదఁట. ఆయానవాలుచూడనైతిని. చూచుట కెట్లు సాహసింపఁగలను. శాంతరసమును వైరాగ్యభావమును వర్షించు నామహా తేజము నెదుట ననిర్వాచ్య తన్మయస్థితిచెందితిని. చక్కఁగ మాటలాడ నోరురాదయ్యె.

ఈయన యుపదేశము నామనశ్శాంతికి సాధనము కాఁగలదు. నేను వేదాంత పరిచయము గలదాననయ్యు నింతకాలము రాగపూరితముగనే బ్రహ్మానంద నామ ముచ్చరించుచుంటిని. ఇఁకనుండియు బ్రహ్మానందభావముతోడనే బ్రహ్మానంద నామోచ్చారణము సేయుదును.

(పరిచారిక వచ్చినిలిచి యుండును.)

అయ్యో! ఎవరో నాకై వచ్చి వేచియున్నారు. ఈభావపరంపరలో నేను జూడనైతిని. (ప్రకాశముగా) ఓహో సూరమ్మగారి యింటఁ బనిచేయుచున్నదానవా! ఏల వచ్చితివి?

పరిచారిక—అమ్మా! యేదో ఆలోచిస్తూన్నట్టున్నారు. సూరమ్మ గారొక్కమాఱు మిమల్ని రమ్మన్నారు. మీతో ఏదో అవసరమఁట. ఇప్పుడే పోవచ్చునన్నారు. అబ్బాయిగారింట్లో లేరేమో! తాళమేసిరండి.

సరస్వతి—సరియే. వచ్చెదనని చెప్పు. పో.

పరిచారిక—చిత్తం (నిష్క్రమించును)

సరస్వతి—(తనలో) కుడికన్నదరుచున్నది. పొరుగింటిలో నేమి యిక్కట్టు సంభవించును? ఆయోగిమూర్తిని మనమున నుంచుకొని శాంతభావముతో నేగెదను.

(నిష్క్రమించును.)

---

# శ్రీ చి ద్వి లా స ము



## తృతీయాంకము.

[సూరమ్మ యింటియెదుటఁ బరిచారిక ప్రవేశించి]

పరిచారిక (స్వగతము) పాపం. సూరమ్మ పిలిచిందని ఆసరస పతొమ్మగోరిని పిలిచొచ్చా, అమాయకురాలు. నమ్మిందినామాట. ఈసూరమ్మ చెడ్డముండని ఆమె కేందెలుసు. ఈకందర్పంగారి నిక్కడఁ బ్రవేశపెట్టి సూరమ్మ చల్లంగా జారిందెక్కడికో. ఇతగాఁడు పెద్దపులి లేడిపిల్లకోసం పొంచున్నట్టా సరసపతమ్మకోసం యింటో దాక్కున్నాఁడు. ఇదంతా చెప్పబుద్ధయిందామెకు. కాని చెపితే తేపు నా ప్రాణం దక్కదుకా. పొట్టకూటికోసం ఏగడ్డయినా తినాలె నాబోట్టి పేదముండలు. ఏంచేసేది. నన్ను గూడా యెక్కడికైనా పొమ్మన్నాఁడే చచ్చినోఁడు పోకతప్పదు. ఆసరసపతమ్మగారు దేవతామడిసి. ఆమెను దేవుఁడే రచ్చించాలె. (పోవును)

ఇది ప్రవేశము.

---

[సరస్వతి ప్రవేశించును]

సరస్వతి—(స్వగతము) అనుకొన్నంతయినది. ధర్మారావుగారు చెప్పినది నిజమే. ఆకందర్పరావు వాక్యములుగాని యాతని వాలకము గాని నాకెంతమాత్రము నచ్చలేదు. ఆయన వినయముతోనే ధూర్తత్వము గోచరించినది. అతివినయము ధూర్తలక్షణముగదా! ఇఁక నేమిచేయుదును. (ఆలోచించి) చేయున దేమున్నది. పారము

మానుటయే శరణ్యము—కారణము...నామనస్సునకు సమ్మత
ముగ నుండకపోవుటయే ! (ఆలోచించును)

అహో ! ఆలోచనఁజేయుచు నీ సూరమ్మ యింటియెదుట
వీధిలో నిలుచున్నాను. ఇంటఁ బంచలో నెవ్వరును గన్పింపలేదు.
లోపలికేగి చూచెదను. (ముందునకుఁ బోవును. కుర్చీపైఁ గందర్ప
రావు కూర్చుండియుండును. సరస్వతి యులికిపడును.)

కందర్పరావు—(లేచి ముందుకువచ్చి) ఆగుము. సరస్వతీ ! నేనే నిన్ను
బిలిపించితి. సూరమ్మ యింటలేదు. ఆమె పేరు పెట్టినఁగాని రావని
యిట్లుచేసితిని. ఆమె మా బందుగురాలు సంశయింపఁబనిలేదు.
కూర్చుండుము. కుశలప్రసంగము గావించిపోవచ్చును.

సరస్వతి—నే నిక్కడ నొక్కక్షణమైన నుండను. (పోఁ బోవును.)

కందర్పరావు—అయిన నీవు వెళ్లుటకు వీలులేదు. తలుపులు బంధింపఁ
బడినవి. కొంచెము నాతో సంభాషించి వెళ్లవచ్చును.

సరస్వతి—(తనలో) ఓహో ! ఈ దుర్మార్గుఁడేదో యకార్యము చేయఁ
దలఁచినట్లున్నది. త్వరపడఁగూడదు. (ప్రకాశముగా) నాతో
మీ కేమిపని ?

కందర్పరావు—అన్నిపనులును నీ తోడనే గలవు. నిజముదాపనేల.
నిన్ను జూచినప్పటినుండియు నామన మెట్లోయున్నది. నీ స్థితికి
జాలినొందితిని. నా సర్వస్వము నీ యధీనము చేయఁదలఁచితిని. నా
జీవము నీయుమన్నను నిచ్చుటకు సిద్ధముగా నున్నాను.

సరస్వతి—నీ మాటలు నా కర్థమగుటలేదు.

కందర్పరావు—ఏల నన్ను బయలఁబెట్టెదవు. తేటతెల్లముగఁ జెప్పు
మందువా ?

ఉ. ఈదురవస్థయేల సుదతీ ! కసిగందును నీదుమేను సం
పాదనకై శ్రీమల్ పడఁగఁ, బాలనసేయుదువేని నన్ను నీ

పాదములం దనంతముగ వచ్చిపడున్ ధనరాసు లుచ్చ సౌ
ఖ్యాది మహార్హ భోగముల నందుదు వీవు క్షణంబులోపలన్.

సరస్వతి—అహో! తెలిసినది నీ దుర్బుద్ధి. ఆలుబిడ్డలుగలవాఁడవే. పాతివ్రత్యధర్మముతో జీవితమునంతయు వెళ్లఁబుచ్చు నేనే నీకు గోచరించితినా!

ఉ. అన్న! యిదేటిన్యాయము దురంతముగాదె యిటుల్ వచింప నీ
కన్న కుమార్తెఁగాగ ననుగావుము ధర్మము రక్షసేయు నీ
వెన్నఁగ నాఁడుతోఁడు గనవే భవదీయపదంబులంటి నేఁ
గ్రన్నన మ్రొక్కి వేఁడుదును గావుము నాదు సతీత్వధర్మమున్.

నీ కామోపభోగమునకు లోకమున నెందఱేని యంగనలు లేరా! నన్ను విడువుము. నీకుఁ బుణ్యముండును.

కందర్పరావు—సుదతీ! నామనస్థితి నే నిప్పుడు నీకువర్ణింపఁజాలకున్నాను. నీ మేని చకచకలు నన్ను లోఁగొనినవి. ఇఁక నన్ను రక్షింపను శిక్షింపను నీవే సమర్థురాలవు. నీవు నిరాకరించినచో నాక్షణమే నేను బ్రాణమును వీడుదును. అప్పుడు నీకు ఘోరబ్రహ్మహత్యాపాతకము సంభవించును.

సీ. తనుమధ్య నీరూపు గనినది మొదలుగ
మఱియొక దెసఁజూపు తిరుగదయ్యె
సరసాంగి నీమేని చకచకల్ గని మనం
బుఱికె నీపయినెటు మరందయ్యె
జలజాక్షి నీనేత్రచాంచల్యమునఁ జిక్కి
బుద్ధియెయ్యెడకును బోవదయ్యె
కనకాంగి నీయంగమున హత్తి నాచిత్త
మందె లీనంబయి యందదయ్యె

గీ. అమల శశిబింబవదన! నీహాసచంద్రి
కా ప్రవాహంబునందు మగ్నమయిపోయె
నాదు జీవంబు నీవు నన్గావవలయు
జాల మింకేల! నన్నేల లోలనయన!
నన్ను రక్షింపుము. (చేయి పట్టుకొనును)

సరస్వతి—(చేయి వదలించుకొని) ఈమేనఁ బ్రాణములుండ నీ శరీరము నీకుఁ దక్కదు. నీవు ధనమత్తుఁడవే కావచ్చును. ఈ పట్టణములో ముఖ్యులెల్లరు నీ స్వాధీనులే కావచ్చును. కాని నామనసును నిర్బంధింప నెవ్వరికిని సాధ్యముగాదు. (కోపముతోఁ గంపించును.)

చ. ఇదె వచియింతుఁజూడు స్పృశియింపకు నన్ను బరాంగనేచ్ఛచే
మదమరి కూలినట్టి యమమందిరవాసుల రావణాదులన్
హృదయములో నెఱుంగు, మతిహీనుఁడవౌచు సతీత్వ ధర్మమున్
జెదఱుపఁ జూతువేని యడె చెల్లుదు పీవును ధర్మచిత్తుఁడా.

కందర్పరావు. ఈ పురాణగాథలన్నియు నేనెఱుఁగనివిగావు. స్వార్థపరులు రచించిన పురాణములు నందలి ధర్మములును మాకుఁ బ్రమాణములుగావు. పరోపకారమే యీశరీరమునకుఁ బరమధర్మము. ప్రాణముపోయిన తరువాత మోక్షమునకై పెనఁగులాటలు పూర్వాచార పరాయణులవి. మాకు సుఖమే పరమావధి. కావున నాలస్యము చేయక నీయంగీకారమును దెలియఁజేయుము. మాయింటనుండిన సర్వము నీయధీనము. నా మోహినియుఁ దత్పరిచారికలు నీకు దాసులు. లేదా! వేఱుచోటనున్నను నాభాగ్యమంతయు నీపాదములకడకుఁ బరువెత్తివచ్చును. ఇఁక సంశయమేల? (కౌఁగిలించుకొన మీఁదికేఁ బోవును)

సరస్వతి—తప్పించుకొని యావలికిఁ బోవును.

కందర్ప——నీవిట్లు తప్పించుకొనఁజాలవు. నేఁడు నీవు నాస్వాధీనమయినఁ గావలెను. లేనిచో నాహంతకులచేతఁ జిక్కి నీవును నీకుమారుఁడును హతులైనఁ గావలయును, చూడుము.

ఉ. నాకుఁవశుల్ గఠోరులు గనన్ యమకింకర తుల్యశౌర్యులే
సాకుననైనఁ బ్రాణములఁజక్కఁగఁ దీయ సమర్థులెందఱో
చీఁకును జింతలేకయె నిశిన్ బవలున్ దిరుగాడుచుండ్రు న
న్నాకుల పెట్టకింక వశురాలవుగమ్ము కురంగలోచనా!

సరస్వతి——(తనలో) ఈ దుర్మార్గుఁ డెంతకైనను జాలినవాఁడుగఁ గన్పట్టుచున్నాఁడు. ఇక్కడనాకు దిక్కెవ్వరును లేరు. ప్రస్తుత ముపాయముచేఁ దప్పించుకొనవలెను. తరువాత ధర్మారావుగారితో నాలోచింపవచ్చును. (ప్రకాశము) మీయభిప్రాయ మిప్పుడేగదా! నాకుఁ దెలిసినది. మనస్తిమితముగాఁ గూర్చుండి నాలో నేనాలోచించుకొనవలదా! అందులకు సాయంకాలమువఱకు నాకవకాశ మీయవలెను.

కందర్ప——దారికి వచ్చుచున్నావు. అటురమ్ము. ఆలోచనకేమున్నది. దుఃఖజీవనమును దరిద్రజీవనమును వర్ణించి మహాభోగముల ననుభవింపుమనుచున్నాను గాని నేనేమి కొండకట్టెలును కోనేటినీళ్లును మోయుమనుచున్నానా! నీవు నిజముగ నేమహారాజునకో భార్యవు గావలసినదానవు. ఈనవయౌవనము నింతవఱకు వ్యర్థముచేసితివి చాలదా!

సరస్వతి——నాకవకాశము కావలెను. నీవేమిచేసినను సరియే. అవకాశములేనిది నిర్ణయింపఁజాలను. సాయంకాల మూఁడుగంటల కిక్కడికే వచ్చి చెప్పఁగలను.

గీ. ఉరిని దీయంగఁబోయెడు తటినినైన
మనుజునకు నిత్తురవకాశమును దదీయ
వాంఛితము దీర్తు రీవు నావంతఁజూచి
యించుకేనియు నవకాశ మీయవలదె.

కందర్ప—నేను మూర్ఖుఁడనుగాను. ఇచ్చితిని గడువిచ్చితిని. కాని ఇదిగో! ఈయూరి రక్షకవర్గమంతయు నాయధీనము. నీవు వారితో మొఱపెట్టుకొందువేమో! వారు నిన్ను రక్షింపఁజాలరు. ఇందె వ్వరును నీకు దిక్కులేరని యెఱుంగుము. పాఱిపోవుట కవకాశము లేదు. నాయనుచరులు నిన్ను గనిపెట్టియుందురు. దాఁటి పోనీ యరు. వెఱ్ఱిప్రయత్నముఁ జేసి కీడుఁజెందక శీఘ్రమే యంగీకరిం పుము. పొమ్ము. (సరస్వతి పోవును.)

కందర్పరావు (తనలో) స్వాధీనకావచ్చునని తోఁచుచున్నది. అయి నను సాయంకాలమువఱ కీ మదనతాపము నెట్లు భరింతును? నాయింటి కేగి యెట్లో వేఁగుదును.

(నిష్క్రమించును. తెరపడును.)

---

## ద్వి తీ య రం గ ము

---

[ధర్మారావు గృహము. ప్రవేశము—ధర్మారావు కుర్చీలోఁగూర్చుండి]

ధర్మా—(స్వగతము) ఆహా! ఆపిశాచి యెంతయైనఁ జేయఁగలదు. దాని మగఁడు దానిచేతిలోఁ గీలుబొమ్మ. అది యూరివెంటఁ దిరిగి యందఱకును జెప్పి యన్నప్రకారము చేయింపఁగలదు. ఈసాయంకాలమే దానికిఁ బ్రత్యుత్తరము కావలెనఁట. 'అత్యా రూఢోహినారీణా మకాలజ్ఞోమనోభవః' అన్న కాళిదాసోక్తి

వ్యర్థముగాదు. దానికి యుక్తాయుక్తవివేచన మెక్కడిది? ఉద్యోగ ముతోఁబాటు ప్రాణముగూడఁ దీయించునఁట. దానిచేతిలో నెవ రైన హంతకులుగూడ నుండి యుండవలెను. కానిమ్ము. ధర్మమే శరణ్యము. పరమేశ్వరుఁడే రక్షకుఁడు. ఉద్యోగమునకై మఱియొక యూరున కేగెదను. ఱేపే ప్రయాణము. నేఁడే యిక్కడ రాజీ నామా నిత్తును. (ఆలోచించి) సతియుఁ బ్రహ్లాదుఁడును నొక యోగిని దర్శించెదమని నన్నడిగి వెడలి యింకను రారైరి. ఱేపు నేనీయూరు విడువకముం దామహాత్ముని దర్శింతును. ఆయన మహిమను బ్రజలు వేనోళ్లఁ బొగడుచున్నారు. ఆయోగివర్యుని యుపదేశమునఁగాని నాకు మనశ్శాంతి చిక్కదని తోఁచుచున్నది.

అదిగో! సరస్వతి వచ్చుచున్నది. ఆమెముఖ మేలనో చిన్న వోయి యున్నది. ఆమెకుఁగూడ నాకువలెనె యిక్కట్టు రాలేదుగదా!

ఉ. సత్యము సత్యమంచు బుధసంతతి చాల స్తుతింతురయ్యయో
సత్యపథాను యాయులకు సంభవిలున్ గడగండ్లు పెక్కు లా
యత్యధికార్తి కెప్పుడో యిహంబుననో పరమందొ సౌఖ్యముల్
సత్యముగా లభించునఁట సందియమయ్యెడుదాన నామదిన్.

(సరస్వతి ప్రవేశించును) సరస్వతీ! రమ్ము. అదేమట్లున్నావు.

సరస్వతి—మీరేమో యాలోచనలో నున్నట్లున్నారు. పాఠశాల కేగలేదేమి? అస్వస్థులుగ నున్నారా!

ధర్మా—కొంచె మస్వస్థుఁడఁగానే యుంటిని. నీవో?

సరస్వతి—మీరన్నంతయైనది. ఆదురాత్మునింటఁ బాఠమువలన నామానప్రాణములకుఁగూడ హాని సంభవించునట్లు తోఁచుచున్నది.

ధర్మా—ఆ! ఏమది! శీఘ్రముగఁ జెప్పుము. నిన్నాతఁడేమైనఁ జెన కెనో? నాకావేశము గల్గుచున్నది.

మణి

# లక్ష్మీసహస్రము

(మచ్చుతునకలు)



## మంగళస్తబకము

కం. మంగళకరముల కెల్లను
మంగళకర మైనదనుచు మన్నించెద రే
మంగళదేవత నయ్యెడు
పుంగవుభాగ్యంబు నెల్లప్రొద్దుఁ దలంతున్.

తే. గీ. ఎందు నైనను నీయంశ మించుకున్న
గడ్డిపరకయు మిగుల మాంగళ్య మొందు
శ్రీఫలము శ్రీతృణం బని చెలఁగునట్టి
బిల్వదూర్వాదులే దీని వెల్లడించు.

ఉ. వర్ణగణాదిదోషపరివారమహాజలరాశి నుండి యు
త్తీర్ణ మొనర్చునంచు భవదీయశుభప్రదవాచకంబు ను
త్కీర్ణ మొనర్చుచుందురు తదీయకృతిప్రముఖస్థలంబులం
దర్ణవరాజరాజతనయామణి తత్కవిశిల్పకారకుల్.

ఉ. నీచరణాబ్జసేవఁ బ్రతినిత్య మొనర్చుటచే నమంగళా
శౌచయుతశ్మశానమున స్థాణువు నెప్పుడు నొందికూడ శీ
తాచలరాట్కుమారిక సుధాబ్ధికుమారిక సర్వమంగళా
వాచక మొందె నన్న తెలుపన్ వలెనే యిఁక నీ మహత్త్వమున్.

సీ. పావనుం డగు సుధావారాశి జనకుండు
కౌస్తుభాదులు శుభంకరు లనుజులు
దివ్యమంగళదేహ దేవాదిదేవుండు
భర్త శ్రీకార మొప్పారు పేరు

క్షేమంకరుఁడును ఛందోమయుం డగు పక్షి
వాహంబు పద్మంబు వాసగృహము
భద్రంకరుండైన బ్రహ్మదేవుఁడు పుత్రు
డాగమాంతంబు విహారభూమి

తే. గీ. ఇట్టి మాంగళ్యపరివార మెపుడు నొంది
యలరు మంగళదేవత వైన యట్టి
నీదు మాంగళ్య మేరు వర్ణింపఁ గలరు
భద్రపరివార ! అఖిలసంపద్వికార !

ఉ. మంగళవస్తురూప వవమాన మొనర్చిన నిన్ను నెంత యు
త్తుంగధనాళితోడఁ దులతూఁగుచు నున్నను కూడు గుడ్డ లే
కం గడుఁ గుందు ; ము న్నధికగర్వముచే మునిదత్తపుష్పమా
లం గరికంఠమం దిడి తలంగెఁడె యింద్రుఁడు స్వర్గభూతికిన్.

తే. గీ. అరయఁ గుజనుఁ డమంగళకరుఁడు మూఢుఁ
డయ్యు దలఁచుగ నీయనుజుఁ డైన చంద్రు
సంగతిం జేసి యెప్పుడు మంగళాఖ్యుఁ
డగుచును బుధాగ్రగణ్యుఁ డౌ నహహ ! జనని !

తే. గీ. అంబ ! కూత్పత్తిమూలమా నబ్జనాభు
చరణకమలంబు నీశుభకరపు మేళ
నంబునఁ గపాలికిని శివత్వంబుఁ గూర్చు
నట్టి త్రిజగత్పవిత్ర జాహ్నవినిఁ గనియె.

తే. గీ. అంబ ! నీ రూపుతో సవర్ణంబుఁ గనుట
భద్రకర యగాచుఁ దనరి హారిద్ర సతము
సుతులకు సుమంగళత్వం బొసంగు నన్న
నీదు మాంగళ్య మేమన నేర్చువాఁడ.

మణి

# లక్ష్మీసహస్రము

(మచ్చుతునకలు)



సౌందర్యస్తబకము

తే. గీ. తల్లి! కనులకుఁ జెవుల కద్వైతభావ
మొనరి నాలుకకును ద్వైత మొనరునెడల
నీనిరుపమావయవరామణీయకమ్ము
నేను వర్ణింపఁగాఁ గొంత నేర్తు నేమొ!

కేశవర్ణనము

ఉ. ఎంతయు నీవు నొదల వహించిననున్ మధుపౌఘమైత్రి న
త్యంత మొనర్చు నౌర! చికురావళి; తల్లిరో! యిది యుక్తమా
నెంతగ నెత్తిఁ బెట్టుక సహించిన నమ్మలినైకసఖ్య మా
వంతయు వీడకుంట కుటిలాత్మ్మల నైజగుణమ్ము కావునన్.

తే. గీ. చామరము నీదు కేశపాశంబు తోడ
సామ్యమునుఁ జెప్ప నెట్లు? శ్రీశౌరిచేత
ప్రస్తుతులఁ గొన్న దిది తల్లి! పశువుచేత
నైనను పురస్కృతినిఁ బొందనట్టి దద్ది.

మ. సుమనస్తోమముతోడ నాహరి మనస్సుం గూడ నీ కేశపా
శమునం గట్టెద వీవు కావుననె విస్తారంబు నామోదపూ
రమునుం బొందెడు నమ్మనం బెపుడు నోరాజీవసంవాసినీ!
గమనింపన్ గుణవత్సహస్థితి గుణగ్రామంబుఁ జేకూర్చ దే.

ఉ. లోకములోన నెచ్చట విలోకముఁ జేసినఁ జెట్టు నెప్పుడున్
మేకొనియుండి పుష్ప మటుమీఁద శలాటుఫలస్వరూపముల్
చేకొనుఁ జెట్టునుండి వెలిఁ జెందియుఁ ద్వత్కచసీమ మెట్టుటన్
నాకకుజప్రసూనము లహో! సఫలత్వము నందె శ్రీసతీ!

ఉ. అమ్మరో! భృంగపంక్తి త్వరయాగతి నీపరిణేత్రనాభిప
ద్మమ్మును వీడి సంతతముఁ దావుల నెంతయు గుమ్మగుమ్మనన్
గ్రమ్మఁగఁజేయు నీ చికురరాజినిఁ జేరెడు నిద్ది యుక్తమా
నమ్మధుసూదనుండు మధుపంక్తుల కెట్టు లభీష్టుఁ డయ్యెడున్.

చం. నలువుగ ముంగురుల్ చెదరి నాట్యమొనర్ప మనోహరమ్ముగన్
జెలగెడునట్టి నీ యలికసీమ పయోదధినుండి భూమికిన్
గలిగెడువేళఁ జుట్టుకొను నాచునుఁ గూడిన బాలచంద్రుగాఁ
దలఁచెద రెల్లవారును సతమ్మును నిందిర! పద్మమందిరా!

మ. స్థిరమౌ నట్లు తమస్సమూహములతో స్నేహంబుఁ గావించి యం
బరమందున్ తోలుమబ్బుతోడ నవినాభావంబునుం బొందుచోఁ
బరిపూర్ణంబగు చంద్రబింబ మఖిలాంబా! నీలకేశాతి సుం
దరమౌ నీ వదనమ్ముతోఁ గడుసమానంబై విరాజిల్లెడున్.

ముఖవర్ణనము

తే. గీ. నదవనజ మమ్మరో నీదు వదనజన్మ
మొందఁగ మహాతపంబున యందు నిష్ట
నెంత తలక్రిందులై తపియించిన జన
వదనమే యగుఁ గాని త్వద్వదన మగునె!

చం. అరయఁగ నబ్జుఁ డబ్జముఁ ద్వదాననశత్రులె యైన వారి కొం
డొరులకు మైత్రి లేమిఁ గడు నోటమి నొందిరి, ధాత్రిలోఁ బర
స్పరము విరోధులై నెగడు వారు మఱెందరొ యైన నేమి యొ
క్కరుని జయింపఁ గూడ సరికారుగదే! భువనైకసుందరీ!

చం. జనని! త్వదాస్యకాంతి ధనసంచయచోరుఁడు చంద్రుఁ, డేమనన్
వనజగృహమ్ము తల్పుగడె వైచుక నీవు శయించువేళలన్
బనివడి సంచరించుచుఁ గవాటము నీ వెడయించ వేగ నా
యినుఘృణులందొ అస్తకుధరేంద్రవనమ్ములయందొ దాగెడిన్.

# స్వవిషయము



కడచిన వేసవిలో నా దేహమున ననారోగ్యము కలిగినందున, జూన్ జూలై సంచికలు జూలై ఆగష్టు నెలలోగాని ప్రకటింపఁజాలనైతిని. ఈలోటు కూడదీయుటకు ఆగష్టు సెప్టెంబరు నెలల రెండు సంచికలును కలిపి యేకముగా పదిఫారముల సంచికగా ప్రకటించితిని. నాటకము; నవల యీరెండును రెట్టింపుగా నిందు ప్రకటింప బడుటచే నిది చదువరులకు కూడ సౌకర్యముగా నుండును. ముందు ముందుకూడ నిట్లే రెండు నెలలకొక రెట్టింపుసంచిక ప్రకటించినచో చదువరుల కుపయోగముగా నుండుటయేగాక, టపాకూలి మూడు రెట్లుయిన యీరోజులలో రెండుసంచికలేకము చేయుటచే కొంత టపా కూలికూడ తగ్గును గావున మాకును కొంత యుపయోగముగా నుండునని తలఁచి యున్నాను. చదవరులిందుకు సంతసించి సమ్మతింతురని నమ్ముచున్నాను.

ఈ సంచికతో 6 నెలలు పూర్తి అయినవి. కావున పోషకులును చందాదారులును తమతమ విరాళములును చందాలును M. O పూర్వకముగా యీ సెప్టెంబరునెల గడచులోపల మాకు పంపించగలందులకు ప్రార్థించుచున్నాము. మేము V. P. చేసినచో మూడణాలు అదనముగా టపాకూలి యగును. ఈ నెలాఖరులోగా పంపకుండనిచో ముందు సంచిక V. P. చేయుదుము గావున తప్పక స్వీకరింపగలరని నమ్ముచున్నాను.

సంపాదకుఁడు

గ్రంథస్వీకారము

# మరణానంతర సందేశములు

గ్రంథకర్త:

రావుబహదూర్ ఎం. నరసింహంపంతులు బి. ఏ., బి. ఎల్.,

రిటైర్డు డిస్ట్రిక్టుకలెక్టర్

అండ్

మెంబర్ మెడ్రాస్ పబ్లిక్ సర్వీస్ కమీషన్.

గారిచే రచింపఁబడినది.

ఇదివరలో 1924 సంవత్సరమున "మరణము—భువర్లోకము" అను పేరున మరణానంతర జీవితమును గురించి యొక చిన్నపుస్తకమును శ్రీ పంతులుగారు రచియించి ప్రకటించి యున్నారు. అందు యూర్ధ్వ లోకములనుండి యందుకొను సందేశములను గూర్చి కొంచెముగా వ్రాసియున్నారు.

1933 సం॥లో శ్రీపంతులుగారు పాశ్చాత్య దేశములకేగినపుడు, ప్రత్యక్షముగా గొన్ని సందేశముల నందుకొనుటయు నచటి శాస్త్ర వేత్తల పరిశోధనల గూర్చి యెక్కుడుగా దెలిసి కొనుటయు ప్రాప్తిం చుటచే యీవిషయమును గూర్చి యిపుడు ప్రత్యేక గ్రంథమును ప్రకటించినారు.

ఇందు మనమెన్నడు కనివిని యెఱుంగనట్టియు మిగుల నద్భుత మైనట్టియు మనము తెలిసికొనదగినట్టియు విషయములు పెక్కులు గలవు.

మరణానంతర విషయములను గూర్చి మన శాస్త్రములయం దున్నవిషయములకును నిందలి విషయములకును భేదము కలదు కాని శాస్త్రపరిశోధనలచే నిందలి సంగతులు పరిక్షింపఁబడినవి గావున పలువురు యీగ్రంథమును చదివి భువర్లోక శాస్త్రమును గురించి తెలుసు కొందురుగాక. దీనివెల పదణాలు మాత్రమే.

సంపాదకుఁడు.

# మహేశ్వరీ అర్ధశతి



విద్వాన్ పాలెపు వెంకటరత్నము

శా. ఆనందామృత వీచికానికర మధ్యస్థాబ్జసంవాసినీ!
వీణాపుస్తక కీరధారిణి! మహావేదాంత సంచారిణీ!
మాణిక్యాంచిత హేమభూషణి! మహామౌనీంద్ర సంపోషిణీ!
వాణీ! కైకొనుమమ్మ నీకిదె; నమోవాకంబు మాహేశ్వరీ! 1

మ. సిగపై బాలశశాంక రేఖ; నుదుటన్ సిందూరనామంబు; పొం
దుగ హస్తంబుల వీణకీరమును సంతోషమ్ము నన్మోముపై
నగవుంగల్గి మనోజ్ఞరాగముల వీణావాద్యముం జేయు నీ
నిగమాత్మాకృతి నెప్డు నామనమున న్సేవింతు మాహేశ్వరీ! 2

మ. నిజభక్తావన దీక్షఁగైకొనిన నీ నిర్వ్యాజకారుణ్యముం
గుజనుల్ కొందఱు కానలేక మదిసంకోచంబు లేకుండఁగా
నజపోతంబులఁ గుక్కుటంబులను గ్రౌర్యంబొప్ప ఖండింతురా
యజపోతాదులు నీకు తృప్తి నిడునమ్మా! దేవి! మాహేశ్వరీ. 3

మ. నను గాపాడఁగదమ్మ! దేవి! మృదుగండన్యస్త కస్తూరికా
ఘనసారాంకిత! దివ్యరత్న విలసద్గ్రైవేయ హారావళీ!
ఘనబిల్వద్రుమమధ్య సంచరణసక్తా! శ్రీమణిద్వీపవా
సిని! సంధ్యానటనైకలోక! హరిణాక్షీ! కాళి! మాహేశ్వరీ! 4

శా. నీరూపమ్మతి సూక్ష్మమంట; యణువై నీవారసూకంబునం
దారూఢమ్మయి యుండునంట, జగదంబా! నీదులోకావన
ప్రారంభంబు నుతింప నీనరులకౌనా? దేవిరో! దివ్వెచే
నీరేజాప్తునిఁ జూపుచందముగదా? నిక్కంబ మాహేశ్వరీ! 5

మ. హిమవింధ్యాద్రులె మూర్ధజంబులుగ తల్లీ! జాహ్నవీ! గౌతమీ
యమునా దివ్యస్రవంతులే యురమునన్ హారాళిగా వార్ధిధా
నమె నీదౌ మొలనూలుగా నుసులెరత్నవ్రాతమై, నీశిరో
జములందొప్పఁగఁబొల్చు నిన్నుఁగన నుత్సాహంబు మాహేశ్వరీ!

శా. ప్రాలేయాచలపుత్త్రి! నీవు కరుణాపారీణవై జూచినన్
లీలన్విద్యలు సర్వమున్ వశములౌ; లేకున్నఁ గొంతేని వి
ద్యాలేశమ్మును లేక హీనకులజుండై యుండు మూఢాత్ముఁడౌ
కాళీదాసున కెట్లు విద్య కలిగెం గల్యాణి! మాహేశ్వరీ! 7

మ. శరణంచు న్నిను వేడి సంతతతపస్సంధాన చేతస్కుఁడై
నిరతిన్నీపదకంజసేవనమె నిర్నిద్రాత్ముఁడై జేయుచున్
వరదేశోద్ధరణైకదీక్ష జరియింపన్ శక్తి నర్థించు నా
యరవిందాహ్వయుఁ నోముచుండవె సహాయంబిచ్చి మాహేశ్వరీ!

శా. ఆకాశంబున నీలమేఘచయ మధ్యస్థంబు; నత్యంత శో
భాకృత్కాంతి సమన్వితంబు; జనవిభ్రాంతి ప్రదంబున్ లస
చ్ఛ్రీకంబైన తటిల్లతాసముదయ శ్రీ గాంచి భావంబునం
దోకల్యాణి! త్వదీయదృక్కలనినే నూహింతు మాహేశ్వరీ! 9

మ. పరమామ్నాయములెల్ల నెచ్చెలులుగా; బ్రహ్మాదులౌ దివ్యు లె
ల్లరు నీభృత్యులుగా, ధరాతలము సర్వంబున్ భవత్పీఠిగా
సురసంచార పథంబె ఛత్త్రముగ; నీశుంభత్ప్రతాపంబునన్
ధరఁ బాలించెడుమూర్తి నామదిని సంధానింతు మాహేశ్వరీ! 10

---

మణి

# (మగ) పంతులమ్మ



రంగము 1.

స్థలము : వీధి ; ప్రవేశము : విశ్వనాథము, రామచంద్రరావు చెఱియొక ప్రక్కనుండి.

రామ—ఏమోయ్! విశ్వనాథం, ఏమిటి మహా హడావిడిగా వెళుతున్నావు? ఏం కథ?

విశ్వ—ఓహో! రామచంద్రమా! బహుకాలదర్శనం. స్కూలుకి వేళయిపోయింది. అందుకోసం తొందరగా వెళుతున్నా.

రామ—ఎక్కడైనా వుద్యోగంలో చేరావా యేమిటి? ఆమధ్య ఎవరో ఏమీ లేదన్నారే.

విశ్వ—అంతా నెలరోజులు నుంచిలే. మొన్నటిదాకా నువ్వన్నట్లు నిరుద్యోగ డిపార్టుమెంటులోనే వుండేవాణ్ణి.

రామ—అయితే, ఎందులో మాష్టరీ? యాక్టింగా? పెరమనెంటా?

విశ్వ—ఆక్టింగే నోయ్. మునిసిపల్ గరల్సు ఎలిమెంటరీ స్కూల్లో హెడ్‌మిస్ట్రెస్‌గా యాక్టు చేస్తున్నాను.

రామ—అదేమిటి? నీ వుద్యోగాన్ని బట్టి జెండరు మార్చేసుకున్నావా యేమిటి?

విశ్వ—మరే! అంతేకాదు. నాకు ఆఫీసునుంచి వచ్చే టపా అంతా, టు ది హెడ్‌మిస్ట్రెస్ అనే ఎడ్రసుతోనే వస్తూవుంటాయి.

రామ—ఎడ్రసు ఎలా వుంటేనేం లెద్దూ. జీతప్పురాళ్లు నాలుగూ నెల నెలకీ జేబులో పడుతూ వుంటే చాలు. అయితే, ఎల్లా సంపాదించావు ఈ వుద్యోగం?

విశ్వా—దాని కంతా వుందిలే. అసలు పెరమనెంటు హెడ్‌మిస్ట్రెస్ మా ఆవిడ. ఆవిడ పురిటికోసం మూడు నెలలు సెలవు పెట్టింది. ఆసందర్భంలో ఎందుకైనా మంచిదని ఒక అప్లికేషను పారేశాను. నా క్వాలిఫికేషన్సును బట్టి నా క్లెయిమ్సు ఓవర్‌లుక్ చెయ్యకుండా నాకీ వుద్యోగం ఇచ్చారు.

రామ—ఈరోజుల్లో క్వాలిఫికేషన్సు ఎవడికి కావాలి గాని, ఏమిటి నీ క్లెయిమ్సు ?

విశ్వా—అసలు క్లార్కు మావాడు. వాడి రికమండేషను ఒకటి. నేను గ్రాడ్యుయేటు నవటం రెండు. ఇంతకంటె మించినది, లీవు పెట్టిన కాండిడేటుకి వర్సు హాఫుని. (worse half)

రామ—అదేమిటి ? తమాషాగా మాట్లాడుతున్నావే. వర్సుహాఫ్ ఏమిటి ? బెటర్‌హాఫ్ అనా యేమిటి ?

విశ్వా—బెటర్‌హాఫ్ అనే పదం ఆడవాళ్లకి వుపయోగిస్తారు. బెటర్ హాఫ్‌కి ఆపోజిట్ జెండరు వర్సు హాఫ్, అదీగాక—

రామ—సరి, సరి! స్కూలుఫైనలులో చదివిన నెస్‌ఫీల్డు గ్రామరు పూరికే పోయింది గాదు. ఇంకా ఢేమిటి చెప్పబోయావు ?

విశ్వా— నావైఫు నాకు బెటర్‌హాఫు. నేను నా వైఫుకి వర్సుహాఫుని. ఎంచేతనంటే, నా వైఫు సంపాదిస్తోంది. నేను కాళ్లు సాచుకుని కూర్చున్నాను. మా ఆవిడకంటే నేను వర్సు కాదూ ?

రామ—బాగా వుంది నీ వ్యాఖ్యానం. అయితే ఎంత జీతం ?

విశ్వా—అసలు ఆవిడకు ముప్ఫయిరూపాయలు. ఆవిడకి ఫుల్‌పేమీద లీవు గ్రాంటు చేశారు. నేను ఆక్టింగు. అదీగాక అన్ట్రెయిండుని. అంచేత నాకు పదిహే నిస్తున్నారు.

రామ—కొట్టూ, ఇంకనేం. చదువుకున్న పెళ్లాం వుండటం ఎంత మంచిదో చూశావా? (నవ్వును)

విశ్వ—నీకు వేళాకోళంగానే వుంటుంది బాబూ. నీకు వెనకాల కావలసినంత వుంది. పైగా, ఏదో మీ మామగారి ధర్మమూ అని బోర్డులో పెర్మనెంటు ఛాన్సు కొట్టావు.

రామ—రామ, రామ! నీతోడు. నేను వేళాకోళం చెయ్యటం లేదోయ్. ఇదీ ఒకందుకు మంచిదేలే. మగవాడు సంపాదించి పడేస్తుంటే వాడి కష్టం ఆడదానికి తెలీక అది తే, ఇది తే అని చంపుతుంది. ఇప్పుడు సంపాదన యందుండే కష్టం వాళ్లకి బాగా తెలుస్తుంది.

విశ్వ—టయిము అవుతోందోయ్. పోతా.

రామ—వెళుదుగానిలే ఏమంత తొందర? వెళ్లటం, తలుపులు తియ్యటం, తలుపులు మూయ్యటం. ఇంతేగా, చదువు చెప్పాలా ఏమన్నానా? అందులో ఆడపిల్లలు. అప్పిడే వచ్చేరా యేమిటి?

విశ్వ—అల్లా కాదోయ్. ఇప్పుడు మగపిల్లలకంటె ఆడపిల్లలకే చదువు యందు ఎక్కువ శ్రద్ధ. స్కూలు ఎనిమిదిగంటలకంటే వాళ్లు ఆరు గంటలకే వచ్చి కూర్చుంటారు.

రామ—అబ్బా! అంత శ్రద్ధగా చదువుతారూ? ఆరుగంటలకే ఎందుకు రావటం?

విశ్వ—ఇంటిదగ్గరుంటే తల్లి ఆపని, ఈపని చెయ్యమని చంపుతుంది. లేకపోతే ఏ తమ్ముణ్ణో, ఏ చెల్లెల్నో ఎత్తుకోమంటుంది. అంచేత, ఇంటిదగ్గరకంటె ఇస్కూల్లోనే హాయి. పెందరాళే వచ్చి ఏ తొక్కుడుబిళ్లయినా ఆడుకోవచ్చు,

రామ—అయితే నీకింద ఎందరు అసిస్టెంట్సు?

విశ్వా—ఇద్దరు.

రామ—మేల్సా? ఫిమేల్సా?

విశ్వా—ఫిమేల్సే. ప్లీజ్ వెడతానోయ్. ఈ వీక్‌లో ఇనస్పెక్షను. ఇనస్పెక్టరమ్మగారు వస్తారు. ఇప్పట్నుంచి పిల్లలికి డిసిప్లిను, పంక్చ్యుయాలిటీ అవీ నేర్పాలి.

రామ—ఇనస్పెక్టరమ్మగా రేమిటి!

విశ్వా—పంతులు, ఇనస్పెక్టరు, ఇత్యాది పదములకు చివర 'అమ్మ' అను సఫిక్సు చేరుస్తే ఫిమినైన్ అవుతుంది.

రామ—బలే. అదా? అయితే, ఇనస్పెక్టరయ్యలతో టేమీ మీకు పని లేదన్నమాట.

విశ్వా—లేదు. మాది గరల్సు బ్రాంచి కాదూ? ఇకముందునుంచి బాయిస్ స్కూల్సుకి కూడా ఇనస్పెక్షనుకి లేడీస్‌నే అపాయింటు చేస్తారుట. ప్రపోజల్సు జరుగుతున్నాయి.

రామ—చచ్చాం. ఏం? ఎంచేత? మగవాళ్లు పనికిరారనా?

విశ్వా—మగవాళ్లకు డిస్క్రిమినేటివ్ పవరు చాలదుట.

రామ—రానియ్. ఈ ప్రపోజల్సు అమలులో పెట్టినప్పటిమాట గదా.

విశ్వా—వెడతాను బ్రదర్. ఎక్స్క్యూజ్ మి. సాయంత్రం వచ్చి సావకాశంగా మాట్లాడతాను.

రామ—వెళ్లిరా. పాపం. చాలాసేపు డిటెయిన్ చేశాను.

(పోవుదురు.)

## రంగము 2

స్థలము: బడిలో నొక గది. ప్రవేశము: విశ్వనాథము, కామాక్షమ్మ, రంగనాయికమ్మ.

రంగ—ఏమండీ పంతులుగారూ! ఈరోజే గదండి, ఇనస్పెక్టరమ్మగారు రావటం?

విశ్వ—అవునమ్మా. అవును.

కామా—అయితే, పంతులుగారూ, ఆవిడకి పళ్లు, పువ్వులు మొదలయినవి తెప్పించారా?

విశ్వ—ఆ! అవి అన్నీ కావాలా ఏమిటి అమ్మా? నాకు తెలీదులే. అవి అంత అవసరమా, అమ్మా?

కామా—కాదుటండీ మరి. వచ్చిన అధికారిని ఆహ్వానచేసి ఆదరించవద్దండీ? ఈసంగతి మీా ఆవిడ మీాతో చెప్పలేదూ?

విశ్వ—(తల గోకికొనుచు) ఏవేవో చాలా చెప్పిందమ్మా. దిక్కుమాలిన ఖర్మం. మరచిపోయాను. నిత్యమూ చేసేవాళ్లకే గాని, మధ్య వచ్చినవాళ్లకు తెలియవు. నీధర్మమా అని ముందే జ్ఞాపకం చేశావు. ఇప్పుడు వెళ్లి తీసుకొస్తా నుండమ్మా.

కామా—అప్పిడే టయి మయిపోవచ్చింది. ఇంకెప్పు డెళ్లి ఎప్పుడట్టుకొస్తారు? నేను తెచ్చే వుంచాను లెండి.

విశ్వ—రక్షించావు. తల్లీ. నీ కడుపు చల్లగా. ఆడవాళ్లకు కావలసినవేవో ఆడవాళ్లకు తెలియాలి గాని, మగముండావాడికి నాకేం తెలుస్తాయి. ఇంకా ఏమన్నా కావాలా అమ్మా?

కామా—ఇంకేమీా అక్కరలేదు లెండి. టయిమయింది. అవతల పిల్లలు అల్లరిచేస్తున్నారు. బెల్లు కొట్టండి.

విశ్వా—ఆ! మంచిదమ్మా. మీరు మీ క్లాసుల్లోకి వెళ్లండి. (బెల్లు కొట్టును; కామాక్షమ్మ, రంగనాయికమ్మ పోవుదురు. పిల్లలు వత్తురు.)

విశ్వా—సిట్ డవున్. అమ్మాయిలూ కూర్చోండమ్మా. (పిల్లలు కూర్చుందురు.)

విశ్వా—అమ్మాయిలూ! ఇవ్వాళ ఇనస్పెక్టరమ్మగా రొస్తారని తెలుసు కాదూ ?

పిల్లలు—(అందరూ, గట్టిగా) తెలుసండి.

విశ్వా—ఆ! అందరూ అల్లా గోలగా మాట్లాడకండి.

సీత—అమ్మగారండీ! చూడండి. కాంతం నాకనికిపుల్ల దొబ్బేసిం దండీ.

విశ్వా—అయ్యో, నాఖర్మంకాల. అమ్మాయ్, నేనమ్మగారినా ? అల్లా పిలవొచ్చా ?

సీత—అయ్యో, మరచిపోయినానండీ. అలవాటుచొప్పున అల్లా వొచ్చిందండీ.

విశ్వా—ఊ! సరేలే. జాగ్రత్త. ఇనస్పెక్టరమ్మగారు వచ్చినప్పుడు కూడా అల్లా అనేవుసుమా ! ఏం, కాంతం ? ఆ అమ్మాయి పలక ఇచ్చెయ్.

కాంతం—నా పెనిసులుచ్చుకుందండీ.

విశ్వా—సరిపోయిందివరస. ఎవళ్లవస్తువులు వాళ్లుచ్చుకోండి. ఏదీ, నుం చోండి. ప్రార్థనచెయ్యండి (పిల్లలులేచి ప్రార్థనచేయుదురు).

విశ్వా—కూర్చోండమ్మా. చూడండీ, ఆవిడొచ్చినప్పుడు. జాగ్రత్తగా అడిగినప్రశ్నకు ఆలోచించి సమాధానంచెప్పాలి. తెలిసిందా ?

పిల్లలు—(అందరూ, గట్టిగా) తెలిసిందండి.

విశ్వా—అదుగో అందరూ ఒకపూటు మాట్లాడొద్దన్నానా ?

రంగ— (ప్రవేశించి) అదుగో వస్తున్నారు. ఎదురుగుండా వెళ్లి తీసుకు రండి. (పోవును)

విశ్వా—(తలపాగా, కోటూ సవరించుకొని వెళ్లి ఇనస్పెక్టరమ్మగారితో వచ్చును).

విశ్వా—అల్లా దయచెయ్యండమ్మా, (కుర్చీచూపి, పువ్వులు మొ॥ బల్లమీద నుంచును)

ఇన—(కూర్చుని, పువ్వు వాసనచూచుచు) ఏమండీ, మీరేనా దీనికి హెడ్మాష్టరు ?

విశ్వా—అవునండమ్మా.

ఇన—మీది పేరమనెంటేనా ?

విశ్వా—కాదండమ్మా. మూడు నెలలు యాక్టింగు వేకెన్సీలో నన్ను అపాయింటు చేశారండి.

ఇన—ఐసి. ఇది ఏక్లాసండి ?

విశ్వా—ఫోర్తుష్టాండరుడండి.

ఇన—సరే! ఏదీ. ఈపిల్లలకు రంగులమీాద ఒకపాఠం చెప్పండి.

విశ్వా—చిత్తం అమ్మా. అమ్మాయిలూ, సిట్, స్టాండ్ (అని చాల సారులు అనును)

ఇన—ఇదియేమండీ ? పాఠము చెప్పమంటే డ్రిల్లుచెబుతున్నారేమిటి ?

విశ్వా—లేదండమ్మా, పాఠంచెప్పడానికి ముందు గ్రౌండు ప్రిపేరుచేసి ఎట్రాక్టు చెయ్యడానికి, అల్లా చెయ్యాలని ట్రెయినింగవుచున్న మా భావమరది చెప్పాడండి.

ఇన—అయితే, మీారింకా ట్రెయినింగవలే ?

విశ్వా——లేదండమ్మా, నేనూ ట్రయినింగవొచ్చే టయిముకి స్టైపెండ్సు లాగిపారేశారండి. అంచేత డబ్బులేక బి. యే. ప్యాసయి మూడేళ్లయినా, ట్రెయినింగవటానికి వీలుచిక్కిందిగాదు. పైగా ప్రీవియస్ సర్వీసు లేదు. ఇదుగో, ఈసర్వీసు ఆధారంచేసుకొని, నెక్స్టు ఇయరు ట్రెయినింగు సీటుకి అప్లయిచేస్తానండి.

ఇన——అట్లనా! మంచిది. పాఠంకానియ్యండి.

విశ్వా——ఇదిగో అమ్మాయ్. రంగులేవేవో చెప్పు.

ఇన——అల్లా అడగకూడదండీ వాళ్లదగ్గరనుంచి ఎలిసిట్ చెయ్యాలి. ఇదే ట్రెయినింగవకుండా మేష్టరీచేస్తే వచ్చేనష్టాలు.

విశ్వా——చిత్తం. (తనలో) చంపుకుతింటోందే. (ప్రకా) ఆకుపచ్చరంగు ఎల్లావుంటుందో నీవుచెప్పు అమ్మాయి.

ఇన——అదేమిప్రశ్నండి? ఆకుపచ్చరంగు ఎల్లాగుంటుందేమిటి? అది అవకతవకప్రశ్న. ఇదిగో చూడండి. నేను ప్రశ్నవేసి చూపిస్తాను. ఇదిగో చూడమ్మా. అమ్మాయి. చిలుక ఏరంగుగా వుంటుంది?

కమల——ఆకుపచ్చగా వుంటుందండి.

ఇన——చిలుకముక్కు ఏరంగుగావుంటుంది నీవుచెప్పు అమ్మాయి.

సుబ్బమ్మ——ఎర్రగావుంటుందండీ.

ఇన——మీరు పేరంటానికి వెళ్లినప్పుడు మీకాళ్లకి ఏమిరాస్తారు?

ఇందిర——పసుపండీ.

ఇన——పసుపు ఏరంగుగా వుంటుంది?

సీత——పసుపు పచ్చగా వుంటుందండి.

ఇన——గోడలకు రంగు ఎల్లాగవుంటుంది? నీవు. అమ్మాయి?

ఇందిర——తెల్లగానూ, నల్లగానూ వుంటుందండి.

ఇన——గోడ నల్లగావుంటుందా? సరిగా ఆలోచించు.

ఇందిర—అవునండీ ! ఆగోడమీద సిరామరకలు నల్లగాలేవండీ ?

ఇన—ఆ ! అవును. సిరా నల్లగావుంటుంది. గోడ తెల్లగావుంటుంది. తెలిసిందా ?

పిల్లలు—తెలిసిందండి.

ఇన—(పంతులుతో) చూచారాండి ? ఇల్లా పిల్లలదగ్గరనుంచి విష యాల్ని రాబట్టాలి. మీకిదంతా ట్రెయినింగులో చెప్తారు లెండి. అమ్మాయి ఒక తెలుగుపద్యం చదువు. అమ్మా.

సీత—(చదువును)

“ కూతురుచెడు గై యుండిన
మాతదితప్పన్న మాట మదినెఱుగుదుగా
నీతలిదండ్రులకు నప
ఖ్యాతులు రానీయగూడదమ్మ కుమారీ ”

ఇన—కుమారీశతకమా ! దాని తాత్పర్యమేమిటో తెలుసునా ?

సీత—తాత్పర్యం అంటే ఏమిటో మాకు చెప్పలేదండీ.

ఇన—ఏమండీ వీళ్లకు తాత్పర్యం చెప్పటంలేదూ ?

విశ్వ—మొదటినుంచీ మామూలు లేదుటండి. ఆమామూలే నేనూ ఫాలో అవుతున్నానండి.

ఇన—తాత్పర్యం కూడా చెప్పాలండి, లేకపోతే పద్యంచెప్పిన ఫలిత మేముంది ? కుమారీశతకంలో ఎంతమంచి పద్యాలున్నాయండి. సుమతీశతకం, కుమారీశతకం, ఇవి చాల బాలికలు చదివి నేర్చుకో వలసిన పుస్తకాలండి.

విశ్వ—చిత్తం.

ఇన—సరే. లెఖ్ఖలు పరీక్షచేస్తాను. అమ్మాయీ. నోటిలెఖ్ఖలడు గుతాను. జాగ్రత్తగా ఆలోచించిచెప్పాలి. వినండిః—నావద్దనాలుగు

జామపళ్లు, మూడు నారింజపళ్లు, అయిదు బత్తాయిపళ్లు వున్నవి. మొత్తము నావద్ద ఎన్నిపళ్లు వున్నవి.

కమల—తొమ్మిదండి.

సీత—పదండి.

ఇందిర—పదకొండండి.

ఇన—అబ్బే. తప్పు. ఇల్లావినండి. జామపళ్లు ఎన్నివున్నవి?

కమల—నాలుగు.

ఇన—నారింజపళ్లూ ?

సీత—మూడూ.

ఇన—రెండూ కలిపితే ?

ఇందిర—ఏడండి.

ఇన—బత్తాయిపళ్లు ఎన్నివున్నవి ?

కమల—అయిదండి.

ఇన—ఏడూ అయిదూ కలిసి ?

సీత—పన్నెండండి.

ఇన—చూచారా ! జాగ్రత్తగా ఆలోచించి చెప్పాలి. (పంతులుతో) లెఖ్ఖలలో చాల వెనుకబడియున్నారే ?

విశ్వ—ఏమోనండమ్మా ! ప్రతిరోజు 1 మొదలు 12 వరకు పలకల మీద ఎక్కాలు వేయిస్తానండి.

ఇన—ఎక్కాలు వేయిస్తే లాభమేమిటి ? లెఖ్ఖలుచేయించాలికాని.

విశ్వ—ప్రతిరోజూ మూడులెఖ్ఖలచొప్పున మూడుదస్తాల పుస్తకంలో హోమ్‌వర్కు చేయిస్తున్నానండి. శనివారాదివారాలొచ్చాయంటే ఇరవయి ముప్పయిదాకా ఇస్తానండి. ఏది అమ్మాయి నీనోటు

బుక్కు చూపించు. మొత్తం నేనొచ్చినప్పటినుంచి యిప్పటికి నూటనలభై తొమ్మిది లెక్కలయ్యాయండి.

ఇన—నంబరు ఎక్కువగా వుండటమూ కావలసినది. వాళ్లకు బాగా అర్థమయేటట్టు బోధించాలి. ఇప్పటినుంచి నోటుపుస్తకాలేమిటి? ఓరల్ గానే బాగా డ్రిల్ చెయ్యాలి.

విశ్వ—చిత్తం.

ఇన—సరే! తరువాతక్లాసుకు వెళదాం రండి.

విశ్వ—అమ్మాయిలూ అల్లరి చెయ్యకుండా కూర్చోండి.

తెర (పోవుదురు)

---

రంగము 3.

---

స్థలము: బడిలో మరియొకతరగతి. ప్రవేశము: కామాక్షమ్మ, పిల్లలు.

కామా—పిల్లలూ, అల్లరి చెయ్యకండి. ఇనస్పెక్టరమ్మగారొస్తారు. ఇవ్వాళ.

కమల—ఏంచేస్తారండీ వచ్చి?

కామా—మిమ్మల్ని పరీక్షచేస్తారు. బాగా ప్రశ్నలకి సమాధానం చెప్పిన వాళ్లకి బహుమానాలిస్తారు.

సీత—ఏం బహుమానాలిస్తారండి?

కామా—(అటు చూచి) ఏవో యిస్తారు. మాట్లాడకండి. ఆవిడ వచ్చారు. ముందు నాలుగోక్లాసుకి పరీక్ష తరువాత మీక్లాసుకి వస్తారు. పాఠాలు చదువుకొచ్చారా?

అందరు—(గట్టిగా) చదువుకొచ్చామండీ.

కామా— మొద్దు మొకాల్లారా! బుద్ధిలేదూ! ఎందుకలా అరుస్తారు? చెవికోసిన మేకల్లాగ. మెల్లగా జవాబు చెప్పాలి. ఒకరొక్కరే మాట్లాడాలి. ఇదుగో పాఠం చెబుతున్నాను వినండి. మెల్లిగా అందరూ అనండి. ఆవు పాలు యిచ్చును.

పిల్లలు—ఆవు పాలు యిచ్చును.

కామా—ఆవు ఏమి యిచ్చును?

పిల్లలు—పాలు యిచ్చును.

కామా—ఎద్దు బండిలాగును.

పిల్లలు—ఎద్దు బండిలాగును.

కామా—కుక్క కావలి కాయును.

పిల్లలు—కుక్క కావలి కాయును.

కామా—కనకం! ఎద్దు ఏమిచేయును?

కనకం—(పరధ్యాన్నముగా) పాలు యిచ్చును.

కామా—మొద్దుమొకమా! ఎద్దు పాలిస్తుందా? నువ్వు కాంతం?

కాంతం—కావలి కాస్తుందండి.

కామా—ఎన్నిచెప్పినా అంతే. దృష్టి వేరేచోట పెట్టుకుంటే చదువెల్లా వొస్తుంది? ఎద్దు కావలి కాస్తుందా? కావలికాసే జంతువేది? సీత?

సీత—ఆవండి.

కామా—ఛీ. ఆవు కావలి కాస్తుందా? కావలికాసే జంతువు కుక్క. కావలికాసే జంతువేది?

పిల్లలు—కుక్కండి.

కామా—ఆ! ఇప్పుడు చెప్పండి. ఎద్దు ఏమిచేయును? సుశీలా?

సుశీల—బండిలాగును.

కామా—తెలిసిందా! ఇనస్పెక్టరమ్మగారు రాగానే మీరంతా నుంచొని, 'అమ్మగారికి వందనములు' అని చెప్పాలి.

(ప్రవేశము : ఇనస్పెక్టరమ్మ, విశ్వనాథం)

పిల్లలు—(లేచి) అమ్మగారికి వందనములు. (కామాక్షమ్మ, నమస్కారము చేయును)

ఇన—(చిరునవ్వుతో) కూర్చోండమ్మా. (పిల్లలు కూర్చుందురు) ఇది యేక్లాసండి?

కామా—రెండోక్లాసు, ఒకటో క్లాసూనండి.

ఇన—రెండింటికి మీరేనా టీచరు?

కామా—అవునండి.

ఇన—మూడోక్లాసుకి ఎవరు?

కామా—రంగనాయకమ్మగారండి.

ఇన—రెండోక్లాసుకి ఏంపాఠం చెబుతున్నారండి?

కామా—జంతువులు, వాటి యుపయోగములు.

ఇన—ఏదీ పాఠముమీద ప్రశ్నలు వెయ్యండి.

కామా—రాజేశ్వరీ! ఆవుయొక్క యుపయోగమేమి?

రాజే—పొద్దునే పేడ దొరుకుతుందండి. అది ఇల్లలుక్కునేందుకూ, కళ్లాపు జల్లుకునేందుకు పనికొస్తుందండి.

కామా—అదా ఆవుయొక్క ఉపయోగము?

రాజే—మీరు చెప్పినప్పుడు నేను రాలేదండి.

ఇన—అవును. ఆ అమ్మాయి చెప్పినదీ బాగానేవుంది. అదికూడా వొక వుపయోగమే. ఏముసలమ్మో ఆ అమ్మాయిని ఆపనిమీద పంపుతూ వుంటుంది కాబోలు. అంచేత ఆసంగతి జ్ఞాపకం వుంది.

మీా మనస్సులోవున్న ఆన్సరు రాబట్టాలంటే ఇంకోవిధంగా వెయ్యాలి ప్రశ్న. అమ్మాయీా నీకు కాఫీ అలవాటుందా ?

రాజే—ఉందండి.

ఇన—కాఫీ ఎల్లా చేస్తారో చెప్పు.

రాజే—నీళ్లుకాచి, అందులో కాఫీపొడి వేసి, కొంచెం సేపుంచి, వడబోసి, అందులో పాలూ పంచదారా కలుపుకు తాగుతారండి.

ఇన—అయితే, ఆపాలు ఎల్లాగ వస్తాయి ?

రాజే—మాగేది ఇస్తుందండి.

ఇన—గేదేనా, ఇంకేదైనా పాలిస్తుందా ?

రాజే—ఆవుకూడా యిస్తుందండి.

ఇన—కాబట్టి, ఆవుయొక్క వుపయోగమేమిటి ?

రాజే—ఆవు, పాలు ఇచ్చును.

ఇన—ఆవుచేత బండి లాగిస్తారా ?

కనకం—లాగించరండి.

ఇన—దేనిచేత లాగిస్తారు ?

సుబ్బమ్మ—ఎద్దుచేత.

ఇన—కాబట్టి, ఎద్దుయొక్క వుపయోగమేమిటి ?

సీత—ఎద్దు బండిలాగును.

ఇన—(కామాక్షమ్మను జూచి) చూచారా ! ఈవిధంగా వాళ్లచేతనే చెప్పించాలి. ఇదంతా మీాకు ట్రెయినింగులో చెప్పలేదూ ?

కామా :—ఏవో చెప్పారండి. అన్నీ ఆపద్ధతుల ప్రకారం చేస్తే పని జరగదండి.

ఇన—జరిగినంతే జరుగుతుంది. పుస్తకాలు పూర్తి చేస్తేమాత్రం ఏమిటి లాభం ? ఈ ఎలిమెంటరీ స్కూల్సులోనే ఆడపిల్లలకి మంచి

పునాది వెయ్యాలి. గృహకృత్యవిషయాలు బాగా బోధించాలి.

కామా—ఇంకా పెద్దక్లాసులున్నాయి కాదండీ?

ఇన—పెద్దక్లాసుల్లోకి అందరూ వెళ్లి చదువుతారని నమ్మకమేమిటండీ? అయినా, పెద్దక్లాసుల్లో గృహకృత్యవిషయాలు చెప్పరండీ. ఎంత సేపూ, ఫిసిక్సు, కెమిస్ట్రి, హిష్టరి, జాగ్రఫి, ఇటువంటివన్నీ చెబుతారు. ఇవన్నీ ఎందుకండీ ఆడదానికి? పెద్దక్లాసుల్లో వెఱ్ఱివేషాలే గాని మంచిబుద్ధులు పట్టుబడవు. ఆ చదువులన్నీ గొప్పవాళ్లకీ, పెళ్లీ పెడాకులూమాని ఉద్యోగాలాసించేవారికీ గాని, సాధారణ సంసారస్త్రీలకు అనవసరమండీ.

కామా—అప్పిడే పిల్లకి సంసారగొడవ లెందుకండీ? క్షమించాలండీ. నాకు తెలీక అడుగుతున్నానండీ.

ఇన— సంసారం అంటే మీవుద్దేశం మొగుడితో కాపరంచెయ్యడమనా? ఈవయస్సులో ఇంటిదగ్గర తల్లికి కాస్త చెయ్యాసరాగా వుండాలి. తరువాత తన సంసారం చక్కబెట్టుకోవాలి. ఇవన్నీ ఇప్పుడుకాకపోతే పెద్దప్పుడు నేర్చుకుంటుందా? అందరూ పెద్దక్లాసులు చదివి అందరూ ఉద్యోగాలుచేస్తే ఇంక ఇంట్లో పనిచేసే దెవరు?

విశ్వ—మగడు చేస్తాడండమ్మా.

ఇన—(నవ్వి) అసలు పెళ్లేలేకుంటే మగడెల్లాచేస్తాడు? అంచేత ఈ క్రింద క్లాసుల్లోనే అటువంటివి నేర్పాలి. అసలు ఆడపిల్లలకు మొదట ఏర్పడ్డ సిలబస్సులువేరు. ఇప్పుడు ఆచరణలోపెట్టబడుచున్న సిలబస్సులువేరు. సరే మూడోక్లాసుకి వెళదాం.

కామా—మాడ్రిల్లు చూడరండి

ఇన—డ్రిల్లుకూడా చెబుతున్నారా యేమిటండి?

కామా— అవునండి,

ఇన—సరే. టయిముంటే తరువాత చూస్తామండి. (నిష్క్ర-)

తెర.

---

రంగము 3.

---

స్థలము: బరిలో గది. ప్రవేశము: విశ్వనాథము, రంగనాయికమ్మ, కామాక్షమ్మ.

రంగ—ఏమండీ! పంతులుగారూ! ఇనస్పెక్షనయి నెల్లాళ్లయింది. ఇంకా రిపోర్టు రాలేదేమండి?

విశ్వ—వచ్చిందమ్మా. ఇవ్వాళే వచ్చింది.

కామా—ఎల్లాగ రాసిందండీ?

విశ్వ—ఒకటోరకంగా రాసింది.

రంగ—ఏం? అల్లా అంటున్నారేం?

విశ్వ—ఇదిగో చదువుతున్నాను. వినండి రిపోర్టు. ది స్టాఫ్ ఇజ్ ఆడిక్వేట్, బట్ నాట్ సూటబుల్. అంటే మేష్టర్లు సరిపోయినట్లే వున్నారుట గాని, తగినట్లుగాలేరు. ఎంచేతనంటే, నంబర్ వన్ ఇజ్ యాన్ అన్ట్రైయిన్డు మేన్ గ్రాడ్యుయేట్. అనగా, ఒకటోనంబరు, అంటే, నేను, ట్రయినింగవని మగబియ్యేనట. అంచేత సాధ్యమయినంత త్వరలో నన్ను తీసివేసి ట్రెయినింగయిన హైయ్యరుగ్రేడు ఫిమేల్ టీచరుని వేయవలసినదని మొదటి విషయం.

కామా—ఇదేమిటండి, ఇల్లాగరాసింది? యాక్టింగుకి ఎవరైతేనేం?

విశ్వ—ఇదుగోనమ్మా, దానికి కారణం గూడా రాసింది తెలుగులోకి

తర్జుమాచేసి చెబుతాను వినండి. యాక్టింగయినా, పెరమనెంటయినా, ఎలిమెంటరీ స్కూల్సుకి హైయ్యరుగ్రేడువాళ్లేగాని, గ్రాడ్యుయేట్సు చెప్పలేరనిన్నీ, గరల్సుకి మేన్ టీచర్సు పనికిరారనిన్నీ రాసింది.

కామా—అదేమిటండీ. మొన్న ఆమధ్య పేపర్లోనో ఎక్కడో చదివాడుట, మాఅన్నయ్య చెప్పాడు. చిన్నక్లాసులో కూడా బి. యే. లు చెబితేనేగాని వాళ్లకి పునాదియుండదని, అల్లాగ లేకపోబట్టే పెద్ద క్లాసుల్లో కుర్రాళ్లు వెనకబడియుంటున్నారనీ రాశారుట. ఈవిడ ఇలాగంటుందేం ?

విశ్వ—గ్రాడ్యుయేట్లుకి ఉద్యోగాలు లేక గోలెడుతూంటే వాళ్లకి ఉద్యోగా లిప్పించటానికి రాసిన రాతలవి. అదీ గాకపోయినా, ఎవరివెర్రి వారి కానందం.

కామా—అదీ గాకపోయినా, ఈవిడ ఇదివరకావిడలా కాదు. అతి కరక్టుగా వుంది.

విశ్వ—ఇంకా వినండి. పాఠములు చెప్పుట ముగ్గురికీ కూడా సరిగా తెలియదుట.

కామా—ఈవిడ మహాపాడిచేసింది.

విశ్వ—బాలికలకు ముఖ్యముగా లెఖ్ఖలు, డ్రాయింగు, సంగీతము కుట్టుపని మొదలగు పాఠములను, గృహకృత్యములకు ఆరోగ్య మార్గములకు సంబంధించిన యితరవిషయములను బాగుగా బోధించవలెను.

కామా—గృహకృత్యములని యిదవుతుంది. ఈవిడచేసేపని యేమిటి ?

రంగ—అది కాదమ్మా. మావారు చెప్పారు. ఈవిడ కేవలం భర్త బలవంతం మీద ఈ పనిలో చేరిందటకాని, సుతలాం ఈవిడకీపని

యిష్టం లేదుట. ఈవిడ మొగుడు గొప్ప వుద్యోగస్థుడు. సీమవెళ్లి వచ్చాడుట. తనే పైకి చదివించి ఈ వుద్యోగం వేయించాడుట.

విశ్వా—ఆ! అల్లాగా అమ్మా?

రంగ—ఈవిడ రోజూ పూజచేస్తేనేగాని భోజనము చెయ్యదుట. ఉద్యోగరీత్యా, భర్త బలవంతంమీద అంతషోకు చేస్తుందటకాని, ఇంటిదగ్గర సాధారణ సంసారస్త్రీలాగే వుంటుందట.

విశ్వా—ఏమోనమ్మా. ఏపుట్టలో ఏపాముందో చెప్పలేం! వెధవ కాలం. ఈకాలంలో వేషాన్నిబట్టి గుణం నిర్ణయించటం కష్టం.

రంగ—అయినా, ఆవిడ చెప్పినవన్నీ మంచిసంగతులేనండీ. మనకు తెలీనప్పుడు, తెలిసినవాళ్లు చెపితే నేర్చుకోవలసిందే.

విశ్వా—ఇంకా సందేహమా, అమ్మా!

కామా—సరేకానండి. ఇంకేం రాసిందండి.

విశ్వా—అంతకంటె చెడ్డగా ఏమీ వ్రాయలేదు. అందరూ శ్రద్ధగా పనిచేస్తున్నారని రాసింది.

కామా—సరిలెండి. ముడ్డిగిల్లి జోలపాట పాడినట్టు, రాసినవన్నీ రాసి కొసముక్క వకటి పడేస్తారు పిల్లు.

రంగ—అయితే, మిమ్మల్ని తీసేస్తారన్నమాట.

విశ్వా—అబ్బే. గుమాస్తా మావాడేగా. వాణ్ణి అడిగాను. ఇంకొక్క నెలకోసం మళ్లా కొత్తవాళ్లని అపాయింటు చెయ్యడమెందు కన్నాడు. తరువాత అసలావిడే వస్తుంది.

కామా—ఇకపోదాం పదండి. పదకొండయింది. తలుపులు తాళాలు వేయించండి. తెర (పోవుదురు)

బారు పార్థసారథి రాఘవేంద్రరావు, రాజమండ్రి.

తే. గీ. స్వస్వరూపమునను, భవద్వదనరూప
మునను, ద్వివిధము గా శశి వనధిలోన
జనని! జనియించె; కనుక నే సార్థకంబు
రాజు దాల్చెడి యా ద్విజరాజపదము.

చ. అతిపరిశుభ్రమౌ సరసునం దసితోత్పల మట్టు లాసిశా
పతి నడిమిప్రదేశమున వర్తిలు నట్టి కళంక మట్టు లా
యతమగు పద్మమందలరునట్టి మధువ్రత మట్టు లంబికా!
సతతము నీదు మోమునను చక్కని కస్తురిబొట్టు శోభిలున్.

చ. తనరి జలేజమున్ శశియుఁ దల్లి సరోగనభోగతానివ
ర్తనము లొనర్చి యెంతయు ముదంబునఁ ద్వన్నయనాస్యజన్మలన్
గని, సరిహద్దుగట్టులుగఁ గన్బొమ లుంచి వసింత్రు; తత్పున
ర్జననములందునున్ సహజశత్రుత వీడ రదేమి చిత్రమో!

చ. శ్రుతులను దాకు నీకనులఁ జూచి ముఖంబునుఁ గూడ నివ్వియా
తతముగ నాక్రమించు నని తద్ద భయంపడి జాణయైన యా
శతధృతి హద్దురాళ్లుగను స్థాపనఁ జేసెనొ యేమొ వీని న
న్వితముగ నీదు కన్బొమలు పెంపగు; నో జగదేకమోహినీ!

మ. అరవిందాసనశంకరాదిసుర లత్యంతంబు నెవ్వానికిఁ గిం
కరులై కొల్తురొ యట్టి యా హరియె నీ కన్బొమ్మయుగ్మమ్ముఁ గిం
కరుఁడై కొల్చును నిత్య మా నహహా! వక్రత్వాంచితుఁ ధాత్రి నం
దఱునున్ గింకరులై భజించెదరుగాదా! భీతి నో యంబికా!

చ. హరిణి త్వదక్షిచే విజిత యై శర ణొందెను రాజు నాతఁడా
హరిణినిఁ బూసి, యాస్యజితుఁడై తన మండలమున్ ద్యజించి తా
శరణముఁ జొచ్చె నుర్గవిభుఁ జయ్యాన నాతఁడు హస్తమస్తకాం

తరములఁ వాసిఁబూని యెటఁదారస మయ్యెదొయంచు భ్రాంతుఁడై
తిరిపెప్రవృత్తి నిప్పటికిఁ దిర్గెడు ; తల్లి ; మహేశుఁడయ్యునున్.

ఉ. అమ్మరొ ప్రముచ్చిలెన్ కువలయంబు త్వదంబకకాంతి నంచు రో
షమ్మున రాజు దాని వికచంబుగఁ జేయుటఁ జూచి యట్టి చౌ
ర్యమ్మునె తామునర్గ సలిపినందులకున్ క్షమియింపు మంచుఁ దా
పమ్మున రాజుపాదములఁ బట్టు చకోరము దిక్కు లేనిదై

చ. తమ వసుతస్కరమ్ము లగు తత్కువలమ్ముల కాశ్రయమ్ములై
యమరుట నీదు కర్ణముల నంబకముల్ కబళించుఁ దల్లి! కో
పమున; సమర్థు లౌ జనుల పట్లు విరోధమె కీడు గాదు ప
క్షము వహియించి వారి రిపుసంఘముఁ జేర్చుట కూడ కీడెగా

చ. పనివడి నీదు నేత్రమధుపమ్ములు త్వన్మధురాధరామృతం
బనయముఁ గ్రోలఁగాఁ బయన మై నడిత్రోవను నాసికాఖ్యచేఁ
దనరెడు చంపకంబుఁ గని దానిని దాటఁగ లేమి నిష్టసి
ద్ధినిఁ గనలేక చంచలతఁ దిర్గుఁ గటా! తరళాంబుజేక్షణా!

ఉ. అంబ! త్వదాననద్యుతిసుధాంబుధిలో భువనైకజీవనా
లంబము లౌచు నీదు కనులన్ మిష వర్తిలు రెండు దివ్యమ
త్స్యంబులు వానికంటెఁ గడు తక్కువ లౌటను విష్ణునేత్రమీ
నంబుల మ్రింగివేయు నిది నైజమె కా ఝషజాతి కెంతయున్

చ. మరుఁడు భవద్వతంసకుసుమం బను నట్టి ఫిరంగి కర్ణికా
వరణపు కుడ్యభాగమున పై శ్రుతివేదిక నిల్పి తల్లి! య
య్యరుణమణిప్రదీప్తిశిఖ నంటిన తుమ్మెదగుండ్ల బారుచేఁ
గరము భవద్హృదీశు ధృతికంకటమున్ విదళించు తీక్ష్ణతన్ ॥

మం. అతనుం డన్ యజమానుఁ గూడుకొని భృంగాధ్వర్యుఁ డోయంబికా
రతనాల్నిప్పుల నింపు త్వచ్ఛ్రుతిసువర్ణప్రజ్వలత్కుండలా

తతహోమానలకుండమందు హరి హృద్ధైర్యంబు హావ్యంబుగాం
కృతులన్ మంత్రములన్ బ్రదక్షిణవిధిన్ గీర్తించుచున్ వ్రేల్చెడిన్

సీ. తనరారు ముత్యాల తాళతళ్యంబులే జలజల ప్రవహించు జలముగాఁగ
ఇంపారు రతనాల యొజ్జని కాంతులే చక్కనౌ చెంగల్వ చాలుగాఁగ
హరువారు నీవిభుతర ళేక్షణంబులే యటసంచరించుమత్స్యములుగాఁగ
నలుపారు నీలాల నైగనిగ్యంబులే రమణీయనీలోత్పలములు గాఁగ

తే. గీ. నలరి సర్వశ్రమాపహం బగుచు నొప్పు
నట్టి భవదీయ తాటంక మను తటాక
మును భజించెద నేను బ్రొద్దునన లేచి
యనుదినంబునుఁ గూడ నో యబ్జనిలయ !

చ. కన, భవదీయనాసికను కంబము గా నిలఁబెట్టి దానినిన్
కనుబొమ లన్న పగ్గముల గాటముగా బిగఁదీసి కట్టి యో
జనని! యనంగుఁ డన్ మివుల సాధకుఁడౌ నొక దొమ్మరీఁడు తా
నసయము దానిపైనిఁ గడు నద్భుతరీతిగ నాట్యమాడెమన్

క. కలుములరాణి ! నీదు నసఁ గ్రాలెడు ముత్తియ మన్నయట్టి రో
వెలఁదుక మందహాస మను వెల్లని పట్టుపుటంబుఁ గట్టి లో
నలరి, సమీరనర్తకుఁడు హంగు నొనర్పఁగ నాట్యలీలలన్
జెలఁగి కరంచు నీదు విభుచిత్తము నెంతయు మెత్తమెత్తగన్

క. భవతీరదనాళిసము
ద్భవతీవ్రప్రభల భవతి భాతిగఁ దగు నా
భవతీహాసజ్యోత్స్నిక
భవతిమిరముఁ బాపి మమ్ముఁ బాలించుఁ గడున్.

ఉ. నీ యధరంబు సం దతివినిర్మల మౌ దరహాసమన్ మిషన్
తీయని యా సుధారసము తెల్లముగాఁ గనుపట్టు నో సుధా

తోయధిపుత్రి! యీ రసముతో మిళితమ్మయి నీ చటూక్తులా
హా! యతిమోదముఁ గొలుపుగా! మధువైరికిఁగూడ నెప్పుడున్.

## వాగ్వర్ణనము

తే. గీ. అంబ! మృద్వీక మృద్వీకారంబె యయ్యె
యరఁటి రుచి చెడె; కండచక్కెరయు చప్ప
వడియె, తేటులచే మైల వడియె మధువు
నీదు వాఙ్మాధురికి సాటి నిలువలేక.

చ. చెఱకు భవద్వచోరసవిశేషము దొంగిలి స్వీయగర్భకం
దరమున నెంతొ గూఢముగ దాచెడిఁ గానని గాన్గులోపలన్
గరము తపించి పిప్పియయి క్రక్కెడు తద్రస మెల్లఁ దల్లిరో!
విరివిగ మర్దనంబు గుణవృద్ధికి మూలము గాదె యారయన్

ఉ. పాలసముద్రమం దమృతభానుసుధాతతి గ్రుమ్మరించి స
మ్మేళ మొనర్చి తల్లి! యటుమీఁదటఁ దియ్యని యిక్షుదండమున్
బోలిచి కవ్వమట్టులుగఁ బోల్పెసఁగన్ గిలకొట్ట నాపయిన్
దేలిన వెన్న గూడ భవదీయచటూక్తుల ముందు తిక్తమా

తే. గీ. అంబ! యధరంబు క్రొందలిరాకు గాగ
పొలుపుఁ జిలికెడు దంతముల్ పుష్పములుగ
రమ్యభాషితముల మకరందములుగ
సరయుదును నీవు మాధవి వౌటఁ జేసి

తే. గీ. భవహారణ మైనయట్టి నీవాక్యఫణితి
కాలకంఠాభిలాపముం గేలిసేయుఁ
గాక; శ్రుతిమధురమ్మయి క్రాలెడి యది
శుకముఖాలాపముల కెటుల్ జూపు దొసఁగు!

---

172

## పదియవ యుల్లాసము



పాముసింగన్న గారాబు కూతురైన దుందుభి వివాహము నిమిత్తము ధనము సంపాదించి తగిన వరునికొఱకు ప్రయత్నము చేయుచుండెను. తగిన వరుఁడనగా కోరినధన మిచ్చువాఁడే యనియర్థము సింగన్నకు వరుని రూపముతోఁ బనిలేదు. వరునకు విద్యాగంధ ముండనక్కఱలేదు. ఇల్లువాకిళ్లతో నవసరము లేదు. తగినధరకు గేదెపెయ్యనో ఆవుపెయ్యనో యమ్ముకొనునట్లు సింగన్న పెయ్యబిడ్డను కోరిన విత్తమునకు విక్రయించి దూడమెడలో పలుపుకట్టినట్లే బిడ్డమెడలో మంగళసూత్రము కట్టించి కొన్నవానియింటికిఁ బంపివేయవలయు ననియే సంకల్పించెను. అతనియొద్ద నాడుపిల్ల యున్నదని తెలిసినవారు తమ మగపిల్లవానికి యాబిడ్డ నిమ్మని యడుగుచు వచ్చిరని వేఱుగఁ జెప్పనక్కఱలేదు. బేరము కుదురకపోవుట చేతనే పెండ్లి యాలస్య మగుచున్నది. ఎవరో యొకరు ప్రతిదిన మాతని యింటికి వచ్చుచు బోవుచుండిరి. అట్టిదినములలో నొకనాఁడు, నాగన్నయు, ఆతని మేనమామయైన చిలుకూరి శేషయ్యయు గొల్లపాలెమునుండి బయలుదేరి మొగలితుఱ్ఱు మీఁదుగా నడ్డుదారిని మడుగుదాటి మత్స్యపురి జేరి యటనుండి వీరవాసరము మీఁదుగా రాయకుదురు వెళ్లి యచ్చట, నెవరి యింటనో భుజించి యానాటిమధ్యాహ్నము తోకలపూడి వెళ్లి వారు పాముసింగన్న యింటికి బోయిరి. ఆతఁడు వారిని సగౌరవముగా నాదరించి యరుగుమీఁదనున్న చిరుగు త్రాటియాకుల చాపమీఁదఁ గూర్చుండబెట్టి, నివాసస్థానము గృహనామమును దెలుసుకొన వచ్చినపని యేమని యడిగెను. అప్పుడు చిలుకూరి శేషయ్య ఇట్లు బదులు చెప్పెను. "సింగన్నగారూ: యితఁడు మాఁమేనల్లుఁడు. ఇంటిపేరు చింతావారు. పేరు

నాగన్న. ఈతనికి వివాహము కాలేదు. చిన్నప్పటినుండియు మావానికి పుణ్యక్షేత్రములు సేవించుట తీర్థయాత్రలు పోవుట మిక్కిలి యిష్టము. దేవతాదర్శనమన్న వానికి పరమసంతోషము పురాణశ్రవణమన్నయతడు చెవి గోసికొనును. తల్లిదండ్రులు చిన్నప్పుడేపోయిరి. వారు పోయిన దుఃఖముచేతను. సహజమైన వైరాగ్య భావము చేతను చిన్నప్పుడే కాశీ రామేశ్వరము మున్నగు పుణ్యక్షేత్రములు పోయి వివాహ విషయమై శ్రద్ధచేయకపోయెను. తీర్థయాత్రలు చేసిచేసి దేశములు తిరిగితిరిగి విసిగి వేసారి యిల్లు జేరెను. పెండ్లియాడవలెనని వానికిప్పటికిని సంకల్పములేదుగాని దగ్గరచుట్టములమైన మేమందరము వంశవిచ్ఛేదమగునని నొక్కిచెప్పి మెడలువిఱిచి వివాహమునకు నేదోవిధముగా నొడంబఱచితిమి. మీదగ్గర పదునొకండు వత్సరములపిల్లయున్నదని విన్నాము. ఇది మేమువచ్చినపని. మావాఁడు కొంచముడబ్బు సంపాదించినాఁడు మీయిష్టప్రకారము నడచుకొనుటకు సిద్ధముగ నున్నాఁడు." ఆమాటలువిని సింగన్న శేషయ్యతో నిట్లనియెను. "అయ్యా! యీయన వయస్సెంత తల తెల్లపీచులాగున్నది. పండ్లులేవు శరీరమునిండ తామరయున్నది, యిటువంటివానికి పిల్లను నేనెట్లీయఁగలను. చదువుకొన్నవానిని పడుచువానిని జూచి యీయవలెనని యున్నది. అనవుడు శేషయ్య మెల్లగా నిట్లు బదులు చెప్పెను "సింగన్నగారూ. శరీరతత్త్వమునుబట్టి యొక్కొక్కనికి తలచిన్నప్పుడె నఱసి తెల్లబడును. దానినిబట్టి వాఁడు వృద్ధుడని మీరు భావింప గూడదు. మావాఁడు తీర్థయాత్రలు చేసినప్పుడు బదరీనారాయణములో నుండగా మిక్కిలి జబ్బుచేసినదట, అప్పుడొకయోగి రసవిషగంధకాదులు ప్రయోగించి మందులిచ్చి కుదిర్చెనట. రస, గంధకాదుల సంపర్కముచేత పండ్లూడిపోయినవి గాని వార్ధకము చేతగాదు. విదేశములలోఁ దగిన

యన్న సౌష్టవము మొదలయినవి లేకపోవుటచేతను, తలయంట్లు శరీర మునకు నలుగు లేకపోవుటచేతను వానికీసమయమునే తామరపట్టినది దానికి తగిన చికిత్స చేయించెదము. అదెంత సేపు ? త్వరలోనేపోవును. అదిగాక తామర లక్ష్మీప్రదమని పెద్దలు చెప్పుదురు. లక్ష్మీదేవి తామర లోనే యుండును. ఆమెచేతిలో నెప్పుడు తామరపువ్వుండును. బ్రహ్మ దేవుఁడు తామరలోపుట్టెను తామరమీద గూర్చుండును. కాబట్టి తామర దేవతలకు ప్రియమైనది. ఈమాటలు నేను చమత్కారమున కన్నాను నుండీ తగిన చికిత్స చేయించి తామర పోగొట్టెదను. వానివయస్సు ముప్పదియైదు సంవత్సరములు పూర్వకాలము మనపెద్దలు ముప్పది యేండ్లు దాటిన తరువాతనే గదా పెండ్లిచేసుకొనెడివారు. మనపెద్దల యాచారములనుబట్టి పెండ్లిచేసికొను వయస్సిదే ! మీపిల్లగూడ పదు నొకండు సంవత్సరముల ప్రాయము గలదనియు గోనగా పెరిగినదనియు ఉతారుగా నుండుననియు నేనువిన్నాను. ఈడుసరిపోవునుగాని విపరీత ముగా నుండదు. వయస్సులో పాతిక సంవత్సరముల తేడా యొక గొప్ప తేడాకాదు. మీకోరిక యేదో చెప్పినపక్షమున ఆప్రకారము మేము నడచుకొనుటకు సిద్ధముగా నున్నాము ” అని శేషయ్య ప్రతివచనము లియ్యగా “ మా మామగారితోను నాభార్యతోను నేనాలోచించుకొని మీకు రెండుమూడుదినములలో ప్రత్యుత్తరము చెప్పెదను మీరు అటుతరువాత రండి. అని సింగన్న బదులు చెప్పుటయు శేషయ్య “ మాగొల్లపాలెము వెళ్లి మూడునాలుగు దినములలో వచ్చుట కష్టము. ఇక్కడకు దగ్గరగానున్న పోలమూరులో మా చిలుకూరివారు న్నారు. ఆ రెండుదినములు మేము వారియింటనుండి వచ్చెదము. పం ద్రెండువందలరూపాయలవఱకు మా వాడియ్యదలఁచుకొన్నాఁడు పిల్లకు మూడువందల రూపాయలు నగలు పెట్టవలెనని వానిసంకల్పము పుస్తె

ముడివేసి యలంకారములు పెట్టకపోవుట వానికి యిష్టము లేదు. ఐదు దినములు పల్లకీభజంత్రీలతో వైభవముగా పెండ్లి చేసికొన దలచు కొన్నాడు. మాపిల్ల సుఖపడునుగాని కష్టపడదు. పిల్ల కాపురమునకు వచ్చినతరువాత మరికొన్ని నగలుకూడ చేయించగలడు. ఈసంగతు లన్నియు మీరుచక్కగ నాలోచించుకొని నాకుజవాబు చెప్పండి. శలవుపుచ్చుకొని వెళ్లివచ్చెదము" అనిలేచి నాగన్నను దీసికొని శేషయ్య వెడలిపోయెను. అతడు వెళ్లినతరువాత సింగన్నయు మామి ళ్లమ్మయు నీసంబంధము విషయమున జాలసేపు ప్రసంగించిరి. అత్తటి మామిళ్లమ్మ భర్తతో నిట్లు జెప్పెను. "వీడెక్కడిపెండ్లికొడుకండి నల్లగ పొడవుగ తాటిచెట్టంతున్నాడు. పగలుచూచిన రాత్రికలలో నికి వచ్చునట్లున్నది వానివిగ్రహము. ఏసుఖసంబంధములైన రోగముల చేతనో రసము దినుటచేత వానికిపండ్లూడినవని నేననుకొనుచున్నాను. వానికేమిటి ముప్పదియైదేండ్లేమిటి. అరవదియేండ్లకు తక్కువయుం డవు. వానికిమాత్రము పిల్లనీయవద్దు. చిన్నవానిని చక్కనివానినిజూచి పెండ్లి చేయవలెనని నేననుకొనుచుండగా పిశాచమును తీసుకొనివచ్చినా రేమి. అయినను యీసంగతి మా నాయనతో నాలోచించి మనము నిశ్చ యించవలెను. మీరువెళ్లి మానాయనను తీసుకొనిరండి. అనవుడు సింగన్నయు ల్లెయని మఱునాడుదయము రాయకుదురువెళ్లి యత్త గారిని మామగారిని కలుసుకొని నాగన్నవిషయమై చెప్పి తుదకిట్లని యెను. మామగారూ నాగన్నగాడి దగ్గర రొక్కమున్నట్లు కనబడు చున్నది. వాడు పండ్రెండువందల రూపాయలు చేతికీయదలచుకొ న్నాడు. మూడువందల రూపాయల బంగారము పెట్టదలచుకొ న్నాడు. ఐదుదినములు పల్లకీ భజంత్రీలతో పెండ్లిచేసుకోదలచుకొ న్నాడు. వయసుమాత్రమేబది సంవత్సరములున్నట్లు కనబడును.

ముప్పదియైదేండ్లేయున్నవని మేనమామ చెప్పినాఁడు. పిల్లకు నగల ముచ్చటయు పల్లకీముచ్చటయు తీరును. వానిధోరణిచూడఁగా నెంత సొమ్మిచ్చియైన వివాహమాడఁదలచుకొన్నాఁడు. మనము గట్టిగా నొక్కితిమా పదియేనువందలరూపాయల వఱకు మన చేతికీయవచ్చును. దొడ్డిలో పెద్దగొడ్డే పడినది. దానిని దాటిపోనీయ గూడదు. మీఅమ్మాయికి మట్టుకీసంబంధ మిష్టములేదు. అందుచేత మీరొకసారి శ్రమపడివచ్చి మీకూతునకు నచ్చజెప్పి యీసంబంధము దాటిపోకుండఁ జేయవలెను. పెండ్లిఖర్చు మనకు విశేషము లేకుండ వరపంచకముగా రమ్మని వారిని మనము కోరినను వారు తప్పకయట్లే వత్తురు. అని తన మనోరథము సింగన్న యెఱిఁగింప మరిడయ్య మంచిదని యల్లునితోఁగూడి తోకలపూడి పోయెను.

---

## పదునొకండవ యుల్లాసము.



మరిడయ్య తోకలపూడి వచ్చి చింతావారి సంబంధమును గురించి కూతురుతో ప్రసంగించెను. ఆసంబంధము తనకెంతమాత్ర మిష్టములేదని మామిళ్లమ్మ తండ్రితో నొక్కివక్కాణించెను. అల్లునకు వలెనే మరిడయ్యకు గూడ మాటలేగాని మాటలు నచ్చవు గనుక పుత్రికవాక్యములాతని తలకెక్కలేదు. పుత్రికబుద్ధి మరలించుటకు మరిడయ్య బహువిధములైన యెత్తులు చెప్పెను. మామిళ్లమ్మ తనవాదము తండ్రియుక్తులముందర దుర్బలమగుటచే నెట్టకేలకు విసిగి యిట్టులనియెను. “ఆబోసిపులికే బిడ్డనిచ్చి దానిగొంతుక కోయదలంచుకొన్న పక్షమున నాకూతునకు నేను పెండ్లి చేయను. ఈముండకు మూడేండ్ల వయసునాఁడే పెండ్లిచేసినపక్షమున దానికేమియుఁదెలియకపోవును. ఇప్పుడు గుఱ్ఱములాగు యెదిగికూర్చున్నది. గనుక పెండ్లికొడుకును చూచినప్పటి నుండియు నది వెఱ్ఱి యెత్తినట్లున్నది. ఆపెండ్లికొడుకు నాకు వద్దుగాక వద్దని నాచెవినిల్లు గట్టుకొని పోరుచున్నది. ఎలుగుబంటులాగుననున్న ఆముసలి వగ్గునకు నిక్షేపమువంటి బిడ్డను బలవంతముగా గట్టిపెట్టి మనమేమి బాగుపడగలము, దాసియుసురు నీకును నాకును దగులదా? ఇదివరకుసంపాదించిన డబ్బుచాలదా? ధనలక్ష్మికి దీనిని గూడ బలిపెట్టవలెనా? నాయనా! అల్లుని తలవాచునట్లు చీవాట్లు పెట్టక నీవుగూడ ఆయనపక్షమే వహించి మాట్లాడుచున్నావా? ఏమైననుసరే పిల్లనువాని కియ్యను.” అని మామిళ్లమ్మ కంఠోక్తిగా చెప్పుటచేత నప్పుడామెతో మాట్లాడిన పక్షమున బాకము ముదిరిపోవునని తరువాత మాట్లాడవచ్చునని మరిడయ్య జామాతకుఁగనుసన్నఁజేసి యప్పటికి తానూఱకుండెను. ఆవ్యవహా

రము పరిష్కరింపబడువఱకుఁ దనయింటనే యుండుమని మామను అల్లుడు బలవంతపెట్టెను. మరిడయ్య నల్లెయని యచ్చటనే యుండ దలఁచి మఱునాడు తెల్లవారుజామున నల్లుని వెంటఁబెట్టుకొని పొల మూరు వెళ్లి చిలుకూరివారి యింటనున్న శేషయ్యను నాగన్నను పిలిచి కొంతదూరము వారిని తీసికొని పోయి రహస్యముగ వార లతో నిట్లనియెను "శేషయ్యగారూ పెండ్లికుమారుని వయస్సు జూచి పెండ్లికూమార్తెయు దానితల్లియు మీసంబంధమునకిష్టపడ కున్నారు. మీరురొక్కము పదునైదువందల రూపాయలు చేతి కిచ్చి పిల్లదానికి మూడువందల రూపాయల నగలు పెట్టుటకునమ్మ తించిన యెడల నేలాగో యొకలాగు సంబంధము నేనుకుదిర్చెదను. నేనుసింగన్న మామగారను, రాయకుదురు మాకాపురము ఇదిగాక రెండెకరముల భూమి పిల్లపేర వ్రాయించమని మాపిల్లకోరిక ఇందుకు మీయభిప్రాయమేమి" ఆమాటలువిని శేషయ్య మేనల్లుని చాటుకు తీసుకొని బోయి "ఏమిరా నాగన్నా అసాధ్యము వచ్చినదే పదియేను వందల రూపాయలు చేతికియ్యవచ్చును మూడువందల రూపాయల నగలు బెట్టవచ్చును నీకు గోష్పాదమంత భూమియైనలేదే! భూమి వ్రాసియిచ్చుటయెట్లు దీనికేమి సమాధానము చెప్పుమందువు?" అనవుడు నాగన్న "సరే! ఒప్పుకో భూమిమాటకూడ నేనుతరువాత నీతో చెప్పెదనులే యనిమామను దోడ్కొని మరిడయ్యయు వాని యల్లుడు నున్నచోటికి బోయిరి. ఏమినిశ్చయించినారని మరిడయ్య యడుగ శేషయ్య యిట్లనియె "మీరు మాపిల్లవానిమీద చాల భారముపెట్టినారు, అయినను మావాడు వంశము నిలుపుకో దలచినాడు గనుక మీకు పదునైదువందల రూపాయలు చేతికి నియ్యగలఁడు, మున్నూరు రూకల నగలు పెట్టగలఁడు, భూమిసంగతిగూడ మావా

జేదో యేర్పాటుచేయగలఁడు కాబట్టి మీరు శుభముహూర్తము నిశ్చయించండి" అనిమఱేమో చెప్పబోవుచుండ సింగన్న యందుకొని "అయ్యా ముహూర్తము వారము దినము లున్నదనగానే పదియేను వందల రూపాయలు రొక్కము దెచ్చి నాచేతిలో బోయవలెను. కన్యాదానపువేళనే నగలు పెట్టవలెను రెండెకరముల భూమియు పిల్లపేర వ్రాసి రిజిష్టరు జేయించి వివాహమునకు ముందుగా నాచేతి కియ్యవలెను. అక్షరాల యీప్రకారము జరిగించవలెను, లేనిపక్షమున వివాహము కాదుసుమీ!" అనిగట్టిగ జెప్పెను. సరేయని శేషయ్యయు నాగన్నయు నొప్పుకొని మరలతోకలపూడి వెళ్లకయె స్వగ్రామమునకు బోయిరి.

ఇక మాణిక్యమ్మను వివాహమునకు నొడంబఱచవలసిన భారము మరిడయ్యమీఁదఁ బడెను, తోకలపూడి వచ్చినతరువాత మరిడయ్య కూతును గూర్చుండ బెట్టుకొని కొంత లోకాభిరామా యణము జెప్పి వివాహప్రసంగము దెచ్చి మెల్లమెల్లగా నిట్లనియె: "అమ్మాయీ! నేను పెద్దవాఁడను. నీమేలును నీకుటుంబము మేలును కోరిన వాఁడను. అసలు కన్న వడ్డీముద్దన్నారు పెద్దలు. నీకన్న నీకూతురు నాకుముద్దు నీకూతురును నేను పాడు జేయనుకదా: అదిసుఖపడగా నేను చూడవలెనని నాసంకల్పము. ఈవచ్చిన సంబంధము చాల మంచిది. చింతావారంటే ఆహితాగ్నులు కర్మిష్ఠులు పెండ్లికుమారుని వయస్సు నలుబదిసంవత్సరములలోపు నోరు బొత్తిగా బోసిదిగాదు కొన్ని పండ్లున్నవి తామరకేమి మంచిమందు రాసుకొన్న పక్షమున పోవును పదియేనువందల రూపాయలు ఘల్లుమని చేతిలో పోయదలుచుకున్నాడు. అందులో నైదువందల రూపాయలు నీకిప్పించెదను. నీయిష్టము వచ్చిన నగలు చేయించుకోవచ్చును పిల్లకు

మూఁడువందల రూపాయల నగలు పెట్టే యేర్పాటు చేసినాము, ఇదిగాక రెండెకరముల భూమిగూడ వ్రాసియిచ్చుటకు పెండ్లికొమారుఁడొప్పుకొన్నాఁడు మీనల్ల మొద్దుముండ సుందిభికి ఒంటినిండా బంగారము గాక రెండెకరముల నల్లబంగారము గూడ వచ్చుచున్నది. ఏమంటి నీయభిప్రాయము చెప్పు? ఈ సద్ధతులకు వారొప్పుకొన్నారు, నీమగనికాసంబంధ మిష్టముగా నున్నది.వద్దని యీయుక్తతలు నీనెత్తిమీద వేసుకొనక నామాటవిని సమ్మతించు. భార్యాభర్తలకు మనస్సులు కలసియుండవలెను గాని భేదము లుండగూడదు గనుక నోతల్లీ నామాట విను ఆటంకపెట్టకు." అని గడ్డము పట్టుకొని కూతును బ్రతిమాలి దుందుభిని బిలిచి "సెత్తితల్లీ యీసంబంధమువద్దని నీవు కూడ నన్నావని విన్నాను. చిన్నపిల్లలకు చిన్నందము లుండవలెను. పెద్ద పోకడలు పోగూడదు. మీనాయనయు మీయమ్మయు నేలాగు చేయుదురో ఆలాగువిను పెద్దముండాకొడుకును. నేచెప్పినది కాదనకు అతనిదగ్గర రొక్కము చాలా యున్నదని విన్నాను. అది యావత్తు నీదే! భూమికూడా నున్నదట మీయప్ప సెల్లెంద్ర సంబంధములలో నీదే శ్రేష్ఠమైనది. ఇక మారుమాటాడకు." అనియూరకుండెను

"ధనమూల మిదం జగత్" అన్నాఁడు భర్తృహరి. ధనమున్నవాఁడె గుణవంతుఁడు బలవంతుఁడు రూపవంతుఁడు నానాగుణములు బంగారము నాశ్రయించునని యామహాకవి జెప్పిన వాక్యము సత్యముగదా! బంగారము దాల్చిన కురూపి సురూపి యగును. గుణహీనుడు గుణరత్నాకరుఁడగును, అదివఱకు నాగన్న సంబంధమన్న రోతగలిగిన మామిళ్లమ్మ తనచేతిలో నైదువందల రూపాయలు పడునని వినగానే మెత్తబడి లోపల నేదో కొంతసేపు గొణుగుకొని ప్రకాశముగా దండ్రికిట్లు బదులు చెప్పెను. "నాయనా! నీవుపెద్దవాఁడవు నీయల్లుఁడు యింటి

యజమానుఁడు మీరియిద్దఱు చెప్పినట్లు వినక తప్పునా? మీకంటె నెక్కువగ నేనెఱుఁగుదునా? ఆమంచి చెడ్డలు మీకే వదలినాను మీరు గొంతు కోయుదురా, యేమి! మీయిష్టప్రకారమే నేను చేసెదను. దుందుభిగాఁడు నామాట కడ్డు చెప్పఁడు." అని తల్లి పలుకుచుండ దుందుభి తాతవంకను తండ్రివంకను చూచి చూచి వారిమాటలు తనమనస్సున కిష్టము లేమి తెగించి యిట్లనియెను. "ఆదిక్కుమాలిన మగఁడు నాకువద్దు ఆబోసి పులితో నేను కాపురము చేయలేను. వానితామర నేను గోకలేక చావవలెను. ఆయన కిచ్చి పెండ్లి చేయుటకన్న మనపెద్ద గేదెకిచ్చి పెండ్లి చేయుట మంచిది. మీరు చచ్చినను సరే నేనాతని బెండ్లియాడను." ఆపలుకులు విని మాతామహుఁడు మరిడయ్య కడుకోపించి మనుమరాలి నిట్లు మందలించెను. "ఓసీ! వెఱ్ఱి పాడె కట్టా! తల్లి దండ్రులు చెప్పినట్లు విని పెండ్లి యాడవలెనుగాని లేనిపోని కూతలు కూయవచ్చునా! పెండ్లి యాడక బ్రహ్మచారి ముండవై యుందువా? లేక మోలుమేను లేచిపోదువా? నోటికి యెంతమాట వచ్చిన యంతమాట ఆడెదవా తప్పుతప్పు నోరుమూసుకో" అతఁడింకను మాటాడుచుండగనే! సింగన్న మహాకోపముతో లేచి కూతుకడకుబోయి నీమొగము ముండ! పాడు ముండ! కొంపజెడ బుట్టినావే! పెండ్లియాడుట యాడకపోవుట నీయిష్టమా?" అని జడపట్టుకొని మెడవంగదీసి ఛళ్లుఛళ్లున వీపుమీద నాలుగు చఱుపులు చఱచెను. మామిళ్లమ్మ యడ్డము పోయి "అయ్యో యిదేమి పాపమండీ కుఱ్ఱముండ తెలియక యేదో వెఱ్ఱి మొఱ్ఱి మాటలన్నంత మాత్రాన మీరు చేయి జేసుకొని పసిబిడ్డను కొట్టవచ్చునా, చాలు చాలులెండి" అని సింగన్న నావలకు గెంటెను. మరిడయ్యయు యింత మాత్రమునకు కొట్టుట యెందుకు అదే క్రమముగ దారికివచ్చును అని

యల్లుని ఆవలకు లాగుకొని పోయెను. దుంముఖి "అమ్మో నాయెనో చచ్చిపోయినానత్తోయి" అని పెద్దపెట్టున నేడ్చెను. ప్రక్క పొరుగున నున్న యమ్మలక్కలు వారికేదో యాపద మూడిన దనుకొని చూడ వచ్చిరి. అప్పుడు మామిళ్లమ్మ కోపముతో మొగమెఱ్ఱబడ వారినిం జూచి యిట్లు కఠినముగ బలికెను. "ఏమమ్మా! యెందుకు వచ్చినారు? చూచుట కిక్కడ భాగవతము ఆడుటలేదు. మాయింట వింతలు విడ్డూరములు జరుగుటలేదు. మీయింటికి మేము వచ్చినామా రమ్మని మిమ్ము బొట్టు కాటుక బెట్టి పిలువలేదు. చాలుచాలు దయచేయండి యీపాటికి మీకు పనిపాటలు లేవాయేమిటి మగవాండ్ర యదుపాజ్ఞలు లేక తిరుగుచున్నారు." ఆకఠినోక్తుల నాకర్ణించి యాయంగనలు యెఱుగకపోయి వచ్చినాము వీరియింటికి అని తమలో తాము గొణుగుకొనుచు వెడలిపోయిరి.

## పండ్రెండవయుల్లాసము



సింగరాజు కనకరాజు గొప్ప లౌక్యుడు, ఆరువేల నియోగి బ్రాహ్మణుడు; పెదగొల్లపాలెము నందును చినగొల్లపాలెమునందును మరి చుట్టుప్రక్కల గ్రామములందును వానికి మిక్కిలి పలుకుబడి గలదు. అతడు తలలు మార్చి తలలు పెట్టునని యాప్రాంతముల యందు గొప్ప వాడుకగలదు. అతని కేయుద్యోగమును లేదు. మడిమాన్యము లంతకన్న సున్న. జీవన మెట్లుందురేమో? పల్లియలలో మనుష్యుల కేవో వివాదము లుండకపోవు గదా! అట్టి తగవులు సంభవించినప్పుడు కనకరాజేదో పక్షము వహించి యావ్యవహారము తన బుజము మీద వేసుకొని కాగితముల కట్ట చంకక్రింద పెట్టుకొని బందరు పోయి, అన్నగారిమీఁద తమ్మునిచేతను తమ్మునిమీఁద నన్నగారిచేతను బిడ్డల మీఁద తల్లిదండ్రుల చేతను తల్లిదండ్రులమీఁద బిడ్డలచేతను వ్యాజ్యములు వేయించి తాను బూనిన పక్షమువారిచేత కొంతధనము బహిరంగముగను, కొంతధనము రహస్యముగను, సంగ్రహించి కుటుంబ పోషణము చేసుకొను చుండును. న్యాయవాదుల కియ్యవలసిన సొమ్ములో కొంత తాను రుసుముక్రింద చేకొనుచుండును. విశేషముగా రాబడిలేని న్యాయవాదియొద్ద నూటికి అరువది డెబ్బది రూపాయలు తన రుసుము క్రిందనే కొట్టివేయును. దర్జాగల న్యాయవాది యొద్ద నూటికి యిరువదియో పాతికయో పుచ్చుకొని సంతసించును. అమాయకులైన రైతులు మొదలైనవారు న్యాయస్థానములకు వెళ్లవలసి నప్పుడు ఆ కర్చులు యీకర్చులని యేవో వంకలు పెట్టి ఎక్కువ ధనము లాగుచుండును. గొల్లపాలెము కృష్ణామండలములో మచిలీపట్టణమను పేరుగల బందరు తాలూకాలో చేరినదగుటచే కనకరాజు వాదులను ప్రతివాదు

లను వెంటబెట్టుకొని బందరు వెళ్లి నెలకిరువది దినము లక్కడనే యుం
డును. ఆతని వశమైన మనుష్యులు న్యాయస్థానమున కెక్కి తీరును.
కొడుకు తండ్రిమీఁద వ్యాజ్యము వేసినను, కనకరాజు ప్రోత్సాహము
చేత నతడు తనకుప్రతివాది తండ్రిగాడని వాదించును. కనకరాజు మా
యలలోబడి యెందరెందరో మోసబోవుచుందురు. బందరువెళ్లినప్పు
డాయనను న్యాయవాదు లెందరెందరో పిలిచి భోజనము పెట్టి మిక్కిలి
గౌరవించుచుందురు. కనకరాజు సకలధర్మ శాస్త్రములు న్యాయస్థాన
ముల వ్యవహారములు, తెలిసిన వాఁడనియు, నతనిముందర న్యాయ
వాదులుకూడ నెందుకు బనికిరారనియు నాచుట్టుపట్ల నున్నది నలు
బది గ్రామములలోని జనులకు నమ్మకి.

శేషయ్యయు, నాగన్నయు, గొల్లపాలెమునకు పోయి యాడు
పెండ్లివారు కోరినట్లు రెండెకరముల భూమియు నీయని పక్షమున
పెండ్లిగాదు, పెండ్లియగు దారి యేదియని రెండుమూడు దినములు
విచారించి కనకరాజు కడకు బోయి యావిషయ మంతయు వానికిజెప్పి
యాలోచనమడిగిరి. తుట్టతుదను శేషయ్య వానితో నిట్లు మనవి
జేసెను. "కనకరాజుగారూ! మాయూరికి మీరు మేరుపర్వతము వంటి
వారు. ఈవిషయములో మాకుగట్టి యాలోచనము జెప్పవలెను.
భూమియిచ్చినగాని వారు పిల్ల నిచ్చుటకు వీలులేదన్నారు. వివాహము
కాదను భయమున నుండి ధైర్యము జేసి భూమి నిచ్చెద మన్నాము.
మామేనల్లునకు గిద్దెడు భూమి యైన లేదు. తగిన యాలోచనము
చెప్పి మావానినొక యింటివానిని జేయవలయును. వంశము నిలుప
వలెను. చింతావారి వంశము నిలిపిన ఫలము మీకు దక్కును."
ఆమాటలు విని కనకరాజు కొంచెము ఆలోచించి "శేషయ్యగారూ!
యీరాత్రి నేను చక్కఁగా నాలోచించి రేపుదయమున మీకీ విపత్తు

దాటుటకు తగిన యుపాయము జెప్పెదను. తప్పక రేపు ప్రాతఃకాలమున రండి. చూడండి మనయూరి కరణము మిక్కిలి తుంటరి సుమండి నాభూమిమీఁద నేను పాతికరూపాయలు పన్నియవలెను. సొమ్ము సద్దుబాటులేదు. పది దినములలో దివాణపు పన్ను గట్టెదనని యెంత బ్రతిమాలినను వినక రేపుదయమున నాచరాస్తి జప్తు జేయించెదనని వర్తమాన మంపినాఁడు తెల్లవారిలేచి ఒకరిమొగము ఒకరు చూచుకొనక పోవుదుమా! యీచిన్న రాజకార్యమునకు మొగమాటము లేకుండ నింతపని చేయుదలుచు కొన్నాఁడు. ఒక్కపాతిక రూపాయలు నాకు బదులియ్యండి పువ్వులలో బెట్టినట్లు మీసొమ్ము మీకు వారము దినములలో నిచ్చివేసెదను. పాతిక రూపాయలు నాకులెక్కటండి వాఁడు కుక్కబుద్ధి చూపించుకొన్నాఁడు గాని!" అని ప్రసంగింప శేషయ్య "చిత్తము చిత్తము పాతిక రూపాయలు తమకు లెక్కేమిటి నాగన్నా పంతులుగారికి రేపుఉదయమూ సొమ్ము మనము దాఖలుచేయవలెను." అనిచెప్పెను. నాగన్న తప్పకుండ ఆలాగె చేయుదము పంతులుగారియొద్ద నున్నసొమ్ము మనపెట్టెలో నున్నట్లే యని మేనమామకు బదులు చెప్పెను. అనంతరము మేనమామయు మేనల్లుడును స్వగృహమునకు బోవుచున్నప్పుడు, మామా! యీపాతిక రూపాయలు బదులన్న పేరేగాని కనకరాజుగారికి సమర్పించవలసినదే అయినను మంచి యాలోచన జెప్పినపక్షమున మనమా సొమ్ము నియ్యవచ్చును. అనిమరియేదో మాట్లాడుకొనుచు నడిచి స్వగృహము చేరిరి. మరునాడుదయమున మామయు నల్లుఁడును పెందలకడలేచి కాలకృత్యములు దీర్చుకొని పాతిక రూపాయలు చేతబుచ్చుకొని కనకరాజుగారి యింటికి బోయిరి. కనకరాజు వారిని సగౌరవముగ దీసుకొనిపోయి యొకవసారా గదిలో కూర్చుండ బెట్టి వారిచెవిలో

నేదో యుపదేశించెను. మేనల్లుడు శభాస్ బాగున్నదనెను. మేనమామా దీనివల్ల మనకేదైన బాధరాదుగదండీ యని యడిగెను. “బాధలేదు. మూడు ప్రాణములకు నా ప్రాణము అడ్డము వేసెదను తాలా ఖూషు వచ్చినప్పటికి మీసాశిఖలోని పువ్వు వాడదు. నాభూమి యేది యని నీభార్యవచ్చి యడిగిన పక్షమున నేజవాబు చెప్పి సమర్థించెదను. ముందు పెండ్లి కానిచ్చుకో! తరువాత నాపరుగు అందుకోండి యని చెప్పవచ్చును. వివాహ మయినతరువాత పిల్లమనది. ఎంతకోపము వచ్చినను పిల్లను మన యొద్దకు పంపితీరవలయును అన్నిటికి నేనున్నాను గదయ్యా నీవు భయపడకు.” అని కనకరాజు వారికి ధైర్యము చెప్పెను. అంతట యిరువదిమైదు రూపాయలు లెక్కించి నాగన్న కనకరాజు చేతిలో బెట్టెను. కనకరాజు సంతోషించి మీపని నిమ్మకాయ వాటము చేసెదను భయపడకండి. నేజెప్పిన రెండెకరముల భూమి నీభార్యపేర దస్తావేజు వ్రాయించెదను. పదిరూపాయల స్టాంపు తీసుకొని రమ్ము. ఈ సాయంకాలము లోపుగా పత్రమువ్రాసి రేపు ఉదయమున బయలుదేరి బందరు వెళ్లి రిజష్టరు జేయింతము ఇకనీపెండ్లి తప్పక జరిగితీరును. వెళ్లండి, స్టాంపు తీసుకొని రండి యని వారిని బంపెను. జాములోపుగ నాగన్న పదిరూపాయల స్టాంపు తీసుకొనివచ్చి యిచ్చెను. సాయంకాలము లోపుగానే కనకరాజు తనకు లోకువైన యొక పడుచువానిని బిలిచి పత్రము వ్రాయించెను. తాను నడుపుచున్న వ్యవహారములలో తాజెప్పినట్లు కూటసాక్ష్యము లిచ్చెడు యిద్దరు మనుష్యులచే సాక్షి వ్రాళ్లుచేయించి నాగన్న చేతగూడ సంతకము జేయించెను. మరునాడు తెల్లవారు జాముననే వారు గొల్లపాలెము విడిచి పెదపట్టణము దగ్గర నుప్పుటేరు దాటి రెండు జాములకు బందరు జేరి స్నానములు జేసి పూటకూళ్లయింట భుజియించి పత్రము రిజిష్టరు జేయించి మఱునాడు స్వగ్రామము జేరిరి.

పత్రము రిజిష్టరైన మూడుదినములకు శేషయ్య తనగ్రామములో నున్న సాటి వెలనాటి బ్రాహ్మణులను మువ్వురను దీసుకొని సింగన్నచేతికిచ్చుటకొ పదునేను వందలరూపాయలును పెండ్లికుమార్తె యలంకారముల నిమిత్తము మూడువందల రూపాయలును దీసికొని తిన్నగా రాయకుదురు వెళ్లి మరిడయ్యను దీసికొని తోకలపూడి వెళ్లెను. అరాత్రి కొణితవాడ నుండి మఱియిద్దఱు బ్రాహ్మణులను బిలిపించెను. ఆబ్రాహ్మణుల పరిముఖముగ శేషయ్య పదునైదువందల రూపాయలు సింగన్నకిచ్చి పిల్లకు మీాయిష్టము వచ్చిన నగలు చేయించుకొమ్మని మూడువందల రూపాయలు నిచ్చి పసుపు కుంకము యిచ్చి బ్రాహ్మణులకు ఫలప్రదానములిచ్చెను. బ్రాహ్మణాశీర్వచనముతో ప్రధానమహోత్సవము సంపూర్ణమయ్యెను. అనంతరము పెండ్లికుమార్తెకు పెండ్లికొడుకిచ్చిన భూమినిగురించిన దానపత్రమునుగూడ శేషయ్య సింగన్న హస్తమునబెట్టి అయ్యా యిగి సుక్షేత్ర ఖండిక సంవత్సరమునకు నలుబది రూపాయలు ప్రతిఫలము వచ్చును. మనమ్ము దివాణమునకు యేవిధమైన పన్ను చెల్లింప నక్కఱలేదు. ఇదిశ్రోత్రియమైన సర్వదుంబాలాయీనాము, మనమింటకూర్చుండగానే రైతు సొమ్ముదెచ్చి చేతిలో బోయును. కావలసినంత నీటియేర్పాటు గలదు. అని యచ్చటి వారందరికి విశ్వాసము గలుగునట్లు దృఢముగ బలికెను. పెండ్లివారికి సింగన్న యరిశల పిండివంటతో భోజనముపెట్టి శేషయ్యకును వానివెంటవచ్చిన మఱియొక బ్రాహ్మణునకును మాత్రము అంగవస్త్రముల వంటి రెండు పంచలచాపులు బహుమతి చేసెను. శ్రీముఖనామసంవత్సర వైశాఖశుద్ధ నవమినాడు, శుభముహూర్తము నిశ్చయించి, యానాటికి తరలిరమ్మని సింగన్న శేషయ్యతో జెప్పెను. "తథాస్తు" అని శేషయ్యయు తక్కిన బ్రాహ్మణులును తెల్లవారుజామున వెళ్లిపోయిరి. అప్పటికి శుభముహూర్తము రమారమి నెలదినములుండెను.

---

సరస్వతి——ఇంతవఱకేమియులేదు. ఇంకే ముందున్నది. మునుల్లపం డుగ. సూరమ్మయింటికి నన్నొంటరిగఁ బిలిపించి కామాతురుఁడై నన్ను నిర్బంధించెను. నే నప్పటికిఁ దప్పించుకొనఁదలఁచి సాయంకాలమైన తరువాత నచ్చటికి వచ్చి చెప్పెదనంటిని. నా సతీత్వమును వీడి తన్ను దృప్తిపఱుపనిచో నా మానప్రాణములు దక్కింపక పోవుటయే కాక నా కుమారునిగూడ వధించునఁట.

(ధర్మారావు పండ్లు పటపటఁగొఱుకుచుఁ గ్రమముగాఁ క్రోధఘూర్ణిత తామ్రాక్షుఁడగును.)

ధర్మారావు——ఏమది? ఓరిదుర్మార్గుఁడా! ఎంతపనిచేసితివిరా! లోకమున సరస్వతికి దిక్కులేదనుకొంటివా! ఛీ! నీచుఁడా! ఈ ధర్మారావు మేనఁ బ్రాణములుండ నీ యాటలుసాగవు. నీకు వినాశకాలమునకే యీ విపరీతబుద్ధి దాపురించినది. చూడు. నిన్నేమిచేసెదనో!

ఉ. కత్తికిఁ గండ తీసెదను గాసిలఁజేసి వెడల్తురక్తమున్
గ్రుత్తును మేనశూలమును గొంతునుగోసెద భూమిపై బడన్
మొత్తెదఁ బాతిపెట్టెదను మున్నల భీముఁడు కీచకున్ బలెన్
నెత్తిని పొట్టదూర్చెదను నేక్షణమాత్రన దుర్మదాంధుఁడా!

(సాధ్వీ! నీకుభయములేదు. ఇదే బయలుదేరుచున్నాను. అని లేచును.)

సరస్వతి——తొందరపడకుఁడు. అతఁడు సామాన్యుఁడుకాఁడు. లక్షాధికారి. పలుకుఁబడి కలవాఁడు. ఈయూరిలో రక్షకభటులు దొంగలును గూడ నాతని వశవర్తులు.

ధర్మారావు——అయిననేమి?

ఉ. లక్షలు నుండుఁగాక పదిలక్షలసేవకు లుండ్రుగాక బల్
రక్షకసైన్య మాతనిని లాలనఁజేయునుగాక లోకమం
దక్షయమైన యేబలము నాతనికుండును గాక యీక్షణం
బక్షతగాత్రుఁజేసి దహియించెదఁ గ్రోధదవాగ్ని కీలలన్.

కావున నీ వడ్డుపెట్టకుము. ఇప్పుడేపోయి—(అని పోవుచుండ—
సరస్వతి అడ్డువచ్చి చేతులను బట్టుకొని)

సరస్వతి—అన్నా! తీవ్రపడినఁ బ్రయోజనమేమి? ఇప్పుడాతఁడు తన యింటనున్నాఁడు. ఇది పట్టపగటి సమయము. మీయీ వాలకముచూచినఁ ద్రోవలోనే ప్రజలు మిమ్మరికట్టుదురు. మనపని యంతయు భగ్నమగును. భారతములోఁ జెప్పిన నీతినిస్మరింపుఁడు.

ఉ. మాయలుగల్గు దుష్టులకు మాయపుభంగులె మందుగాక ని
ర్మాయుల నుల్లసిల్లెడు పరాక్రమలీలలు సెల్లునెట్లు వై
దేయులు తొల్లిమాయల నతిప్రబలాత్మకులైనఁ దద్వధో
పాయములన్ జయించిరె నృపాలక! విష్ణుఁడు నింద్రుఁడున్ దగన్.

కావున మీపాదములంటి మ్రొక్కెదను. శాంతింపుఁడు తరువాత నాలోచన చేయుదము.

ధర్మారావు—(కొంచెమాలోచించి శాంతించి కూర్చుండును.) నిజమే సాధ్వీ నీవన్నమాట నిశ్చయము. నాకాకోపావేశమున నేమియుఁ దోఁపదయ్యెను. నీవివేకము శాంతము ప్రశంసనీయములు. స్త్రీలకుఁ బురుషులకంటె మేధాశక్తి యెక్కువగుట స్పష్టమైనది. సరియే. ఇప్పుడు కర్తవ్యమేమో యాలోచించి నీవే చెప్పుము.

సరస్వతి—మీరే చెప్పుడు. నాకేమియుఁ దోఁచుటలేదు.

ధర్మారావు—(ఆలోచనవభినయించి) నేనిందాక కోపావేశములో జేసిన కీచకప్రశంసను బట్టి నాకొక యూహపొడముచున్నది.

మనయూరి వెలుపలనున్న పాడుశివాలయమునకు నీవు రాత్రి పదిగంటలకు వత్తునని యతనితోఁ దెలుపుము. నేను నీవేషము వేసి కొందును. కొంతకాలము క్రిందట నాటకమున స్త్రీపాత్రములను ధరించిన నాప్రజ్ఞ యిప్పుడుపయోగింపఁగలదు. నాకంఠస్వరము స్త్రీస్వరము నుబోలుననియు సది ముఖ్యముగా నీస్వరమును బోలియుండుననియు నన్ను మానతి యెప్పుడును మేలమాడుచుండును. ఇంకను భేదములు లేకుండ సవరించుకొనఁగలను. నీవస్త్రాభరణములు నా కలంకారము లగును. సందర్భమునుబట్టి ప్రత్యుత్తరము చెప్పి యాతనిని జక్కఁగ నమ్మింపఁగలనని నాకు నమ్మకము గలదు. ఆతఁడు కాముకుఁడు గావున నీవుచెప్పు నాకు లంగీకరించును. నన్ను విశ్వసించును. కాముకులకు వివేకమెక్కడిది? ఆమీఁదటిపని నేనే నెఱవేర్చెదను.

సరస్వతి—నే నిందుల కంగీకరింపను. నా సతీత్వరక్షణమునకై కృత్రిమ వర్తనమున కంగీకరించినను, మీరు నాకై యాపదనొందుట నా కిష్టములేదు. ఎవ్వరికిని శ్రమగలుగని యుపాయమొకటి నాకు స్ఫురించుచున్నది. ఇఁక నన్నురక్షించు దుర్ఘటకార్యము మీపై మోపుటకంటె మాప్రహ్లాదుని గాపాడుభారమునే మీపై నుంచుట నాకు సమ్మతము. ఇఁక నాకు విచారమేల?

ఉ. ఏలితి నెల్లసంపదల నెప్పుడొ నాథునిమ్రోల భక్తి ని
ల్లాలినిగా, మెలంగితి నిలన్ బ్రథితంబుగ సాధ్వివేరితో
నోలిసుతుండు గూడసగుచుండెడు ప్రాయము వచ్చువాఁడుగా
నేలయిఁకన్ మనంగఁ ద్యజియించెద బల్మిని నాదుప్రాణముల్.

ధర్మారావు—శివశివా! అంతపనియేలనమ్మా! మొత్తమునమీఁద స్త్రీప్రకృతి యనిపించితివి గదా! గోరఁబోవుదానిని గొడ్డటఁజీర

నేల ? (తనలో) నే నెట్లో మఱియొకందుకుఁ బ్రాణమునకుఁ దెగించి యున్నాను. ఇప్పుడు పనిలోఁ బనిగలిసి వచ్చినది. సెబాస్.

సరస్వతి—మీరు మఱలనేదో యాలోచనఁ జేయుచున్నారు.

ధర్మారావు—ఏమియులేదు. నీకు భయములేకుండఁ జేయుటకే. నీవు సాయంకాలము నిర్భయముగ వెళ్లి నాయాజ్ఞ నెఱవేర్పుము. ఈ సందర్భమున మాటాడఁగూడదు.

నీవాత్మహత్య చేసికొనఁదలచితివా! నీకంటెముందు నేనే యాపనిని జేసికొందును. మనముచేయుపని కేవలస్వార్థనిర్వాహణము కాదు. దైవకార్యమగు ధర్మప్రతిష్ఠాపనము. అధర్మ నిర్మూలనము లోకమునకంతకును జెందినది.

ఉ. లోకమునందుఁ గాముకులలో మృతిపీనిది పారమైచనున్
లోకుల నోర సాధ్వులకు లోటొనఁగూడదు నిక్కమంచు నీ
వాకు చెలంగఁగావలెను వర్తిలు ధర్మపథంబె శ్రేయమై
లేకిపుడూరకుండినను లేతురు దుష్టులు నిర్భయంబుగన్ ॥

గీ. ధర్మసంరక్షణంబె నేఁదలపకున్నఁ
గాల్పనే నాదు సంజ్ఞ నీఁకన్ బ్రజాళి
నన్ను వచియింపరె యధర్మనామ మెన్ని
యిహముఁ బరమును గోల్పడనే నెలంత ॥

కావున నీవింటికిఁ జని విశ్రమించి సాయంకాలమాపనిఁ దీర్పుము.

సరస్వతి—చిత్తము. తండ్రీ! విధిలేక యంగీకరించుచున్నాను. సాయంకాలము ప్రత్యుత్తరమును 'సరే' యనుమాటమాత్రము బాలునిచేఁ జెప్పి పంపుదును. నేను దఱచు నిచ్చటికివచ్చిన నతని గూఢచారులు కని పట్టుదురు. ఇఁక నేఁబోయెద. సెలవిండు.

( అని నిష్క్రమించును. )

ధర్మారావు—( స్వగతము ) నాజన్మమింక ధన్యముకాగలదు. నానామము సార్థకముకానున్నది. (చూచి) సతియును బ్రహ్మోదుడును వచ్చుచుందురు. వారికెదురేగి యోగిపుంగవుని విషయములను దెలిసికొందును. ఇఁక మోహిని విషయము స్మరింపఁగూడదు.

( నిష్క్రమించును. తెరపడును. )

---

## తృతీయరంగము.

---

( పురివెలుపల నరణ్యము—శ్రీ చిదానందయోగియు శిష్యుఁడును గూర్చుండియుందురు. )

శిష్యుఁడు— దేవా ! ఇందఱు మీసేవకై వచ్చుచున్నారే. ఎవ్వరిచ్చెదమన్నను నొక్క పైసయైనఁ గొనరేల. ?

శ్రీ చిదానందయోగి—మాకు ధనముతో నవసరములేదు. కామినీ కాంచనముల జయించినతరువాత మరల వానికి లోఁబడికుందు మూఢుఁడెవ్వఁడు నుండఁడు.

శిష్యుఁడు—ఆధనమును లోకోద్ధరణమునకై వినియోగింపవచ్చును.

శ్రీ చిదానందయోగి— మేముచేయు లోకోద్ధరణకార్యమున కొక్క పైసయైన నక్కఱలేదు. అది యమూల్యము. ధనమూలమైన కార్యములు మేముచేయము.

శిష్యుఁడు—పోనిండు ఒక్క మఠమైన నిర్మింపవచ్చునే. అందు మీరు నిలిచి శిష్యులకుపదేశములఁ గావింపవచ్చును.

శ్రీ చిదానందయోగి—మఠనిర్మాణముతో మాకుఁబనిలేదు. అరణ్య వృక్షములే మామఠములు ఆవృక్షములైనను నేడొకటి రేపొకటి. ఒక్కచోటనే యుండవలయునను సక్తత మాకుండరాదు.

ప్రారబ్ధవశమున నీశరీరమక్కడక్కడ సంచరించుచుండును. అచ్చ టచ్చట ప్రజలతరణమునకు హేతువగును.

చ. వనతరులే నివాసములు స్వాదుఫలంబులె భోజనంబు పా
వన సరిదంబుపూరములె పానము నారలెకట్టుపుట్టముల్
మనుశయనస్థలంబు పరమంబగు వృత్తియుఁ దత్వచింత యే
యనఁజెలువారు యోగులిల నర్థములన్ మతముల్ గడింతురే॥

శిష్యుఁడు——క్షమింపుఁడు. నేను గ్రొత్తవాఁడ నగుటచేత నెఱుఁగక యిట్లడిగితిని. మఱియొక్క ప్రశ్న మడుగుదునా!?

శ్రీ చిదానందయోగి——అడుగుము.

శిష్యుఁడు——లోకములో నెన్నివిధములఁ బ్రజలార్తిఁ జెందుచుందురో మీరెఱిఁగిన విషయమేగదా! అయిన మీయనంత తపశ్శక్తిచే వారి దుఃఖముల నేలమాన్పరాదు.?

శ్రీ చిదానందయోగి——అదియు కూడనిపని. ఎవరికర్మమును వారనుభ వింతురు. ప్రారబ్ధమును దప్పింప నెవ్వరికిని వశముగాదు. విజ్ఞానము నంది యాగామి సంచితముల నశింపఁ జేసికొని ప్రారబ్ధమునకు వగవక ముక్తినందుటకు స్వయంకృషి యావశ్యకము. ఈవిషయ మున గురువులు మార్గదర్శకులుగ మాత్రముందురు. ఓంకారమత మిట్టిదుఃఖమును నివారించుటకు సాధనము.

శిష్యుఁడు——మీకడకుఁ దండోప తండములుగ వచ్చు ప్రజలందఱు దాని నాచరింతు రని మీకు నమ్మకము గలదా!

శ్రీ చిదానందయోగి—— లేదు—ఇందుఁ బెక్కండ్రు తాత్కాలి కోద్రేకముచే వచ్చినవారు సత్పథమును వెంటనే విస్మరించి మరల నంధకారములోఁ బడుదురు.

శిష్యుఁడు—అయిన నిట్టివారికి మీ రుపదేశించినచో వారికెట్టి ప్రయోజనము గల్గును.

శ్రీ చిదానంద యోగి—ఎవరి పరిణామ మెట్టిదో ముందుగ నిర్ణయింప రాదు. లక్ష్యబీజము హృదయము లందున్నచోఁ బ్రస్తుతము దానిని విస్మరించినను గష్టకాలమున నదిస్మృతికి వచ్చి తరణోపాయమగును.

శిష్యుఁడు— సృష్టిస్థితిలయాత్మకమైన యీ సంసారమునకు సంత మెప్పుడు. ?

శ్రీ చిదానంద యోగి—ఆద్యంతరహితుఁడైన పరమేశ్వరునిపై నాధార పడి యున్న యీ సంసారమునకు విరామము లేదు.

ఉ. అంతవిహీన సత్వమున యందలి యధ్యసనంబుచేత నీ
యంత విహీనసంసృతికి నాదియు వృద్ధియు నాశనంబునున్
వింతగఁ గల్గు నీస్థితులు వేగ భ్రమించుచు నుండుదీని న
త్యంత తపఃప్రపూర్ణులు మహాత్ములె గెల్వఁగఁజాలు నేర్పరుల్.

శిష్యుఁడు—దేవా! మఱచితిని. మీయాజ్ఞచే రేపు నేను హిమా లయారణ్యములకుఁ బోవలసి యున్నదిగదా! అందువలన నిఁక మీసేవ లభింపదని మిక్కిలి విచారముగ నున్నది. ప్రభూ! తమ సేవఁజేయుచు మీతో సంచరించుచునే నేను దపస్సాధన మొన రింపఁగూడదా!

శ్రీ చిదానంద యోగి—కూడదు. నాకే సేవయు నక్కఱలేదు. నాశిష్యు లేకాంతమునందుండి తపముఁ జేయుటయే నాకు గొప్పసేవ.

శిష్యుఁడు—దేవా! ఈప్రాంతముల నేల యుండరాదు ?

శ్రీ చిదానంద యోగి—ఈప్రాంతమునఁ దపోవిఘ్నమున కవకాశము లెక్కువగఁ గలవు. మహర్షుల కనాదినుండియుఁ దపోభూమియైన హిమాలయము లాధ్యాత్మికకృషి కత్యుత్తమస్థానములు. అచ్చట

సాంసారికవృత్తు లతిశీఘ్రముగ నిరస్తములగును. ఆత్మశాంతి యమోఘముగఁ జేకూరును. ఇది యనుభవమూలముననే స్పష్టము కాఁగలదు. ఆహా! ఏమి? ఈహిమాలయప్రభావము? దానిని దలఁచినంత మాత్రమున నేను దన్మయుఁడ నగుదును.

ఉ. అక్కడి శైల కందరము లక్కడి శీతల మందమారుతం
బక్కడి పుణ్య భూస్థలులు నక్కడి నిర్మల గాంగపూరమిం
కక్కడి సత్తపోధనుల యవ్యయ సత్కృప నిత్యశాంతియున్
జెక్కువచింప నేమిటి కభీష్ట ఫలంబుల నందఁజేయవే॥

మ. బలవంతంబుగ ధ్యానమున్ సలుప సద్భావంబుఁ గల్గించెడున్
బలవంతంబుగ లోకవృత్తుల పయిన్ వైరాగ్యమున్ గూర్చెడున్
బలవంతంబుగ లక్ష్యసిద్ధి మదికిన్ బ్రాప్తంబు గావించెడున్
బలవంతంబగు హైమశైల మహిమన్ వర్ణింపఁగా శక్యమే॥

కావున నీవిచటఁగాలమును వ్యర్థపుచ్చరాదు. చూడుము.

శ్లో॥ దినయామిన్యౌ సాయంప్రాతః శిశిరవసంతౌ పునరాయాతః
కాలః క్రీడతి గచ్ఛత్యాయుః తదపి నముంచ త్యాశావాయుః॥ భజ

(పాడుచుండ శిష్యుఁడు తన్మయుఁడై వినుచుండును.)

[ ప్రహ్లాదుఁడును సతియుఁ బ్రవేశింతురు. ]

ప్రహ్లాదుఁడు—ఆహా! ఏమి యీ భక్తిపారవశ్యము ఈ యనయే నేను జెప్పిన మహాను భావుఁడు. స్నేహితుఁడు తెలియఁజేసిన గుర్తులన్నియు సరిపోయినవి. నమస్కరింతము. పద

(ముందునడచి యిరువురును సాష్టాంగ నమస్కారము చేయుదురు.)

శ్రీ చిదానందయోగి— ఓంనారాయణ.

ప్రహ్లాదుఁడు— దేవా! మీ మహిమవిని మీయనుగ్రహమున నుపదేశమునంద వలయునని మేము వచ్చినాము. ఈమె మా

పొరుగుననున్న యిల్లాలు. సతియను నామముగలది. నాపేరు ప్రహ్లాదుఁడు.

సతి—మునీంద్రా! నాభర్తగారి యనుజ్ఞఁబొంది శ్రీమత్పాదసన్నిధికి వచ్చినాను. వారును దమ కరుణకొఱకు మిక్కిలి యాత్రపడు చున్నారు. కాని నేఁ డస్వస్థులుగనుండి రాఁజాలరైరి. రేపు తమ దర్శనముఁదప్పకచేయుదురు. నాకుఁదరణోపాయముప్రసాదింపుఁడు.

శ్రీచిదానందయోగి—మీముఖముల నొక్కమాఱు చూచుటతోడనే మీనిష్కల్మషహృదయములు నాకు స్పష్టమైనవి. మీరు చక్కఁగ లక్ష్యసాధనమునకు యత్నింపఁగలరని నాకు విశ్వాసము గలదు. బాలకా! ఒక్క పద్యమును జదువుము. ఆలకించెదను.

చ. అగణిత జన్మకర్మ దురితాంబుధిలో బహుదుఃఖవీచికల్
దెగిపడ నీదలేక జగతీధన నీపదభక్తి నావచేఁ
దగిలి తరింపఁగోరితిఁ బదంపడి నీదుపదంబుఁ గూర్పుమా!
తగదని చిత్తమందిడక దాశరథీ కరుణాపయోనిధీ.

శ్రీచిదానందయోగి—సెబాస్ నీకీపద్యము నెవ్వరు బోధించిరి?

ప్రహ్లాదుఁడు—చిన్నప్పుడు మానాయనగారు నాకు శ్రీమద్భాగవతములో నుండియు దాశరథీశతకములో నుండియుఁ బద్యములఁ జెప్పుచుండువారు.

శ్రీచిదానందయోగి—వారిప్పు డెచ్చట నున్నారు?

ప్రహ్లాదుఁడు—తెలియదుఁ స్వామీ! భక్తిపరవశులై యెచ్చటికో పోయిరి. మరల మీరు దప్ప నాకంతటి భక్తశ్రేష్ఠు లెచ్చటను గాన్పింపలేదు. ప్రస్తుతపు నావిద్యలో భక్తిమాటయే లేదు. కావున నట్టివిద్యపై నసూయఁజెంది నేనుగూడ మానాయనగారి వలె నెచ్చటికైనఁ బోయినచో బాగుగ నుండు ననుకొనుచుందును.

శ్రీచిదానంద యోగి—త్వరపడకుము. బాలకా! యుక్తాయుక్తములను విచారింపక యిల్లువీడిన కష్టపాటిల్లును. ఇల్లువీడుట నీవను కొన్నంత సులభమైన పనిగాదు. తీవ్రసాధనముచే మనము పరి పక్వము గానివారు సంసారమును త్యజించినచో భ్రష్టులగుదురు. జాగ్రత్త.

ప్రహ్లాదుడు—చిత్తము. తమయాజ్ఞ ననుసరింతును.

శ్రీచిదానంద యోగి—మంచిది. మీమీ స్వభావముల కనుగుణమైన యోగము నిప్పుడు మీకుఁ బ్రసాదింతును. మిగిలిన ధర్మము లన్నింటిని మాశిష్యుఁడు మీకు బోధించును. ఈప్రయత్నము నెన్నటికిని విడువకుఁడు. ముం దెప్పుడెప్పు డేమి చేయువలసి యుండునో ధ్యానమున మీకే స్ఫురింపఁగలదు.

ఇరువురు—చిత్తము.

(అంత వారిరువురకును ననఁగా ముందు సతికిని తరువాతఁ బ్రహ్లాదునకును యోగి చెవిలో నుపదేశించును.)

శ్రీచిదానంద యోగి—శిష్యా! వీరి నావలకుఁ గొంపోయి మన మత ధర్మంబు లన్నింటిని బోధింపుము.

శిష్యుఁడు—చిత్తము. (ముప్వురు నిష్క్రమింతురు.)

శ్రీచిదానంద యోగి—(స్వగతము) ఎండ తీవ్రముగ నున్నది. మార్గ మునను్న యాచల్లని చెట్టునీడను గొంచెము విశ్రమించెదను.

(ఈక్రింది పాట పాడుచు నిష్క్రమించును.)

శ్లో. సురమందిర తరుమూలనివాసః। శయ్యాభూతల మజినంవాసః
సర్వపరిగ్రహభోగత్యాగః। కస్యసుఖం నకరోతివిరాగః॥

భజగోవిందమ్॥

( తెరపడును )

## చతుర్థరంగము

(బాలికాపాఠశాల—లక్ష్మీసుందరీపార్వతులు చూచి వ్రాఁతవ్రాయుచుందురు. మోహినికూర్చుండి యాలోచనలో నుండును.)

మోహిని—(స్వగతము) పాపము బాలికలు చూచివ్రాఁత వ్రాసికొనుచున్నారు. నాహృదయసముద్రములో నున్న కల్లోలపరంపర వారికేమి తెలియును. ఈయుద్యోగము నాకు నిర్బంధముగాదు. ఉద్యోగము కేవలపురుషలక్షణమే గాదు. స్త్రీకి లక్షణము గూడనని ప్రకటించుటకు నేనీ గౌరవోద్యోగమును గ్రహించితిని. కానిచో లక్షాధికారిణినగు నాకీయుద్యోగముతోఁ బనియేమి? అనుమానగ్రస్తుఁడగు నాభర్త నన్నెక్కడికి కేగితివని తఱిచి యడుగకుండుటకు నిది వీలుగనున్నది. ఇట్టి సుఖకరమైన యుద్యోగము నేఁడు నాకుఁ గంటకప్రాయముగ నున్నది. ఆధర్మారావున కింతకరుణ గలుగునేమో యనిగదా యింతవఱకు వేచియున్నాను. ఆతనికి మాత్ర ముద్యోగముమీఁదను బ్రాణముమీఁదను దీపియుండదా! ఇంకఁ గొంచెము సేపు మాత్రము గడువుగలదు.

పార్వతి—అమ్మా! చూచి వ్రాఁతయైనది.

మోహిని—అయిన నాతోఁ జెప్పవలయునా! ఏమి నీ తెలివి! ఇంకొకపుట వ్రాయుము.

పార్వతి—నేఁడుప్రొద్దు గ్రుంకుదనుక చూచి వ్రాఁతయేనా!

మోహిని—నీవిచ్చుజీతమున కదిచాలులే.

పార్వతి—అట్లే వ్రాయుదును.

మోహిని—(తనలో) అహహా! ప్రాణములను బొత్తిగఁ ద్రోసివేయుటకు వీలులేదు. మన్మథుఁ డసాధ్యుఁడను యువి పల్కించినమాటలో

నతిశయోక్తిలేదు. అతనికి రూపము శూన్యము. పుష్పములు బాణములంట. కాని యాతఁడు ప్రాణములు నిలువునఁదీయును. యముఁడు ప్రాణములఁదీసి సౌఖ్యమిచ్చును. వీఁడు ప్రాణములు తీయక వేధించును. (నిట్టూర్పువుచ్చి) అయ్యో! ఇంకనురాలేదే; ఆదుర్మార్గుఁడు! ప్రొద్దువ్రాలినది.

సుందరి—అమ్మగారూ! వ్రాసి వ్రాసి చేతులు నొప్పులెత్తుచున్నవి.

మోహిని—ఓసిమొద్దా! ఆసంగతి నాతోఁ జెప్పవలెనఁటే. ఇంచుకసేపు వ్రాఁతే మానరాదా! చూచి చదువుకోఁగూడదా!

సుందరి—మీరు చెప్పలేదుగా మఱి.

మోహిని—నోరుమూయుము. గ్రహింపవద్దా! ఎంతకాలము చదివినను నీమందబుద్ధి మాఱకున్నది.

సుందరి—(పుస్తకముతీసి బిగ్గఱగాఁ జదువుచున్నది)

మోహిని—(చెవులు పట్టుకొని యూపి) లోలోపలఁ జదువుకొనలేవో

సుందరి—(బిగ్గఱగా నేడ్చును.)

మోహిని—లోలోపల నేడువరాదూ! (రెండుకొట్టి) నోరుమూసెదవా! లేదా!

సుందరి—(ఏడ్పు బిగఁబట్టుకొనును. కండ్లు తుడుచుకొనుచుండును.)

లక్ష్మిపార్వతులు—(నవ్వుదురు)

మోహిని—ఇదిగో మీరు నవ్వనక్కరలేదు. మీకుగూడ మాగతికరాదు గనుక తలయెత్తకుండ నందఱు లోలోపలఁ జదువుకొనుఁడు.

(బాలికలు చదువుకొనుచుందురు. మోహిని పైకిఁ జూచుచుండును.)

పార్వతి—(లక్ష్మితో మెల్లఁగా మీయమ్మగారికి నేఁడేదో దయ్యము పట్టినది. చూడు మెట్లుచూచుచున్నదో.)

లక్ష్మి—(పార్వతితో మెల్లఁగా) అమ్మయ్యో! దయ్యమే. నేనిప్పుడే యింటికిఁబోయి మానాన్నగారితోఁ జెప్పెదను. (పాఱిపోవును.)

మోహిని—(ఉలికిపడిలేచి చూచి) లక్ష్మి యెక్కడకుఁ బోయినది.

పార్వతి—రెంటికి వచ్చుచున్నదని త్వరగా నింటికిఁ బరుగెత్తినది.

మోహిని—సరే పోనిమ్ము. వేళయైనది. మీరు నిండ్లకుఁ బొండు.
(వారిరువురు పోవుదురు.)

మోహిని—(తనలో) ఇఁక ధర్మారావు పనిపట్టించవలయునని యర్థము. ముందుఁ బ్రాణముఁ దీయించి యుద్యోగముఁ దీయింతునా! ముందుద్యోగమే తీయించి పిదపఁ బ్రాణముఁదీయింతునా? అయ్యో! నాకు మతిపోవుచున్నది. ప్రాణమును దీయించిన తరువాత నుద్యోగమును దీయించుట యెట్లు? ముందుద్యోగమే తీయించవలెను. మావారితో నీవిషయమునుగూర్చి ముందు మాటలాడి తరువాత నితరసభ్యులకును జెప్పెదను. ఈ నాహృదయమున మండుచున్న దావాగ్ని వేయిరెట్లయి యాతనిని దహింపవలెను. ఱేపు మధ్యాహ్నమున కాతనికి బర్తరఫ్ తాకీదు చేరవలెను. అదిగో! రాంజీ వచ్చుచున్నట్లున్నది.

[రాంజీయను భ్రష్టబైరాగి ప్రవేశించును.]

రాంజీ—(తనలో) నేను మావాండ్లూ పనిలేక మాడిపోతున్నాం.
ఈమెకేదో మనమె తక్లీఫ్ హై. మాకీబేరం ఆనేవాలా హై
(ప్రకాశముగా) జైసీతారాం. జైసీతారాం (సమీపించి)
అమ్మాజీ తస్బీర్ మే అచ్ఛాహై!

మోహిని—ఆ! ఆరోగ్యముగనే యున్నది. ఆప్రశ్నము తెనుఁగులో నేడువరాదా!

రాంజీ—హిందీ బిల్‌కుల్ మాలుంనై? అప్ నే పఢాధా. నా!

మోహిని—అవునోయి చంపకు. దేశనాయకు లేడ్చి పోవుదురని పేరికి మాత్రము హిందీ మిడికితిని. అది యప్పుడే పోయినది.

రాంజీ—అజ్‌కల్ కాం బాత్తైనై ఆప్.

మోహిని—వెధవా! తెనుఁగులోమాట లాడిన మాటలాడుము. లేని-చో నిక్కడనుండి లేచిపొమ్ము. నీవంటిసన్న్యాసులు చాల మందిగలరు.

రాంజీ—(తనలో) ఓహో బెడిసిందిరోయి, సర్దాలె (ప్రకాశముగ) అది గాదండీ అమ్మగారూ! ఈ మధ్య మీరేమీ పనిచెప్పడంలేదు. మేం మల మల మాడిపోతున్నాం అని మొఱబెట్టుకుంటున్నాను.

మోహిని—అట్లు తేటతెల్లముగ నేమనరాదా! నీకుఁ బనిరాఁబోవు చున్నది. అది యెంతపనియో యెప్పుడో నిశ్చయముగాఁ జెప్ప లేను. జేపు సాయంకాల మిక్కడికి వచ్చినచోఁ జెప్పెదను. అంత-వఱకు నేను రమ్మనినవిషయము మీ స్నేహితులతోఁ జెప్పవద్దు.

రాంజీ—చిత్తం. మీపని మాకు ప్రధానం. జేపుసాయంకాల మనేది యెప్పుడు వస్తుందా అని ప్రాణం బిగఁబట్టుకొని ఉంటా! ఈరోజు దమ్మిలేదు. పోవాలె. అచ్ఛాఫిర్ మిలేంగే.

మోహిని—అదిగో! ఆతురకము హూనివేసిన రావచ్చును.

రాంజీ—మీదయ. అలాగే మళ్లీవస్తా! (నిష్క్రమించును.)

మోహి—(తనలో) ఈ నీచులతో సంబంధము విధిలేక పెట్టుకొను టయే గాని వీండ్రతో వేఁగుట మిక్కిలికష్టము. ఆవలించినఁ బ్రేగు లు లెక్కపెట్టుచుండకోడుకులు. నేను మెలఁకువగల దానను. కావున నెగ్గుచున్నాను. (ఆలోచించి) కాలాతీతమైనది. ఇంటికి శీఘ్రమే నడచెదను. బండిరప్పించిన బాగుగనుండి యుండెడిది. కాని యీదుస్థితిలో నడచుటయే మంచిది. (నాలుగడుగులువేసి) ఓహో!

సోమిదేవమ్మ యిటువచ్చుచున్నది. ఈమూర్ఖపుముండ నన్ను సామాన్యముగ వదలదే.

(అంతట సోమిదేవమ్మ యెదురుగా వచ్చి)

సోమి—ఓసి! నీనోరుపడా! నీవేనఁటే మావాండ్లపిల్ల ఉసురుఁబోసి కొని వెధవ పెండ్లిచేయించావఁట.

మోహిని—సోమిదేవమ్మా! అది సందుగొందులలోఁ బోకుండఁ జక్కని వరునిజూచి పెండ్లిచేయించితిని.

సోమి—ఏడ్సావు! విన వే! నీప్రతాపం దానికీ వాడికి పడలేదుట. అప్పుడే తెగతెంపులైంది. వాఁడింకోదాని కోసం తిరుగుతున్నాఁడు అది యింకోడికోసం తిరుగుతున్నది.

మోహిని—మంచి యూహించిచేసినాము. ప్రారబ్ధమునకు మనమేమి చేయఁగలము. పోనిమ్ము. అంతకంటె మంచిసంబంధమును జూచెదను.

సోమి—నీపిండాకూడూ—నాబీరా కూడూ. ఆప్రారబ్ధం అనుకునే మాటముందే అనుకొని రెండోపెండ్లి అంటూ యేడవకుండా ఉంటే యేం? ఇప్పుడు బజీతుముండ అనిపించుకొని యిరవై పెండ్లింఢ్లాడితే వచ్చే లాభమేమిటి? నీసంస్కారం నీవు తగలఁబడా!

మోహిని—మూర్ఖురాలా! పూర్వకాలపుదానవు. ఇప్పుడు లోకమంతయు నెట్లునడచుచున్నదో నీకుఁ దెలియదు. మేమింత శ్రమపడుచున్నను మీవంటి మూఢులుండుటవలన హిందూదేశమింకను సంఘసంస్కరణమున వెనుకఁబడియున్నది.

సోమి—చాలులే నీచరిత్ర మే మెఱుగందిగాదు. ఏదో పేరు పెట్టుకొని దేశం నాశనం చేయి. ఛీ! నీ మొఖం చూస్తే పంచమహాపాతకాలు చుట్టుకుంటాయి. (థూ అని ఉమ్మివేసిపోవును.)

మోహిని—ఆప్రారబ్ధమే మో మఱి. విధవా వివాహములకు మంచి-వధూవరులు లభించుటలేదు. దీనికిఁ గారణము ప్రజలు విద్యావిహీనులై మంచిమార్గములలోనికిఁ జొరవచేసి ప్రవేశింపకపోవుటయే. ముందు ముందు బాగుగనుండును. ఈ ముసలిముండ నన్ను మిక్కిలి ఝూడించినది. మనస్సు సరిలేదుగాని సరిగనున్న నీమెకు రెండంటించి యుందును. ఇఁకఁబోవలెను.

(నిష్క్రమించును)

(తెరపడును)

(ఇది చతుర్థరంగము)

ఇది తృతీయాంకము.

---

# శ్రీ చిద్విలాసము

## చతుర్థాంకము

### ప్రథమరంగము.

(ఊరి వెలుపల బైరాగి మఠము—రాంజీ—సోంజీ—సూర్ జీ—)

అందఱు—జైసీతారాం. శ్రీ—తా—రాం. శ్రీ—తా—రాం—

రాంజీ——అరే సోంజీ—కల్ కేవాస్తే ఠరా నహీఁహై. ఇంతి జాంకరోబే.

సోంజీ——అరే రాంజీ—నీబుద్ధిపోనియ్యవు గదా! ఊళ్లోకిపోయి నప్పుడు గాని యిప్పుడెందుకురా మనతప్పులతడక హిందూస్థానీ. స్వేచ్ఛగా తెలుగులో మాట్లాడరాదూ!

రాంజీ——అరే హిందూస్థానీ అచ్ఛాబోలీబే. ఇస్ తెలంగుబాత్ మే హుషార్ నహీఁహై. కేరే సూర్ జీ.

సూర్ జీ——ఇఁక నధికప్రసంగం చేశావంటే ఇద్దఱూ కలిసి నిన్ను తంతాం. నీతురకపంచాంగం కట్టెయిరా బేవకూఫ్.

రాంజీ——అదిగో నీ విప్పుడన్న దేమిట్రా! బేవకూఫ్.

సూరజీ——తిట్టడానికి బాగా పనికొస్తుందిరా అది, దివానా. అంతేదాని పని డోఖలీ. నోర్ముయి బద్మాష్—కబర్దార్ రండీ. తంతా భోసడీ (లేచి తన్నఁబోవును)

రాంజీ——(తప్పించుకొని)చాలులేవోయి వెధవ! నీబూతుల పంచాంగం.

సోంజీ——అల్లా తెలుఁగులోకిరా వళ్లుదగ్గఱఁ బెట్టుకొని.

రాంజీ—ఈరోజు తెచ్చిన బియ్యమన్నీ సారాకే పోశాం. చీకులు లేక పోతే నాకేం తోచడంలేదు.

సూర్‌జీ—జేపన్నీ చీకులే కిందున్న లేవోయి.

రాంజీ—అన్నీ ఒక్కపాళి ఉంటేనేగాని మజాలేదు బే.

సూర్‌జీ—అరే మజా గిజా అంటావు. నీకేం మన భాషమీద అభి మానం లేదట్రా సువర్.

రాంజీ—అరే పెద్ద పెద్దోళ్లంతా తెలుంగూ ఇంగ్లీషూ కలిపేస్తూ న్నారు. మామూలోళ్లంతా హిందూస్థానీతో సంకరం చేస్తున్నారు. ఇంక నీకీభాషపైన అభిమానమెందుకు రా బైరాగి ముండా కొడుక్కి.

సోంజీ—తల్లిభాషపైన అభిమానంలేకపోతే తల్లికిద్రోహంచేసినట్లే.

సూర్‌జీ—అరే ఈసంగతి కట్టిపెట్టి జేపటిగతి చూడు.

సోంజీ—మనకు కొద్దిరోజులలో ఒకబేరం తగిలేటట్టుంది. అసిందిర్పు గాడీమధ్య పిలవడం లేదు. పిలిస్తే యేపిల్ల నెత్తికొచ్చినా వంద ఏ ప్రాణంతీసినా రెండొందలు. సుఖంగా బతకొచ్చు. నెలరోజుల పాటు పత్రి కావలసినంత.

రాంజీ—ఎప్పుడో రాంబోయేదానికి గుటకలేస్తే యేముందోయి. ఇప్పుడేమైనా బేరం ఉందా లేదా!

సోంజీ—ఉంటే మన ముగ్గురికీ తెలియకుండానా! సన్న కనపడి ఈవేళ సాయంత్రం ఒక్కమాటు కనపడమన్నాడు.

సూర్‌జీ—సరే పోయిరా. బేరం తగుల్తదిలే.

రాంజీ—అగే అగే ఎంతమోసం—చచ్చానురోయి.

సోంజీ—ఏమొచ్చిందిరో నాయనా! మనముండీ స్మశానంలో నేభయము లేదు.

రాంజీ—దమ్మేసుకొని గంటయిందోయి నేను పుట్టింది మొదలింతసేపు ఎప్పుడు దమ్ములేకుండా ఉండలేదు.

సోంజీ—ఇదేమట్రా! చస్తావేమో మాకీ హిందూస్థానీ గొడవ వదల్తుం దనుకున్నా.

రాంజీ—ఇంక ప్రాణం ఆగదు తియ్యరా పత్రి సియిపుల్ల పట్టాదమ్ము.

(సోంజీ పత్రివెలిగించును. అందఱు ఎరుసన జై సీతారాం అనుచుఁ బత్రి పీల్తురు.

(రాంజీ యీక్రిందిపాట పాడును. సోంజీ సూర్ జీలు తాళము వేయుదురు. పల్లవి కలిసి పాడుదురు.)

కీర్తన

పల్లవి—మనమిద్దర మేగాని మనుసు లెవ్వరులేరు మాట్లాడవే రామ చిలుకా!

వేదాంత మందునా యెంత చూచినగాని నేనొక్కడనే రామచిలుకా!
ఇద్దఱము ఒకటై రెండు ఒక్కటైతే అద్దరిని బ్రహ్మమే చిలుకా!
ఇద్దరిని అద్దరిని అంతు లేనిచోట ఏకమాబ్రహ్మంటే చిలుకా!
నిన్ను గూడినదాక నాకు శాంతము లేదు నన్ను గూడవె రామ చిలుకా!
ఏడు మేడల మీద కడమేడలోపలా కన్నె గూడవె రామ చిలుకా!

(క్రమముగా లేచి గంతులు వేయుదురు. తుదకు సొమ్మసిల్లి పడిపోవుదురు.)

అంతట దూరమున శ్రీ చిదానందయోగియు శిష్యుడును ప్రవేశింతురు. యోగి యీక్రిందపాట పాడుచు వచ్చును.)

శ్లో॥ జటిలోముణ్డీ లుంఛితకేశః కాషాయాంబర బహుకృతవేషః
పశ్యన్నపిచనపశ్యతిమూఢో హ్యుదరనిమిత్తో బహుకృతవేషః ॥భజ॥

శిష్యుఁడు—ప్రభూ! అక్కడ నెవ్వరో ముగ్వురు యోగీశ్వరులు పరుండి యున్నట్లున్నారు. వారిని దర్శింతమా!

శ్రీ చిదానందయోగి—వారిని దర్శింప నక్కఱలేదు. వారు కేవల తుచ్ఛులు. లోకములో నన్ని తెగలలోను మంచిచెడ్డ లున్నట్లు కాషాయాంబరముల ధరించిన వారిలోను నన్నివిధముల వారుందురు. అంత మాత్రముచేత నిజమైన సన్యాసులకును ఉత్తమమైన సన్యాసాశ్రమము నకును లోటుగలుగదు. మంచిచెడ్డలను వేరు చేయుట మాత్రము కష్టము.

శిష్యుఁడు—వీరునున్మత్తుల వలెనున్నారు. జ్ఞానిని బాలోన్మత్త పిశాచ వత్తని యందురుగదా! కావున వీరుజ్ఞానులు కావలయును.

శ్రీ చిదానందయోగి—నీతర్కములో లోపమున్నది. జ్ఞాను లున్మత్తుల వలెనుండినను, ఉన్మత్తు లందఱును జ్ఞానులు కానక్కఱలేదు కారుసుమా!

శిష్యుఁడు—దేవరవారు వీరిస్వభావ మెట్లు గ్రహింపఁగలిగిరి.

శ్రీ చిదానందయోగి—త్రికాలవేదుల మగుమాకు మానవులస్వభావముల నెఱుఁగుట యొకకష్టముగాదు. ముఖదర్శన మాత్రముననే మానవుల స్వభావములును జరిత్రములు నద్దము నందువలె మాకు స్పష్టముగ గోచరమగును.

శిష్యుఁడు—అట్లయినఁ బ్రజలు మిమ్ముల నెంతవేఁడినను వారి భవిష్యద్వృత్తాంతములఁ గూర్చి చెప్పరేల?

శ్రీచిదానందయోగి—జ్యోతిషమును సాముద్రికమును నభ్యసించి లోకులను పలువురు చెడిపోవుచున్నారు. యథార్థజ్యోతిషము చెప్పఁగలవార

మయ్యు మే మాధ్యాత్మికమార్గము నొక్క క్షణమైనను విడిచి జ్యోతిషాదికార్యములఁ బ్రవేశింపఁజాలము. అది లోకులకు నివృత్తి చింత గల్గించుటనుమాని ఆశలను భయములను గల్గించును. కష్టము వచ్చునని నఁ గొందఱు నిరుత్సాహము చెంది కర్తవ్యమును విసర్జించి నశింతురు. మానవుఁడు వర్తమానకాలమునఁ దీవ్రకృషి చేయవలయును. భావిచింతఁ జేయఁగూడదు.

శిష్యుఁడు—చిత్తము దేవా! ఒక్కసారి యాయోగుల దగ్గఱకు వెళ్లుదము.

శ్రీచిదానందయోగి—సరే. అటు పోవుదము. పద, ఇది నీతృప్తికొఱకే సుమా!

శిష్యుఁడు—చిత్తము. (కొంచెము ముందునకు నడచి దూరముగా నాగుదురు.)

(బైరాగులు ముగ్వురును గ్రమమున దొర్లి లేచి యొడలు దులుపుకొందురు.)

రాంజీ—ఉఠో బే కోయీ జోగీ ఆతేహై.

సూర్ జీ—అరే ఫూల్, రాస్కెల్, స్టుపిడ్ మళ్లీ హిందీలో పడ్డా వేంరా డాంకీ.

రాంజీ—నీవు చిన్నప్పుడు చదువుకొన్న ఇంగ్లీషంతా యింతేనా! యింకేమైనా ఉన్నదా!

సూర్ జీ—వెధవా! ఉపయోగమైంది బుఱ్ఱలో దాచుకొని మిగిలింది మఱచి పోయినానోయి. ఎంతచదువుకున్నా ఈకాలంలో ఇంతకంటె ఎక్కువ లాభించడంలేదు.

రాంజీ—ఫిర్ దమ్ము లగావ్.

సోంజీ—నాదగ్గఱ లేదురా గధా!

(అంతట రాంజీ బొడ్డులో దాచిన పత్రితీయును. అంటించి మఱలదమ్ము పట్టుదురు. శిష్యుఁడు సమీపించును.)

సూర్ జీ—అరే యెవఁడో వచ్చాఁడ్రా తొందరగాపట్టు.

శిష్యుఁడు—పత్రివలనఁ బ్రయోజన మేమి?

రాంజీ—మోచ్ఛం

శిష్యుఁడు—ఎట్లది మోక్షకారణమో చెప్పఁగలరా!

రాంజీ—మన్సు లీలమైపోతది. అదే హానందం.

శిష్యుఁడు—ఇట్లని పురాణము లందుఁగాని శాస్త్రము లందుఁగాని మఱెచ్చట నైనఁగాని కలదా!

రాంజీ—ఏదాంత పురాండంలో వున్నాది. అంతకంటె నీ కేం పురాండం కావాలోయి. భోసడీ!

శ్రీ చిదానందయోగి—ఇఁకేఁజాలుఁరమ్ము. (సంజ్ఞచేయును. శిష్యుఁడు వెళ్లును. ఇరువురును నిష్క్రమింతురు. ఈక్రిందిపాట యోగిపాడును.

రథ్యాకర్పట విరచితకన్థః పుణ్యాపుణ్య వివర్జితపన్థః
యోగీయోగనియోజితచిత్తో రమతే బాలోన్మత్త వదేవ॥ భజ॥

సూర్ జీ—ఆయోగి యెవఁడో గొప్పఁవాఁడు లాగున్నాఁడు రోయి. సరే మనకెందుకు పడుకుందాం లోపలికిపద రాంజీ. అరేసోంజీ నీవు బేరం చూచుకొని రావోయి. నీకోసం ఎదురు చూస్తూంటాం. ఇక్కడున్నట్టు రావాలె.

సోంజీ—సరే (పోవును.)

సూర్ జీ—కదలవేంరా (రాంజీని నీడ్చుకొని పోవును.)

## ద్వితీయ రంగము

(సూరమ్మయిల్లు, కందర్పరావాసీనుఁడై యుండును.)

కందర్పరావు—(స్వగతము) అహో నాకు నేఁడే సూరమ్మయిల్లే మహా భవనమైనది. ఈదుర్భరమైన మదన వేదన భరించుట కష్టము. ఆసరస్వతి యాశగలిగించి నందున నీబాధ మఱింత దుర్భరమైనది. ఎప్పుడైనను బ్రొద్దు గ్రుంకునేమో సరస్వతి వచ్చునేమో యని యెంత కనిపెట్టుకొని యున్నను లాభము లేకున్నది.

ఉ. క్రుంకఁడ దేమిసూయ? రవిక్రుంకెనదే! యిసికాదు మబ్బుపై
సంకిలి యయ్యె నెప్పు డకటా! యిఁక రాత్రియె రాకపోవునో
సంకట మయ్యె నాబ్రతుకు, చాలఁగఁ దత్తరపాటు పుట్టెనే
వంక మనంగలాఁడ నిఁక వర్తులసుస్తనిఁ గాంచ కుండినన్॥

అమ్మయ్య! బ్రదికితిని. అదిగో! సరస్వతి—అయ్యో! కాదు. కాదు. ఆకొమ్మనీడ కదలు చుండఁజూచి సరస్వతి యని భ్రమ చెందితిని.—ఛీ! నాబ్రతు కెంత తేలిక యైనది. నేను మునుపెంతబల వంతుఁడనో యిప్పుడంత దుర్బలుఁడ నైతిని.

అయ్యో! నాభ్రమలకు మితము లేకుండ నున్నది.

ఉ. ఒక్కయెడన్ లతాంగి దరి నున్నటు తోఁచు మఱొక్కసారి నే
నక్కమలాక్షితోడఁ బలుకాడిన భంగిగఁ దోఁచు నొక్కచో
జక్కనలట్టి చన్గవ విశంకత బట్టిన యట్లుతోఁచు నిం
కొక్కెడనాతిఁ గౌగిటను నుంచిన యట్టులుతోఁచు నక్కటా॥

ఇసీ! నేను వెఱ్ఱివాఁడను. ఈ మధ్యాహ్నము చేతఁజిక్కిన ఫలమును జారవిడిచితిని. అందువలన నీదుఃఖము స్వయంకృతాపరాధము

మధ్యాహ్నమే యామెను నిర్బంధించి యొక్కబండిలో నింటికిఁ గొంపోయిన నింత బాధయుండి యుండదుగదా! హాపరమేశ్వరా! నీవు నిజముగా లేవని తోఁచుచున్నది. ఉన్నచో నింతపరితాప పడు నాకోర్కెఁదీర్ప నింతజాగు సేయుదువా!

ఇంటికడ మోహిని యేమనుకొనుచున్నదో. ఛీ! ఆకురూపిణి యేమనుకొన్న నేమిభయము.? ఇఁక సానిజోలి నాకిక్కఱలేదు. స్వాతంత్ర్యమును వహించిన మోహినివంటి స్త్రీకంటెఁ బూర్వాచారము ననుసరించి బిడియముగలిగి ముగ్ధయై సతియైన సరస్వతివంటి స్త్రీవలననే పురుషున కెక్కువసౌఖ్యము లభింపఁగలదు. ఇది నిస్సంశయము. ఇది నాయుపన్యాసములలో మాటగాదు. మనసులోమాట. ఏలయన స్వతంత్రాంగన.

చ. ఒకపురుషున్ గరానఁగొను నొక్కనితో సరఁబులాడు వే
ఱొకనిని గూడి స్వేచ్ఛగఁ బురోపవనంబుల సంచరించు నిం
కొకనిని జేరి నాటకములో యనిపోవు గృహంబు భర్తనా
మకములు సీ! స్వతంత్రకును మానితశీలమెటున్ లభించునే!

ఇఁకఁ బ్రాచీనపద్ధతి ననుసరించు స్త్రీలో

చ. పరపురుషున్ గనుంగొనుట భావ్యముగాదని యోరగాఁ జరిం
తురు మఱి యన్యపూరుషులతోఁ బలుకాడ లవంబు నిచ్చగిం
పరు సతులట్టివార లెటునర్తిలనేర్తురు వీధులందు నె
బ్బెఱికములేక చేతులను వ్రేళులఁ జెట్టలఁబట్టి యొండ్లతోన్.

అందువలన సరస్వతివంటి స్త్రీలతోఁ గూడిక యనుమానమునకు హేతువుగాదు. మోహినియా! ఇతరులతోఁ జెప్పికొన సిగ్గుచేటు, నేనాపెయెడఁ బ్రేమ నటించుచున్నను నాకాబిడ శీలమెట్టిదో స్పష్టముగఁ దెలియును.

అదిగో! ఎట్లో ప్రొద్దుగ్రుంకినది. అయ్యో! ఇంకనురాలేదే; ఛీ! మోసగించినది. దుర్మార్గురాలు. ఇప్పుడేపోయి నేను దానిని స్వయముగా హత్యగావింతునా! కాదు. కొంచెమునాఁగి పోలీసు వచ్చును గాన వానిచేతఁ బరిమార్పింతును. అహా! ఎంతకతెనురాలు. గోముఖ వ్యాఘ్రము.

(అని యటుఁ నిటు తిరుగుచుఁ గోపముతోఁ బండ్లుకొఱుకు చున్నాఁడు.)

సరస్వతీ! ఇంతదానవని యెఱుఁగనైతినిగదా! నన్ను గోపింపఁజేసి యింకను జీవింతువా!

శా. ఘోరాహిన్ వడికోఱలన్ బెఱుకనొ క్రూరంపు సింహంబుతో
హోరాహోరిగఁబోరనో రణములో నోర్వంగనో మృత్యువున్
జేరన్ రాని దవాగ్నిలో నుఱుకనోఁ జెన్కంగనో బెబ్బులిన్
నేరన్వచ్చునె యేరికేని బ్రదుకంగా నేనల్గి వీక్షించినన్.

కావున—(అని వాకిటిలోనికిఁ బోవుచుండ సరస్వతి యెదురుగా వచ్చుచుండుటఁజూచి శాంతించి సంతసించును).

ఓహో నేను బొరపడితిని. సరస్వతి వచ్చినది. రానేవచ్చినది. అదిగో! చిఱునవ్వుగూడ మోమున—అనుగృహీతుఁడనైతిని. ఇంక నాజన్మము ధన్యమైనది. సరస్వతీ! రమ్ము. నీగాఢాలింగనము కొఱ కెంత తపించుచున్నానో నీవెఱుంగవు. ఇంత జాలిలేకపోయెనా! ప్రొద్దు గ్రుంకినతరువాతనే రావలెనా! కొంచెము పెందలఁడవచ్చిన నీసొమ్మేమి పోయినది.? మాటాడవేమి.?

సరస్వతి—నేనువచ్చి చాలసేపైనది. మీరు కోపములో నున్నట్లు తోఁచుటచే నేను లోనికిరా సంశయించితిని.

కందర్పరావు—కోప మెవ్వరిపై సరస్వతీ! కోపములేదు గీపములేదు. సంశయమేల? నేనన్యుఁడనా; నాసర్వము నీదేయని ముందుఁ జెప్పితినిగదా!

సరస్వతి—నేను బాగుగ నాలోచించితిని.

కందర్పరావు—ఇంకను నాలోచనయే. ఆలోచనఁ జేసి—అంగీకరించితివి _ అదిగో! నీముఖవికాసమే దానిని బ్రకటించుచున్నది.

సరస్వతి—కాని.

కందర్పరావు—ఏమికాని నాప్రాణము దీయుటకీ కాని యిందులకు; త్వరగ—కాని.

సరస్వతి—ఈ సూరమ్మయింట మన సమావేశము పనికిరాదు. నేను లజ్జావతిని మీకుఁ దెలియునుగదా! మాయింటను వలనుపడదు. మీయింటను మీవారు గలరు.

కందర్పరావు—ఓసి వెఱ్ఱిదానా! మాయింట నేమిభయము? అది నాస్వరాజ్యము. నేనచ్చటఁ జక్రవర్తిని. అది లంకంతలోగిలి. దివ్యసౌఖ్యముల కాభవనరాజ ముత్తమస్థానము. ఒక్కమాఱు నీవు చూచిన దానిని గూర్చి శంకింపవు.

సరస్వతి—కావచ్చును. కాని నాకు సమ్మతము కాదు.

కందర్పరావు—మఱి.

సరస్వతి—అంగీకరింతునన్నఁ జెప్పుదును.

కందర్పరావు—త్వరగఁ జెప్పుము.

సరస్వతి—ఇక్కడికి నుత్తరముగనున్న పాడుశివాలయమున రాత్రి పది గంటలకు.

కందర్పరావు—అయ్యో! పాడుదేవళమా! లక్షాధికారి కెంతకర్మము పట్టినది. నీకు నచ్చిన మేడల నెన్నింటినైనఁ జూపింతును. కోరు కొమ్మ. ఆదరిద్రపు చోటేల?

సరస్వతి——నామాటకుఁ దిరుగులేదు. ఇతరస్థలములు మహాభవనము లైనను నేనొల్లను. అంగీకరింపకున్న నిప్పుడే ప్రాణము విడిచెదను. కనుఱెప్పపాటులోఁ బ్రాణముఁ బాపఁగల సాధనము నావద్ద నున్నది.

కందర్పరావు——(కొంచె మాలోచించి) సరే! ఏమి చేయుదును? నీవు పదిగంటలకు రాకపోయిన?

సరస్వతి——మీరు ముం దన్నట్లే చేయవచ్చును.

కందర్పరావు——ఇప్పుడొక్క ముద్దైన నీయవా!

సరస్వతి——అన్నియు నప్పుడే.

కందర్పరావు——ఏమి చేయుదును. చచ్చినట్లు వేచియుందును.

ఉ. ఏమి వచించినన్ వినఁగనేవలె నోటిని మూసికొంచు వా
రేమని యానతిచ్చిన వహింపవలెన్ దల నాక్షణంబునం
దేమని యందురో యనుచు నెప్పుడు వేచి కనుంగొనన్వలెన్
కాముకు లెల్లరీపగిదిఁ గాంతలచేతులఁ గీలుబొమ్మలే.

సరస్వతి——ఇంట బాలుఁ డెదురు చూచుండును. ఇఁక శీఘ్రముగఁ బోవలెను. గృహకృత్యములను జక్కఁబెట్టుకొని వేళకు వచ్చెదను. రహస్యమును గాపాడవలెను. సెలవు. (పోవును)

కందర్పరావు——(పోవుటను జూచి) పోయినది. మరల నన్ను విరహ సాగరమున ముంచిపోయినది. అంతరాత్రివఱకుఁ గాలమెట్లు గడుపుదును. ఎట్లో గడుపుదును. అదే! అప్పుడే చంద్రోదయము గూడ నగుచున్నది. ఈతని వేడికిరణముల నెట్లు భరింపఁగలను?

ఉ. చల్లని మంచిగంధములు చాలఁ దపింపఁగఁజేయుఁ, గోయిలల్
మెల్లనఁగూయఁ బ్రాణములు మీదికి బోయెడునట్లు దోఁచు, సం

ప్రల్లనవారలిందములు పొక్కఁగఁజేయు మనంబుఁ, జంద్రికల్
పెల్లు దహించు, మేనుకుఁ బెట్టును జల్లనిసెల్లఁ బాంధులన్.

ఇంటికేగి మోహినితోడను లక్ష్మితోడను వ్యర్థప్రసంగము గావించి కాలము వెళ్ళఁబుచ్చెదను. (ఆలోచించి) ఈస్థితిలో బ్రసంగించుటయుఁ గష్టమే. చదివెదను—చదువునకు మనస్సనుకూలముగాదు. సరే యిల్లుచేరిన తరువాత నేమిచేయఁగలనో చూచెదను.

(నిష్క్రమించును)

అంతటఁ దెరపడును,)

---

## తృతీయరంగము.

---

(సరస్వతిగృహము. ఒకప్రక్కన ప్రహ్లాదుఁడు లోలోనఁ జదువుకొనుచుండును. సరస్వతి యాలోచనములోఁ గూర్చుండియుండును.)

సరస్వతి—(స్వగతము) ప్రొద్దుపోవుచున్నది. వెంటనే ధర్మారావుగారికిఁ గబురుచేయవలెను. బాలుఁడేదో చదువుకొనుచున్నాఁడు. వాని లక్షణముచూడ వాఁడు నేఁడు బడికేగి నట్లులేదు. ఏభక్తసభకో ఏసన్న్యాసుల సాంగత్యమునకో పోయి యుండును. (ప్రకాశము) తండ్రీ! ప్రహ్లాదా! ఏమి చదువుచున్నావు?

ప్రహ్లాదుఁడు—శ్రీమద్భాగవతము—గజేంద్రమోక్షణకథ.

సరస్వతి—ఇంక నీ సొంతపాఠము లెప్పుడు నాయనా! సరే నీ విప్పుడు చదువుపద్యమును బైకిఁజదువు.

ప్రహ్లాదుఁడు—అమ్మా—నీవేదో యాలోచనలో నున్నావనియుఁ గోపింతువనియు లోలోనఁ జదువుకొనుచున్నాను. మహాభాగ్యము. బిగ్గఱగాఁ జదువుదును.

శా. లావొక్కింతయులేదు ధైర్యము విలోలంబయ్యెఁ బ్రాణంబులున్
తావుల్దప్పెను మూర్ఛవచ్చెఁ దనువున్ డస్సెన్ శ్రమంబయ్యెడిన్
నీవే తప్పనితః పరం బెఱుఁగ మన్నింపదగున్ దీనునిన్
రావే యీశ్వర! కావవే వరద సంరక్షించు భద్రాత్మకా!

సరస్వతి—(తనలో) ఈపద్యము నాప్రస్తుతస్థితి కెంతయు ననుగుణముగా నున్నది.

ప్రహ్లాదుఁడు—ఇంకను జదువుదునా!

సరస్వతి—చాలునుగాని మన ధర్మారావుగా రింటి కేగి, చక్కఁబఱచి వచ్చితిననియు ఫలితము వినఁగోరెదననియుఁ జెప్పుము.

ప్రహ్లాదుఁడు—అమ్మా! నా కర్థమగుటలేదు.

సరస్వతి—నీకర్థము కానక్కఱలేదు. అదియొక రహస్యవిషయము. వెంటనే రమ్ము.

ప్రహ్లాదుఁడు—సరే. (అని వెళ్లును)

సరస్వతి—(స్వగతము) అమాయికుఁడు. నా యాందోళనము వీఁడేమి యెఱుఁగును. అయ్యో శ్రీహరీ! నన్నీయిక్కట్టుల పాలుచేయుట కేనా సృజించితివి. తుదకుఁ గపటవర్తనము గూడ నాచరింపవలసి వచ్చెనుగదా! ఛీ. ఎందులకీ జన్మము. హా! ఆ మహానుభావుని గూడ నీ రొంపిలో దింపితినే.

ఆతని కేదేని యాపదవచ్చిన నేటి గావలయును? ఆహా! అది దుర్భరస్థితిగదా!

ఉ. ఏల సృజించితయ్య? పరమేశ్వర నన్నుసృజించి తీవు పో!
యేల యనాథఁ జేసితివి? యిట్టులు చేసితి వో మహార్తిపా
లేల నొనర్చితీవునను! నెందులకీ కపటంపు నాటకం
బేల మహోపకారి కిటులీవు ఘటించితి విక్కటుల్ ప్రభూ!

ఆయన యే యాపదనొందిన ధర్మము నశించినదని యర్థము. నేను బాలు నెచ్చటికైని పంపివేసి యాత్మహత్య గావించు కొందును. ఆ పరమేశ్వరుఁడిట్టికష్టమునేలఁ గలుగఁజేసెనో యని నా సందేహము.

(పరికించి) అదిగో! ఎడమకన్న దరుచున్నది. ఎటుచూచినను నన్నియు శుభసూచకములే. కానిమ్ము చూచెదను.

నేఁడు భోజనము రుచింపదు. నిద్రయునుండదు. రేపటియుదయ మా యోగీశ్వరుని పాలికినేగి తాపోపశమనము చేసికొనువఱకు నాకు శాంతియెక్కడిది? అంతవఱకు నాకు నేనే మార్గదర్శనిని.

చ. మృతిధ్రువ మెల్లజీవులకు మిక్కిలిగా భయమంద నేల? స
న్మతి పరమేశుఁడే గలఁడు నాకిఁక దిక్కని నిశ్చలాత్మనై
యతని పదంబులే గొలుతు నన్నిటికాతఁడె రక్షకుండగున్
బ్రతుకరె యుగ్రకాననము పాలయికూడఁ బ్రజల్ తదిచ్ఛచేన్.

కావున నాతని నీవిధమున ధ్యానింతును.

"శా. ఓ నిష్కైతుక జాయమానకరుణా! యోనిర్వికారప్రభూ!
యోనిర్వ్యాజపరోపకార సుకృతీ! యోనిత్య! యోనిర్మలా!
యోనానాంతరయామి! విశ్వసృజ! విశ్వోపాస్య! విశ్వాత్మకా
జ్ఞానానందమయస్వరూప! వరదా! సద్భక్తచింతామణీ!"

ఇప్పుడు మనస్సునకుఁ గొంతస్థైర్యము గల్గినది. అదిగో! ప్రహ్లాదుఁడుగూడ వచ్చుచున్నాఁడు.

[ ప్రహ్లాదుఁడు ప్రవేశించును. ]

నాయనా! చెప్పితివా! ఇంత యాలస్యమైన దేల?

ప్రహ్లాదుఁడు—చెప్పితిని. వారు సంతోషించిరి. నేను వెళ్లునప్పటికి సతిగారు నిద్రపోవుచున్నారు. ఆమెకు నేఁడేమో బడలికగా నున్న

దఁట. ధర్మారావుగారు భాగవతమునుండి రెండుపద్యములఁ జదువుమని నన్ను నిర్బంధపఱచిరి. అందువలన నాలస్యమైనది.

సరస్వతి—(తనలో) ఆయన మనస్సుగూడ భగవదాయత్తమై యున్నది. (ప్రకాశము) మంచిది నాయనా! త్వరగ నింటిలోనికిఁ బద అన్నము పెట్టెదను. తిని పరుండుదువు. నిద్రవేళయగుచున్నది.

ప్ర—సరే!

(అని యిరువురు నిష్క్రమించుచున్నారు)

## చతుర్థాంగము

(కందర్పరావు గృహము—లక్ష్మి ప్రవేశించును.)

లక్ష్మి—(తనలో) నాయనగారింకను రాలేదు. అమ్మయును రాలేదు. కంజీకటి పడినది వెన్నెలగూడ వచ్చినది. ఎటుపోవుటకును దోచుటలేదు. (చూచి) అదిగో! నాయనగారు రానేవచ్చినారు.

(అంతటఁ గందర్పుఁడువచ్చి కుర్చీలోఁ గూర్చుండును.)

(ప్రకాశముగా) నాన్నగారూ! అమ్మకు దయ్యముపట్టినది. మీరింటలేరు. ఆమె యింకను నింటికిరాలేదు. నాకుఁ దోఁచుటలేదు.

కందర్పరావు—అది యెచ్చటనున్నది?

లక్ష్మి—పాఠశాలలో

కందర్పరావు—ఏమిచేయుచున్నది?

లక్ష్మి—కూర్చుండి యేమో యాలోచించుచున్నది.

కందర్పరావు—దయ్యము పట్టినదని యెవరుచెప్పినారు?

లక్ష్మి—పార్వతి.

కందర్పరావు—మీయమ్మ నడిగితివా?

లక్ష్మి—పాఱిపోయి వచ్చితిని.

కందర్పరావు—ఓసి పిచ్చిపిల్లా! ఈ పార్వతి గడుసుది. అది నిన్నుఁ దఱిమివేయుటకు చేసినయెత్తు. భయములేదు. మీ యమ్మయే పెద్దదయ్యము. అదియే పదిమందిని బట్టును. దానిని బట్టువారెవ్వరులేరు.

వంట సిద్ధమైనదేమో చూచి వడ్డింపుమనుము. నేనును వచ్చెదను. (లక్ష్మి పోవును)

(తనలో) పిఱికిపిల్ల నేను చచ్చినతరువాత నెట్లు బ్రతుకఁగలదో. అమాయకురాలు. ఎవ్వరేమిచెప్పినను నమ్మునుగదా! పిట్టబుఱ్ఱుమన్న నెగిరిపడును. ఒగురాకు కదలిన పాముని భ్రమించును.

(ఆలోచించి) మనకర్తవ్యమేమి? ఎట్లో పది గంటలదనుకఁ గాలము వెళ్లఁబుచ్చుటయే. (చూచి) అదే! సోంజీ వచ్చుచున్నాఁడు. వాని కీమధ్యపనిలేదు పాపము. ఇప్పుడు సరస్వతిమూలమునఁ గలుగునేమో యని తలఁచితిని గాని యందుల కవకాశము గలుగలేదు. అయినను వీని నింకను బోమ్మనరాదు.

[ సోంజీ ప్రవేశించును. ]

సోంజీ—కందర్పరావుగారికి దండాలు. పనిలేదు పాటులేదు. మాడిపోతున్నాం మహాప్రభూ!

కందర్పరావు—గంజాయి సారాయి మొదలగునవి యెప్పుడున్నవో యప్పుడే మీకు మాడుట తప్పదు.

సోంజీ—మానెయ్యాలని చూస్తూన్నాం బాబూ!

కందర్పరావు—ఇటునున్న సూర్యుఁడటు పొడిచిన తరువాత.

సోంజీ—ప్రస్తుతం పనియేదన్నా ఉందాండీ?

కందర్పరావు—లేదుగాని—ఈరాత్రి 12 గంటలకు మీమఠమునకుఁ గొంచెము దూరమునయున్న శివాలయమున కొకసాఱురమ్ము.

పనియున్నఁ జెప్పెదను. సేవకుఁడ దగ్గఁగూడదు. తుమ్మఁగూడదు. నిశ్శబ్దముగ నుండవలెను. రెండవవానిని దీసికొనిరాఁగూడదు.

సోంజీ—మీరు చెప్పినట్లే, ప్రస్తుతం పత్రికొక రూపాయైనా యిప్పింతురూ!

కందర్పరావు—ఇదిగో రూపాయి. (తీసియిచ్చి) ఇఁకపో.

[సోంజీ పోవును.]

ఈముండకొడుకులు నక్కలను మించినవాండ్రు. నక్కలు పీనుఁగులను బీఁకుకొని తినునుగాని వీండ్రు బ్రతికియున్నవాండ్రనే బాధించి తిందురు.

చ. తటియగునప్పుడెంతటి యధర్మములైనను జేయుచుందు రం
దఱకును బ్రాణకంటకులు తావులు దుర్వ్యసనాళికెల్ల నెం
దరనయినన్ ధనం బిడ హతంబొనరింత్రొక మాత్రలోన దు
శ్చరితులు వీండ్రతోఁ జెలిమి సర్వవిధంబులఁజూడ దూష్యమే.॥

కాని యవసరమును బట్టి వీరిని జేర్చికొనుచున్నాను. అయినను బదిమంది పెద్దమనుష్యులలో దిరుగవలసి యుండుటచే నేను వీరితో సంబంధము లేనట్లు నటింప వలసి యున్నది. సందు గనిపెట్టి వీండ్రు నావద్ద లంచములఁ దీయుదురు.

(చూచి) అదిగో! మోహినియు వచ్చుచున్నది. ఇంతప్రొద్దు పోయి యేమిపని దీనికి? లక్ష్మి యన్నట్లేదయ్యామైనఁ బట్టినదేమో కొంచెము దిగులుపడి యున్నట్లున్నది.

[మోహిని ప్రవేశించును.]

మోహినీ! ప్రియా! కూర్చుండుము. ఏమట్లున్నావు.? ఇంత ప్రొద్దుపోయినదేమి?

మోహిని—ఏమియులేదు. సుందరమ్మగారితో సంఘసంస్కరణమును గూర్చి చర్చించుచున్నాను. ఇప్పుడొక నూతన విషయము గూడఁ దెలిసినది.

కందర్పరావు—ఏమది. ?

మోహిని—మన యున్నత పాఠశాలలో నుపాధ్యాయుఁడైన ధర్మారావు మన ప్రచారమునకు విరుద్ధప్రచారము సాగించుచున్నాఁడట. ఊరిలో సనాతనాచార సభలు చేయించి వానిలోఁ బాల్గొనుటయే గాక తన తరగతిలోని బాలురకందఱకా దుర్బోధనములు తలకెక్కించినాఁడఁట.

కందర్పరావు—అయిన నిది విచారింతము.

మోహిని—విచారించుట కేమున్నది? అందఱకును దెలిసిన విషయమే. ఆతనిని రేపే బర్తరఫ్ చేయించవలెను. దానికి వలయు సహాయము మీరు చేసెదరా! అట్లయిన నేనును నడుముగట్టుదును. క్షణములోఁ బనిముగియును.

కందర్పరావు—నీకేదో దయ్యము పట్టినదఁటే

మోహిని—ఎవరు చెప్పినారు. ?

కందర్పరావు—లక్ష్మి

మోహిని—దాని కెవరు చెప్పిరి ?

కందర్పరావు—పార్వతి.

మోహిని—గడుసరిముండ రేపు దానిని దండింతును. నేను మిమ్మడిగిన ప్రశ్నమునకు సమాధాన మేది ?

కందర్పరావు—విచారించి తగుకారణములఁ జూపిన తరువాతనే కార్యమునకుఁ గడంగుట శ్రేయస్కరము.

ఉ. కారణ మున్నఁగాని యొకకార్యము నెగ్గదు లేనిచోటులన్
గారణమేదొ చూపవలెఁ గానియెడన్ బదిమంది చేరి యీ
దారుణ మేమటంచు సరదారులుగాఁ బొడువంగవత్తు ర
య్యో! రమణీ! విదూషణము నొందెదు సాహస చర్చలొప్పునే.॥

మోహిని—మీరేవో వంకలుపెట్టి నాపని సంగీకరింప కున్నారు. నామాట నేనమ్మనియెడల నేనీపూట నెట్లు భుజింపఁగలను?

కందర్పరావు—నిజముగనా?

ఉ. అందువుగాని యీరీతి యట్టులు మానుదువా! భుజింప పొ
మ్మిందు భుజింపకున్న నిఁకనెక్కడనేనియు నారగింతు వీ
వెందును బోవనన్న మఱియింతకు రెట్టిగ తేపుతిందు వే
మందువు మందయాన! మరియాద యిదేగద! కోపమేలనే.

మోహిని—నేఁడేమో మీవైఖరి విపరీతముగనున్నది. నన్నింతగా నెప్పుడు నెగతాళి చేసియెఱుఁగరు. ఇఁకనాపని సున్నయేనా!

కందర్పరావు—భయపడకుము. తేపుదయము మఱల జ్ఞాపకము చేయుము. నేను జేయఁదగినది చేయుదును. ఇదియొక గొప్పపనిగాదు.

చ. ధనముగడింప దుష్కరము దానిని నాశమొనర్పఁగా క్షణం
బును వలదొక్కచోఁ బ్రజకు భోజనసత్రముఁ బెట్టఁగష్ట మం
దున మఱిరాలు ఉవ్వుట గనుంగొనఁ దేలిక వేతనంబు లి
చ్చినిలుప భారమీక నిరసించి తొలంగఁగఁ జేయఁగష్టమా.

అదియుంగాక మన యుద్యమమునకు విరోధులైన వారిని నిరసించి యనుకూలురను బ్రోత్సాహపఱచుట మనవిధి.

(నిరూపించి) ప్రొద్దుపోయినది. లక్ష్మి నీకొఱకుఁ గలవరించుచున్నది. భోజనమునకు నాలస్యమైనది. పద.

మోహిని—అభయహస్త మిచ్చినట్లే గదా!

కందర్పరావు—ఆ!

మోహిని—(తనలో) ఒకపనియైనట్లే

(ఇరువురు లోనికి నిష్క్రమింతురు)

(తెరపడును)

(ఇది చతుర్థరంగము)

---

పంచమ రంగము

---

(ధర్మారావు తన గృహమున నద్దమునెదుట స్త్రీవేషముతోఁ గూర్చుండి యుండును.)

ధర్మారావు—(తనలో) ముస్తాబైతిని. చిన్నప్పుడు నాటకములలో స్త్రీ వేషము వేసిన తెలివితేటలిప్పుడు కొంచె మక్కఱకువచ్చినవి. నేనింకఁ గొంచెమాలస్యముఁ జేసితినా! ఈపరికరముల నరువిచ్చు దుకాణదారుఁడు తనగదికిఁ దాళమువేసి వెళ్ళియుండును. నేను సరిగా నాసమయముననే వెళ్లుట కేవలము వైదికము. నవనాగరకుల స్వయం క్షౌరవిధానము నేఁడు నాకవలంబింపవలసి వచ్చినది. (ఆలోచించి) అయ్యో! సతి యీ గొడవ యెఱుఁగక నిద్రించుచున్నది గదా! లేపిచెప్పుదునా? వలదు. అమాయికురాలు. దానికేల యిది. ఫలితము వలననే యీవిషయము తేటతెల్ల మగును.

(మఱల నాలోచించి) ఇప్పుడు నేనేగుచున్నది కీడునకో మేలునకో మఱచితిని. పిడిబాకుకుఁ బదనుపెట్టి యుంచితిని గదా! దానిని ధరించెదను. (అరలోనున్న పిడిబాకును దీసి చేతితోఁబైకెత్తి)

ఉ. కన్నుల నద్దుకొందు నినుఖడ్గమ! హింసకుఁగాలు దువ్విపో
నెన్నడు ధర్మమున్ నిలుప నేగుడు నియ్యెడ నీకుసాయమే
యున్న భయంబులేదిఁక మహోగ్రముగా దురితాత్ముగుండెలన్
గ్రన్ననఁజీల్చి నెత్తురులఁ గండలఁ బూఁకలు నీకొసఁగెదన్॥

(కన్నుల నద్దుకొని మొలలో దోపుకొనుచున్నాడు.)

మోహినిని గూడ నీబాకున కెఱచేసిన బాగుగనుండును. దుష్టురాలు, ఎందఱ కొంపలు తీయునో. (ఆలోచించి) ఛీ స్త్రీహత్య చేయనొల్లను. చేతనైనది దానిని జేసికొనిమ్ము. ఉద్యోగము పోయినఁ గలిమో గంజియో త్రాగుట కింత పొల మున్నది. నాకు వచ్చినచో ధర్మమరణమే గదా! సతికి దుఃఖమనివార్యము.

ఆకాముకుఁడు చంకలెగురవైచును. లొట్టలువేసికొనుచు వచ్చుచుండును. కామమెంతయైనఁ జేయించును. లక్షాధికారియగు వీనికిఁ బాడుశివాలయముపై నాసక్తి గల్గించినది. అవునది యుచితమే. వైజయంతీ విలాసములోఁ జెప్పలేదా! జారరతికిఁ బనికివచ్చు స్థలములలో గుళ్లపంచలను గూడ నాకవి పేర్కొనినాఁడు.

ఉ. కుట్టనికాసివేశములు గోష్ఠతలంబులుఁ దక్కరింపుం
దెట్టలు పాడుగోడలు నదీసదనంబులు నిష్కుటంబులున్
గట్టుకుటీరముల్ పసులగాడి మఱుంగులు గుళ్లపంచలున్
గట్టసి యిండ్లు జారరతికార్య సమాచరణైక సిద్ధికిన్.

జారిణీ జారుల సమావేశములు కత్తులతో సాములవంటివి. శయ్యాది సౌఖ్యముల నొక్కటియైన నుండదు. అయిన నదియే వారి కత్యంత మధురమైనది.

(పైకిఁజూచి) వెన్నెల దివ్యముగఁ బ్రకాశించుచున్నది. దీని యాహ్లాదము వేనోళ్ల వర్ణించినను దనివితీరదు.

ఉ. మిన్నుల దివ్యదీపము సమీహిత భక్తము వేల్పు మూఁకకున్
జన్నుగ నాచకోరములపాలిటి బువ్వము స్వీయకాముకున్
గ్రన్ననఁ జేరఁజూచు విటకాంతకునడ్డము చందురోచి దీ
ప్త్యున్నతి వాఁడు నోషధుల కూటట వెన్నెలవెల్లి యల్లదే.

ఇదినాకు మార్గమును జూపించుటయందు నిక్కలి సహకారి కాఁగలదు (చిఱునవ్వుతో) కొంపదీసి మేలిముసుఁగునేసికొని యీ వేష ముతో నున్న నన్ను త్రోవలో మఱియొక కాముకుఁడెవఁడైనఁ బట్టు కొనఁడు గదా! ఇఁకఁ దడవు సేయరాదు. (బయలు దేఱుచు, చూచి) అదేమి! సరస్వతి వచ్చుచున్నది.

[సరస్వతి ప్రవేశించును.]

(తొందరతో) సరస్వతీ! విశేష మేమైనఁ గలదా యేమి.?

సరస్వతి—విశేష మేమియులేదు. నిద్రపట్టక యిటు వచ్చినాను.

ధర్మారావు—నీవు వెలుపలికి వచ్చిన నీకపాయమునంటివే.

సరస్వతి—అపాయము లేదను ధైర్యముతో నచ్చినాను. నేను వత్తునను విశ్వాసముతోనే యాతఁడుండును. పాఱిపోదునను సంశయము నెంతమాత్రము పొందఁడని నేనిప్పుడు దృఢనిశ్చయముతోనుండి వెలుపలికి రాఁగలిగితిని. (చూచి) మీ వేష మత్యద్భుతముగ నున్నది. నన్ను మించితిరి.

ధర్మారావు—సోదరీ! ఇదంతయు దైవానుగ్రహము. పని నెఱవేఱిన తరువాత సంతసింతము. వేషమున నింక నేమైన సర్దుకొనవలసి యున్నదేమో చూడుము.

సరస్వతి—ఇఁక నేమియు నవసరము లేదు. పిపిబాకు మఱవలేదు గదా!

ధర్మారావు—ఇదిగో! మొలలో దోపికొంటిని.

సరస్వతి—నేనుగూడ వత్తునా! మీకు సహాయముగ నుందును.

ధర్మారావు—అమ్మా! నీవు రాఁగూడదు. ఇది నిశీథ సమయము. ఈవేషముతో నేను వెళ్లుటయే కష్టము. పైఁగ నీవుగూడనా! ఇది పట్టణమయ్యు నీసమయమున నిది మహారణ్యముతో సమానము.

శా. ప్రొద్దస్తంగతుఁడైనవెంటనె గుహల్ వోవిడి సింహాదుల
త్యుద్దండంబుగ వెల్వడున్ వనములందున్ లేళ్లు భీతిల్లఁగా
నుద్దామక్రియ నిట్లె పట్టణములందు గ్రాకృతిన్ దుష్టులే
సద్దున్ లేని నిశీథవేళలను నిశ్శంకంబు వర్తింత్రుగా.

కావున నీవిల్లువదలుట యుచితముగాదు. మీయింటికేగుము. నేనేవచ్చి యావద్వృత్తాంతముఁ జెప్పెదను.

సరస్వతి—తండ్రీ! స్వార్థత్యాగపరాయణా! నీకు జయమగుఁగాక.

మ. పతి పాదాంబుజ మెప్పుడున్ దలఁచుచున్ భావంబునం దన్యసం
గతిఁ జింతింపక యుంటినేని దురితన్ గాకుంటినేనిన్ సదా
గతి యెవ్వాఁడగు దీనమానవుల కాకంజాక్షుఁడే యండయై
వెతలన్ జెందగనీక కాచునిను సర్భికుండవై పాపుఁకన్.

ధర్మారావు—నీ యాశీర్వచనము వలన నాకు వేయింతల బల మెక్కువైనది. సత్వర మింటికేగుము. నేను వెళ్లవలెను.

సరస్వతి—చిత్తము. సెలవు. (సరస్వతి నిష్క్రమించును.)

ధర్మారావు—(తనలో) పదిగంటలు గూడఁ గావచ్చుచున్నది. నేనాలస్యము చేయరాదు. నేను ముందుఁ బోయితినాఁ వాఁడు నన్నెక్కువగ విశ్వసించును. (చింతించి) ఆహా! విధి వైపరీత్యము. తానొకటి తలఁచిన దైవ మొకటి తలఁచును. అతఁడు కాముకుఁడై కులుకుచు వచ్చుచుండును గాని ముందుగతి యెఱుంగఁడు.

మ. ఇదె యూకాంతను గూడి చక్కసరసం బీరీతిఁ గావింతునే
నిదె యూయంగనఁ గూడి ముద్దులను గొంచీరీతి వర్తింతునే
నిదె యూసుస్తనిఁ గూడి యంగజసుఖం బీరీతిగాఁ గొందునం
చెదఁ జింతించునె గాని చత్తునని వాఁడింతేని యెంచండుగా॥

వానిస్థితిని విచారింపనేల? ఎట్లైనను గందర్వ సంహారమే గదా కావలసినది. భారత దేశమునఁ బతివ్రతాత్వ ధర్మమును నిలుపఁ బెట్టుటయందు దక్షులైన రాజపుత్త్ర సతులను స్మరించి మఱియు నాపని కేగుదును.

మ. పతులన్ బుత్త్రుల ఘోరయుద్ధమునకై పంపించి దుర్వారవీ
రతఁ దామున్ బటుశస్త్ర సంతతుల ధీరస్వాంతలై పోరియున్
బ్రతుకుల్ లేశము లెక్కసేయకయె యాపత్కాల మందున్ దుదిన్
చితులన్ మ్రుగ్గిన రాజపుత్త్ర సతులన్ జింతింతునే నిత్తఱిన్॥

(శీఘ్రముగఁ బోవుచున్నాఁడు)

(ఇది పంచమ రంగము)

ఇది చతుర్థాంకము

పదమూడవయుల్లాసము.

నాగన్నకు బిడ్డనిచ్చి పెండ్లిచేయుటకు యెంతమాత్ర మిష్టపడని మామిళ్లమ్మ యావివాహమునకు సుముఖురాలై యుండుటకు హేతు వేదో చదువరు లిదివరకే యూహించియుందురు. ఆమెకు గూడ నగలు జేయించుకొనుటకు నైదువందల రూపాయల నిచ్చెదనని సింగన్న వాగ్దానము జేయుట చేతను, తండ్రి యాసొమ్ము తప్పక యిప్పించెదనని మాటయిచ్చుటచేతను మామిళ్లమ్మ పెండ్లిచేయుటకు ఒడంబడెను. ధనములో నెంతమహత్వమున్నదో చిత్తగింపుడు. తడసిన నులకమంచపుకుక్కివలె బిఱ్ఱబిగిసియున్న యామెమనస్సు వెంటనే చక్కబడెనుగదా! ధనముచేత శత్రువులు మిత్రులగుదురు. పరమ మిత్రులు పగవారగుదురు. ధనాశయనెడు పిశాచ మావహించినప్పుడు మనుష్యుడు పూర్వస్థితిని విడిచి నూతనావస్థలంబ్రవేసించుట మనము ప్రత్యక్షముగా జూచుచున్న విషయమే! మామిళ్లమ్మ పెండ్లికూతురు నగలతోబాటు తననగలు కూడ చేయింపుమని భర్తతోను తండ్రితోను చెప్పి యాసొమ్ము తండ్రిచేతికి యిచ్చి పాలకొలనువెళ్లి కాసులు తెమ్మని చెప్పెను. మరిడయ్యయు పాలకొలనువెళ్లి క్రొత్తకాసులుదెచ్చి నేర్పరియైన యొకకమసాలిని పిలిపించి తనగృహమునందే దుకాణము పెట్టించి కూతురకును మనమరాలికిని నగలుచేయించెను. మరిడయ్య మిక్కిలి జాగరూకుడై కమసాలి చిన్నమెత్తు బంగారమైన హరింపకుండ వేయికన్నులతో గనిపెట్టెనుగాని నగలలో నూరు రూపాయల బంగారము మాత్రము తక్కువయ్యెను. అందుకు స్వర్ణకారుని హస్తలాఘవముకాక మరిడయ్య హస్తలాఘవమే కారణము. అట్లు బంగారము తక్కువయ్యెనన్న మాట సింగన్నకుగాని భార్యకుగాని తెలియదు.

స్వగృహమునందు దుకాణము పెట్టించి యాభరణములను మరిడయ్య స్వయముగా చేయించి తూనికలు వేయించి యప్పగించుకొన్నాడను నమ్మకముతో వారాభూషణములను మరల తూనికలు వేయించుకొనక యూరకుండిరి. ప్రధానము చేసికొనుటకు వెళ్లినప్పుడు వారితో గూడ గొల్లపాలెము నుండి యొక వృద్ధబ్రాహ్మణుడుగూడ వెళ్లెను. అతని పేరు వేము తిమ్మన్నదీక్షితులు. ఒకనాడు సింగరాజు కనకరాజు తిమ్మనదీక్షితులంబిలిచి, "ప్రధానకాలమున జరిగిన విశేషము లేమిటి పెండ్లికూతురే లాయున్నది? పిండివంటలతో మీకుభోజనములు పెట్టిరా? మీకు వస్త్రము లిచ్చిరా?" యని అడిగెను. అప్పుడు తిమ్మనదీక్షితులు వారికిట్లు బదులు చెప్పెను. "కనకరాజుగారు మేము శుద్ధవైదికులము. ఏదిచేసినను వైదికులచేతిది డెమాయె వనితబ్రతుకు" అనిబదులు చెప్పెను. అరిశలపిండివంట వండినారు. అవి పండ్లతో పట్టి యెంతపీకినను ముక్కలుకాలేదు. అవి నమలుటకు కోరలుండవలెగాని యీదంతములు పనికిరావు. అవి పిండితో చేసిన అరిశలుగావు. రాతితో జేసిన యరిశలు. అటువంటి పాకమును దొడ్డ యిల్లాలు మామిళ్లమ్మగారెక్కడ నేర్చుకొన్నదో తెలియదు. పెండ్లి కుమారుని మేనమామకును నాకును వస్త్రములిచ్చినారు. అవి మిక్కిలి సన్నబట్టలు. పెద్దముండకొడుకు నగుటచేత నేను బరువుబట్టలు కట్టుకొనలేనని వాటిని నానిత్తము పురమాయించి నేయించినారు గాబోలు. అవివస్త్రములంటేవస్త్రములా మంచియంగవస్త్రములు. ఇక పెండ్లి కూతురుమాట చెప్పెదవినండి అది సిత్తేపమువంటిపిల్ల. నల్లవిరుగుడు చావకఱ్ఱతో చేసిన లావుపాటి బొమ్మలాగు ఉండును. దాని మొగము సరిగా అర్చనపాత్రవలెయుండును. కన్నులుదొన్నెలే. చెవులు గారెలు లాగుండును. ఉచ్చిష్టపిండము లాగున్నది ముక్కు. జెడ కూర్చొను

బోలు, వీపుపారణపాత్రవలె యుండును. మొత్తముమీద పిల్ల బొద్దుగా బాగుగానేయున్నది. అది మన నాగన్నగాడికి యీడు జోడుగా యుండును. వీనిసంగతి తెలిసినవారు "వెధన నాగన్న గాబోలువెలది మగడు" అనిచెప్పికొందురు. ఆయత్తమూమలు తప్పక యీపెండ్లికొడుకునకు సరిపోయినవారే!" ఆపలుకులు విని కనకరాజు పకపక నవ్వి "దీక్షితులుగారూ! చిన్నప్పటినుండియు మీరపరాలు చేయించుట కలవాటు పడియుండుటచే పెండ్లికూతురు వాలకమంతయు శ్రార్ధకర్మతో పోల్చిచెప్పినారు. బాగున్నది. మీవర్ణన. కొంప దీసి పెండ్లికివెళ్లినప్పుడు మాత్రము యిటువంటి మాటలు రానీయకండి." అనవుడు తిమ్మన్నదీక్షితులు ముసిముసి నవ్వుల నవ్వుకొనుచు "అయ్యా! నేనెట్లు వర్ణించినను తప్పులేదు. నాగన్న రేవు తాడి అదియొక గేదెమ్మ. ఆమహిషమును యీరేవుతాడికి కట్టిపెట్టుట వలన వారిదాంపత్యము ఎంతో అనుకూలముగా యుండును. పెండ్లికూతురు నాకీమొగుడు వద్దు మొర్రో యని యేడ్చుచున్నదట. ఏమైతేనేమి ఆకట్టురండమాట వినువారెవరు. పెండ్లి జరిగితీరును. మేమందరము పెండ్లి పెద్దలము" అని ప్రత్యుత్తరమిచ్చి వెడలిపోయెను.

అంతట గొన్నినాళ్లకు శుభముహూర్తము సమీపించెను. పల్లకీ భజంత్రీలను రాయకుదురులోనో తోకలపూడిలోనో కుదర్చవలసినదని శేషయ్య సింగన్నకు వర్తమానము చేసెను. పెండ్లికి బోవుటకు శేషయ్యకు పెక్కండ్రు బంధువులులేరు. అతనిపెద్ద మేనమామ కిద్దరు కొడుకులు. వారు వారిభార్యలను బిడ్డలును శేషయ్యయు భార్యయును పెండ్లికి వెళ్లదలచిరి. గొల్లపాలెములో నున్న వైదీక గురు బ్రాహ్మణులను గూడ రమ్మనివారాహ్వానము చేసిరి. నరసాపురమునుండి నాగన్న పినతల్లి కూతురును దానిమగడును గూడ

పెండ్లికి బోదలచిరి. బంధువులు, మిత్రులు, పురోహితుడు, కలసి మొత్తముమీద పదియారుగురు మనుష్యులు పెండ్లికి బయనమైరి. వారు గొల్లపాలెమునుండి మొగలితుర్రు పోయి అక్కడ నొక డింగీ పడవ పాలకొల్లు వరకు నేర్పరుచుకొని మధ్యాహ్నము భోజనము చేసి యానావ నెక్కిరి. పొగబండ్లు రాకమునుపు పూర్వకాలమున పాలకొలను నుండి నరసాపురమునకును, నరసాపురమునుండి మొగలితుర్రునకును, బాటసారులు డింగీలనబడియెడు చిన్ననావలమీద నెక్కి ప్రయాణము చేయుచుండిరి. ఆ పడవకేవు మిక్కిలి తక్కువ. ఒకమనుష్యునకు రెండు కానులు మాత్రమే. ఈదినములలో యట్టినావల సంచారము విరళమైనది. ఈవిధముగా ప్రయాణముచేసి పెండ్లివారు సాయంకాలమున పాలకొలనులో దిగి యచ్చటి సత్రములోదిగి వండుకొని భోజనముచేసి, మరునాడు తెల్లవారు నప్పటికి తోకలపూడి జేరి యుదయమున స్నాతకము జేసికో దలచినట్లు ముందుగా తమవెంట వచ్చిన చాకల స్వామిగానిని యారాత్రియే తోకలపూడి బంపిరి. వాడు నడచి తోకలపూడి పోయి జామురాత్రివేళ సింగన్నను లేపి యావార్త జెప్పెను. పెండ్లివారు రెండెడ్లబండ్లు నాలుగు కుదుర్చుకొని తెల్లవారుజామున బయలుదేరి నాలుగు గడియలు ప్రొద్దెక్కు నప్పటికి తోకలపూడి చేరిరి. పూజారి మల్లయ్యగారి చావడియు వారి పశులపాకయు విడిదులుగా నేర్పరుపబడెను. గ్రామములో నెవరో సింగన్నను బిలిచి, "ఇదియేమయ్యా! సింగన్నా పెండ్లివారికి విడిది పశులపాకయిచ్చినావు?" అని యడుగగా, ఆపశువులకు యీపశుల పాక చాలదా యని యాతడు బదులు చెప్పెను. సింగన్నయు మరిడయ్యాయు భజంత్రీలతో పెండ్లివారి నెదుర్కొని విడిదిలో ప్రవేశపెట్టిరి. విడిది చూడగానే పెండ్లివారికి మొగము మొత్తెను. పూజారి

వారిసావడి ఆడువారి నిమిత్తమనియు బశులసాల మగవాండ్ర నిమిత్త మనియు సింగన్న చెప్పెను. ఆసాలలో గేదెలు మొదలయిన పశువులైనను భరింపలేనంత కంపు బయలుదేరెను. నేలయంతయు నావు పంచితముతోను, మహిషమూత్రముతోను, నిండియుండెను. ప్రక్కను మురిగిపోయిన పేడకుప్ప. తిమ్మన్నదీక్షితులును శేషయ్యయు మగవారినిమిత్తము నిర్ణయింపబడిన విడిది చూచి వమనము రాబోవగా నది యొల్లెట్లో ఆపుకొని సింగన్నను మరిడయ్యను గలసికొని "అయ్యా! ఆడవాండ్రమట్టుకు బస యేదోవిధముగా నున్నది, మగవారిబస మిక్కిలియసహ్యముగా నున్నది. ఒక్కనిముసమైన మేమక్కడ నిలువజాలకున్నాము. మఱేదైన యింకొకబస చూచిపెట్టగలరా?" యని వినయముగా నడిగిరి. ఆవచనములు చెవుల సోకగానే సింగన్న కోపముతో మండిపడి గొంతెత్తి కఠినముగా నిట్లు పలికెను. "మీరు పరపంచకముతో తరలిరావలసినదని నేనును మామామగారును మీతో మొదటనే జెప్పియుంటిమిగదా? మామాటలు సరకు చేయక షోడశకర్మకు వచ్చినట్లు పదునెనమండ్రు మనుష్యులతో దండెత్తినట్లు మాయింటిమీఁద వచ్చిపడినారుగదా? మీకందరకు నేను మంచి మంచి మేడలుమిద్దెలు భవనాలు బసలక్రింద నీయగలనా? ఇది కుగ్రామమన్నమాట మీ రెరుగుదురా? ఇక్కడ మంచి బసలెట్లు దొరకగలవు. ఆబస మీకిష్టము లేకపోయిన పక్షమున సామానులు వేరే ఎవ్వరియింటనైన బెట్టుకొని పూజారిని బ్రతిమలాడుకొని దేవాలయపు మంటపముమీఁదను, గృహస్థుల వీధియరుగుల మీఁదను, పరుండి యెట్లో యీనాలుగు దినములు కాలక్షేపము చేయండి. మనలో మనము సర్దుకోవలెనుగాని పేచీలు పడినందువలన వినియోగము లేదు." అతని కఠినోక్తులు విని దీక్షితులు శేషయ్య మొద

లయినవారు పెదవులు విరచిరి. సింగన్న కాగ్రహము వచ్చుటకు రెండుమూడు కారణములు గలవు. వివాహము నిమిత్తము బంధువుల రమ్మని యతడు బిలుచుటచే నలుగురు కూతుళ్లును వారిభర్తలును, వారిబిడ్డలును, వారికి సంబంధించిన బంధువులును వచ్చిరి. పెండ్లివారు కూడ నేడెనమండుగురు వత్తురని తలంచెనుగాని, వానితలంపునకు భిన్నముగా బెండ్లివారు చాలమంది వెళ్లిరి. ఈరెండును వానికి మహాగ్రహకారణము లగుటచే మాటిమాటికి యందరితో గలహమాడుచు, నిప్పులుద్రొక్కిన కోతివలె గంతులువేయుచు, మామగారితో నిట్లనెను. "చూడండి! ఈదిక్కుమాలిన బంధువు లందరు నాప్రాణమునకు వచ్చి పడినారు. ఏదో బాగుండదని బంధుమర్యాదకు రమ్మని పిలువగానే నందన సంవత్సరము కరువునకు చచ్చినంత మంది చుట్టాలమని కట్టగట్టుకొని నాకొంపమీద పడవచ్చునా ? వీండ్ల యిండ్లు దక్షిణమున నున్నవో ఉత్తరమున నున్నవో నేనెన్నడైన నెరుగుదునా ? వీండ్లమొగాలుమండ ఈతొత్తుకొడుకులు గతిలేక పప్పన్నమునకై పదియామడ దూరమునుండి వచ్చినారు. నేను పెండ్లి నిమిత్తము జాగ్రత్తపెట్టుకొన్న సొమ్ము యావత్తూ పెండ్లివారికిని బంధువులకును పిండా కూడునకైన సరిపోవునో ? లేదో ? కానిండు, యీలాగున పశులమందవలె వచ్చిపడినందుకు వీండ్రడగడ్డి వీండ్రకు తిని పించి పంపెదను. చూడండి నాతమాషా, రండి స్నాతకము తగల బెట్టాలికాదూ! మనమిప్పుడు." అని మరేమో సణుగు కొనుచు మామగారిని తోడుకొని యత డావలికి బోయెను.

---

## పదుసాల్గవయుల్లాసము

స్నాతకము విడిదిలోనే చేసికొనుటకు యేర్పాటు చేయబడెను. మొగపెండ్లివారు రాత్రి పండుకొనుటకు పంపబడిన తాటియాకుల చాపలే యక్కడ పరవబడెను. స్నాతకమునకై గ్రామములోనున్న బ్రాహ్మణులు పూజారిమల్లయ్యగారి సావడిలో గూర్చుండిరి. మల్లయ్యగారి యింటిలోనివే రెండుపీటలు పురోహితున కొకటియు పెండ్లికొమారున కొకటియు వేయబడెను. స్నాతకపు తగవులో తేవలసిన పంచలచాపు సింగన్న పంపలేదు. కాశీయాత్రవేళ వరునకు మరియొక పంచలచాపు బహుమతిగా నీయవలసి యుండునని లోభించి సింగన్న కాశీయాత్ర ముచ్చట పెండ్లికుమారున కీవరకే తీరిన దనియు నందుచేత యిప్పు డక్కర లేదనియు జెప్పి యావేళకు దానక్కడ యుండక వెడలిపో యెను. తాటియాకుల గొడుగును, చెప్పులజోడును కృష్ణాజినమును వెలబెట్టి కొననక్కరలేదు గనుక అవియెట్లో సంపాదించి మేనమామ యైన చిలుకూరి శేషయ్య తనదగ్గరనున్న ఒక పంచలచాపు మేనల్లుని మీదగప్పి యాపెండ్లి కుమారునకు స్నాతకపువేళ జరుగవలసిన కాశీ యాత్రముచ్చట జరిపెను. గడ్డముక్రింద బెల్లపుముక్క తానే బెట్టి కాశీయాత్ర వెళ్లవద్దని బ్రతిమాలెను. ఈవిధముగ స్నాతక వ్రతము జరిగిన పిదప మగపెండ్లివారి నందరిని మరిడయ్య యాడుపెండ్లివారింటికి భోజనమునకు రమ్మని పిలిచెను. పెండ్లివారు మడిగట్టుకొని సింగన్న గారి యింటికి బోవుసరికి నపరాహ్ణము తిరిగెను. అప్పటికి వంటలు పూర్తిగా కాలేదు. ఏలయన సింగన్న వంటబ్రాహ్మణులను బెట్టక తానును తనభార్యయు తనయత్తగారును, తనయింటికి పెండ్లినిమిత్తము

వచ్చిన మరికొందరు స్త్రీలును గలసి వంట జేసిరి. అల్లుండ్రు నీళ్లు మోసిరి. కూతుండ్రు పైపని జేసిరి.

ఆడపెండ్లివారి గృహ మెంత సుందరముగా నున్నదో వర్ణింప జాలము. ఇంటికి వెల్ల వేయలేదు. వీధిగోడలకు సున్నపుపరజాలైనను వేయలేదు. గోడల కడుగున జేగురు రేఖ యైన తీర్చలేదు. మామిడాకు తేరగా దొరికినది గనుక ద్వారములకు మాత్రము తోరణములు విరివిగా గట్టిరి. గుమ్మములకు పసుపు కుంకుము మాత్రము గొంత వ్రాసిరి. ముందరి వాకిటిలో నాలుగు గడకఱ్ఱలు పాతి పైన పదితాటి యాకులు పరచి పందిలి వేసిరి. ఆపందిటిలోనే పెండ్లివారి భోజనములు. భోజనములకు గూర్చున్న వారిమీదికి ఒకమూలనుండి యెండ తగులు చునే యుండెను. పాకముమాట చెప్పనవసరము లేదు. క్రొత్త బుడమ బియ్యము తెచ్చి సింగన్న యన్నము వండించెను. అన్నము చిమిడి చింతపండు ముద్దవలె ముద్ద గట్టుకు పోయెను. అది వేడిగా నుండుటచే చిదుపుట శక్యము గాకపోయెను. పప్పు విస్తళ్లలో పరువులెత్త నారంభించెను. అది కందికట్టో కందిపప్పో తెలిసికొనుట కష్టమయ్యెను. సింగన్న కష్టపడి యిరువది గుమ్మడి కాయలును నొకవంద యరటి కాయలును సంపాదించెను. స్నాతకమునాడే గాక తక్కిన నైదు దినములు గూడ పగలు గుమ్మడికాయ కూరయు గుమ్మడికాయ పులుసును రాత్రులయందు అరటికాయ కూరయు జేయించి సింగన్న కాలక్షేపము చేయించెను. స్నాతకమునాడు పెండ్లివారి భోజనములు అగునప్పటికి నాలుగు గడియల ప్రొద్దు మాత్రమే యుండెను. ఆరాత్రి నాలుగుగడియలకే శుభముహూర్తము నిర్ణయింపబడెను. రెండు గడియల రాత్రి యైన తరువాత పెండ్లికొడుకు పల్లకి యెక్కి యూరేగి వధూగృహమునకు వచ్చెను. క్రొత్తబిందెలు కొనక సింగన్న ప్రాత

బిందెలలోనే కొంచము పానకము జేసి పెండ్లివారికి త్రాగనిచ్చి బిందెలు మరల తనయింటికి పట్టించుకొని పోయెను. సింగన్న పెండ్లిపీట నిమిత్తమై ప్రయత్నము చేయలేదు. మును పెక్కడనో తనకు నగ్న ప్రచ్ఛాదనమీదనో పొత్తర్లమీదనో వచ్చిన రెండుపీటలు తెప్పించి వధూవరుల నిమిత్తము వేయించెను. ఆజాతిలోనే మరియొకపీట పురోహితుని నిమిత్తము యేర్పాటు చేయబడెను. కాళ్లు గడుగుటకై మైనము మాటు బెట్టిన యొక చిల్లిచెంబును ప్రాతపళ్లెము నుపయోగింప బడెను. క్రొత్తవి కొనలేదేమని శేషయ్య ప్రశ్నింపగా, నః పురమాయించినాను, కంచరి కామాక్షి చేయించు చున్నాడు, అంతవరకు నివి తాత్కాలికముగా నుపయోగించు చున్నానని సింగన్న బదులు చెప్పెను. నాగన్నగారివెంట వచ్చిన పురోహితునకు మంత్రము పూర్తిగా రాదు; నడుమ నడుమ నట్టుచుండును. చూర్ణికయు మహా సంకల్పమును జెప్పవలసి వచ్చినపుడు భజంత్రీలను గట్టిగా వాయింపుమని నొక్కి చెప్పి రహస్యము జెప్పినట్లు మంత్రము మెల్లగా జెప్పెను. మన మంత్రములు మిక్కిలి విచిత్రమైనవిగదా! వేలకొలది రూకలు వరునకు దక్షిణగా నిచ్చి కన్యకు వందలకొలది రూకలు విలువగల యాభరణములు బెట్టి సాలంకృత కన్యాదానమును యజమానుడు చేసి నప్పుడును, బిడ్డను వేలకొలది రూకల కమ్ముకొని కటికవానివలె నరమాంస విక్రయము చేయుచున్న వాని బిడ్డకు వివాహము జరుగు నప్పుడును "దశపూర్వేషాం, దశాపరేషాం, మయాసార్ధం, మత్ పితౄణాం, శాశ్వత బ్రహ్మలోకనివాస సిధ్యర్థం సాలంకృత, కన్యాదానం, కరిష్యే" అనియేగదా మంత్రము జెప్పబడును. నిజముగ నిరలంకృత కన్యావిక్రయం కరిష్యే యని మంత్రము మార్చి చదివిన పక్షమున నెంతో సమంజసముగ నుండునుగదా! ఈకారణములచేతనే

మంత్రముల మీదను వైదిక కర్మలమీదను, మనవారికి విశ్వాసము పోయినది. పెండ్లికుమారుని వంశము గాని వయస్సు గాని విద్యగాని రూపముగాని స్థితిగతులుగాని చూడక యాత్మలాభ పరాయణులయి తల్లిదండ్రులు కుంటివానికో గ్రుడ్డివానికో మూగివానికో మొండి వానికో బండవానికో కన్యలను విక్రయించి వారిని దుఃఖసాగరములో శాశ్వతముగా ముంచుచున్నంత కాలము మన దేశ మిట్లె యుండును. సంఘములోనున్న పెద్దలును వేదవేత్తలును ధర్మకోవిదులును, మంచి పలుకుబడిగల యుద్యోగస్థులును ధనాఢ్యులును, దమకన్నుల ముందట యిటువంటివి జరుగుచుండగ వారిని జీవాట్లుపెట్టి తమ ధర్మము నిర్వర్తింపక యూరక చూచుచుండుటచే సంఘవృక్షము దురాచార మనెడు చీడపురుగుల పాలై క్రమక్రమముగా నాశనమగుచున్నది. కన్యాశుల్కము గ్రహించుట మహాపాతకమనియు, శుల్కమిచ్చి గ్రహింపబడిన కన్యలు హవ్యకవ్యములకు బనికిరారని శాస్త్రములు ఘోషించుచున్నను, మన పండితులు శాస్త్రముల మొఱ్ఱ లాలింపరు. శాస్త్రములే మనకు ప్రమాణములని గొంతులెత్తి యఱచెడివారేగాని శాస్త్రానుసారముగ నడచుకొనునట్టివారు, దేశస్థులలో ముఖ్యముగా బ్రాహ్మణులలో నెవ్వరు లేరని నిర్భయముగ నిరాక్షేపణముగ జెప్ప వచ్చును. శాస్త్రములమీదనే యభిమానమున్న పక్షమున యిటువంటి దుష్కార్యములను మనవారేల సైరింతురు.

వివాహ మెట్టెటో పూర్తియైనది. పిమ్మట ప్రధాన హోమము జరిగెను. తరువాత స్థాలీపాకము జరిగెను. అది యైనతరువాత భోజనము లారంభ మాయెను. అప్పటికి మూడు జాములు రాత్రి గతించెను. గడియారము గంట గొట్టినట్లు పెండ్లివారి యేర్పాటు లింత చక్కగా నున్నవని కాలపురుషుడు కేక వేసినట్లు కొక్కొరోకో యని జాముకోడి

కూసెను. వంట విషయమై యీవరకే కొంత వ్రాయబడినది. మరికొన్ని విషయములు గూడ చెప్పవలసి యున్నవి. ఏమదినములు గూడ నిట్లే యున్నవని చదువరు లూహించుకొనవచ్చును. పప్పులో నొకపూట నుప్పు తక్కువ; మరియొకపూట నోట బెట్టుకొనుటకు వీలులేనంత ఉప్పెక్కువ; కూరలలోను, దప్పళములోను, నొకమారు నోరుమండిపోవునట్లు కారమెక్కువ; యొకసారి యుప్పుకారములు లేకుండుట. పచ్చడినిమిత్తము పదికుంచములు ఉశిరిగకాయలు తెప్పించి సింగన్న పచ్చిమిరపకాయలు పోసి పచ్చడి తొక్కించెను. అదే రెండుపూటల పెండ్లివారు వడ్డించిరి. వివాహములలో మితవ్యయము చేయదలచినవారు సింగన్న చేసిన పెండ్లిప్రయత్నముల నెరిగి జాగ్రత్త పడవచ్చును. పప్పు దప్పళము కూరలు నోట బెట్టుకొనుటకు వీలులేనట్లుండుటచే కర్చు మిక్కిలి తక్కువగు చుండెను. నేతివడ్డన విషయమై యొక్కమాట జెప్పవలెను. ఒక్కసారేగాని మరల నేయి జూపించుట లేదు. మగ పెండ్లివారు నేయి గావలెనని యెంత అరచినను పనితొందరలో విన పడనట్లు సింగన్నయు వాని చుట్టములును నటింతురు. నేతిజారీ సింగన్న పట్టుకోవలెను లేదా మామగారు మరిడయ్యయైన పట్టుకొనవలెను; ఆజారీ మరొకరు పట్టుకొనుటకు సింగన్న సెలవులేదు. అన్యులు ఆజ్యము వడ్డించినపక్షమున చేరల నిండ వడ్డింతురను భయము చేతనే సింగన్న యీకట్టుబాటు చేసెను. విధిలేక రెండవసారి నేయి వడ్డించ వలసివచ్చినప్పుడు సింగన్న నూనె జారీ పట్టుకొనివచ్చి వడ్డించును. అయ్యో యిది నూనె యని మగపెండ్లివారు అన్నప్పుడు పొరబాటు పొరబాటు యని అతడు ప్రత్యుత్తరము జెప్పును. ఒకప్పుడు నేయియు నూనెయు కలిపి వడ్డించును. ఇకమజ్జిగ మాటకూడ యించుక వర్ణింప తగును. లోకములో మజ్జిగలో నీళ్ళుకలుపుట మనమెరుగుదుము

సింగన్నగారి యింట మరియొక క్రొత్తఫక్కీ కనిపెట్టబడెను. ఒకఅణా బెట్టి పెరుగుకొని కుండెడు నీళ్లలో నది కలిపి వేయునట్లు సింగన్న యేర్పాటుచేయించెను. అందుచేత సింగన్నగారి యింట మజ్జిగ కలుపుకొనుట యనగా నీళ్లు కలుపుకొనుటయే యని యర్థము. ఇంక పిండి వంటలమాట యేమని చదువరు లడుగవచ్చును. స్థాలీపాకమునకు నరిశెలు గారెలు నండిరి. గారెలు మినుముతోగాక యినుముతో జేసి యుండవచ్చునని తిమ్మన్నదీక్షితులు ప్రక్కన గూర్చున్నవారితో పలికి మరియు నిట్లనెను. "ఓరీ? యీగారెలలో నంజుకొందుకు అల్లపుపచ్చడియుండిన బాగుండునురా! నువ్వుపచ్చడి యున్నను మంచిదే!" ఆపలుకులు విని ప్రక్కనున్న బ్రాహ్మణుడు "తిమ్మన్న బావా! అల్లపుపచ్చడి నువ్వుపచ్చడి శ్రాద్ధములలో చేయుదురుగాని శుభకార్యములలో చేయుదురటయ్యా! నీవేళాకోళము లెప్పుడును శ్రాద్ధములమీదికే వెళ్లును. ఎవరైన విన్నపక్షమున బాగుండదు ఊరుకో" యని మందలించెను. "ఓరీ! వెఱ్ఱిపాడెగట్టా, యిది శ్రాద్ధము గాక వివాహమటరా? శ్రాద్ధయోగ్యముగా జరుగుచున్నది గనుక యిది శ్రాద్ధమన్నను తప్పులేదు. ఇది చూడగానాకు నాగన్నగాడి మాసికము లాగున్నది గాని పెండ్లిలాలేదు." అని తిమ్మన దీక్షితులు బదులు చెప్పి యూరకుండెను. అరిశెలును గారెలును అప్పజెల్లెంౘ్ర వంటివి గనుక గారెలపాకమే అరిశెలకు గూడ పట్టెను. మంచిదంతపటిమగల పడుచువాండ్రకే యవికొఱుక బడనప్పుడు తిమ్మన్నదీక్షితులువంటి ముసలివానికి కొఱుక శక్యమగునా? పండ్లూడిపోవుటచేత పెండ్లికొడుకు వాని నోట బెట్టనేలేదు. తక్కినదినములలో బూరెలు మొదలయిన పిండి వంటలు లేకపోయినను వేరొకవిధమైన పిండివంటలు లేకపోలేదు. దప్పళములో పిండివేయుదురుగదా? కూరలలో పిండివేయుదురుగదా?

అందుచేత నవే పిండివంటలని పాఠకమహాశయులు భావింపవలెను. పెండ్లికుమారున కొక్కపూటయైనను మినపసున్నిగాని యరిశలుగాని యుపాహారముగా బెట్టలేదు. అతనికేదిక్కులేనప్పుడు కూడవచ్చిన చుట్టములకామర్యాద జరుగలేదని వేరుగజెప్పవలెనా ? పెండ్లికూతును పెండ్లికొడుకు విస్తరిదగ్గర కూర్చుండబెట్టి భోజనము చేయింపవలెనని మనలో నొకపద్ధతి యున్నదిగదా ! దుందుభినట్లు చేయించుటకు నెవరి శక్యము గాకపోయెను. "ఆయన దగ్గర నేను భోజనము చేయను. ఆయెంగిలి నేను తినను, ఆయనతో కూర్చుండుట నాకసహ్యము ; నన్నుమీరు తిట్టండి కొట్టండి నేనాపని చేయను." అని దుందుభి మగని దగ్గర గూర్చుండి భోజనము చేయుమని యుపదేశించిన బంధువులకు బదులు చెప్పెను. అందుచేత వధువు యొక్క మాతయు మాతామహియు శేషయ్య యొద్దకు బోయి "అయ్యా! మాపిల్లకు మిక్కిలి సిగ్గు. అది పెండ్లికొడుకుతో గలసి భోజనము చేయుటకు చాల బిడియపడుచున్నది. మెల్లమెల్లగ దాని భయము దీర్చి రేపటెల్లుండి కూర్చుండ బెట్టెదము." అనిక్షమార్పణ జెప్పికొనిరి. మొత్తముమీద పెండ్లికూతురుతో గలసి భోజనము చేయు భాగ్యము నాగన్న కొక్కపూటయైన బట్టలేదు. వివాహమయిన తరువాత రెండవనాటి మధ్యాహ్నము సింగన్న దప్పళము మానుపించి చారు గాపించెను. ఆచారు త్రాగినప్పుడే కొంచము వెగటుగా తోచెను. త్రాగిన తరువాత రెండుమూడు గడియలకు వారికందరకు డోకులు బయలుదేరెను. పిల్లలు మొదలుకొని పెద్దలవరకు వమనములు ఒక్కటేవరుసను కాజొచ్చెను. పెండ్లివారినందరను జంపివేయుటకు సింగన్న యేదో విషము గలిపినాడురో యని తిమ్మన్నదీక్షితులు మొదలయినవారు గట్టిగా అరవ జొచ్చిరి. ఆవార్త తెలిసి మునసబు కరణము లక్కడికి

వచ్చి సింగన్నను బిలిచి యడిగిరి. వారికి సింగన్న యిట్లు బదులు చెప్పెను. "అయ్యా వాంతులకు నేను కారణము చెప్పలేను. మగపెండ్లి వారికేగాక నాబంధువులకు గూడ వమనములు వెళ్లుచున్నవి పెండ్లి కూతునకు పెండ్లికొడుకునకు గూడ వమనములు బయలు దేరినవి. నేను విషముపెట్టినవాడనైన పక్షమున నాయల్లునకు గూతునకు గూడ నాచారు పోయింతునా? నాకుగూడ వికారము వచ్చుచున్నది." యని చెప్పి వారియెదుట రెండువమనములు చేసుకొనెను. కరణము విశేష లోకజ్ఞానము కలవాడు గనుక చారులో చింతపండు పిసికి వేసినారా? అడలు విడదీయకుండ వేసినారా? అడల పాళముగానే వేసినపక్షమున కాగగా మిగిలిన అడలు తీసుకొనిరండి యనిచెప్పి యవి దెప్పించి విడ దీసి చూచెను. వానిలో పొగాకు రేకలు కాడలు నాలుగు కనబడెను. అవికనబడగానే వమనములకు గారణము చింతపండులోనున్న పొగా కేయని భయములేదని జెప్పి మునసబుతో వెడలి పోయెను. పెండ్లి వారిలో కొందరికి కడుపు నొప్పి బయలుదేరెను. కూరలు మొదలయి నవి రుచిగా లేకపోవుటచేత కొందరికి కడుపునిండక నీరసము బయలు దేరెను. డబ్బుబెట్టి యేదైన కొని తినవలెనన్న నచ్చట మిఠాయి దుకాణములు లేవు. కొందరు కొబ్బరికాయలు కొని నీరుత్రాగి యాగుంజు తినిరి. కొందరు కాపులయింట పాలుకొని బెల్లము కలుపు కొని త్రాగిరి. కొందరు పొలమూరు వెళ్లియరటిపండ్లుకొని తెచ్చుకొని తినిరి. తమతో పెండ్లికి వచ్చిన వారియవస్థ చూడలేక శేషయ్యా నాగన్నతో నాలోచించి సింగన్నను మరిడయ్యను బిలిచి మెల్లగానిట్లు చెప్పెను. "అన్నగారూ! మామగారూ! నామనవి చిత్తగించండి మాతో వచ్చినచుట్టములు మిత్రులు చాలచిక్కుపడుచున్నారు. బసలా మంచివిలేవు. దానిమాట యటుండనిండు; భోజనములా రెండుపూటల

ప్రొద్దుపోవుచున్నవి, పగటివేళ నపరాహ్ణము తిరుగుచున్నది. రాత్రి తెల్లవారుజాముకోడి కూయుచున్నది. అన్నము క్రొత్తబియ్యపు అన్నము ఎఱ్ఱగా నెత్తురు కూడు వలెనున్నది. పప్పుగాని కూరలుగాని దప్పళముగాని హాయిగా తినుటకు నోటికి రుచిగాలేవు. పిండివంట లసలేలేవు. అప్పడములు వడియములు లేనిపెండ్లి యెక్కడనైన యుండునా? పదియేనువందల రూపాయలు కరుకులు మీచేతిలో బోసిన పెండ్లికొడుకు ముండకొడుకు ఒక్కయప్పడమునకైన వడియమునకైన నోచుకొనలేదా? మావాండ్రందరు నాకలిచేత మలమల మాడిపోవు చున్నారు. డబ్బుపెట్టికొని యేదైన తిందమన్న యీ కుగ్రామములో నేమియు దొరుకదు. వాండ్రు స్వగృహములకు వెళ్లిపోవలెనని తలచు చున్నారు. నేటినుండియైన జాగ్రత్తగ వంటలు చేయించి రుచిగా భోజనము పెట్టించవలెనని కోరుచున్నాను."

ఆవచనము లాకర్ణించిన తోడనే సింగన్నకు వర్ణింపలేనంత యాగ్రహము పొడమెను. పొడముటయు నతడు కన్నులు ఎఱ్ఱజేసి కోపముచే మొగ మెఱ్ఱబార శేషయ్యకిట్లు ప్రత్యుత్తర మిచ్చెను. "అన్నన్నా! యెంతమాట! పెండ్లివారి కెక్కడ లోపము జరుగునో యని వేయికన్నులతో గనిపెట్టి బహువిధముల నేను తగిన యేర్పాట్లు చేయుచుండగ మీరీప్రకారముగ నోటికి వచ్చినట్లు మాట్లాడవచ్చునా? అన్నము నెత్తురు ముద్దలులా గున్నదా? మనమందరము బుడమ బియ్యము తినుటలేదా! మహారాజులవలె మీకు ఢిల్లీభోగాలు చిట్టి ముత్యాలు కిస్మీసాంబాలు చిన్నప్పటినుండియు అలవాటైనవి కావోలు. అటువంటి బియ్యాలు తినుటకు మేమాగర్భశ్రీమంతులము గాము. కూరలు దప్పళములు నిక్షేపముగ నున్నవని మాచుట్టాలు హాయిగ తినుచుండగ మీకవి రుచిగలేవా? నేనును నాభార్య నాయత్తమామలు

రేయుంబగళ్లు మాయెముకలు పొడుమైపోవునట్లు కష్టపడి వంటలుచేసి కుంభాలు మీ కమర్చి పోయుచుండగ నేమిలోటు వచ్చినది. దినము నకు వరహా యిచ్చెదమని చెప్పినను వంటబ్రాహ్మణుడు దొరకలేదు, యివి లగ్గసరి రోజులు. బ్రాహ్మణుడు దొరకకపోయినను మేమే తంటాలు పడుచున్నామను మాట లేకుండా నలుగురిలో నన్నీవిధముగ నవమానము చేయుదురా? నేను చేసినంత వైభవముగ వివాహము నేతొత్తుకొడుకు చేసినాడు? పోతుల్లాగున తినికూర్చుండి మాటలు చెప్ప వచ్చును. పెండ్లిచేసిచూడు యిల్లుకట్టి చూడు అన్నాడు శాస్త్ర కారుడు. మీ బంధువులు వెళ్లిపోవుదురని నన్ను బెదిరించెదవా? ఇష్టమైన నుండుమనుము, కష్టమైన వెళ్లుమనుము. వారు నాకోసము రాలేదు. నాకోసము ఉండరు." ఆ పలుకులు మంటమీద పోసిన నేయిలాగ శేషయ్య కోపమును రెట్టింపు చేయగా శేషయ్య సరే పెండ్లివారి యెడల నీకంత నిర్లక్ష్యముగనున్న మేము వెళ్లిపోదు ములే యని విసవిస నడిచి తనవారి నందరిని ప్రయాణము గమ్మని సదస్యమునాడు భోజనము చేయకుండ రెండుజాములువేళ నందర వెంటబెట్టుకొని పోయెను. "ఏలాగో యీరెండు దినములు కన్నులు మూసుకొని కాలక్షేపము చేసిపోవయ్యా మామా" యని మేనల్లుడు నాగన్న మిక్కిలి బ్రతిమాలినను వినక శేషయ్య బంధువర్గముతో సాగి పోయెను. పోయి వీరవాసరమున నొక బ్రాహ్మణుల యింట వంట జేసికొని భుజించి సాయంకాలమునకు మత్స్యపురిమీదుగా మొగలితుర్రువెళ్లి మరునాడు ఉదయమున యాతడు గొల్లపాలెము జేరెను. నరసాపురము నుండి వచ్చిన యిద్దరు చుట్టములు మాత్రము శేషయ్యతో పోక నిలిచిరి. మొత్తముమీద పెండ్లికొడుకు పురో హితుడు నరసాపురము చుట్టము లిద్దరు తక్క తక్కినవారు వెడలి

శ్రీ

# విద్విలాసము

( ఐదంకముల సాంఘికనాటకము )

" భాషామణి " పత్రికనుండి పునర్ముద్రితము.

గ్రంథకర్త

( త్యాగి )



ప్రకాశకులు

శ్రీ మార్కండేయభవనము



3

నరసరావుపేట
గుంటూరుజిల్లా.

వెల
రు 0–12–0

# కృతిసమర్పణము



ఎవ్వాని నామంబు నెనసి జ్ఞానానంద
వర్ణముల్ పరమ ప్రభావమందు
నెవ్వాని శుభరూప మెన్న లోకాతీత
సౌందర్యరాశియై సన్నుతమగు
నెవ్వాని దయచేత నీ సర్వలోకంబు
చల్లగ వర్ధిల్లి యుల్లసిల్లు
నెవ్వాని బోధన మీప్సితమోక్షంబు
కరతలామలకంబుగా నొనర్చు
నెవని పూర్ణత్వ సముపాస్తి నెల్ల భక్త
లజ్ఞతను వీడి పరమార్థ మందుచుందు
రట్టి సద్గురువర్యున కధిక భక్తి
నంకిత మొనర్తు చిద్విలాసాఖ్యకృతిని.

## నా ట క ర ం గ ము

కృష్ణాతీరమున నరణ్యప్రాంతమున కుండినపురము.

## పా త్ర లు

### పు రు షు లు

1. చిదానందయోగి.
2. శిష్యుఁడు.
3. కందర్పరావు—వకీలు.
4. ధర్మారావు—ఉపాధ్యాయుఁడు.
5. ప్రహ్లాదుఁడు—సరస్వతి కొడుకు.
6. రామారావు—సరస్వతి తండ్రి.

7–9. సోంజీ రాంజీ సూర్జీలు (భ్రష్టబైరాగులు)

### స్త్రీ లు

1. సరస్వతి.
2. మోహిని—కందర్పరావు భార్య.
3. లక్ష్మీ సుందరీ పార్వతులు (బడిపిల్లలు)
4. సతి—ధర్మారావు భార్య.
5. సోమిదేవమ్మ, పరిచారిక మొదలగువారు.

# కథాసంగ్రహము

## ప్రథమాంకము

(ప్రథమరంగము. ప్రథమదినము.)

నాంది నటీసూత్రధారులు.

గ్రంథకర్త:— త్యాగి—పారమార్థబుద్ధితో వ్రాసె.

(విష్కంభము) —ఉదయము 8 గంటలు

శ్రీచిదానందయోగి హిమాలయములనుండి యాంధ్రదేశమున కుండినపురమునకు విచ్చేయుట. 3 రోజు లుండఁదలఁచుట. అచ్చట నాయవకాశమున ఓంకారమతము స్థాపింపఁదలఁచుట, తనమాయా విలాస మనునాటకమును తానే చూడఁ దలచుట.

ప్రథమశిష్యుఁడు ప్రవేశించుట. వానితో నాటకసూచన.

ద్వితీయరంగము :—9 గంటలు.

వకీలు కందర్పరావుభార్య యగుమోహిని గౌరవోపాధ్యాయిని, ధర్మారా వనునాతని మోహించినది.

తనపాఠశాలనుండి ప్రణయలేఖ నంపును. తనకుమార్తె లక్ష్మికై సరస్వతి యనునామెను బిల్చి వీణపాఠమునకు గుదుర్చును.

తృతీయరంగము :—మధ్యాహ్నము 12 గం.

సరస్వతితండ్రి రామారావు పట్టణనివాసము మాని తమయండ నుండమని సరస్వతిని బ్రోత్సహించుట. సరస్వతి బాలునివిద్య పోవునని రా ననుట. తనభర్త బ్రహ్మానందము 5 వత్సరములక్రింద వైరాగ్యముఁ జెంది వెళ్లగా వీణపాఠము చెప్పి బాలునికిఁ జదువు చెప్పించుచున్నది.

చతుర్థరంగము :—సాయంకాలము 6 గం. —8 గం.

కందర్పుని సంఘసంస్కరణచర్చ, మోహినిపై గలమోహము. సరస్వతి పాఠముఁ జెప్పవచ్చుట. ఆమెను జూచి ముగ్ధుఁ డగుట.

ద్వితీయాంకము

ప్రవేశకము రాత్రి 7 గం.

పార్వతి లేఖను ధర్మారావునింట పడవేయుట.

ప్రథమరంగము :—8 గం.

ధర్మారావు లేఖను జూచికొని నిరసించుట. ఆసమయమున మోహినివచ్చి నిరాకరింపఁబడుట. ధర్మారావు సరస్వతిని బిలిపించి కందర్పరావింట జాగరూకతతో నుండు మనుట.

రెండవరోజు—ద్వితీయరంగము :—ఉదయము 8 గం.

సరస్వతి పాఠము చెప్పుచుండ కిటికీనుండి కందర్పరావు స్వేచ్ఛగ చూచును. అతనిమోహము. పాఠ మైనపిదప, తమయింట నొకభాగ ములో నూరక యుండవచ్చు నని సరస్వతితోఁ జెప్పుట. సరస్వతి నిరాకరించి సత్వరము వెళ్లుట. వెంటనే మరల సరస్వతిని గలుసుకొన వలెనని యాతఁడు తొందరపడుచుండుట.

తృతీయరంగము :— 9—30 గంటలు.

సరస్వతితో కుమారుఁడు ప్రహ్లాదుఁడు భక్తిలేని యీచదువు నభ్యసింపననుట. ఆమె లాలించి, బెదరించి, బడికి పంపుట. శ్రీ చిదానందయోగి భిక్షకు రాగా నింటిలోనికిఁ బిలిచి భిక్ష మిచ్చుట. భర్త యేమో యని సంశయము. తనదుఃఖము చెప్పుట, మోహరహితముగా నీశ్వరరూపముగా భర్తృనామమును సంస్మరించిన దుఃఖ మడఁగు నని చెప్పి పోవును. ఒకపరిచారిక సూరమ్మయింటికి రమ్మనును.

తృతీయాంకము

ప్రవేశకము :—11 గంటలు.

పరిచారిక సూరమ్మయింటికిఁ గందర్పరావే సరస్వతిని బిలిపించి నాఁడనుకొనుట. దానిజాలి

ప్రథమరంగము :—11 మొదలు 12 గంటలు.

సూరమ్మయిల్లు, సరస్వతీ ప్రవేశము. కందర్పరావు మోహము. లాలించుట. బెదరించుట సాయంకాల మూఁడుగంటలకుఁ జెప్పెదనని యొప్పికొని సరస్వతి వెడలిపోవుట.

ద్వితీయరంగము :—ఒంటిగంట.

శ్రీ చిదానంద యోగి శిష్యునితో ప్రసంగించుట. శిష్యులు తప మాచరించుటయే తనసేవ. మతము లావశ్యకము లేదు. హిమాలయప్రశంస. ధర్మారావు భార్య సతియు ప్రహ్లాదుఁడును వచ్చి యుపదేశము నందుదురు.

తృతీయరంగము :—2 గంటలు.

మోహినినిగూర్చి ధర్మారావు స్వగతము. ఊరు విడచెద నను కొనుట. సరస్వతి తన వృత్తాంతమును జెప్పుట. రాత్రి పదిగంటలకు పాడుశివాలయమునకు రా నొప్పుకొను మనియు నచ్చటికిఁ తాను సరస్వతీ వేషముతో వెడలి యాతని సంహరింతుననియు ధర్మారావు సరస్వతి నొప్పించుట.

చతుర్థరంగము :—సాయంకాలము 5 గంటలు.

మోహిని పాఠశాలలో ధర్మారా వుద్యోగము తీసివేయించ నిశ్చయించుట. రాంజీ రాగా మరల మరునాటి సాయంకాలమురమ్మనుట.

చ తు ర్థాం క ము.

ప్రథమరంగము :—సాయంకాలము 6 గంటలు.

రాంజీ-సోంజీ-సూర్‌జీలు-భ్రష్టభైరాగులు. రాంజీ హిందూస్థానీ (హాస్యము) శ్రీచిదానంద యోగియు శిష్యుఁడును వారిని జూచి తొలగి పోవుట.

ద్వితీయరంగము :—

సూరమ్మ యిల్లు కందర్పరావు విరహము. తుదకు సరస్వతి వచ్చి సమయము చెప్పుట. అంగీకారము.

తృతీయరంగము :—7-8 గంటలు.

సరస్వతి విచారము. సరియే నని ప్రహ్లాదుని ధర్మారావునకు కబురుచేయుట.

చతుర్థరంగము :—

కందర్పరావు విరహము. సోంజీతో రాత్రి 12 గంటలకు పాడు శివాలయముకడకు రమ్మనుట.

మోహినికి ధర్మారావు నుద్యోగము తీయించెదనని యభయ మిడుట. పంచమరంగము :—రాత్రి 9 గంటలు.

ధర్మారావు స్త్రీవేషముతోఁ బ్రయాణము. సరస్వతి యాశీర్వాదములు. పంచమాంకము

ప్రవేశకము :—రాత్రి 9 గంటలు.

సోంజీ-రాంజీ-సూర్‌జీలు-కందర్పుఁడు 12 గంటలకు రమ్మన్న సంగతి సూచన :—

ప్రథమరంగము :—10 గంటలు.

కందర్పరావు విరహము—ధర్మారావు వచ్చుట సరసములు. లోని కేగుట (చమత్కారములు)

ద్వితీయరంగము :—11 గంటలు.

సరస్వతి చింత ధర్మారావు సరస్వతికి కందర్పరావు మరణ మెరింగించుట. (వీరరసము అద్భుతము) సరస్వతి కృతజ్ఞత—

తృతీయరంగము :—12 గంటలు.

మోహిని విరహము. సోంజీ వచ్చి కందర్పరావు మరణించినాఁ డని చెప్పుట. దుఃఖము. అప్పుడే దహనముచేసిన అప్రతిష్ఠ యుండదని డబ్బిచ్చి యట్లాజ్ఞాపించుట.

సోంజీ పోవును. మోహిని పశ్చాత్తాపము. మరునాడుదయ మున యోగివద్దకుఁ బోవ నిశ్చయము.

మూడవరోజు—చతుర్థరంగము :—ఉదయము 8 గం.

శ్రీ చిదానంద యోగి శిష్యునితో జరిగిననాటకము చెప్పి తనకు సర్వత్ర సంబంధము గలదనియు అంతయుఁ దానే ననియుఁ జెప్పుట; అంత సరస్వతి ప్రహ్లాదుఁడు ధర్మారావు వచ్చుట. మోహిని వచ్చుట. శ్రీ చిదానందస్వాములవారు అందఱకుఁ దత్త్వముపదేశించుట.

భరతవాక్యము.

---

# శ్రీ చిద్విలాసము

## పంచమాంకము

### ప్రథమరంగము

(చీఁకటిలో సోంజీ గంజాయి త్రాగుచుండును. రాంజీ వెనుకనుండి ప్రవేశించును.)

రాంజీ—(తనలో) దొరికాఁడు లండీకే. మాయిద్దరికీ తెలియకుండా పత్రి సంపాదించుకోని తాగుతున్నాఁడు.

(అని వెనుకనుండి సోంజీ కన్నులు మూయుచున్నాఁడు)

సోంజీ—ఎవఁడురా వాఁడు?

రాంజీ—(పలుకఁడు)

సోంజీ—పలుకవేంరా భోసడీ (తనలో) ఈ యుంగరాలనుబట్టి చూస్తే వీఁడు రాంజీ అని స్పష్టమైంది. (హఠాత్తుగా క్రిందఁ బెట్టి చేతులు వదలించుకొని రాంజీని గ్రిందఁ బడవైచి తన్నుచున్నాఁడు.)

రాంజీ—అరే! మర్గయారే!

సోంజీ—(మాట గుర్తించనట్లు నటించి) ఓరి! నువ్వాఁటరా! రాంజీ! చావఖంగోడా హిందూస్థానీలోనేనా లేలే!

రాంజీ—(లేచి) మాకిద్దఱికీ తెలీకుండా పత్రి తాగుచున్నావా? సూర్‌జీని పిలుచుకొస్తా నుండు. (పాఱిపోవునట్లు నటించును.)

సోంజీ—ఉండవోయి వెధవా! నేను గూడా అక్కడికే వస్తూన్నాలే. ఉండు.

రాంజీ—(నిలిచి) ఏమన్న బేరముందా ఏమిట్రా ?

సోంజీ—ఉంటే నీకెందుకు ? లేకపోతే నీకెందుకు ?

రాంజీ—అలానా ! చెప్పకపోతే మే మిద్దఱము గలిసి యేమిచేస్తామో చూడు.

(తనయెడమచేతితోఁ గుడిపిడికిటను గ్రుద్ది చూపుచున్నాఁడు)

సోంజీ—ఏడ్చావు లేవోయి. ఈదినము రాత్రి 12 గంటలకు కదర్ప రావు నన్నొక్కడ్నే యీపాడుశివాలయందగ్గఱికి రమ్మన్నాఁడు. మఱెవరూ రాకూడదఁట పనిఉంటే చెపుతానన్నాఁడు.

రాంజీ—ఓస్ ఉంటేనేనా ! లేకపోతే చెవులు లొటలొట కొట్టుకుంటూ రావలసిందేనా ?

సోంజీ—పనిలేకపోయినా ఏదో లాక్కురాకుండా ఉంటానా ! కష్టం ఊరికే పోదులే. నీకేమన్నా ఉందా ?

రాంజీ—మోహినమ్మగారు తేపు సాయంత్రం రమ్మన్నారు. పని ఉంటే చెపుతారఁట. తేపు పొద్దుగూకిందాకా యీసంగతి మీాతో చెప్పొద్దన్నారు.

సోంజీ—ఓస్ మాకు తెలియకుండానే ! మఱి బయానా ఏమన్నా.

రాంజీ—పని ఉంటేగదా !

సోంజీ—పని ఉన్నా లేకపోయినా ఏదో లాక్కురావాలెగాని చవట వెధవలాగా వట్టిచేతులతోనా రావడం. నువ్వు మాతో ఉండడానికి పనికిరావు. తన్ని వెళ్లగొట్టేస్తాం.

రాంజీ—ఈతాప తేకపోతే అందువుగాని లేవోయి. మఠందగ్గఱ నూర్జీ యెదురుచూస్తూంటాడు పద.

(నిష్క్రమించును.)

(ఇది ప్రవేశకము)

ప్రథమరంగము.

(పాడుశివాలయము పంచలోఁగందర్పరావు కూర్చుండియుండును.)

కందర్పరావు (తనలో) నేఁడేమో మోహినివైఖరిలో మార్పుకన్పట్టు చున్నది. 9 గంటలు కాకుండఁగనే తనయేకాంతపుగదిలోనికిఁ జేరినది. ఏదో పరితాపమునను భవించు చున్నట్లున్నది. నాపరి తాపమువంటిదే యామెనుగూడ నావేశించియుండును. మాయిద్ద ఱలో నీవిషయమున, దక్కువచేయి లే దనవచ్చును. పోనిమ్ము దానితోనేమి? లక్ష్మి యప్పుడే నిద్రించినది. కాపలావానితోఁ జెప్పి వచ్చినాను. నా కీదండయాత్రలు మామూలుగావున వానికీ విషయము క్రొత్తగాదు. (ఆలోచించి) ఆహా! రాత్రి గంభీర ముగానున్నది.

చ. జనులయు జంతుజాలముల సంచరణంబదె సన్నగిల్లె మే
దిని కొనలందు సైతము మదించిన చీకటు లావరించె రో
దనములు మాని దీనులదె దారులప్రక్కల నిద్రమున్గి రం
దున భటవర్గ మావెనుక దొంగలు రాత్రిభయంకరంబగున్ ॥

ఈసరస్వతి యింకను రాలేదు. గడియారము పదికొట్టిననే కాని యది యిక్కడ నడుగుపెట్టదు కాఁబోలును. సాయంకాలము నేను బడినపరితాపము తానెఱుగునుగదా! ఒక్కక్షణము ముందుగా వచ్చినఁ దనపుట్టి యేమిమున్గును. లేక యింకను మోసముండునా? ఉన్నచో 12 గంటలకు సోంజీచేతఁ గావలసినది చేయింతును. (ఆలో లంచి) అంతపని యక్కఱలేదు. అదిగూడ నన్నుజూచి వలఁచినట్లే యున్నది.

చ. ఎలనాని సుస్మితంబాదవ నిందుని భాస్య వికాససంపదల్
వెలువడ మేనువాంగఁ దమి పెల్లున బల్ పులకాంకురాళిఁల్
మొలకలు దేరసట్టి ననుబొందఁగఁగోరినయట్లు తోఁచె న
పొలఁతుక యింకసేపగిది మోన మొనర్చునటంచు నెంచెదన్.

(ఆలోచించి) స్త్రీల చిత్తములు క్షణచంచలములు. ఏమో యెప్పటి కెప్పటికేమిబుద్ధిపుట్టునో యెవడెఱుంగును ?

(ఆలోచించి)

ఎట్లైనను నాజన్మము ధన్యమగుననియే తోఁచుచున్నది. అయ్యో! ఎడమకన్నదరుచున్న దేమి? అహ్హహ్హ. పూర్వకాలపు ఛాందసు లెడమకిన్న దరుట మొదలైనవి యశుభసూచకము లందురు. కాని నాకు వీనియందు విశ్వాసములేదు.

ఉ. రాఁగలయట్టిశోభనపరంపర చేయునె? నచ్చుసూచనల్ ?
పోఁగలయట్టిభాగ్యములు ముందుగఁజూపునె నాశచిహ్నముల్
రోగముచేత దేహములలోఁ బొడకట్టెడుమార్పులన్ బ్రజల్
కాఁగలకార్యసూచనలుగాఁ దలపోసెద రెంతయజ్ఞులో!

ఈమూఢవిశ్వాసములను విసర్జించుటయే నాగరికతాలక్షణము. దుర్భరమైన యీవిరహవేదనకు వెన్నెలకూడఁ దోడైనది. ఈచల్లని గాలియు నన్ను వేధించుచున్నది.

ఉ. ఆమెలనాఁగఁగూడికొని హార్దవమైన సుఖాప్తితోడ నా
నాయుతబంధచాతురి ననంతవిధంబులఁ జుంబనాదులన్
బాయనికౌగిలింతలను వర్తిలినప్పుడుగాని క్రూరుఁడౌ
కాయజుగర్వమున్ శిశివికారము గాలిమదం బడంగునే.

ఈపరితాపముచే మూర్ఛకూడ వచ్చునేమోయని భయ మగు

ఛీ! దుర్మార్గురా లింకను రాలేదు. రాఁగానే యాలస్యము చేసినందులకు దాని నొక్కచెంపపెట్టు పెట్టినఁగాని నావేదన చల్లారదు. (ఆలోచించి) ఆకుసుమకోమలి స్పృశించినమాత్రమునఁ గందిపోవును. ఇఁకేఁ జెంపపెట్టు విరసముగాదా! మదనసౌఖ్యములలో విరసమెప్పుడును జేయరాదు. స్త్రీలు విశృంఖలమైన సుఖమెక్కుడిది.

చ. కవితయుఁ గాంతయున్ స్వయముగా వరియించినయప్పుడేగదా
చవు లెదనూర నొల్కెడు రసం బటుగాక బలాత్కరించినన్
బ్రవిమలరాగసంపదలు రమ్యసుధామధురప్రసంగముల్
సవనవభంగిఁ దోఁపక ప్రణష్టముకా విపరీతచర్యలన్ ॥

కావున నే నీరేయి రసికాగ్రగణ్యుఁడ ననిపించుకొని మోక్షసౌఖ్యమునకుఁ దుల్యమైన రతిసుఖము ననుభవింపవలయును. (చూచి) అదిగో! రానే వచ్చినది సరస్వతి.

[అంతటసరస్వతివేషమున ధర్మారావు ప్రవేశించుచున్నాఁడు]

సరస్వతీ! ఇంతయాలస్యమైనదేల? సెబాస్! మేలిముసుఁగు గూడనా! (ముసుఁగుతొలఁగించుచున్నాఁడు.)

నీ కింతవిలువగలచీరలుసొమ్ములు నెక్కడివి.? రవిక యద్భుతముగనున్నది. (మీఁదఁజేయివేయును.)

ధర్మారావు—(చేయితొలఁగించి) ఇంతతొందరయేల? ఇంతదూరము వచ్చినతరువాత రానున్నసౌఖ్యము రాకమానునా!

కందర్పరావు—అదియేమి? నీకంఠస్వరము మధురముగానున్నది. ఈమార్పేలఁ గలిగినది?

ధర్మారావు—నీపైఁ బ్రేమాతిశయమునఁ గళాశాస్త్రము ననుసరించి నేను నేఁ డొకమందు సేవించితిని. ఇది దానివలనఁ గలిగిన మార్పు.

కందర్పరావు—అయినఁ గళాశాస్త్రములోఁ జెప్పినమందులు మంత్రములు నన్నియు వ్యర్థములుకావా యేమి.?

ధర్మారావు—వ్యర్థము లెట్లగును.? వానినిఋషులు జ్ఞానసాధనమున ననుభవించి వ్రాసిరి.

సీ. ఒక్క-ప్రక్రియచేత నున్న స్వరంబెల్ల
మారివచ్చును నూత్నమధురకంఠ
మొక్క-యౌషధముచే నున్నంతకంబెను
సౌందర్యసంపద చాలఁగలుగు
నొక్క-సాధనముచే నూరక కాముకుఁ
డిచ్ఛవర్తిలుఁ గంగిఱెద్దుమాడ్కి-
నొక్క-యుపాయంబు నొనరింప బంధము
లనుకొని సౌఖ్యంబులను జెలంగు
నొక్క-యోషధిచే బిగువెక్కుఁ గుచము
లక్క-జంబులు మంత్రంబు లధికసంఖ్య
గలవు విశ్వాసముంచఁగ వలయు నెందు
ఋషులశాస్త్రము లూరక వృథయె తలఁప.

కందర్పరావు—అట్లయిన నిన్ను సామాన్యురాలినిగఁ దలంపఁగూడదు. నీదగ్గఱ నేర్చుకొనవలసిన విషయములు చాల గలవని తోఁచుచున్నది. ఏది యొక్క- ముద్దు. (మీఁదికి వచ్చుచున్నాఁడు.)

ధర్మారావు—ఉండుము. (నిలువరించి) మాట వినిపించుకొనవేమి? లోపలి కేగనున్నాముగదా! ఇంతలో నింత తొందర యేం? వెన్నెలలో నీ పంచలో నా కిష్టములేదు. మఱియు నీ వైఖరి చూచిన మొఱటుతనము గోచరించుచున్నదిగాని నీకుఁ గళాశాస్త్రప్రావీణ్య మున్నట్లు తోఁచుటలేదు.

ఉ. ముద్దులలోన భేదములు మొత్తము పందలువేయినుండు నా
యొద్ద గడింపుమా రసికయోగ్యములైన నఖక్షతంబు లిం

కద్దియు నిద్దియేల మదనాఖ్యకళన్ రతిబంధచాతురుల్
సుద్దులుమాని నేర్చికొని శోభనముల్ గను కాముకాళిలోన్.

కందర్పరావు—చూడఁజూడ నీచరిత్రము నాకాశ్చర్యము గలిగించుచున్నది. నీవు సామాన్యపు వనితవుగావు. ఇందువలన నీవిశుద్ధతనుగూడ శంకింపవలసివచ్చుచున్నది.

ధర్మారావు—అయ్యో! పిచ్చివాఁడా! పదిమందితోఁ దిరిగిననేకాని రసికతరాదనుట వట్టివెఱ్ఱితనము. నాభర్త యేకపత్నీవ్రతస్థుఁడు. నేనుఁ బతివ్రతను. మేమిరువురమును గామశాస్త్రమునం దసమాన పాండిత్యము గడించినవారము. నీనిర్బంధమున నిట్లంగీకరింపవలసి వచ్చినదిగాని నేనితరులకు లోఁబడుదాననుగాను.

మ. నను సామాన్యఁగ నెంచఁబోకు మదిలోనన్, నీదుపుణ్యంబునన్
నను గూడంగలభాగ్యమబ్బె నిలలోనన్ విద్యలన్నింట నే
ననుమానింపఁగనేల ? నగ్ర్యను గళల్ నాసొమ్ము సౌందర్యమా
కనఁతుల్యంబిఁక లేదు నన్ గలిసి యింకన్ గోరవే కామినిన్. ॥

కందర్పరావు—అహో! ఏమినాభాగ్యము. ఇఁక నాకాకురూపిణి యగుమోహినితో నావశ్యకములేదు.

ఉ. కంటిని నిన్ను మత్తనువు గాంచెను జన్మఫలంబు నిన్ను లోఁ
గొంటనె కామశాస్త్రమునఁగూడఁ బ్రవీణుఁడనైతి లెస్సగా
మింటిని దాఁకుపొంగునను మించెడుమన్మథసౌఖ్యమిచ్చు నీ
దంటతనంబుఁజూపుమిఁక ఁదాళను సారసకుట్మలస్తనీ! ॥

(కౌగిలించుకొనఁబోవుచున్నాఁడు.)

ధర్మారావు—(చేతులతోనిలువరించి) ఒక్కమాటమాత్రము చెప్పవలసియున్నది.

ఉ. ఈవిఁక నన్యకామినుల నెన్నఁడపేక్ష యొనర్పకుందువా?
కందర్పరావు—కోరను. సంశయమేల?
ధర్మారావు—
ఉ. ఈవిఁక నన్యసౌఖ్యముల నెంచ కడంగుదె నాదుకౌఁగిటన్
కందర్పరావు—నిశ్చయముగా.
ధర్మారావు—
ఉ. నీవిఁక నీదుజీవనము నేర్పునఁ జేయఁగ నాయధీనమున్
కందర్పరావు—ఇదిగో! ఇప్పుడే నాజీవనము నీయధీనము చేయుచున్నాను.
ధర్మారావు—
ఉ. కావున స్వర్గసౌఖ్యమును గాంచెదమింక కుటీరమ్ములోనికిన్.
కందర్పరావు—అవశ్యము వత్తును. అందులకే యువ్విళ్లూరుచున్నాను.

(ఇరువురును భుజములపై నొండొరులచేతులువైచికొని లోనికిఁ బోదురు.) (తెరపడును)

---

(ద్వితీయరంగము)

---

(సరస్వతి యిల్లు దీపము వెలుగుచుండును. సరస్వతి కూర్చుండి యుండును.)

సరస్వతి—(స్వగతము) ఈతీవ్రమనోవేదనలో నేమియు దోచుటలేదు. ఫలితమేమగునో యని నామనస్సు మిక్కిలి యాందోళనము నందుచున్నది. ఈదీనురాలిని గాపాడఁదలఁచినధర్మారా వేమయ్యెనో! అతనిని స్త్రీనిగాఁదలచి త్రోవలో నెవ్వరైన నడ్డగించిరో; లేక కందర్పరావసాధ్యుఁడు గాన వెంట నెవ్వరినైనఁగొనివచ్చెనో! తెలియదు. అంతకునాజగదీశ్వరునిదే భారము.

ఉ. ఓపరమేశ్వరా! శుభద! యోకరుణామృతపూర్ణచంద్రమా!
యోపటుదైత్యసంహరణ! యోసుఖదాయక! దీనరక్షకా!
యోపరమాద్భుతక్రియుఁడ! యోపృథివీ సకలైకపోషకా!
యోంపి మదీయసోదరున కూర్జితసన్మతి శుభంబుఁగూర్పవే.

అయ్యో! చాలప్రొద్దుపోయినది. యింకనురాలేదే! పనియే మైన నింతతడయనేల? ఏదో యాపద సంభవించియుండును. నేను గూడ నింక మరణమునకు సిద్ధపడెదను. బాలునిలేపి తగినయేర్పాటుతో వాని నీయూరు దాటింపఁజూచెదను.

అహో! ఎంతదుర్మార్గురాలను. చచ్చుదానను నేనొక్కతెనె చావక యాధర్మాత్మున కిక్కట్టు తెచ్చితినే! "స్త్రీబుద్ధిః ప్రళయాంతకా" యందురిదియే కాఁబోలును. నేను జీవించియున్నచో నాతని సతికేమి ప్రత్యుత్తరమీయఁగలను. మరణించినను నేనామె ఋణముఁబోనా! ఇంకనాకుఁప్రాయశ్చిత్తమెద్ది?

[ధర్మారావు రక్తసిక్తమైన పిడిచాకును హస్తమునందుంచుకొని రక్తవస్త్రములతో వేగముగ వచ్చుచున్నాడు.]

ఓహో! అన్నగారా? ఏమైనది.!

ధర్మారావు—మహేమగును. కావలసినదే మైనది.

ఉ. చంపితి నాదురాత్మకునిఁ జంపితి నాయధమాధమాధమున్
జంపితి నామదాంధు ఖలు సాధ్వులపాలిటి జన్మశత్రువున్
జంపి తదీయరక్తమున స్నానమొనర్చితిఁ జూడు మమ్మరో
చంపక యూరకుండునెటు సజ్జనబాధకు ఘోరపాతకున్.

నీయిక్కట్టులు తొలఁగినవి. లోకము నిష్కంటకమైనది. నాప్రతిజ్ఞ నెఱవేఱినది.)

సరస్వతి—అయ్యో! సోదరా! ఈవీరావేశమున నీవేషముతోడనే వీధులవెంట వచ్చితిరా! ఎంతయుపాయము తప్పిపోయినది.

ధర్మారావు—ఏమీ! అపాయమా! రానిమ్ము.

చ. పని యయిపోయె నెట్టులో యపాయము వచ్చిన వచ్చుఁగాక నీ
పని సమకూడె సాధ్వులకు భవ్యశరణ్యముగల్గె లోకమం
దనయము ధర్మమే గెలుచు, సంతమునందు సధర్మమీక్రియన్
వినుము వచింతు నాప్రతిన వీడుదుఁ బ్రాణములేని నీతికిన్.

సరస్వతి—సోదరా! శాంతింపుఁడు. మీయాకృతిఁ జూచిన నాకు భయమగుచున్నది. ఆఖడ్గముతో నన్ను గూడఁ బొడిచెదరా యేమి?

ధర్మారావు—ఓసి వెఱ్ఱిదానా! నిన్ను బొడువఁదలంచినచో నింత ప్రయాస మేల పడవలయును? [జెప్పుడు.

సరస్వతి—మీరు శాంతించి జరిగిన వృత్తాంతము సవిస్తరముగఁ

ధర్మారావు—అటులైన వినుము. చెప్పెదను. మొట్టమొదట నాతనితోఁ గొంచెము సరసములాడితిని. పాప మా మోహావస్థతిలోనే యాతఁడు నాతో నాలయములోపలికి వచ్చినాఁడు.

సరస్వతి—వచ్చి.

ధర్మారావు—తమినిలిప్కోనలేక వెంటనే నన్ను గౌఁగిలించుకొనెను. ఆక్షణమే వాని నీఖడ్గమున కెరచేసితిని. కొంచె మాతఁడు పెనఁగులాడినను నాబలముముందఱ నిరాయుధుఁడు వాఁ డెట్లు నిలుచును? వాఁడు ప్రాణములు విడువకముం దిట్లు చెప్పితిని.

“నేను ధర్మారావును. సాధ్వీసంరక్షణార్థ మీవేషముతో నిట్లుచేసితిని. నీవు పశ్చాత్తాపముఁజెంది నారాయణనామస్మరణముతోఁ జచ్చుట మంచిది” అని.

సరస్వతి—అతఁడు ప్రత్యుత్తర మిచ్చెనా!

ధర్మారావు—"నారాయణా!" యనుచు నుసురుల విడిచెను.

సరస్వతి—(కందర్పరావును దలఁచుకొని) ఓరీ! కందర్పహతకా! నీ కీ దుర్మరణమునకా యింతచేసితివి. తుదకు నారాయణా యంటివి. చాలును. అహో! విధివిధానము దప్పింప నెవరితరము? (ముక్కుపై వ్రేలిడుకొని)

ఉ. ఇందులకా పరాంగనల నిట్లు పరాభవమందఁజేయ నా
నందముతోడ దూఁకితివి నాఁడు గ్రహింపవు నేఁటి చావయో
మందమతీ! దురాత్మకుఁడ! మన్మథసౌఖ్యము గోరినాఁడ వే
మందు విధిప్రచోదితము సర్వఫలంబునుగంటి వక్కటా!

శా. పాడైనట్టిశివాలయంబునఁ గనన్ బ్రాపెవ్వరున్ లేక నీ
మేడల్ మిద్దెల పీడి విత్తములతో మేలున్ విసర్జించి యే
గోడున్ గానని యాలుబిడ్డలు గనన్ ఘోరార్తి దుష్టాత్మ! యీ
నాఁ డిట్లన్యసతీప్రలోభమునఁ బ్రాణత్యాగముం జేసితే.
పాప మాతని యిల్లా లెంత ఘోషిల్లునో!

ధర్మారావు—అవును మిక్కిలి ఘోషిల్లును. (తనలో) ఆమె చరిత్ర నీ వెఱుఁగవు.

సరస్వతి—ఎవఁడైననేమి? పోయినవానిని నిందింపరాదు. అది యట్లుంచి మీరీవేషమును వెంటనే విసర్జించి స్నాన మాచరించి మంచి వస్త్రముల ధరింపవలెను.

ధర్మారావు—నాకేమో యీవస్త్రములపై మక్కువగా నున్నది.

ఉ. హింసయెఱుంగనట్టికులమే సుమి నాయది పుట్టుటాదిగా
హింసకు జంకువాఁడ నదియేమి మహత్త్వమొ పాపభీతి యీ
హింసను నాకుఁ గల్గదు రహిన్ మధుపర్కములట్లు మించి నా
యంసమునందు నున్న రుధిరార్ద్రిము లీవసనంబు లింపగున్.

సరస్వతి—ఇప్పటికైనను మీరు పూర్వస్థితికి వచ్చినట్లు లేదు. మీకున్మాదము సంభవించునేమో యని భయ మగుచున్నది. కొంచె మాలోచింపుఁడు. విధిలేక చేసితిమిగాని యీకృత్యము మనకుఁ దగినదా!

ధర్మారావు—నిజమే, నా కిప్పుడు లోకస్పృహ గలుగుచున్నది. అయ్యో! కసాయిదు కాణమును జూచిన హరిహరీ! యని కన్నులు మూసికొనువాఁడనే! ఈదారుణకృత్య మెట్లు చేసితిని? ఈపాప మెట్లు పోవును?

సరస్వతి—ఇది పాపముగాదు కాని దారుణకృత్యము మాత్ర మగును.

ధర్మారావు—అవును. ఇందుకుఁ దరణోపాయ మేమి?

సరస్వతి—ఒక్కటిమాత్రము పొడకట్టుచున్నది. అనుప్రసిద్ధుఁడైన యోగీశ్వరు నాశ్రయించినఁగాని యీతాపము చల్లారదు.

ధర్మారావు— తెల్లవారుదనుక భగవత్సంకీర్తనముచేసి సూర్యోదయ మైనతరువాత నామహామహునికడకేగి యాయన శరణుచొచ్చి దీనికి నిష్కృతిఁ బడయుదము.

సరస్వతి—అట్లే చేయుదము. సోదరా! మీకు నే నా మరణాంతము కృతజ్ఞురాలను. బంధువులందఱు వీడి యీయూర నున్నందుల కాపదబంధువు లగు మీరా యందఱికంటె నెక్కువగఁ గాపాడినారు. ఈఋణ మెట్లు తీర్చికొందును.

మ. ఇది యేతీరునఁ దీరు మీఋణము మీ రెంతే మహాసాహసం
బు దయన్ జేసియుఁ బ్రోచినార లిటు మీపుణ్యంబునంగాదె నే
బ్రదుకంగల్గితిఁ బర్వు నిల్పఁబడె సద్భావంబుతో భక్తితోఁ
బదముల్ పట్టి నమస్కరింతుఁ గొనుమాపద్బాంధవా! మొక్కులన్॥

(సాష్టాంగనమస్కారముచేయును.)

ధర్మారావు—చాలులెమ్ము. నీవు నాకీయవలసిన ఋణమేదియు లేదు. నావిధిని నేను నెఱవేర్చితిని. ఇఁక నింటికేగి వస్త్రముల మార్చికొందును. సతికిఁ దెలియకుండ నీవస్త్రములఁ బెట్టెలో దాఁచెదను. అదిగో! చూచుము. సరిగా నడిరేయి యైనది. లోక మంతయు నిప్పుడు నిద్రావశమై మేనుమఱచి యపారసుఖము ననుభవించుచున్నది.

ఉ. ప్రొద్దునలేచి మానవులు పుత్త్రసతీ పరిపోషణార్థమై
యెద్దియొ వృత్తిఁ బూని గడియించి ధనంబును లౌకికంబులౌ
సుద్దులమున్గి శాంతిగనుచోటు నెఱుంగక యార్తినొందఁగా
నద్దమరేయి నావనట నంతయు మానుపు నిద్రయొక్కటే.

ఇఁకఁ బోయెదను. (నిష్క్రమించుచున్నాఁడు)

సరస్వతి—(స్వగతము) నేనులోనికేగి పరమేశ్వరుని కృతజ్ఞతతో ధ్యానింతును. (నిష్క్రమించును) (తెరపడును)

---

## తృతీయరంగము.

---

కందర్పరావు గృహము. మోహిని శయ్యపైఁ గూర్చుండి యుండును.

మోహిని—(స్వగతము) నేఁడు నిద్రపట్టదు. అర్ధరాత్రమైనను గన్ను మూతవడదు. పోనీ భర్తతోనైనఁ గొంచెము ప్రొద్దుపోవునఁటన్న నాయన యింట లేరు. ఇంకను నా కాధర్మారావుపైననే మనస్సు పోవుచున్నది. వానికి రానున్నయాపద లన్నియుఁ జెప్పి మఱలఁ బ్రార్థింతునా? (ఆలోచించి) అయ్యో! నా వెఱ్ఱితనము. అతఁ డేల యంగీకరించును. వట్టినపుంసకుఁడు. రసికుఁడు కానివానిఁబదు

కెందులకు? కాల్పనా! వేయిధర్మములఁ జెప్పవచ్చునుగాని సమ యమువచ్చినప్పు డిట్లు స్త్రీలకోర్కులు చెల్లింపఁజాలక పోవుట పర హింస కాదా? కాలానుసారముగ ధర్మము మాఱుచుండును. తదనుకూలముగాఁ బ్రవర్తనమును దిద్దుకొనవలయునేకాని ఛాంద సముగా సనాతనధర్మమునే యంటిపట్టి యుండవచ్చునా!

(తెరలో) అమ్మా! నిద్రించుచున్నారా! నేను గావలివాఁ డను. (ఆలకించి) ఏమిపని?

(తెరలో) అమ్మా! సోంజీయట, తమతో నవశ్యము మాట లాడవలెనట, రానిమ్మందురా?

మోహిని—(తనలో) ఏమైయుండును. ఎంతయో యవసర మున్నఁ గాని వాఁ డీసమయమున వచ్చియుండఁడు. వీనిని బంపియుం దునా! ఏమైనను వినవలయునుగదా? (ప్రకాశముగా) పంచలోనికి నేను వచ్చుచున్నాను. అక్కడ నాతనిఁ బ్రవేశపెట్టి నీవు వెలు పలికిఁ బొమ్ము. (తెరలో) చిత్తము.

(మోహిని పంచలోనికి వచ్చి, తనలో) వీంద్రునిశాచరులు. వీరికి రాత్రిపగలు పగలురాత్రి నాకు మిక్కిలి తొందరగా నున్నది. అకారణముగ భయముకూడ వేయుచున్నది.

[ సోంజీ ప్రవేశించును ]

(ప్రగాశము) ఏమి సోంజీ! ఏమైన విశేషమున్నదా!

సోంజీ—ఏంచెప్పేది తల్లీ

మోహిని—చెప్పు మోరి చెప్పు. నీకు భయములేదు. నీకుగంజాయికి ధనమిచ్చెదను జెప్పు.

సోంజీ—నాకు చెప్పడానికి నోరాడడంలేదు తల్లీ!

మోహిని—అయ్యో! నింఘజీవనములఁ దీయుటకు జంకని నీవే జంకుచున్నావే. ఏదో కొంపమునిఁగియుండును.

సోంజీ—అవునమ్మా! కొంపమునింగింది.

మోహిని—అయ్యో! చెప్పరా! త్వరగా, భర్తగారికి క్షేమమా

సోంజీ—ఇంకేంక్షేమం తల్లీ.

మోహిని—(మఱింతదుఃఖముతో) అయ్యోనాన్చి చంపకురా! అసలు మాట చెప్పు

సోంజీ—కందర్పంగా రిఁక మనకండ్లఁబడరు తల్లీ! వారికి మోచ్ఛం

మోహిని—హానాథా! (క్రిందఁబడి మూర్ఛిల్లును.)

సోంజీ—(దగ్గఉన్న విసనకఱ్ఱతో విసరుచు) అవును. మొగుడుకదా పాపం. ఎన్నిలచ్చలుంటేనేం. తేపటినుంచి ముండమోసిందనే పేరు తప్పదుగదా!

మోహిని—(లేచి) అయ్యో! నాథా! ఎట్లుగతించితిరి! మీపై యాశలుంచుకొనికదా జీవించియున్నాను. మీరులేనిచో నాకిఁక దిక్కెవరు.? లక్ష్మిగతి యేమికావలయును.? ఏమి యీయాకస్మిక మరణము. ఏమి యీయకాలమృత్యువు. అయ్యో! అయ్యో ముప్పదిసంవత్సరములైనఁ బూర్తిగ నిండలేదే. ఇంక నేనెవ్వరితో నాకష్టములు చెప్పికొందును. అయ్యో!

సోంజీ—అయిపోయిందాని కేంజేస్తాం. కర్మం అనుభవింపక తప్పు తుందా! ఏడవకండమ్మా! ఏడవకండి. ఓర్చుకోండితల్లీ! చెప్పాలి సింది చాలాఉంది.

మోహిని—అయ్యో! ఇంక నేమిచెప్పియు నేమి ప్రయోజనము అయినను గుండె ఱాయిచేసికుని విందును. చెప్పుము.

సోంజీ— ఈరాత్రి 12 గంటలకు కందర్పంగారు నన్ను పాడుశివా యంకాడికి రమ్మన్నారు.

మోహిని—తరువాత.

సోంజీ—పోయి చూస్తే జాడ కన్పించలేదు.

మోహిని—ఇంతే! మఱొకచోట నుందురు.

సోంజీ—కాదమ్మా! ఆలయంలోపలికిఁ బోదునుగదా! కాలికేదో తగిలింది. అగ్గిపుల్లగీసి చూస్తునుగదా! అది అయ్యగారిశవం.

మోహిని—అయ్యో! అయ్యో! పాడు శివాలయములోనే అక్కడకు నేను బోయి యురి పోసికొందును.

సోంజీ—వినండమ్మా! ఎవతెనో ఆడదాన్ని గూర్చి తగాదాలో పగవాండ్లు చంపినట్లు తోస్తుంది వంటిమీదా చాలా కత్తి పోట్లున్నాయి.

మోహిని—(తనలో) ఆసరస్వతిముండ యింతకుఁ గారణమైయుండును. (ప్రకాశము) అయ్యో! అయ్యో! ఎంతఘోషిల్లిపోయినారో. శవమును సరిగా గుర్తించితివా! ఆయన యగునో కాదో!

సోంజీ—గుర్తించకేం. పొద్దునలేస్తే ఆయన పాదాలకాడ బతికేవాళ్లంగాదా! ఇప్పుడాశవం మీరు చూడలేరు. పొద్దున మిమ్మల్ల నాడికి తీసుకపోతా!

మోహిని—(తనలో) నేనీస్థితిలోఁ బోయి చూడఁజాలను. శవమును బ్రొద్దుటివఱకుంచినచో నీయప్రతిష్ఠ యూరంతయుఁ బ్రాకిపోవును. ఈరహస్యమరణమును దాఁచుటకు నేనిప్పుడు ధైర్యము వహింపక తప్పదు. (ప్రకాశముగ) ఈసంగతి నింకెవ్వరు నెఱుంగరుగదా!

సోంజీ—నరమానవుఁడికి తెలియదు.

మోహిని—నీ వీసంగతి నెవ్వరికిని జెప్పఁగూడదు. ఆశవమున కిప్పుడే దహనసంస్కారము చేయవలెను. ఆపనిని నెఱవేర్పుఁడు. మీకు వందరూపాయల నిచ్చెదను. ఈసంగతి యెవరికైనఁ దెలిసినచో

మీరే హంతకులని రక్షకభటులు మిమ్ముఁ బట్టుకొందురు. జాగ్రత్త.

సోంజీ—క్షణంలో జరిగిస్తాం. ఇక్కడున్న ట్లే వస్తా. మాతో చెప్పిన పని కడ్డులేదు.

మోహిని—ఇఁక నాలస్యముఁజేయకు, పొమ్ము.

సోంజీ—ఇదే పోతున్నా! (పరుగెత్తుట నటించును.)

మోహిని—(స్వగతము) ఇంతవఱ కాగినదుఃఖము మఱల నిప్పుడు పొంగి పొరలి వచ్చుచున్నది. దానితోఁబాటేదో యాందోళన బయలు దేరినది. చెప్పరాని యావేదన గలుగుచున్నది.

ఈచావు సరస్వతిని గోరుటవల్లనే యని స్పష్టమైనది. ఈ రెన్నాళ్లనుండి యాయనవిపరీతవైఖరి నాకిప్పుడు చక్కఁగ నర్థమైనది. నాయనుమానములు నిశ్చయము లైనవి. ఆదుర్మార్గురా లెంతచేయించినది. దానినిమాత్ర మేమందును. ఆయన దాని నెంత యొత్తిడి చేసిరో.

ఇస్సీ—ఎంత పనిజరిగినది. ఒక్కక్షణములో నాబ్రతుకంతయు దుఃఖమయమైనది. మాయిరువుర మోహకృత్యముల కిప్పటికిఁ దగిన ప్రాయశ్చిత్త మైనది. అకటా! కామము హత్యలకు వెనుదీయదు. మేముచేసిన దారుణకృత్యము లిప్పుడు జ్ఞప్తికివచ్చి నన్ను దహించి వేయుచున్నవి. ఇందువల్ల నపూర్వపశ్చాత్తాపము నాకుఁగలుగు చున్నది. ఆహా! ఏమియీపరిణామము. అకటా! ఏమియీపరితాపము, దీని నెట్లు భరింతును.! నేనుఁ మహాపాపాత్మురాలను. ఛీ, నాబ్రతు కెందులకు.! ఇప్పుడే యాత్మహత్య గావించుకొని సుంఖింతును. ధర్మా రావు! నిన్ను ద్రోహము చేయనుంటిని క్షమింపుము. సరస్వతీ! నీకు నమస్కారము.

కాని నేనిప్పుడే మరణింపను. ఒక్కయుపాయము తోచుచున్నది. ఈయూరి బయలనొక్క మహాయోగి కలఁడని యూరంతయు మార్మ్రోగుచున్నది. ఉదయ మాయనకడ కేగి తరణోపాయము నర్థింతును. ప్రాయశ్చిత్తముఁ జేసికొనుమన్నఁ జేసికొందును. ప్రాయశ్చిత్తమే లేదనిన నాక్షణమే మరణింతును. ఈలోపున నాభర్త కృష్ణానదిలో జారిపడి మరణించినాఁడని వదంతి వేయుదును. ఇంతకంటె మార్గములేదు.

సోంజీ (ప్రవేశించి) అమ్మా! శవము దగ్ధమవుతున్నది.

మోహిని—సరే ఇదిగో నందరూపాయలనోటు (లోపలి కేగి తెచ్చి నోటిచ్చును.) ఈసంగతి బయటకిరాఁగూడదని మఱలఁ జెప్పుచున్నాను. వారు కృష్ణానదిలోఁ గాలుజారిపడి మరణించినారని ప్రకటింపుఁడు. పొమ్ము.

సోంజీ—చిత్తం. మీమాట దాఁటను. (పోవును)

మోహిని—(స్వగతము) ఱేపుమధ్యాహ్నమువఱకు లక్ష్మికిఁగూడ నిది చెప్పను. యోగిదర్శన మగువరకు భగవద్ధ్యానము గావించుచుఁ బశ్చాత్తాపముతో దగ్ధమగుచుందును. (నిష్క్రమించును.)

---

## తురీయరంగము.

---

పురబాహ్యారణ్యము. శ్రీచిదానందయోగియు శిష్యుఁడును.

శ్రీ చిదానందయోగి—

శ్లో॥ యావత్పవనో నివసతి దేహే
తావత్పృచ్ఛతి కుశలం గేహే
గతవతివాయౌ, దేహాపాయే,
భార్యాబిభ్యతి తస్మిన్కాయే ॥ భజగోవిందమ్॥

శిష్యుఁడు—ప్రభూ! నే నీమధ్యాహ్నమే వెళ్లిపోవలయునా!

శ్రీ చిదానందయోగి—ఆహా! తప్పదు. నేనును నేఁడే వెడలిపోయెదను.

శిష్యుఁడు—ఎందువలన?

శ్రీ చిదానందయోగి—ఇక్కడనున్నచో జనసమ్మర్దము భరించుట కష్టము. ఇక్కడిసంఘానుయాయులు మనకార్యమును నెఱవేర్పఁగలరు.

శిష్యుఁడు—విశేష మేమైన సెలవిచ్చెదరా!

శ్రీ చిదానందయోగి—ఆధ్యాత్మిక విషయమునకుఁ గ్రొత్తవాఁడవగుటచే నీమనస్సు లౌకికవిషయములపై కేగుచున్నది. నీతుష్టికొఱ కొక్కటిఁజెప్పెదను. (కందర్పరావుమరణము చెవిలోఁ జెప్పును.)

శిష్యుఁడు—ఆశ్చర్యము! నేను కందర్పరావువద్దనున్నప్పుడే యిట్టిది యెప్పుడో గలుగఁగలదని శంకించితిని. పాపము మీరు సూచించినట్లే తుద కాతని కీదారుణమరణము సంభవించినదా!

శ్రీ చిదానందయోగి—ఇందు వింతయేమున్నది.? ఎవరిప్రారబ్ధము చొప్పున వారికి సంభవించును. మాకీవిషయము మున్నె తెలియును.

శిష్యుఁడు—స్వామీ! మీదివ్యజ్ఞానము నాకాశ్చర్యము గలిగించుచున్నది.

శ్రీ చిదానందయోగి—నీకాశ్చర్యమైనను నాకిది సహజమే. ఈజగన్నాటకమునకు నేను సూత్రధారిని. సాక్షిభూతుఁడనై చూచుచుండియు నడపువాఁడను నేను. నడపియు నేను నిర్లిప్తుడనే. వేయేల? నేనుగాని దొక్కటియులేదు. నామాయచే నీలోకములన్నియు యంత్రమునందలి చక్రములవలెఁ బరిభ్రమించుచుండును.

శా. కందర్పుం డనువానికామమును నేఁగానా తదీయంబులౌ
నిందల్ వొందఁగనీక యంగనను నేనేగా వడిన్ బ్రోచితిన్
సందర్భంబున ధర్మనామకునకున్ స్థైర్యంబు నేనిచ్చితిన్
వందల్ వేయును నేల నాదుమహిమన్ వర్తిల్లు నీవిశ్వముల్ ॥

ఆయాస్థితులు వారిజీవితములం దావశ్యకములుగావున నట్టికామ క్రోధాదులు తత్ఫలితము లగుమరణాదికములు సంభవించినవి.

శిష్యుఁడు—మహాప్రభూ! మీతత్త్వము నాకతీతమైనది. తపస్సువలననే కాని నేను దానిని గనుగొనఁజాలను. ప్రస్తుత మీ విషయమున, నేనంధుఁడనుగా నున్నాను.

శా. అంధప్రక్రియనున్నవాఁడ నను నత్యాభీలసంసార దుర్
బంధంబుల్ పెడఁబాపి కావఁగదె సద్భావంబుతోడన్ గృపా
సింధూ! నీదుచరిత్రముల్ విశదముల్ చేయంగ జ్ఞానంబెదన్
సంధింపంగదవయ్య! సల్పెదను సాష్టాంగప్రణామంబులన్.

(పాదములపైఁబడును.)

శ్రీచిదానందయోగి—(లేవఁదీసి) భీతిల్లకుము. నీకచిరకాలముననే యభీష్టము సిద్ధించును. ప్రస్తుతము ధర్మారావును, నతనిసతియు, సరస్వతియు నామెకుమారుఁడు ప్రహ్లాదుఁడును నిచ్చటికి రాఁగలరు. కందర్పరావుభార్య యగుమోహినియుఁ దనపూర్వచరిత్రమునకుఁ బశ్చాత్తాపమొంది యిచ్చటికి వచ్చును. వీరందఱకును రాగద్వేష రహితమైన మనయోంకారమతమునందు మనశ్శాంతిగలుగఁగలదు.

(సరస్వతియుఁ బ్రహ్లాదుఁడును ధర్మారావును. సతియుఁ బ్రవేశింతురు.)

శిష్యుఁడు—అదిగో! మీరన్నవారందఱు రానేవచ్చిరి.

శ్రీచిదానందయోగి—రానిమ్ము.

సరస్వతి—ఆమహానుభావుని దర్శనమువలన ధన్యుల మైతిమి. మః
పాపములు నిర్మూలము లైనవి.

ఉ. ఏమిమహత్త్వమో యెఱుఁగ నీశుఁడె యీకరణిన్ మనుష్యుఁడై
యీమహనీయరూపమున నిందు జనంబులఁ బ్రోవవచ్చెనో
సామజరక్షకుండె యిటు చయ్యన వచ్చెనో భక్తరక్షకై
యేమొ మహోజ్జ్వలంబయిన యీదృశతేజము గానమెన్నఁడున్.

ప్రహ్లాదుఁడు—నేనీవఱకే యీయనకడ నుపదేశమంది ధన్యుఁడనైతి
నమ్మా!

సరస్వతి—మంచిపనిచేసితివి, నాయనా!

సతి—నేనును బ్రహ్లాదునితో నిన్నవచ్చి స్వామివారి యనుగ్రహము
బొందితిని.

ధర్మారావు—పాపము. ఈసంగతి సరస్వతి యెఱుఁగదు. ఆతొందర
రలో నెవ్వరము నామె కిది చెప్పమైతిమి. (తనలో) హత్యను
గూర్చిననాపరితాప మీయనతో నెట్లునివేదింతును.

సరస్వతి—ఆమహాత్ముఁడు గడ్డమును సవరించుచున్నాడు. అదిగో!
చిటికెనవ్రేలిపైఁ పెద్దమచ్చ. నాభర్తయే! చిహ్నము లన్నియు
సరిపోయినవి. సంశయములేదు.

ఉ. ఆయదియే శుభాకృతియు నయ్యదియేసుమి స్వర్ణకాంతి శు
భ్రాయతనేత్రరుగ్వితతి యయ్యదియే, యదె పీనవక్ష మ
త్యాయతమైన బాహుయుగ మల్లదె చంద్రనిభాననం బదే
పాయనిచిహ్న మయ్యదియె భవ్యకరాంగుళి, నాదుభర్తయే.

అహో! నాథా! (వేగముగఁబోయి కాళ్లపైఁబడును)

శ్రీచిదానందయోగి—(లేవఁదీసి) నేను నాథుఁడను గాను. నీవు భార్య
వును గావు. నాయీశరీరము లౌకికవిషయములకు నిష్ప్రయోజన

మైనది. కాల్చినత్రాటితోఁ బశువును బంధించుట యెట్లసాధ్యమో నాయీశరీరమును లౌకికవ్యాపారముల కుపయోగింపఁ జూచుటయు నట్లసాధ్యమే. మోహము వీడుమని నేను నీకుఁ జేసినయుపదేశమే తారకమైనది. ఇంక నజ్ఞానాంధకారమునఁ బడకుము.

మ. తరుణీ! యజ్ఞతచే నహంకృతి యవిద్యన్ జన్మమున్, మృత్యువున్
బరఁగున్ సంసృతి నిట్లు చక్రముగతిన్ వర్తించు మర్త్యాళి యే
మఱి యెన్నాళ్లు నరుండు భ్రాంతుఁడగునో మార్గంబులే దంతకున్
దరియింపంగ, నిఁకేల యీభ్రమలు భర్తల్ భార్యలంచున్ ధరన్.

సరస్వతి—స్వామీ! క్షమింపుము. నే నజ్ఞురాలను. పారమార్థికబుద్ధి యెఱుఁగనిదానను. పోనిండు. మీశిష్యురాలిగా నైన నుండ నన్ననుగ్రహించి నాసేవలఁ గొనుఁడు.

శ్రీచిదానందయోగి—శిష్యత్వము నందఱతోఁబాటు నీవును పొందవచ్చును. కాని నాకెవ్వరిసేవయు ననావశ్యకము. నే నొకచోట నుండువాడఁను గాను. నాయుపదేశము నాచరణములోనుంచి తపముసాగించువారే నాకుఁ బరమసేవకులు. అట్టివారికి ముక్తి సన్నిహితము.

శా. ఏమర్త్యుండు మదీయమార్గమునఁ దానేకాగ్రతఁ బూనునో
యామాన్యుండె మదీయశిష్యతతిలో నగ్రంబునఁ నిల్చునో
భామా! యెవ్వఁడు నిత్యమున్ దపముతో భావంబు బ్రహ్మంబునన్
నేమంబారఁగ నిల్పు నమ్మనుజుఁడే నిక్కంబు నావాఁడగున్.

సరస్వతి—చిత్తము—మీకుఁబ్రత్యుత్తర మిచ్చుటకు నాకు నోరు వచ్చుటలేదు. పరిపూర్ణుల రగుతమను లౌకికదృష్టితోఁ జూచినందులకు క్షమింపుఁడు.

మ. క్షమియింపంగదవయ్య నేరముల నేసాష్టాంగముంజేసి నీ
సుమనఃకోమలపాదయుగ్మమె మదిన్ శోధించి దిక్కంచు ని
ల్పి మహాభక్తిని నమ్మియుండెదఁ బరాభీష్టంబు చేకూర్చు ల
క్ష్యము నిప్పింపుము సత్కృపన్ జతనమున్ సాగింపఁగాఁబూనెదన్.

(అంజలి పట్టినిలుచును)

శ్రీచిదానందయోగి—మంచిది! నీకింతత్వరగా వివేకము గల్గుటకు నీ విద్యావివేకములును శీలమును భక్తియుఁ గారణములు. నీకు లక్ష్యము నిప్పుడే యొసంగెదను.

సరస్వతి—చిత్తము. మహాప్రసాదము.

శ్రీచిదానందయోగి—(ధర్మారావువైపుతిరిగి) ధర్మారావుచేసిన దారుణకృత్యము నే నెఱుఁగుదును. అతనిశీలము మంచిదే. అతనిక్రోధాది బీజముల నణఁచఁజాలినసాధనము నే సమకూర్చెదను.

ధర్మారావు—చిత్తము. మీసర్వజ్ఞత్వమునకు విస్మితుఁడనై యున్నాను. నాకోర్కుల నింగితమువలననే గ్రహించి నెఱవేర్చుచున్నందులకు నేనెట్లు కృతజ్ఞతచూపవలయునో తెలియకున్నది.

శా. దేవా! యెంతనిసన్నుతింతు నిను నాదీనత్వమున్ సర్వమున్
భావంబందునెఱింగి దుష్కృతులకున్ బాగా ప్రతీకారముల్
నీవే సేయ దయన్దొడంగితివి, దీనిన్ ఘోరసంసారమున్
బోవన్ జేయవె భక్తిమైఁ గొలుతుఁ ద్వత్పూజ్యాంఘ్రిపద్మంబులన్.

(పాదములపైఁబడును. సతియుఁ బ్రహ్లాదుఁడును పాదములపైఁ బడుదురు.)

శ్రీచిదానందయోగి—లెండు. ఇదే మీశోకభయము (నిరూపించి) అదే మోహిని పశ్చాత్తాపతప్తయై వచ్చుచున్నది. ధర్మారా వింక నామెను ద్వేషింపరాదు.

ధర్మారావు—చిత్తము. (లేచును. అందఱును లేతురు.)

(మోహిని శీఘ్రముగవచ్చును.)

మోహిని—స్వామీ! మహాపాపాత్మురాలను. దుర్మార్గురాలను. నీచురాలను. క్షమించుటకు వీలున్నచో నన్ను క్షమింపుఁడు. లేదేని నరకమునకుఁ బోవ నాజ్ఞయిండు. నాకుఁగూడఁ దరణో పాయ మున్నదా? (కాళ్లపైఁబడును.)

(అందఱు నాశ్చర్యము నభినయింతురు.)

శ్రీచిదానందయోగి—(లేవఁదీసి) లేకేమి? కలదు. ఇందుసంశయము లేదు.

చ. ధరణి నసాధ్య మొంటుగలద్గా! యెటువంటి దురాత్ముఁడేనియున్
గర మనుతాప మొంది పరగన్ గడుభక్తిని నీశ్వరేచ్ఛ దు
ర్భరదురితంబులెల్ల నెడఁబాసి వెలుంగుఁ బవిత్రుఁడౌచు న
బ్బురముగఁ బంకిలుండు జలపూరముచేఁ బరిశుద్ధుఁడౌగతిన్.

నీపశ్చాత్తాప మెంతతీవ్రమైనదో యంతశీఘ్రముగ నీకర్మము దగ్ధమగును. నీచరిత్రమును దివ్యచక్షువులచే సాంతముగఁ జూచితిని. నాకు వేఱుగ నీవు చెప్పనక్కఱలేదు. నిన్నిఁక ద్వేషింపఁగూడదని ధర్మారావుతో నిప్పుడే చెప్పితిని. నీభర్త కట్టిమరణము సంభవించెనని చింతింపకుము. తుదకు నారాయణస్మరణముచే నతనికి మేలుగలిగినది.

ఉ. ఎవ్విధి నేరి కెప్పటికి నెందున మృత్యువు రాఁగనున్నదో
యవ్విధి వారి కప్పటికి నందున మృత్యువుసంభవిల్లు ను
మ్మెవ్వరు చింతిలక్కవలదు. హీనవినశ్వరదేహనష్టికై
దవ్వుగఁబోవుజీవునకుఁ దన్వి వినాశము గల్గనేర్చునే.

మోహిని—దేవా! సకలవృత్తాంతవేత్తవు, అనుగ్రహింపుము.

శ్రీచిదానందయోగి——నీకుఁ దగినయుపదేశ మిప్పింతును. రాగద్వేష రహితమైన యీయోంకారమతము నిన్నుఁ బవిత్రముచేయఁగలదు. నీపశ్చాత్తాపము దీవ్రమైనది గావున నీవు గొప్పసాధకురాల వగుదువు. (అందఱవైపుతిరిగి) మీకందఱకును దగునుపదేశము లిచ్చి యీమధ్యాహ్నమే మఱియొకచోటి కేగెదను. మీరుసాధనము చేయుటయే కర్తవ్యము. మనస్సు పరిపక్వస్థితిఁజెందనిది పూర్ణవైరాగ్యములభింపనిది సన్యసింపరాదు. అందుకుఁ దగినసమయము సాధనమునందే మీకు గోచరమగును. ఈ మాయాత్మక మగు విశ్వమున కాధారభూతుఁడను నేనని యెఱుఁగవలయును. నదుల కన్నింటికి సాగరము గమ్యస్థానమగున ట్లీచరాచరప్రపంచమున కంతకు గమ్యస్థానము నేను. నన్నువిడిచి యిది యేదియును లేదు. భ్రాంతిచే మీకీసంసారము సర్వము నేర్పడినది. క్రమక్రమముగ సాంసారికవృత్తుల నిరోధించి మదీయలక్ష్యమును బ్రధానముగఁ జేసికొని సర్వకర్మములను ఫలాపేక్షలేక బ్రహ్మార్పణముగ నాచరింపవలయును. దానఁబరమశాంతి గలుగును.

ఉ. నాశవిహీనమై యఖిలనామములన్ విడి రూపశూన్యమై
స్వాశయమెల్లెడన్ జెలఁగ సంశయహీనత నాత్మతత్త్వ మా
కాశమురీతి సర్వగము ఖ్యాతము దేహులకాత్మశక్తిచేఁ
గ్లేశములన్ హరించి భవఖేదముఁ బాపి యొసంగు మోక్షమున్.

(ధర్మారావునకును సరస్వతికిని మోహినికిని జెవిలో మంత్రోపదేశము చేయును.)

నాతేజము సర్వదా మీలో నుండి మిమ్ముల నడపించుచుండును. మీరు నన్ను మఱచినను నేను మిమ్ము మఱవను. ఎన్నివేలమైళ్లదూరమున నున్నను, ఎంతకాలము గడచినను, దేశకాలాతీతుఁడ

నగునేను సర్వవ్యాపినై నిత్యము మీకు సన్నిహితుఁడనుగ నుండును. ఇందు సందేహము లేదు. ఇఁక నేమి కావలయును.

ధర్మారావు—దేవా! అనుగృహీతుల మైతిమి. మాకోర్కులు ఫలించినవి. ధన్యులము ధన్యులము. ఏమికోరవలయునో యెఱుంగకున్నాము. సర్వజ్ఞులగుమీరే మాకుఁ గావలసినదానిని బ్రసాదింపుఁడు. (అందఱు నంజలి ఘటింతురు.)

శ్రీచిదానందయోగి—అయిన నిట్లగునుగాక

(భ ర త వా క్య ము)

శా. అజ్ఞానాంధ తమోనిరాకరణమే యర్థించి సర్వప్రజల్
సుజ్ఞానప్రభనిద్ధభక్తిగరిమన్ జూడంగ వాంఛింత్రు గా
కీజ్ఞానాత్మకతత్త్వశక్తి జగముల్ హింసావిదూరంబులై
ప్రజ్ఞన్ బూర్ణసుఖంబుఁ బొంది తరియింపంగల్గుఁగా కెప్పుడున్.

(తెరలో తథాస్తు)

తెరపడును.

(ఇది తురీయరంగము, పంచమాంకము.)

ఓం తత్సత్.

---

శ్రీ

# లక్ష్మీ సహస్రము



గ్రంథకర్త

విద్వాన్, శ్రీ వేదుల సూర్యనారాయణ శర్మగారు.





'భాషామణి'

నుండి

పునర్ముద్రితము.

తే. గీ. పాలకడలికి గారాబుపట్టి వమృత
దీధితికిఁ జెలియలవు మధురాధిపతికి
నెయ్యపుంబత్ని వైనట్టి నీ సుభాషి
తంబులకు నంబ! కదళీఫలంబు తులయె!

తే. గీ. ఆదిలో రూపయుక్త మై యలరు ద్రాక్ష
యెపుడు నడుమనె యధిక యా ఇక్షుజ సిత
చూడఁగా, నగ్రజనయుక్త సుధయుఁ దల్లి!
నీదు వాఙ్మాధురికి సాటి నిలువఁ గలవె?

చ. సతము మహాపరాధముల సల్పుచునుండిన నైననున్ దయా
మతి మముఁ బ్రోవ మాధవుని మాపయినిన్ సదయున్ బొనర్ప సం
తతము చటూక్తులం బలికి తద్ద శ్రమంపడి యెట్టివారు న
య్యతులరసజ్ఞ నంబ! శర ణందెద మోక్షపదాభికాంక్షినై.

తే. గీ. వాగధరరూపములుగ నీ వదనమందు
నమృతములు రెండు జనియించె; నందు మొదటి
దానివర్ణంబు శుకలాలితంబు; తల్లి!
లాఁతి వర్ణంబు కింశుకలాలితంబు.

తే. గీ. బింబమున కోష్ఠమునకును భేద ముడిపి
సాధుపదవర్తనులు సంధి సలుప నప్పు
డంబ! నీ యోష్ఠ మగ్రవర్ణంబు బింబ
మునకు నిడి, తదంతిమవర్ణమునుఁ దొలంచె.

తే. గీ. మానులకు నమృత మొసఁగెడు మాధవుండు
తానె యమృతపిపాస నెద్దానిఁ గొలుచు
నో, యలగుణోత్తరము భవదోష్ఠ మధర
మనుట యంబ! విరోధిలక్షణానె కాదె?

పయోజవర్ణన

తే. గీ. ఓజనని! నీ కుచములు పయోజములు అని
యందు రది యెట్లు పొసఁగు? బ్రహ్మాదిబాల
కావళికి జీవ [illegible]
నుండి యే యుద్భవం బగు[illegible] గాదె?

మ. తనలో నున్న సుధాఘటాళిఁ గలశద్వంద్వంబు లోకైకర
క్షణకై నీజనకుండు నీయెడ స్తనాకారంబునన్ నిల్పె నో
జననీ! యందఱి పాలఁ దృప్తిగను నాస్వాదింపఁగాఁ డెల్లఁబా
ఱిన యజ్ఞానను నాల్కనాడుటను మాఱెన్ వాణియున్ గారిగన్.

తే. గీ. పుండరీకాక్షుఁ డంగజపూజ సేయఁ
దలఁచి పుణ్యాహవాచనకలశము లని
యంబ! నీ కుచయుగము మహాక్షతముల
చే నలంకార మొనరఁగాఁ జేయుచుండు.

తే. గీ. అంబ! నీ స్తనభూభృద్యుగం బయారె!
యెంత యౌన్నత్య మందెనో! యీ చరాచ
రాళి కీశ్వరుఁ డే చక్రి యరసి తక్ష
ణంబె యవ్వానికిఁ గరార్పణంబు సేయు.

తే. గీ. అంబ! బ్రహ్మాదజనకము లౌట నీదు
స్తనము లవి హిరణ్యాచల సంపదలనుఁ
జెందుఁ; గనుకనె యా నరసింహమూర్తి
నలుపు నచ్చటనే నఖక్షతము లెప్పుడు.

తే. గీ. త్వత్కుచంబుల నడిమి ముత్యాల సరులు
గండు తుమ్మెద నూగారు తుండ, మవ్వి
మత్తగజరాజకుంభ సమానము లను
కవుల నుడులను దృఢపర్చుఁ గాదె జనని!

తే. గీ. త్వత్కుచంబుల కంబ! మిత్రంబు లైన
యట్టి కుంభములను శిర మందుఁ దాల్చు
చుండె నని కాదె యల గజేంద్రుండుఁ వేఁడఁ
బక్షణమె రక్ష సేసె నధోక్షజుండు.

తే. గీ. అంబ! నీ సోదరుఁడు విరహంబు మాకుఁ
గూర్చుచున్నాఁడు; తన కది కూడ దనుచు
గట్టిగాఁ జెప్పు మని కుచ కైతవమున
చక్రవాకంపుజంట నిన్ సతత మొందు.

తే. గీ. అంబ! తావకగురుకుచాగ్రంబు లందుఁ
దనరి మిసమిసలాడు ముత్యాల పేరు
లల్ల బంగారుకొండపై సవఘుళించు
రిక్కగమితోడ నెప్పు డెకసక్కె మాడు.

బాహువర్ణన

చ. జనని! భవచ్ఛరీర మను చక్కని యావలరాజుతోటలోఁ
గనుఁగొన నా భుజంబు లనఁగాఁ దగు రెండిటి మల్లెతీవలన్
ఘనతరమైన చిత్రము దగిన్ బుతుభేదము లేక యెంతయున్
పెనుపు వహించు న ప్పుడు వ్రేల్జివురాకుల గోరుపూవులన్.

తే. గీ. పైఁడికంకణముల నాటఁబడిన యింద్ర
నీలమణిదీధితులఁ దేలి నీ కరములు
నాచుమేల్ముసుఁగునను దోబూచులాడు
కమలములఁ బోలె మిగుల రంగారు; జనని.

తే. గీ. అంబ! సర్వార్థదాయి యైనట్టి నీదు
హస్తమే కాదు కల్పవృక్షాధికంబు
ఎవఁడు నీ దాసమున కర్హుఁ డవునో, వాని
హస్తముం గూడ కల్పవృక్షాధికంబె.

# లక్ష్మీసహస్రము భాషా

## ( మచ్చుతునకలు )

### వదాన్యస్తబకము.

తే. గీ. రసనలను రెంటఁ గాని, నేత్రముల మూఁటఁ
గాని, ముఖముల నాల్గింటఁ గాని, నాల్గు
కరములను, గాని కల్గుచోఁ గవులు నీవ
దాన్యతను సుంత వర్ణింపఁ దగుదురమ్మ !

తే. గీ. జనని ! వననిధిఁ బుక్కిటఁ గొనినవాఁడు,
దాని దూకినవాఁడును, దానియందు
నిరతమునుఁ బండువాఁడును, నీవదాన్య
మొనర నుతియింపఁ గలరొ లేరో ! యెఱుంగ

చ. నిను వెనుకొంచుఁ బాల్కడలినిన్ జనియించిన యంతమాత్రచే
తనె జగదంబ ! లుబ్ధకవతంసుఁ డొకండును వేఱొకండు చె
ట్టును, పసరంబొకండును గడుంగడు దానగుణంబుచేఁ బ్రసి
ద్ధినిఁ గనగల్గెనింక భవదీయవదాన్య మహత్త్వమెట్టిదో !

ఉ. ఈవు వదాన్యశీల వన నిం ద్రొక చిత్రమె ! యో రమాసతీ !
యీవు వసించుచోటున నెయించుక లేదను మాట లేదు సం
భావన సేయ ; నేమన భవన్నిరతస్థితి గేహభూమియా
నా వృషభాద్రినాథుఁ డఖిలాశ్రితకామితదాయి యౌఁగదే !

చ. మొగము ముడుంచుకొంచుఁ గడు పోటగు మ్మాటలఁ దూటుకొం
క్రొ
బొగ లెగయంగ రోషపరిపూరితుఁ డొచు హిరణ్యదానముల్
దగ నొనరించు నీ పతివదాన్యత కేమి యటుండనిమ్ము నీ
జగదభినంద్యదాన మతిసత్కృతిపూర్వము సంస్మరించెదన్.

తే. గీ. ఇహమునందును, పరమందు నెట్లు నేను
యాచకావళి వలెఁ, బిశాచావళి వలెనుఁ
దిరుగకుండుదునో యట్టి దివ్యవిభవ
మొసఁగు; మో తల్లి! నీ దయ యొసక మొసఁగ.

ఆ. వె. నిరుపమానదాననిధి వీవె యఖిల వివా
వలయుఁ గాని; తల్లి! ఫలము లొసఁగ
వట్టి యున్నతతనుఁ బడసి యుత్తమమైన
దానవారితరువు తగదు తగదు.

తే. గీ. పలమె యొసఁగెను శిబిచక్రవర్తి తొల్లి
కలనె యొసఁగెడు నా శీకరుఁడు తల్లి!
నీరదము విష మొసంగును నీవొకోరు
కొనినదానికిఁ బదిరెట్లు కూర్తు వహహ!

సీ. స్వర్గతరువును నీకు సాటి సేయుద మన్న
చూడఁగా నెంతయో సుమిత మద్ది
ఘనుని నీ కెన గాగఁ గల్పించెద మటన్న
తలఁచి చూడఁగ నప్రదాత యతఁడు
కర్ణుని నీతోడ గణన సేయుద మన్న
పరికింపఁగ నపార్థకరుణుఁ డతఁడు
బలిచక్రవర్తి నీ ప్రతి సేయుద మటన్న
తలచి చూడంగ కుదాత యతఁడు
నీ ప్రాణనాథునే నీకుఁ బోల్చెద మన్న
యరసి చూడ హిరణ్యహారి యతఁడు

తే. గీ. తక్కుగలవారి మాటలఁ దలఁప నేల
నిరుపమం బగు వితరణనిరతి యందు
నీకు నీవే సమానవో నిఖిలజనని!
ఏరు నీ సాటి వారలు లేరులేరు.

ఉ. అన్నివిధంపుసంపదల నప్పటి కప్పుడ సంఘటించు ని
న్నెన్ని భజించువారు భువనేశ్వరి! కన్నుల నెత్తిఁ గల్గుచున్
మన్నును మిన్నునున్ గనక మత్తిలి యందఱఁ గేలిసేయు నా
చెన్నఁటి యల్పపుందొరల చేరరు; చూడరు కోర రెన్నడున్.

చ. సరగున నీప్సితం బయిన సంపదఁ గూర్చెడి నీవు గల్ల నే
మొఱ కిఁక రాచదయ్యములఁ గ్రొక్కి భజంచును! తల్లి ? మాధురీ
భరఫలనమ్రమై యెదుట వర్తిలు సాలము వీడి కంటకా
కర మగు తుమ్మ చెట్టుఁ గుతుకంబునఁ జేరుదు రే ఫలార్థులై.

తే. గీ. ఇహపరంబుల సర్వసమృద్ధిఁ గూర్చు
నీ పదాంబుజసేవనే నే నొనర్తు
నెంతవారల నేనియు నీసడించు
ధనమదాంధుల కెప్పు డేఁ బ్రాసపడను.

చ. అరయ నొకింత యేని స్తవనార్హగుణం బని లేని నీచభూ
వరుల గుణప్రకాండములుగ వాకొన నీహ నొప్పఁ దల్లిరో!
నిరుపమయు న్నిరూహ్యయు ననిర్వచనీయయు నైనయట్టి నీ
పరమగుణాళి వాకొనుదు బారకు నంగున మేనిఁ జేరఁగన్.



# శృంగారసశ్రీయము




గ్రంథకర్త

విద్వాన్

శ్రీ వేదుల సూర్యనారాయణ శర్మగారు



'భాషామణి' నుండి పునర్ముద్రితము.

1937




8

కృతిసమర్పణము

# కృతిసమర్పణము

———:0:———

నాసలువఁబూనినట్టి లక్ష్మీసహస్ర
కార్యము నిరంతరాయముగా రచింప
బడఁగ జేయుమటంచు సద్భక్తి విఘ్న
దేవునకు నంకితంబుగా దీని నిడుదు.

కృతిసమర్పణము

# శృంగారనళీయము

తెలచెద ముందు వాక్సతి మదిన్ దదనంతరమందు శ్రీరమా
లలనను ; శాంకరీసతిఁ జెలంగెడు మోదమునన్ దలంచి వా
రలప్రియులన్ ద్రిమూర్తులఁ గరం బెద నెంచి వినాయకున్ గడున్
దలఁచి పురాతనంపుకవితల్లజులన్ నుతియించి భక్తి ను
జ్జ్వలమగుబుద్ధితో గురులపాదములన్ భజియించి, సత్కవీ
శులకు జొహారు లొగ్గి యతిశుష్కకవిత్వముమాత్రచేఁ గవీం
ద్రులను హసించుకాకవులరోసపుటీర్ష్యఁ దిరస్కరించి నే
నల నిషధాధినాథునికథామృత మాశువుగా నొనర్పఁగాఁ
గడఁగెద ; సావధాను లయి కర్ణపుటంబుల నాస్వాదింపుఁడీ.

*　　　*　　　*　　　*

కలకలలాడుభూసతిముఖంబునకున్ దిలకాయమానమై
యలరుచునుండుఁ దొల్లి నిషధాభిధ దేశ మొకండు దానిశో
భల గణుతింప నా గురుఁడు పద్మభవుండును పాపతేఁడునున్
వెలవెలఁబోయి రన్న మఱి నే వచియింపఁగ నెంతవాఁడ నా
పలుకులకల్కిఁ జేనిఁ దొలిపల్కుల మెచ్చరు వృద్ధుఁ డంచు, భూ
తలసురులచ్చటన్ ; మిపుల ధర్మజమైకమనస్కులై మహా
బలయుతు లైన యట్టి నరపాలురు వాలినిఁ జెట్టు మాటుగాఁ
గలిగి వధించి స్వార్థమునుఁ గైకొనె నం చల రామచంద్రునే
చెలఁగి తృణీకరింతు రట సెట్టివతంసులు బిచ్చగానికిన్
జెలి యని యా కుబేరుసిరిసిం గని కేలి నొనర్తు రంచు కా

పులు కడు భీతిభక్తులను మోదముఁ గూర్చెద రెల్లవారికిన్ 31
లలి లలనామతల్లు లకలంకచరిత్ర నరుంధతీసతీ
తిలకమునీడు వత్తురు పతిప్రియజీవనలై యొసంగి, యూ
కలుములముద్దరా లటనె కాంక్ష విహారము సేయు సన్న యి
ట్టుల నది యట్టు లద్దియుఁ గనుంగడు నొప్పు నలంచు వేఱుగా
దెలియఁగఁ జెప్ప నేల! యటఁ దిటఁగువస్తుసమృద్ధి నాత్మలోఁ
దలఁపుఁడీ, యట్టు లెంచినను తత్త్వములో నొకవీస మేనియున్
దెలియఁగలే రటన్న గణుతింపుట యెట్టులు వాక్కులన్; మహా
లలితము, నిర్జరాలయము లాగుఁ జెలంగెడు నట్టిదేశమున్
నలుడనుచక్రవర్తి, త్రిపురాశికతన్ సమవర్తి, దానమం
దలశిబిచక్రవర్తి, జనతాదరణైకపథానువర్తి, య
య్యలరులతూపుజోడుఁ బరిహాసమొనర్చుమనోజ్ఞమూర్తి భూ
వలయజనార్జితాద్భుతతపఃఫలపూర్తి, తుషారరాజతా
చలఫణిరాజరాజకరశారదనీరదశుద్ధకీర్తి, రం
జిలి, ప్రజ లెల్ల సన్నుతులు సేయఁగ, ధర్మము నాల్గుపాదముల్
నిలువగ నేలు; నొక్కపుడు నిష్కుటసీమఁ గడున్ విహారమున్
సలుపుచు, నాతఁ డందుఁ గల చక్కనిపూబొదరిండ్లసోయగం
బులు, ఫలసమ్రసాలములపొల్పును, పక్షులయాటపాటలున్
గలయఁగఁ జూచి, యం దొకట కాంతిసరోవర మొందుగాంచి యం
దలఘున నొక్కపద్మమున హాయిగ నిద్దురఁ గాంచునట్టి యం
చలలన నొంటిఁ గాంచి మెఱు చక్కఁదనంబును మెచ్చి చేకొనన్
వలె నని మెల్ల మెల్లఁ జని పట్టిన నయ్యది దైన్యలాపియై
కలువలరాకొలంపుతి ప్రట్టినవు నీ నల నేలుచుంటి వన్ 43

బలమున నిర్భయంబుగనుఁ బండితి నిం దిపు డీవె పట్ట, మ 44
మ్మలల నెవ రాదరింతురు ప్రభూ! యని గొల్లున నేడ్వ; రాజు సం
కలితదయాంతరంగుఁడయి క్రచ్చుఱ దానిని వీడె నంత క
న్నులను కృతజ్ఞతారసము సూల్కొన నయ్యది జేని కిట్లనున్
సలలితభావ! నన్విడచి నాగృహ మంతకుఁ బ్రాణదాన మి
వెలమి నొనర్చి తీఋణము నెట్టులఁ దీర్చెద నైనఁగాని నా
కలవడుకార్య మొండు గల దద్ది యొనర్చెద నేను నీకు నా
నెల కొక నూలుపోగు వలె నీవు గ్రహింపు మ దెట్టు లంటివేన్
కలదు విదర్భదేశమునఁ గాంతల నెల్లను గాంతమై యిలా
తలగతయౌ శచీసతియొ దర్పకునెచ్చెలియో యనంగ రా
జిలు దమయంతినాఁగ నొక చేడియ యయ్యెడ నీకె పోలు నా
నెలఁతుక నీకుఁ గూర్చి కడు నేరుపుఁ జూపెద నీ కభీష్టమున్
గలుగఁగఁ జేయునే యిది యనన్ నునుసిగ్గున లేతనవ్వు మో
మలమఁగ మౌనముద్రఁ బలు కాడకయుండిన నద్దె యిచ్చగా
దెలిసి యనుజ్ఞనుం బడసి దివ్యపథంబునఁ బోయె నంచ, యా
నలుఁడును హంసపల్కుల మనంబున నెంచుచు మోహమగ్నుఁడై
యల దమయంతిరూపము హృదంతరదర్పణమందు నెప్పుడున్
నిలువ, విరాళి పైకొనఁ గణింపఁగ శక్యముగాని బాధ పై
నలమఁగ నిట్లు చింతిలెఁ గటా! తనయంతట తానె యట్టులం
చలతలమానికంబు సరసంబుగ ముద్దియఁ గోరు దే యనన్
దెలివి యొకింత లేక యొక తిన్ననిమాటనె పల్కనైతి నా
వలపును దెల్పనైతి; సతివాంఛవిహీనుఁడు వీఁడ టంచు లో
పలఁ దలపోయునేమొ? సరభావవిదగ్రణి యంచ యట్లిటుల్ 66

దలఁచును, మౌనమే యనుమతం బనియెంచదె! యెంచుఁగాక య 67
య్యలఁతిపులుం గదెట్లు దమయంతినిఁ జేరెనుఁ; జేరి చాటుగాఁ
దెలుపుట యెట్లు, లెట్టిటులో తెల్పిన నా సతి మెచ్చు టెట్లు లా
పులుఁగు కృతజ్ఞతన్ పలుకుపొందునఁ జూపెనెగాని దానికిన్
దలమగునే యొసర్పఁగఁ గృతజ్ఞత కాదుగదా కృతఘ్నతన్
సలిపెను, బాళిఁ గూర్చి ననుఁ జంపుటకే యిటుఁ బల్కె నంచుఁ చే
రలుకనుఁ బూనియున్, తిరిగి యాదృతిఁ బూనియు నాఁటినుండియున్
వెలి మెయిఁ దోపఁగా విరహవేదనఁ గుందుచు నుండె హంసయున్
కలజవ మెల్లఁ జూపి యలకాపురిఁ గాపురి నేయు శ్రీలతో
నలరెడు నావిదర్భవిషయాంతరకుండినపట్టణంబులో
పల నెలఁదోట సాళి యయి భైమి విహారమొనర్చుచోట వ్రా
లె; లలనలెల్లఁ జూచి తనలీలలకెంతయు నబ్బ మందఁగన్
చెలువున నా పులుంగు తనచిత్తము లోఁగొన దానిఁ బట్టఁగాఁ
దలఁచి విదర్భరాడ్దుహిత దానిసమీపముఁ జేర నద్దియున్
మెలఁకువ మెల్లఁగా నళిననేత్రకు నందియు నందకుండఁగా
మెలఁగుచు; నట్లు దూరము గమించి యొకింత రహస్యసీమ నా
లలనకు నంది, యాపెయుపలాలనఁ బెల్లుగఁ బొంది యిట్లనున్
తొలకరిమించుమించు వెలిద్రోసెడు నీ తనువల్లి యిప్పుడే
ట్టుల వసివాడెఁ బాదము లెటుల్ గనుగందెనో, నన్నుఁ బట్ట చా
పలత యదేల! మన్మథుని బంగరుచాపలతా! యటంచు నా
పొలఁతుకతోడ నెంతయును ప్రొద్దు గడుంగడు పుచ్చటాడి ప
ల్కుఁలసుధ నాపెఁ దేల్చి యొకకొంచెముసేపటి కెద్దొ జ్ఞప్తికిన్
గలిగినటుల్ నటించి గజగామిని! పోయెద నేను మంచు ను 89

త్తలపడసాగ తత్పదసుధన్ గమం(గ్రోలియుఁ దృప్తిలేక, యం
చలరతనంబ! యేల యిటు సంభ్రమమొందెద విందె యుండి నా
చెలివయి, వాక్సుధారసముచే నసఁ దేల్చుచు నుండరాదె! నీ
కిల నెటనైన నేమి! యని యెంతయుఁ బొచ్చెములేనియట్టి (పే
మలహరి యుబ్బునొందఁగ దమస్వస బల్కిన, రాజహంస మం
జులతరవాక్యగుంభనము చూపడ నిట్లను నో(త్రిలోక మో
హాలతిక! యీయిలాతలమునందు నలుం డను ఱేఁడుకల్గు నా
నలువ కడంగి స్వీయరచనాపటిమన్ గడు ధారవోసి, యీ
లలితశరీరునిన్ నృపలలాముని సృష్టియొనర్చి తాను పే
ర్మిలుపుకొనెన్; మఱాతనిమనీష నెవర్తుక భాగ్యరాశి నా
నలునకుఁ గూర్ప నూహనుపొసర్చెనొ! అమ్మకచెల్ల! మీనులన్
గెలిచెడుకండ్లసౌరు, నునుఁ గెంపునుమించధరంపుతీరు, నా
కలువలఱేనిఁ గెల్చెడుముఖంపుహొయల్, కనకంపుమేనిడాల్
కలికిమిటారి! నేత్రములఁ గాంచఁగఁబోలునె కాని చెప్ప నా
పలుకులు చాల వానలువిభాతతి దేవమునుల్ వచింపఁగా
వలఁపునుఁ బొంది యాతని వివాహమునాడు దలంచి వెండి యా
నలునకుఁ దాను పోలఁదగు నాతుకఁ గానని యెంచి రంభ వి,
హ్వాలతను బేరుచేనయిన నాతనిఁ బోలె నటంచుఁ దృప్తిచే
నల నలకూబరున్ బరిణయంబుసునాడె నటన్న వాని యా
చెలువు నదేమనందు నని చిత్తము మోహపువార్ధిఁ దేలఁగాఁ
దెలిపి యొకింతలౌక్యఫణితిన్ దగ నిట్లను రాజహంస మో
హదఁతుక! కన్నెయొద్ద మగవారి(ప్రసంగము లెంతమాత్రమున్
నలుపఁగఁగూడ దైన నలసక్తమనంబునఁ జేసి యే నిటుల్

సలిపితి, దీని నీవు గను సమ్మతితో క్షమియింపు మట్టి యా 113
నలునకు ధాత్రినాసతి వినమ్రతతో సేవ లొనర్చుచుండు నే
కొలఁగ నిమేషమాత్ర మతిదుఃఖితుఁ డౌనతఁ డేను గూడ నా
నలు విడియుండ మానసమునన్ గల నా చెలికాండ్రఁ జూడ నె
ట్టులొ, సెలవందిపోవుచుఁ గడుంగడు నాతనిరూపరేఖకా
విలసనముల్ సమస్త మొకవీసము భేదములేక నీయెడన్
గలుగుటఁ జూచి మా నిషధకాంతునకున్ సరియైనచేడె భూ
తలమునఁ గల్గెనే యనుచు తద్దయు నచ్చెరువంది చూచిపో
వలెనని వ్రాలి నిన్నుఁ గన భావము విస్మృతి మొందఁ బెద్దఁగాఁ
దడసితి, నిన్నువీడఁగ నెదన్ గడుదుఃఖము నాకుఁ గూడ నీ
వలెనె గలాదు; కొండొకనెపంబును బెట్టుచు నప్పుడప్పు డా
నలు విడివచ్చి నీ కరమునన్ దనరారెదఁ బోయివత్తు నం
చెలిమి వచింప, భీమసుత యెంతయుఁ గౌతుకసక్తయై నలా
కలితమనస్కయై, కుసుమకార్ముకతీక్ష్ణకృపాణవిద్ధయై
యలరుచు, నేమినెచ్చెలివె హంసమ! యున్నటు లుండియుండి, య
య్యలరులవిల్తుముల్కులకు నర్పణఁజేసి చనంగ నెంచితే
వెలువడనిత్తునే యిఁకను వీడను నిన్నని నొక్కిపట్టి రా
గలత గడిందిసాగఁ దనకామిత మెంతయు స్పష్టరీతిగన్
దెలిపి మమున్ వియోగభరనీరధినుండి తరింపఁజేయు న
య్యలయిక యంత నీదె యని యంతకునంతకు ప్రేమ సాగఁగా
నిలువఁగలేక మూర్ఛిలిన, నీడజ మెంతయు శీతలక్రియన్
దెలివిని గల్గఁజేసి పొలఁతీ! భయమందకు, నీదు భావమున్
దెలియ యదార్థసంగతిని నేను మఱుంగొనరించితిన్, గడున్ 135

నలుఁడు భవద్గుణౌఘములు నావలనన్ విని మోహమంది, నీ 156
వలఁపు నెఱుంగ నన్ననిచె వాస్తవ మిద్ది యటంచు నెన్నొ బా
సల నొనరింప భైమి కడు సంతస మంది “ విళంబ మేమియున్
సలుపక పోయి, నాదుతమిసంగతి నంత నెఱుంగఁజెప్పి, మ
మ్మలఁ గడువేగమే మివుల మోదపువార్నిధిఁ దేల్చు ” మన్న రం
జిలి కలహంసమున్ సెలవుఁ జేకొని నైషధుఁ జేరి యంతయున్
దెలిపి ‘ సుశీఘ్ర మేవ భవదీయవివాహముహూర్త మ ’ స్త టం
చెలమి వచించి వీడుకొని స్వేచ్ఛగ నాకసమందుఁ బోయె నా
నలదమయంతులున్ దమ మనంబుల నెంతొ వియోగబాధచేఁ
గలఁగుచునుండి రంతట నొకానొకయప్డు విదర్భభూమిభృ
త్తిలకము భీమరాజు కడుతేరినకూరిమి గూతుపెండ్లికిన్
సలుపఁగ దేశదేశములఁ జాటఁగఁజేసె స్వయంవరంబు, నం
త లలితదేహులౌ నృపతితల్లజు లెల్లరు నన్నె నన్నె యా
పొలఁతి వరించు నం చధిక భూషణముల్ మెయిఁ దాల్చి ఠీవి పెం
పలరఁగఁ గుండినేశుపురమందు వసించిరి ముందె పోయి ; యా
కలహనిమిత్తనారదముఖంబున దాని నెఱింగి యంత ది
క్కుల కధినేతలౌ శతమఖుండును పాశి, యమాగ్నిహోత్రులున్
నలువురు భైమిపై వలఁపునన్ బయనం బొనరించి రంత భూ
తలమునకున్ ; గరమ్ము ఫలిత మ్మగు స్వార్థమటంచు నెంచి లో
నలరి నలుండునున్ బయనమయ్యెను, పిమ్మట మార్గమధ్యమం
దల నలుఁ గాంచి దిక్ప్రభువు లంతకుఁ దొల్లియె భైమి నైషధున్
వలచెను గట్టిగా, ననుచు, భావములోన నెఱింగియుండుటన్
వెలవెలఁబోయి, రంత బలభేది నలుం గని యెంతొ కైతవా 158

కలితమనస్కుఁడై యిటులఁగా నని "యోనలరాజ! యేమి యీ 159
ఫలపరిపాకసూచనలు! వహ్వారె! నిన్నన మేము నీరసా
స్థలి దిగినంతనే యిటకుఁ జయ్యన వచ్చితి వీవె యిప్డు నీ
వలనని కాని కాని యొకభారపుకార్యము మాకు నియ్యెడన్
గలిగెను; దానిఁ గూర్పఁగ వినమ్రత వేఁడుచునుంటి మద్ది నీ
వెలమి నొనర్చెదే! యనిన నెంతయు మోదమునన్ నలుండు వే
ల్పులయెకిమీండ్లకున్ గరము మ్రొక్కి సురాధిపులార! మీకునున్
పొలుపడనట్టి కార్య మది భూమినిఁ గల్గెనె! నన్పరీక్షనున్
సలుపఁగఁగాక! యేమయిన సమ్మతియే మఱి మీకు నేమికా
వలయును ప్రాణమైనసరె ప్రాణముకంటెను నెక్కువైనదీ
యిల మఱి యెద్ది? యేదయిననేని నొసంగెదఁ జెప్పుఁడన్న మా
యలకు నిధానమైనదివిజాధిపు డాత్మకరమ్ములోన నా
నలుఁగర ముంచి తప్పక యొనర్తు నటంచును నెన్నియెన్నొ యొ
ట్టుల నొనరింపఁజేసి, మది డొంకక యోయసమానదాన! మే
మల దమయంతిపై వలపు నందితి మాపెను మాకుఁ గూర్ప నీ
వెలమిని దూతకృత్య మొనరించుట మా దగుకోర్కె నీవు దీ
ని లలి నొనర్చి నీవిపుడు నీకులవృద్ధున కైన మచ్చనున్
బొలియఁగఁజేయు మన్న నలభూవరుఁ డయ్యది వజ్రపాతమై
కలఁత నొనర్చినన్ ధృతినిఁ గ్రచ్చఱ దానినిఁ గప్పి యట్టులే
నలిపెద నన్న నాతనికి శాంబరివిద్య నొకండుఁ జెప్పి నీ
వల దమయంతిమందిరమునందుఁ జరించెడునప్పు డెవ్వరున్
తెలియఁగలేరు నిన్ను మఱి నీవు సమస్తముఁ గాంచుచుందువం
చెలిమిని దేవభర్త వచియింపఁగ, దైవతకార్యభారమా 181

దల ధరియించి వేగమె విదర్భనృపాత్మజరాణివాస మే 182
రలుఁ గనకుండఁ జేరి నలరా జట భైమినిఁ గాంచి మోహపుం
జలధి మునింగి, ధైర్యమున సత్వరమే తెలివొంది వెండియున్
కలఁతను బొంది యెచ్చటనుఁగాంచిన భైమియె తోఁప నీపెతో
సలుపుదు దౌత్య మంచు కడుసంభ్రమపాటునుఁ బొంది వెంటనే
తెలివినిఁబొంది యెంతయును తేకువ యొప్పఁగ నొంటి నున్న యా
పొలఁతినిఁ గాంచి యోయలరుఁబోఁడి దిగీశులదూత నేను, వా
రలు భవదీయభాగ్యమున రాగమునొంది, భవద్వశాంతరం
గు లయిరి ; వారిలో నొకరిఁ గోరి శరీరముతోన స్వర్గమం
దెలమి వసింపు మీవు స్వరధీశునిఁగోరుదె! ధర్మరాజుపై
నెలమి వహింతె! కాంతినిధినెంతువె! యప్పతిపైనఁ గూరిమిన్
గలిగితె! వేఁరిపైనినయినన్ సరె యొక్కనిపైనిఁ బేరిమిన్
గలిగి సుఖింపు మంచుఁ బలుకన్ నలుఁ; డంతట భైమి యోయి నే
నలమునిమానినీవిటుని కాసనొనర్పఁ లులాయవాహనున్
దలఁపను, సర్వభక్షకు నెదన్ దలపోయ; జడాధినాథునం
దెలమి వహింపఁ దక్కుల మఱెవ్వరిఁ గోరను వారి నిచ్చటన్
దలఁపకు మంచుఁ బల్కుటయు నైషధుఁ డంతట నోర్పుతోడ వా
రలఁ గడుబెద్దగా నుడివి రాగముఁబట్టఁగఁజేయ నెన్నొరీ
తుల బతిమాలిచెప్పి, మఱి తుట్టతుదన్ నిను వారు బల్మి గ
ల్పలతనొ, కామధేనువునొ ప్రార్థనఁ జేసియొ, నీమతండ్రినిన్
గెలిచియొ కాని పొందు టది నిక్కము గావున నీవె వారినిన్
వలచిన మంచి దంచు భయభంగి వచింపఁగ వార లట్టులే
తలఁచినఁ బ్రాణమే వదలెదన్ చితిలోఁ బడికాని, వార్ధిలో 204

వలఁ బడికాని కాని యలవారికిఁ దక్కుదునే నలేతరున్ 205
దలఁపదు భైమి యేమి తలదన్నక పోయెడి కార్యమైన నం
చెలిమి వచింప నాపె; నలుఁ డింతయు లేనగ వొప్ప నోసతీ
తిలకమ! వెఱ్ఱిదానవుగదే, మరణించిన, వారి కెంతయున్
సులభముగాదె నిన్గొనుట చూడు; చితింబడ నగ్గివేల్పునిన్
సులువుగఁ జేకొనున్; జలముఁ జొచ్చిన పాశికి వశ్యవౌదు వె
ట్టులమరణించినన్ యమభటుల్ సమవర్తికి నప్పగింత్రు గా
న లలి యెసంగ నీవె సురనాథులలోపల నేరినైననున్
వలచి సుఖింపు మంచుఁ బలుభంగులఁ జెప్పిన వానిలెక్కగన్
దలఁపక వానివాక్యరచనానిపుణత్వము భావసూచనా
విలసనముల్ మదిన్ ముదముఁ బెంపఁగ నాదమయంతి, యోయి! నీ
పలుకులపోడిమిన్ దలఁప భారతి పుంస్త్వముఁ దాల్చినట్లుగన్
దలఁపు జనించు నిన్నుఁ గన నాకది యేలనొ చెప్పలేని క్రొం
దలఁపులు గల్గుచున్నయవి తథ్యము; కావున నీదునామమున్
దెలుఁపగ వేడుచుంటి నని దీనముగా దమయంతి వేఁడ నా
నలుఁ డిక పట్టలేక తననామము, స్వాగమనక్రమంబునున్
దెలియఁగఁ జెప్పఁ గ్రచ్చఱ జనించినసిగ్గును, మోదమున్ మదిన్
వలఁగొనఁగా తటాలునఁ గవాటపుచాటున డాగి, మోహపున్
జలధి మునింగె భైమి; మఱి నైషధుఁడున్ కడురాగవార్ధిలో
పల నడుగంట మున్గి యటుపై దిగధీశులకార్య మేమియున్
ఫలితముఁ జేయఁజాలమికి భావములోఁ దనుఁదానె దిట్టుకొం
చలదివిజోత్తరుల్ నిలిచినట్టిప్రదేశము వేగఁ జేరి యా
కలఁకఁలతేండ్లకంత నెఱిఁగించెను నైషధుఁ డంత నెంతొ చిం

తిలి మఱి వారు కృత్రిమమతిన్ నలువేషము దాఁ బూని యా 228
నలుకడఁ గూరుచుండి రల నైషధుఁడెవ్వఁడో యేర్పరింపఁగా
నలవడనట్టిరీతిని స్వయంవరమందిరమందు నంతటన్
చెలియ నొకర్తు నానుకొని చేతను చంపకపుష్పమాలికన్
సలలితభంగిఁ దాల్చి నృపసంఘము లావెదవింటిజోదుతూ
పుల బడిస్రుక్క నాభువనమోహనసుందరి యాయనంగుచా
పలతిక, యాతటిల్లలిత భైమి మనోహరరీతి వచ్చినన్
తళతళభాసమానమగుతత్తనుకాంతికి ముగ్ధులై యటన్
గలనృపు లెల్లఁ గట్టెదుటఁ గల్గినయద్దములందుఁ దమ్ముఁ దా
గలయఁగఁ జూచుకొంచుఁ దమకంబున మీసల నీటుబుచ్చువా
రలు, మణిభూషణమ్ములు సరాసరి దిద్దెడువారు, మోటుగాఁ
జెలఁగెనటంచుఁ గొన్నిఁటిని శీఘ్రము తీసెడువారు నుంగరం
బులఁ గడుఁబైకిఁ గన్పడెడుపొల్పున హస్తములన్ దెమల్చువా
రలునయి యాపెపైని ననురాగపుఁజూపులఁ బర్వఁజేసి యా
పొలఁతుక యెట్లుచూచినను మోహముతోఁ దముఁ జూచె నంచున
గ్గలమగుకూర్మి నాభువనకాంతులు సొంపుగఁ గూరుచుండఁగన్
చెలియ నృపాలశేఖరులఁ జేతను జూపుచు వారివారిపే
రులు, గుణపుంజముల్ గడు నెఱుంగఁగఁ జెప్పుచురాగ వారి గుం
డెలు గడు విచ్చిపోవఁగ వడిన్వడి చూచుచుపోయి యొక్కచో
నలువుగ నిల్చి భైమి యట నైషధపంచకమీక్ష సేయుటన్
నలు లిట నెందఱో గలిగినారలు హంసయు నాకు దీనినిన్ 242

తెలుపనెలేదు, హా! హాతవిధీ! యిపు డేమియొనర్తు నే నహో 249
తెలిసిన దల్లదిక్ప్రభులు దీటుగ నైషధు వేష మూనిరా
నలుఁడును నిందె యుండు మఱి నా కిపు డానిజనైషధుం డెటుల్
దెలియు నటంచుఁ దాఁ దనమదిన్ గడుదుఃఖము నొంది, యొంది ది
వ్యులకపటంబు దివ్యులె సుబోధము సేయవలెన్ మఱెవ్వరున్
దెలియఁగలే రటంచుఁ బ్రణుతించె నిటుల్ బలుకుంబొలంతి; నో
నలువమొగంపుతమ్మివయి నాట్యమొనర్చు మరాళరత్న! నీ
లలితకటాక్షవీక్షణబల మ్మొకవీసము గల్గినన్ కరా
మలకముగా నెసంగును సమస్తనిగూఢపదార్థజాల మా
బలము కొలంతవడ్డ నరుభావము దీపములేని గీమెకా
తలఁపఁగఁ దల్లి! నీవిభుఁడు తద్ద్రశమన్ సృజియించినట్టియా
నలుఁ డిపు డిందు నెవ్వఁడొ కనంబడఁ జేయవె! నాకు సత్కృపా
కలిత! సమస్తసన్నుత! జగజ్జననీ! యని పెక్కురీతులన్
జెలఁగి నుతించి తుట్టతుద నింగికిఁ జేతులనెత్తి చూచుచున్
తొలఁకనిభక్తి నోపలుకుతొయ్యలి! నైషధభిన్ను నెప్పుడుఁ
దలఁపకయుంటినేని నిజనైషధుఁ దెల్పుదుగాక లేనిచోఁ
దల శతధా ప్రభిన్నమయి ధారుణిఁ గూలెదఁగాక నే నటం
చెలుఁగిడి, గట్టుఁగోసి ప్రవహించెడియేఱువలెన్ కవోష్ణబా
ష్పలహరి గుబ్బమిట్టలను జాల్కొన నేడ్చె భరంబునన్ బటాం
చలమున మోముఁ గప్పుకొని సాధ్వి రసాలవినూత్నపల్లవా
కలితకషాయకంఠ కలకంఠమనోహరగీతికీతి, 269

క్కులమొకిమీాండ్లహ్వృచ్ఛిలలుగూడ ద్రపంచి ద్రవించె నంత ద్యో
తలమునసుండి యోాపరవిదర్భనృపాత్మజ! యేరికూ్పతో
మెలఁగినఁగాని వారి యనిమేషత తప్పదు దేవతాళి కీ
మెలఁకువ గుర్తెఱుంగుము నిమేషయుతుం డలనైషధుం డటం
చెలమి వినంబడన్ ముదము నెంతేయుఁ బొంది యదార్థనైషధున్
దెలిసి విదర్భరాడ్భవ జనించినసిగ్గున నోరచూపు ము
ల్కులఁ గడుఁ గ్రుచ్చె నా కుసుమకోమలు దేహము గాడిపాఱ నా
నలుఁడును కూర్మిభైమిఁ జఱునవ్వుదొలంకగఁ జూచె నంత నా
వలపుటవస్థ యిట్టిదని వర్ణనసేయఁగ శక్య మౌనె యా
చిలువల తేనికైన నజుచేడియకైనను నాక్షణమ్ముగన్
విలువనుఁగట్టుచో నల కుబేరుసిరుల్ సరిగావు; పిమ్మటన్
లలి, దమయంతి పూసరము నైషధుకంఠమునందు వైచెఁ గో
ల్లలుగను క్రొన్ననల్ గురిసి లాస్యమొనర్చిరి దేవమానినుల్
చెలఁగెను దుందుభిధ్వను లశేషముగా భువినిన్ దివిన్ గడున్
నలు నుతియించి రెల్లరు ననంతరమందు ముహూర్తవేత్తలౌ
కాలముపురోహితుల్ దెలుప కూతును నల్లుని భీమరాజు మం
గళతరమైనస్నానముఁ దగన్ బచరింపఁగఁజేసె నంత నా
నలదమయంతు లిర్వురు వినమ్రతతోడ వివాహవేదికా
స్థలము నతిక్రమించిరి ముదంబున నైషధుఁ డంత భైమికిన్
గళమున భవ్యసూత్రమునుఁ గట్టెను, భూసురవేదనాదమున్
బలుపగు తూర్యనాదము నభస్థలవీథుల సంచరింపఁగన్

సలలితమైన యాకుతుకసంపద కంతకు నాదిహేతువై 291
చెలఁగినహంసతల్లజము చేరి కడున్ పరిహాసవాక్యముల్
పలుకఁగ లేతనవ్వు ముఖపద్మమునం దుదయింప నంత వా
రలు తలఁబ్రాలు నొండొరుశిరంబులపైఁ దమిఁ బోసికొంచు బం
ధులకు ముదంబుఁ గూర్చిరి తోరముగా మఱి భీమరాజు రా
ట్తిలకములన్ సగౌరవమతిన్ దగుమన్ననఁ జేసి పంపె నా
నలదమయంతులున్ సుఖమునన్ గడు దోఁగిరి నాఁటినుండియున్

* * * *

శ్రీయుతమైన కాకరపురిన్ ద్విజులన్ బొడవౌ ద్వివేద్యభి
ఖ్యాయుత వంశమందు శివు గౌరినిఁ బోలినయట్టి సూర్యనా
రాయణగౌరమాంబలకు నౌరసపుంగొమరుండు సూర్యనా
రాయణశర్మ దీని నొనరన్ బొనరించె బుధాళి మెచ్చగన్. 300

---

శ్రీ అద్దేపల్లి లక్ష్మణస్వామి నాయుఁడుగారిచే సరస్వతీ పవర్ ప్రెస్‌నందు
ముద్రింపఁబడి, భాషామణియందు చెఱుకువాడ వేంకట్రామయ్యగారిచేఁ
బ్రకటింపఁబడియె, 645-37.

# స్వవిషయము



రెండునెలల కొక రెట్టింపుసంచిక ప్రకటించెదమని యిదివరలో 1937 సంవత్సరము సెప్టెంబరు సంచికలో తెలియపఱచినాము. అట్లే అక్టోబరు, నవంబరు సంచికలు కలిపి జనేవరి 1938 లో చందాదారుల కందజేసితిమి. ఈసంచిక సుమారు రెండునెలల క్రిందటనే తమ కంద చేసియుండవలసినది. కాని మొదట ఫిబ్రేవరినెలలో నాదేహములో నస్వస్థత జనించుటచే కొంచెము సుస్తీఅయినది. దానికితోడు ఆనెల లోనే సూక్తిసుధానిధి కవిశేఖర వసురాయకవిగారికి పక్షవాత సంబంధమైన రుగ్మత జనించుటయు పిమ్మట మార్చినెల రెండవ తేదీని ఆయన కాలధర్మమొందుటయు తరువాత నింకను కొన్నిదినములు నేను వారి యింట సహాయభూతుడనుగా నుండవలసివచ్చుటయు పత్రిక సకాలమున వెలువడకుండుటకు కారణములైనవి. చదువరులు మన్నింతురుగాక.

మేనెలలో సంవత్సరాంతసంచిక (3 వ సంపుటముయొక్క) ఇది వఱకు చందాల నందచేయనివారికి వి. పి. గా పంపుచున్నాము గనుక దయయుంచి స్వీకరింపగోరుచున్నాము. ఈలోపుగ M. O. చేయించి మాకందచేసినచో సంతోషింతుము.

సంపాదకుడు

---

# నవ్వుటాలు

'దెబ్బ యెక్కడ తగిలినదని డాక్టరుగారితో చెప్పినావు?'
"అడివిలో తగిలినదని చెప్పినాను."

---

"అదేమిటి? గదినిండా పళ్లు, కాయలు పఱిచినారు?"
"డాక్టరుగారు రోగిని కొన్నాళ్లు పండ్లమీద నడిపించమన్నారు."

---

డాక్టరు—నీజబ్బుకి నేనేమీ చెయ్యలేను. అది వారసత్వముగా వచ్చింది. ఫీజు పదిరూపాయిలు యిస్తావా?
రోగి—బిల్లు మాపూర్వీకులకు పంపండి.

---

"నీవు త్రాగినప్పుడల్లా కళ్లు మూసుకుంటావేమి?"
"డాక్టరుగారు కల్లునీళ్లు కంటితో చూడవద్దన్నారు."

---

శ్రీరామసహాయం.

# వసురాయ చాటు ప్రబంధము



## ద్వితీయ భాగము

## ప్రశంసా ప్రకరణము

### ఈశ్వరుఁడు



సీ. సర్వోన్నతంబైన శ్యామలాకాశ ప్ర
దేశంబు నా దేవదేవు మూర్ధ
మర్ధరాత్రమున గాఢాంధకారంబులో
వెలుఁగుజ్యోతులు నాదువిభునికనులు
పదునాఱుకళలతోఁ బండువెన్నెలగాయు
చందురుమామ నాసామిమోము
హాలపద్మముఖ్య రేఖాంకితం బైన వి
శ్వంభర నామహాప్రభు పదములు
గీ. చేతనాచేతనపదార్థ జాతపూర్ణ
మైన రోదోంతరంబు నాయధిపునుదర
మనుచు నాయాత్మ మనసున కందరాని
నీకుఁ గల్పించి రూపు ధ్యానించు నాథ. 1

ఉ. ఆకృతిలేక భూత బహిరంతర పూర్ణ నిజప్రకాశతన్
స్వీకృత దుష్టశిష్ట జన శిక్షణ రక్షణ కార్య భారుఁడై
లోకులకుం గనంబడక లోకము లేలు దయాపయోధి సు
శ్లోకుని భక్తపాప భయ శోక హరుం బరమేశుఁ గొల్చెదన్. 2

కం. దేవా! దేవా! యని వా
పోవు సతని వెంట నంటి పోవుచు నుండున్
దేవుండు; క్రేపు వెంబడి
నావు ప్రధావించు నట్టు లారూపమునన్. 3

గీ. దేహబుద్ధి నేను దేవ! నీదాసుండఁ
దావకాంశకుండ జీవబుద్ధి
నాత్మబుద్ధి నీవె యౌదు నే; నిదియ మ
దంతరంగ నిశ్చయము మహాత్మ! 4

గీ. దేహబుద్ధిని దాసుండ దేవ! నేను
దావకీ నాంశకుండను జీవబుద్ధి
నాత్మబుద్ధిని నీవె నేనౌదు నిదియె
యస్మదీయంబు మతినిశ్చయము; మహాత్మ! 5

చ. ఎముకలు రక్తమాంస వస లిట్టి యసహ్య పదార్థ సంచయం
బమరిచిలోనఁ, దోలు పయినంతటఁ మూసిన రోఁతయొళ్లు, పా
పమునకుఁ బంటగా నొసఁగి, ప్రాఁకుచో, దేఁకుచో, దూఁకుచో, సరా
గముగను దాని మోయుమని కట్టడ చేసితి వాత్మ కీశ్వరా! 6

చ. ఒకపెడ నీల; మాపెడ నెయున్నవి ప్రస్ఫుటహాటకాక్షర
ప్రకరము లొత్తుగాఁ; దిరుగవైతును బత్రము; లంత మంచు వా
నికిఁ గనుపట్టు; దెందనుక నీకృతి నన్ జదివింతొ? లేశమే
నిఁక వలదన్ తలం పొదవ దెంతచమత్కృతిరా జగత్కృపీ! 7

ఉ. ఎక్కడనిల్వజంతు వుదయించు తఱిన్ నియమింతొ నీవు, త
త్త్వాకృత కర్మబీజముల పంటగఁ బ్రాణి కిడంగ మేలుగీ
ళ్లక్కడ నిల్చెదుం గ్రహము లన్నియు; నీజగదండ కోటులన్
జక్కఁగ నేల, సామికిఁ బ్రశస్త భటాదులు కాలముఖ్యముల్. 8

చం. నిరవధి కాలనీరనిధి నీకు శతాబ్ద మనంత ! సుంత తుం
ప రయినఁ గాదుగాని, శతముం బరమాయువుగా గణించు నీ
నరులకు దేఱు ; తత్సుతరణంబు ఘటిల్లెడునాఁడు వారలా
చరితమహార్థ సంస్మృతికి సల్పుదు రుత్సవముం భవన్నుతిన్. 9
ఉ. ఆపద వేచిక్రమింగఁ బ్రజ నంగఁద, గ్రిందను మీఁద వల్పలం
దాపల ముందువెన్కలను దారుల దోఁచుచు నున్న వేనవే,
లోపవు కాల్గదల్పఁ, గరుణోదధివయ్యుఁ బ్రచండశాసనుం
డో పరమేశ ! నీవెపుడో యక్కఱ సంకెల లూడ్చు నంతకున్. 10
క. చింతల వంతలఁ జివుకక
సంతాపము పాలుగాక శాంతిని గని, మ
త్స్వాంత మనంత ! నితాంతము
సంతసమున నిను భజింప నలుపు కృపాబ్ధీ.
కం. దినముఖమున నిను మునుము 11
స్మనము దలంపఁగ వలయు, నాలుక నీకీ
ర్తనఁ బాడవలయుఁ గవ
గనవలె నీమూర్తి, దేవ ! గలుగన్ శుభముల్. 12
కం. లో వెలిగనులను వేకువ
దేవా ! లోగన్ను మున్న తెఱవంబడు ; మే
లావహిలదాన నినుఁగని
పావనుఁ, బైకనులఁ గందుఁ బాపజగంబున్. 13
కం. వేకువ వికచము లగునా
ళీకమ్ముల జుమ్మనుచు నళియుఁ బోలెనుతి
శ్లోకమ్ములతో భక్తుఁడు
నీకోమల పదము లీశ ! నెమ్మి భజించున్. 14

కం. రసన నినుఁబొగడు గడియవి
రసమునఁ బెఱసరణిఁ జనక, రసన యెటులటుల్
వసపడుచు నసిగ మసలఁగ
విసపుమనను మందలింపవె హృషీకేశా. 15

కం. మొలకువ రావేఁ బోకను
దొలుతొలుతం దలఁచు తలఁపు, దొలితొలి పలుకున్
వెలివానిఁగాక, తన్నుం
దెలిపినలో వానిఁజెంద, దీపనలాదవున్. 16

కం. నిన్నును నన్నును, మిన్నును
మన్నన్ని సృజించియున్న మహితాత్ముని, స
ర్వోన్నతు, మేలొ్కని కను లో
గన్నన నంతరబహిర్జగ త్పరిపూర్ణున్. 17

కం. వికృతిం బాపి శరీరము
ప్రకృతిం బొందింపు భక్తవత్సల ! కరుణా
మకరాలయ ! నీనామము
సకలౌషధసారమని రసన సేవించున్ ॥ 18

మ. ఒరు బాగుం దన బాగుగా, నటులె యోగోగుంగ భావించు కొం
చొరుచేఁతల్ తనకప్రియంబు లెవియానో యట్టి వెన్నం డవె
వ్వారికిం జేయక సాధుజీవనమునన్ వర్తించు నీభక్తుఁ డీ
శ్వర ! నిర్మోహాజగత్కుటుంబుఁడు తుదిం బ్రాపించుఁ గైవల్యమున్

## హరిస్తవము

ఉ. శ్రీమహిళామణీ నిలయ సీమలమంచు నఖర్వ గర్వముం
దామర లొందినం, దొడలఁ దత్సతిదాలిచి మెత్తనౌట్తుర్ల
వేమఱుఁగుల్గఁ దత్ప్రీతికిఁ జేర్మి, దనర్చెడివాని, భక్తచిం
తామణులన్ భజింపుమ, సదా హరియంఘ్రుల నంతరంగమా 20

ఉ. తామరసద్యుతిన్ నఖసుధారుచి నోరిచి, నీరజంబులై
కోమల తారుణత్వములు గూరి తొలంగి మలీమసాళికిన్,
వ్యోమనదీమరందఝురి యుప్పతిలన్ నెలవైన భక్తచిం
తామణులన్ భజింపుమ సదా హరియంఘ్రుల నంతరంగమా! 21

ఉ. తాముపమాన మానమును దామరసంబులుదక్కె, వేనిపై
వేమఱుఁ బ్రాలుఁ బ్రత్యహము నృత్తరమాకుచకుట్మల స్ఫుర
చ్ఛీమదవాసితంబు లఘుసింధుర కేసరులవ్వి భక్తచిం
తామణులంచుఁ గొల్వుమ, సదా హరియంఘ్రుల నంతరంగమా!

ఉ. సామమనోజ్ఞగానమును సల్పుచు సాధుమిళిందబృంద మెం
దామెత లొందుచుండు నిగమాంత సుధారస వద్వచోప్సర
స్సీమలఁ గమ్మవాసనల సీధువు వేనఁ దొరంగుచుండుఁ ద
త్కోమల పాదపద్మములకుం బ్రణతుల్ ఘొనరింతు వేకువన్. 23

శా. శ్రీసర్థించికుచేలుఁ డుగ్రభవవార్ధిందాటఁ బ్రహ్లాదుఁడున్,
మానత్రాణముగోరి ద్రోపది, సరోమధ్యంబునన్ నక్రబా
ధానిర్ముక్తికిభేంద్రుడుంగొలిచి, లబ్ధస్వార్థులైనట్టి త
చ్ఛీనారాయణ పాదపద్మముల మచ్చింత్తంబు హత్తించెదన్. 24

మ. గరుడస్కంధమునందు సింధుతనయా కాంతోరు దేశంబునం
దురగాధీశుని భోగమందును మహాయోగీంద్ర చేతంబులన్

గరిమం గాంచి విరించి హ స్తబలి రక్షస్స్వామి మ స్తస్థలా
భరణంబైన పదారవిందము మనఃపద్మంబుఁ బొందించెదన్. 25

కం. పార మగపడని పటు సం
సారాబ్ధిఁ దరింపఁ దగిన సాధనమని, గీ
తాశ్లోక మాశ్రయించితి;
నారాయణకర్ణధార! నను జేర్పుదరిన్. 26

శా. శ్రీకృష్ణా! పరమాత్మ! నీవిజయుఁడాజిన్ బంధుమిత్రాదులన్
బోకార్పన్ మనసొప్ప కశ్రువులు చూపుంగప్పఁగా దేరిపై
వేకూలంబడ, నాత్మబోధములఁ దద్విభ్రాంతిఁ దూలించితీ;
వాకళ్యాణ వచోమృతం బహరహం బాస్వాద మేఁ జేయుదున్. 27

కం. వాతూల తూల మృదుసిత
చేతన సుఖశయ్యఁ గేలుఁ జివురులఁ బదకం
జాతములొత్తు త్రిజగ
న్మాతఁ భువనరక్షుఁ దనుపుతండ్రి! భజింతున్. 28

ఉ. గ్రుక్కెఁడు చేతిపాల్ శిశుతఁగ్రోలి, యొసంగితి మోక్షసంపదన్
రక్కసి; కారగించి మధురంబగు గుప్పెఁడు నివ్వరడుక్కలన్,
మిక్కిలి బీదబాఁపనికి మేటిసిరుల్ ఘటియించితీవు; నీ
చక్కికివచ్చినన్ సములు, శత్రులు మిత్రులయారె! శ్రీహరీ. 29

---

శిష్యుఁడు (1925)

---

సురుచిరసారభాన్వితముసూనము మేను మదీయ మేనిఁ
చ్చరితమదాజ్ఞ యెవ్వనికి స్వామిప్రసాదము ప్రస్తుతంబు మ
ద్విరచితచాటుపద్యములు వేనికి కంఠసరంబు లెంతు నా
పరహితవర్తనున్ చెఱుకువాడజు వేంకటరాము ఛాత్రునిన్.

పోయిరి. జనసంఖ్య తగ్గినందుకు సింగన్న పరమానంద భరితుడయ్యెను. మునసబు కరణములువచ్చి "పెండ్లివారిని పోవలదని బ్రతిమాలు కొనక పోయినావా" యని సింగన్నను మందలింపగ, నతడు "నాకేం బట్టిందండి బ్రతిమాలుటకు వారినోట శనియున్నది గనుక హాయిగ దినలేక లేచిపోయిరి. ఉన్నవాండ్రే నావాండ్రు" అని పరుషముగ బదులు చెప్పెను. ఈవివాదము వలన సదశ్యము జరుగలేదు. రెండవనాడు మాత్రమే పసుపులు నలుచుట జరిగెను. మూడవరోజు జరుగనేలేదు. నాల్గవనాడు పెండ్లికూతునకు బద్ధకముగ నున్నదని యాపని మానిరి. నాలుగవ నాటి రాత్రి తెల్లవారు జామున శేషహోమములు జరిగెను. ఐదవనాడు నాగబలి జరిగించిరి. అలుకపాన్పు మిథున విడియములు మొదలయిన ముచ్చట్లు తమకు ఆనువాయి లేదని సింగన్న యాముచ్చట్లు కొట్టివేసెను. తరువాత దండాడింపులు జరుగవలెనని మామిళ్ళమ్మ పట్టుబట్టెను బగ్గుండయు బుక్కాయు సింగన్న తెప్పించలేదు. దానికి బదులుగా సున్నిపిండియు కూరపిండియు ముగ్గు ఉపయోగింపబడెను. నాగన్నను దండాడింపు నిమిత్తము యెవ్వరు నెత్తుకొనలేకపోయిరి. మావల్లకాదు, మావల్లకాదని వచ్చినవా రందరు తప్పించుకొనిరి. అందుచేత నాగన్న నొకయరుగు మీద గూర్చుండ బెట్టిరి. అతడు పెండ్లికూతురు మీద పిడిమాత్రమే జల్లెను. అనేకుల కన్నులలో దుమ్ముకొట్టిన నాగన్నకన్నులలో పెండ్లికూతురో మరొకరో దండాడింపు ముచ్చటక్రింద ముగ్గు గొట్టిరి. దానితో నతని కన్నుల వెంట నీరు కారనారంభించెను. వెంటనే యప్పగింతలు జరుగవలసి యుండుటచే పురోహితుడు నాగన్నను గ్రుడ్డివానిని తీసుకొని పోయినట్లు చేయిపట్టుకొని తీసుకొని పోయి యప్పగింతల పీటలమీద కూర్చుండ బెట్టెను. బంధువు లందరు వెళ్లి పోవుట చేత అప్పగించు

కొనువారు లేనందున వధువును వరున కొక్కనికే వప్పగించిరి. అప్పు డొకముత్తైదువు జాలికలుగునట్లు వప్పగింతల పాట పాడెను. అప్పుడు మామిళ్ళమ్మ కూతును కౌగిలించుకొని యేడ్చెను. తల్లిని కౌగిలించు కొని కూతు రేడ్చెను. ఈపెండ్లి యెందుకువచ్చెరా! యని యేడ్చు చున్నాడేమో యన్నట్లు ముగ్గుపడినందున పెండ్లికొడుకు కన్నుల నుండి నీరుపడజొచ్చెను. ఈవిధముగ వివాహము ముగిసెను. పెండ్లి కుమారునితో గూడ మనుగుడుపులకు మరిడయ్యయు వానిభార్యయు దుందుభిని దీసుకొని గొల్లపాలెము వెళ్లిరి. పెండ్లికొడుకు కన్నులు మూసుకొనియే బండ్లెక్కి పడవలెక్కి పురోహితుని సాయమున నెట్టులో స్వస్థలము జేరెను.

---

౫౯

పదునైదవ యుల్లాసము.

గొల్లపాలెములో మనుగుడుపులు మూడు దినములును సలక్షణముగ జరిగెను. గ్రామములో నున్న యమ్మలక్కలందరు చిలుకూరి శేషయ్యగారి మేనల్లుని భార్యను దుందుభిని జూడవచ్చి "ఈవెధవ నాగన్నకు తగిన పెండ్లికూతురే, అమ్మవారులాగున్నది." యని తమలో తాము జెప్పుకొనుచు బోయిరి. శేషయ్యభార్య పళ్ళమ్మ వంటలో మిక్కిలి జాణ యగుటచే కూరలు పచ్చళ్ళు పిండివంటలు మొదలయినవి మిక్కిలి రుచి కలుగునట్లుచేసి పెట్టెను. ఆమూడు దినములు శేషయ్య తిమ్మనదీక్షితులుగారిని విందునకు బిలిచెను. దీక్షితులు ముసలివాడైనను కొంటెవాడగుటచే భోజనకాలమున పామసింగన్న గారి యింట చేసిన పెండ్లిప్రయత్నమును దలపెట్టి యీవిధముగ నెగతాళి చేయజొచ్చెను. "మాపళ్ళమ్మవదినె వంటలో గొన్నినాళ్ళు తరిబీదు కావలెను. సింగన్నగారియింట వంటజేసినవారి దగ్గర కొంత కాలము వంటనేర్చుకొన్నపక్షమున చాలబాగుండును. ఒక్కవస్తువైనను రుచిగ లేదు." ఆమాటలు విని మరిడయ్య కోపించి భోజనము చేయుచునే తిమ్మనదీక్షితులుతో వాదమున కందుకొనెను. వాదము తుదకు దెబ్బలాటగ మారెను. మరిడయ్య కోపము ఆపుకొనలేక తిమ్మనదీక్షితులను ఎంగిలిచేయితో నొక చంపకాయ కొట్టెను. దీక్షితులు తనవిస్తరి మరిడయ్యనెత్తిన వేసిరుద్దెను. "ఇదేమిపాపమయ్యా" అని శేషయ్య లబలబ మొత్తుకొనెను. పళ్ళమ్మ "తాతగారు! మరిడయ్యగారు! రండి రండి స్నానముచేసి మరల భోజనము చేయుదురుగాని దీక్షితులుమామగారు! మీరుగూడ రండి స్నానము జేసి మరల భోజనము చేయుదురుగాని" యని బ్రతిమాలెను. ఆపలుకులు విని మరిడయ్య మహాగ్రహముచే మరింత మండిపడి యిట్లు కఠినముగ సంభాషించెను "చాలు చాలు లేవమ్మా మనుగుడుపులకు తీసుకొనివచ్చి

మీచుట్టాలచేత కారుకూతలు కూయించినారుకద. మాయింటిలో వంటలు బాగులేవట. మీయింటిలోపాకము నలపాకభీమపాకములవలె నున్నది కాబోలు. మాకుచేతనైనట్లు చేసినాము మాకుకలిగియున్నది గంజియో అంబలియోపోసినాము అందుకే ముసలికోతితొత్తుకొడుకు నన్ను దెప్పవచ్చునా! మాసింగన్న పెండ్లి చేసినట్లు మనవెలనాడులలో నేగాడిదకొడుకు జేసినాడు. నాకన్నమక్కరలేదు నీళ్లుఅక్కరలేదు. అన్నమునకు మొగము వాచి రాలేదు. దైవానుగ్రహముచేత మాకింత అన్నముకద్దు." అని యతడింకను మాట్లాడు చుండగనే తిమ్మన దీక్షితులు వానిమీదిమీదికివెళ్ళి "నేను కోతితొత్తుకొడుకునటరా! సిగ్గుమాలిన ముండతొత్తుకొడుకువు నీవు పెండ్లివారికి తిన్నగ నన్నమైన బెట్టక బసయైన సరియైన దియ్యక సిగ్గుపడి తలవంచుకొని యూరకుండక తెగనీలిగెద వేమి పైగా మనవెలనాటివారి నందరిని గాడిద కొడుకులని తిట్టుచున్నావా? నీనోటదుమ్ముపడ. ఆట్టేపేలకు ఊడిపోగా మిగిలినపండ్లు గవ్వల్లాగున వూడిపోగలవు." అని కొట్టుటకు చేయి యెత్తెను. మరిడయ్య "ఏమాత్రము కొట్టగలవో కొట్టు" అని తనజారీచెంబునకు అంగవస్త్రము ముడివైచి "మొగవాడవైతే రారా! కొట్టరా?" అని కలియబడుటకు సిద్ధమయ్యెను. అప్పుడు నాగన్నయు శేషయ్యయు భోజనము ముగించకుండగనే ఉత్తరాపోశనములు పట్టి లేచి యిద్దరు చెరియొకరిం బట్టుకొనిరి. నాగన్న తిమ్మనదీక్షితులను బట్టుకొని బ్రతిమాలి యింటికి బంపివైచెను. శేషయ్య మరిడయ్యను కౌగిలించి పట్టుకొని మామగారు యిదియొకవేళావిశేషము. నిష్కారణముగ మాటపట్టింపులలో కలహము వచ్చినది. దీక్షితులు కొంచెము కొంటెవాడు. ఈపని మాయింటజరిగినది గనుక మీరునన్ను క్షమింపుడు. మేముమాత్రము మీకన్న నెక్కువగ పంచభక్ష్యపరమాన్నములు పెట్టినామా యేమి! దీక్షితులునోరు మంచిదిగాదు. వానిహృదయము మంచిదే. ఈగ్రామములో మాకన్నివిధముల నతడు తోడు

పడుచుండును గనుక అతనిని గూడ భోజనమునకు పిలిచినాను యింత వరకు వచ్చునని నేను కలలోనైన తలపలేదు. మనుగుడుపులలో యిది మూడవరోజుగదా! నామనవి చిత్తగించి మరలస్నానముచేసి భోజనముచేయండి" అని పాదములపైబడి బ్రతిమాలెను. అప్పుడు మరిడయ్య "సరి! సరి! మామగారు అంతపని యెందుకు లెండి కాళ్ళమీద నుండి లెండి క్షమించుటకు మీరేమితప్పు జేసినారు విందునకువచ్చిన వాడు వియ్యాలవారిని యీవిధముగ దెప్పునని మీరనుకొన్నారా? ఈదినమున నేనునిద్రలేవగానే పిల్లియెదురైనది. ఆదుశ్శకునము చూడగానే యేదో పుట్టిమునుగునని నేనుభయపడుచునే యుంటిని అనుకొనినట్లే జరిగినది. ఈపూట తిరిగి భోజనము చేయను రాత్రిభోజనము చేసెదను. నేటితో మూడునిద్రలు ముగిసి పోవును గనుక రేపు ఉదయమున మాకుశెలవీయండి. పెండ్లికుమారునిగూడ తీసుకొనిపోయి మూడునిద్రలు చేయించి మరల పంపెదము" అని శాంతించి యూరకుండెను. రాత్రి భోజనము లైన తరువాత మరిడయ్య శేషయ్యను బిలిచి "మామగారు! మాపిల్లకు నాగన్న వ్రాసియిచ్చిన భూమి రేపు ఉదయమున నొకసారి చూడవలెనని యున్నది. నన్ను వెంట బెట్టుకొని వెళ్ళిచూపెదరా! భూమి సాగుబడి చేయుచున్న రైతునుగూడ పిలిపించండి" అని యడిగెను. అడుగుటయు శేషయ్య "సరే మామగారు రేపుదయమున అట్లేచేయవచ్చును. ఇదేమి మహాద్భాగ్యమా! యని బదులు చెప్పి మంచము మీద పండుకొని పచ్చివెలగకాయ గొంతున బడినట్లు తోచక నిదురబోక నిటునటుదొర్లుచు నడుమనడుమ నాగన్నను బిలిచి మాట్లాడుచు వ్యాకుల చిత్తుడై యుండెను. తెల్లవారుజామున కోడికూయగానే యతడు మేనల్లునిలేపి యతనిని వెంటబెట్టుకొని సింగరాజు కనకరాజుగారియింటికివెళ్ళి జరిగినవృత్తాంతము ఆయనతో జెప్పి యీవిపత్తునుండి రక్షింపుమని ప్రార్థించెను.

## పదునారవ యుల్లాసము



ఎలుక దొరికిన పక్షమున పిల్లివిడువదు మేక చేతజిక్కెనా బెబ్బులి విడువదు. తనతో బనియుండి యేమనుష్యుడైనా వచ్చెనా సింగరాజు కనకరాజు వానినూరక పోనీయడు. ఆపదనుండి తప్పించుమని శేషయ్యయు నాగన్నయు వేడుకొనిన తోడనే చేపలువలలో బడి నప్పుడు బెస్తసంతసించినట్లే కనకరాజు సంతోషపడి వారితో నిట్లనియె. "శేషయ్యగారు! యీపూట నేను చిన్నగొల్లపాలెము వెళ్లవలెనని సంకల్పించుకొన్నాను చేతిలో డబ్బులేక ఆయూరిలో నొక పెద్దమనుష్యుని పదునైదురూపాయలు చేబదులిమ్మని యడిగినాను, యీపూట వానియొద్దకు వెళ్లి యాసొమ్ము దెచ్చుకొని నాయక్కర గడుపుకొనవలెను అటుచేయనియెడల నామానభంగ మగును. మీరడిగినదానికి ఉపాయము రేపుజెప్పెదను రేపుదయమున రండి" ఆపలుకులు విని శేషయ్య చేతులు నలుపుకొనుచు మిక్కిలివినయమున కనకరాజుతో నిట్లు మనవి జేసుకొనెను. "పంతులుగారూ పెండ్లివారు నేడుభోజనము చేసి వెళ్లిపోవుదురు. ఈయుదయమున వారిపొలము చూచుకొని వెళ్లవలెనని గట్టి సంకల్పము వారికి గలిగినది. ఏచిక్కులనైన బడి మీకుగావలసిన పదునైదురూపాయలు నేనుదెచ్చి యిచ్చెదను కాబట్టి యీపూట మీప్రయాణము మానుకొని మాపని జేయండి లేకపోయిన పక్షమున మాపరువుదక్కదు. మరిడయ్య మరిడీజాడ్యము వంటివాడు. ఆజాడ్యమునకైనను మందుగలదు గాని మరిడయ్య మాటకు మారులేదు. మామీద నిన్నటినుండి కోపము గలిగి యున్నాడు. అందుచేత మీరేదో విధముగ మావ్యవహారము సవరణ చేయించవలెను." అని శేషయ్య వేడుకొనుటయు కనక

రాజు కొంచెము యాలోచించినట్లు పైకిజూచి "సరే ఆపదునైదురూపా యలు పట్టుకొని రండి యీపూట ప్రయాణము మాని మీపని జూచె దను. మీరు తిరిగి వచ్చునప్పుడు నక్కా జోగన్నను తీసుకొనిరండి వేగము వెళ్లండి" యని వారిని బంపెను. వారుస్వగృహమునకు బోవు నప్పుడు శేషయ్య మేనల్లునితో "ఓరీ నాగన్నా కరణము మరణము సమానులే యని మాతాత చెప్పుచుండెడివాడు. ఈపని చేసినందుకు కనకరాజు పదునైదురూపాయలు తెమ్మన్నాడు చూచినావా! వీడు బోసిపులి చేతజిక్కినాముగదా యని డబ్బులాగుచున్నాడు. ఏమిచేయ గలము వసుదేవుడు గాడిద కాళ్లుపట్టుకొన్నట్లు మనము వీనికాళ్లు పట్టుకొని కార్యము చేయించుకొవలెను. ఇంటికిపోయి నీవు పదునైదు రూపాయలు తీసుకొని కనకరాజుగారి యింటికిరా. ఈలోపున నేను జోగన్నను వెంటబెట్టుకొని యక్కడకు వచ్చెదను." అని చెప్పి మేనల్లుని పంపించి తాను నక్కా జోగన్న యింటికి వెళ్లి వానిని లేపి వెంటబెట్టుకొని కనకరాజుగారిగృహమునకు వెళ్లెను. నాగన్న సొమ్ము తీసుకొని మరియొక గడియలో సింగరాజుగారింటికిబోయి దూటబిళ్లల వంటి పదునైదు రూపాయలను వానికి సమర్పించెను. ముడుపు చెల్లించ గానే కనకరాజు వారిపై పరిపూర్ణానుగ్రహము గలవాడై శేషయ్య గారూ "మీరింటికి వెళ్లి మరిడయ్యగారిని మీవెంట బెట్టుకొనిరండి. భూమివారికి మనము చూపింతము" అని శేషయ్యను నాగన్నను వెళ్లు మని పంపి జోగన్నతో యిట్లు జెప్పెను. "ఓరీ జోగన్నా శేషయ్యగారితో మనయొద్దకొక బ్రాహ్మణుడు వచ్చును ఆయనను దీసుకొని వెళ్లి నేనేదోయొక భూమి చూపి మీయమ్మాయికిచ్చిన భూమి యిదే యని చెప్పెదను. ఈజోగన్న యీభూమి సాగుబడి చేయుచున్న రైతని కూడ జెప్పెదను. అవునండి నేనే యీభూమి చేయుచున్న

రైతునని నీవుగట్టిగ జెప్పవలెను. ఈవిషయమున నీకేవిధమయిన బాధయు గలుగదు. ఈమాట జెప్పినందుకు నీకొక రూపాయి యిప్పించెదను. నిన్న సాయంకాలమేగదా కొంపలో నూకలు లేవని నీవునాతో మొఱబెట్టుకొంటివి. తెల్లవారు నప్పటికి దైవమునీకు సాయపడి రూపాయి చేతిలో పడవేయుచున్నాడు. నీవునక్కను త్రొక్కి వచ్చినావు నీవులేచినవేళ మంచిది." ఆమాటవిని సంతసించి జోగన్న "పంతులుగారూ మీ రేలాగున జెప్పుమందురో ఆలాగుననే చెప్పెదను. తమశెలవు ప్రకారము నేనెప్పుడును చేయువాడనేగదా నన్ను పోషించు భారము మీదే! మీరు జెప్పినట్లు నేనెరుగనిసంగతులను గురించి నేనెన్నిసార్లు కోర్టులో సాక్ష్యము లిచ్చియున్నానో మీకు తెలియదా! నేను మీబిడ్డను" అని చేతులు జోడించుకొని కనకరాజు కట్టెదుట నిలిచెను. అంతలో మరిడయ్యను వెంటబెట్టుకొని శేషయ్యయు నాగన్నయు వచ్చిరి. "వారేకనకరాజుగారు. మాగ్రామములో లౌక్యములో వీరితో సమానులు లేరు. కాగితము నలుపు గావలెనంటె గ్రామములోని పిన్న పెద్దలందరు వీరిసన్నిధికి రావలసినదే! దస్తావేజు వీరు వ్రాసినారంటే సీమకు వెళ్లినప్పటికి దానికి తిరుగుండదు. మాకాయన కల్పవృక్షము లాగుననున్నారు. మన దుందుభి కిచ్చిన భూమి దస్తావేజు వీరే వ్రాసినారు మీరు భూమి చూడదలుచుకొన్నారని వారితో మనవి చేయగ మనతో వారుగూడ దయచేయుట కనుగ్రహించినారు. కనకరాజుగారూ వీరే మరిడయ్యగారు మామేనల్లుని భార్యకు మాతామహుడు." అని శేషయ్య కనకరాజుగారికి మరిడయ్యను, మరిడయ్యకు కనకరాజుగారిని యెరుకపఱచెను. "వీరా మరిడయ్యగారు వారిని గురించి విన్నాను గాని దర్శనము జేయలేదు. నేటికి మీయింట పెండ్లిమూలమున దర్శనభాగ్యము లభించినది" అని కనకరాజు వట్టి యుప

చారవాక్యములు పలికెను. "గొల్లపాలెములో కనకరాజుగారని గొప్ప లౌక్యులున్నారని వినియుంటిని గాని కన్నులపండువుగ జూడలేదు. నేడు జూచి ధన్యుడనైతిని. మీయండనుండి మావాండ్రు సుఖముగ కాలక్షేపము జేయుచున్నారనివిని చాల సంతోషించితిని" అని మరిడయ్యా బదులు చెప్పెను. చెప్పినతోడనే కనకరాజులేచి చెప్పులు దొడుగుకొని నల్లవిరుగుడుచేవతో చేసిన వెండిపొన్ను చేతికఱ్ఱ పట్టుకొని "రండి భూమి చూచివత్తము" అని బయలు దేరెను. వాని వెనుక మరిడయ్యా, శేషయ్యా, నాగన్న జోగన్న కూడ బయలుదేరి వెళ్లిరి. వారందరు కొంతదూరము నడచి నడచి యూరిబైటకు పోయిన తరువాత కనకరాజు వారిని మెల్లగ నొకపొలము లోనికి తీసుకొనిపోయి గట్టుమీద తను నిలువబడి "మరిడయ్యగారూ యిదే మీయమ్మాయికిచ్చిన భూమి. ఆయీతతుప్పలు మొదలుకొని యీతాళ్ల కట్టవవరకు నున్న రెండెకరముల భూమి రత్నగర్భయని జెప్పవచ్చును. ఎకరముపుట్లమరకము. నీటిబోదె పొలము నోటిలో నున్నది. కావలసినంత నీరు. యీనక్కా జోగన్న యీపొలము చేయుచున్నరైతు. ఇతడు రైతంటేరైతుగాడు. ధాన్యము కైలు చేయగనే బస్తాలు బండ్లమీద వేసి మన యింటికి పంపగలడు. ధాన్యపుఖరీదే మనకు కావలసిన పక్షమున తలుపుగొట్టగానే ఘల్లున రూపాయలు మనచేతిలో బోయగలడు. రైతులలో యిటువంటి పెద్దమనుష్యుడు లేడు. మంచి మోతుబరి. నాదారురైతు కాడు గిద్దెడు గింజలైన మానవలసినదని యడుగడు" అని క్షేత్రమును జోగన్నను స్తవము జేయుచు చిన్న యుపన్యాసమిచ్చెను. కర్ణపర్వమైన యాయుపన్యాసము నాలకించి మరిడయ్యా కనకరాజుతో నిట్లనియె.- "బాగున్నదండి మీరు చేసిన యేర్పాటులలో లోపముండగలదా, ఇకమీద మాయమ్మాయిపేర కవులు

వ్రాయించి రిజిష్టరు జేయించి, యేయేట ధాన్యము విక్రయించి యేయేట సొమ్ము తోకలపూడి పంపించుట కేర్పాటు చేయ గలరా? దాని భూమిమీదవచ్చు ప్రతిసంవత్సర మదే యేదో యొక నగ చేయించుకో గలదు" అని యతడు మరియేమో చెప్పబోవుచుండ నాగన్న వానిమాట కడ్డము బోయి "కనకరాజుగారూ! అది న్యాయముగాదు పిల్ల కాపురమునకు వచ్చినతరువాత దానిసొమ్ము దానికే యిచ్చివేసెదను. పనికిమాలిన యీవూదాని సొమ్ము నేను పుచ్చుకొందునా? అంతవరకు భూమి నాస్వాధీన భుక్తములలోనే యుండవలెను." యని నొక్కి చెప్పెను. కనకరాజుకూడ నాగన్న మాటయే న్యాయముగ నున్నదని తీర్పు చెప్పెను. నక్కా జోగన్నయు కనకరాజుగారితోనే యేకీభవించెను. అదేసబబని శేషయ్యగూడ బలికెను. అప్పుడు తనమాట సాగదని మరిడయ్య సరే మీయిష్టమేలాగో ఆలాగే చేయుదము అని సన్నసన్నముగ బలికి యూరకుండెను. కనకరాజు ప్రొద్దెక్కుచున్నదిరండి పోవుదము అని వారిని హెచ్చరించి స్వగృహాభిముఖుడై బయలుదేరి, త్రోవలో శేషయ్యను దరికి బిలిచి చెవిలో "జోగన్న మనకు మంచి యుపకారము జేసినాడు బియ్యపు నూకలు లేవని వాడు చిక్కు పడుచున్నాడు. ఇంటికివెళ్లి వానిచేతిలో నొక్కరూపాయిపెట్టండి. మనము చెప్పినట్లు వినేవాడేవాడు. ముందు ముందు వానితో మనకు నెంతోపనియుండును." అని యుపదేశము చేసెను. చిత్తము ఆలాగే యని శేషయ్య యొకకంట నేడ్చుచు జోగన్న కొక రూపాయి నిచ్చి పంపెను. జాము ప్రొద్దెక్కు నప్పటికి వంట లయ్యెను. పెండ్లివారు భోజనములు చేసిరి. శేషయ్య మరిడయ్య కును వానిభార్యకును దుందుభికిని నూతనవస్త్రములు కట్టబెట్టెను. మరిడయ్య మనుగుడుపునిమిత్తము నాగన్నతో శేషయ్యను వానిభార్య పల్లెమ్మను గూడ రమ్మని కోరెను. అట్లేయని వారు మరిడయ్యవెంట బయలుదేరి మఱునాడు తోకలపూడి జేరిరి.

---

## పదునేడవయుల్లాసము



మగపెండ్లివారియింట గొల్లపాలెములో మనుగుడుపుల సందర్భమున జరిగిన ముచ్చటలు చదువరులు విని యానందించిరి గావున ఆడపెండ్లివారి యింటను మనుగుడుపులలో జరిగిన ముచ్చట్లు గూడ వినుటకు మనసులు తత్తరపడుచుండునని యచ్చటి విషయములు గూడ కొన్ని చదువరుల యానందము కొఱకు వివరింప వలసిన యవసరమున్నది. మరిడయ్యా శేషయ్యాగారియింట భోజనాల సమయమున తిమ్మన్న దీక్షితులు ఆడపెండ్లివారినాక్షేపణ జేసినట్లును నంబుచేత దీక్షితులకును తనకును వివాదము జరిగినట్లును, దీక్షితులు తననెత్తిమీఁద యంటపిస్తరి వేసి రుద్ది నట్లును, కొట్టబోయినట్లును, నేరమంతయు వారిమీఁదనే మోపి తనతప్పు కప్పిపుచ్చి ప్రసంగించెను. ఆప్రసంగము విన్నపిదప సింగన్నకును మామిళ్లమ్మకును మగపెండ్లివారి మీఁద నింతింత యనరాని యాగ్రహము కలిగెను. అల్లునితోగాని శేషయ్యతోగాని సింగన్న సరిగ మాట్లాడనే లేదు. "పిల్ల పేర భూమి కవులు కదపా లిప్పించుటకు వారంగీకరించిరా? భూమి చూచినావా? వట్టి చవటిపఱ్ఱయా? లేక మంచిభూమియా?" యని మామిళ్లమ్మ తండ్రిని ప్రశ్నించెను. ఆప్రశ్నకు మరిడయ్య యిట్లు ప్రత్యుత్తరమిచ్చెను. "అమ్మాయీ! భూమి చూచితిని. అదిభూమిగాదు రత్నగర్భ; అందు బంగారము పండును. మనదుందుభి యదృష్టవంతురాలు మగడెటువంటి యవకతవక ముండకొడుకైనను భూమి ప్రశస్తమయిన దాటచే మనపిల్ల యింత గంజి యన్నము దినుట కాధారము గలిగినది. పిల్ల కాపురమునకు వెళ్లిన తరువాతగాని కవులు కదపాలు దాని పేరపుట్టుటకు వీలులేదని చెప్పినారు. ఆగ్రామములో కనకరాజని

యొకలౌక్యుడున్నాడు. వాడు ఛండశాసనుడు. వానిని క్రిందపెట్టిన పంటలుండవు. మీదపెట్టిన వానలుండవు. అన్నివిషయములలోను మీయల్లున కాయన సలహా లిచ్చుచుండును. ఈవెధవ నాగన్న ఆకరణపువాడెంత జెప్పిన నంతజేయును. ఈసలహా యతనిదే. మన వాంఛ్రడే గాదు. ఆగ్రామములో నందరుగూడ నతని యాలోచన మీదనే వ్యవహారములు జరుపుకొనుచుందురు. వ్రాయకపోతే మానెలే పిల్ల కాపురమునకు వెళ్లినతరువాత యీనాగన్నగానితో చెప్పకుండగనే పిల్లచేత భూమి నమ్మించి యాసొమ్ము దానిపేరనే వడ్డికి వేయుదము. ఇది నీమనసులో నుంచుకో" ఆపలుకులు విని మామిళ్లమ్మ తన కోరిక వెంటనే నెఱవేరినది గాదని విచారించి యావృత్తాంత మామె భర్తతో జెప్పెను. మామగారిని పరాభవించినారని మండిపడుచున్న సింగన్న కోపాగ్ని కీవార్త ఎండు సమిధల కట్ట యయ్యెను. అతని కోపము రెట్టించెను. అది మనసులో బెట్టుకొని సింగన్న రెండవనాటి రాత్రి భోజనముల వేళ యాప్రసంగ మెత్తెను. అప్పుడు వారికీ క్రింది విధముగ సంభాషణము జరిగెను.

సింగ—ఏమండి! శేషయ్యగారూ! భూమి పిల్లపేర కవులు కదపా లిప్పించి భుక్తము చేయించ వలసినదని మామగారు కోరినప్పటికిని మీరాప్రకారము జేయించలేదేమి?

శేష—పిల్ల కాపురమునకు వచ్చిన తరువాత యట్లు జరిగింప వచ్చునని మేమనుకొన్నాము.

నాగ—ఎప్పటికైన భూమి మీపిల్లదేకాని మాది కాదుగదా! తొందరేమున్నది? కాపురమునకు రాగానే వచ్చినధాన్యము మీపిల్ల స్వాధీనము చేసుకొని యిష్టము వచ్చినట్లు చేసుకొనవచ్చును.

సింగ—ఇప్పటినుండి దానిస్వాధీనము చేసిన పక్షమున ప్రతిసంవత్సరము సంవత్సరాది పండుగకు మాపిల్ల యేదో యొక నగ చేయించుకో వచ్చునుగదా!

నాగ—ఆనగ నేనే చేయించి పంపెదను లెండి.

మరి—"పుస్తకం, వనితా, విత్తం, పరహస్తం గతం గితం" అన్నాడు శాస్త్రకారుడు. డబ్బు మీచేతిలో పడిన తరువాత అది యేదో విధముగ మీరు ఖర్చు పెట్టుకొందురు గాని పదిలముగ దాచి మాయమ్మాయికి నగచేయింతురా? మాటలేగాని మాటల ప్రకారము సంగతులు జరుగునా?

శేష—జరిగింపగలవారున్నారు జరిగింపలేనివారున్నారు. అందరొక్క విధముగ నుందురా? మావాడు మాత్రము భార్య ముచ్చట దీర్చడా?

సింగ—ఇంతకు మీరు, తాబట్టిన కుందేటికి మూడే కాళ్లట్లు మీరన్న మాటప్రకారమేగాని మామాట ప్రకారము జరిగించరని మీప్రసంగమును బట్టి స్పష్టమైనది.

నాగ—అన్ని విషయములలోను మీరన్న ప్రకారము జరిగించవలెనా? మేము.

సింగ—జరిగించక యెగబెట్ట వలెనని జూచుచున్నావా యేమి? మినుప గుగ్గిళ్లుగావు ప్రింగుటకు యినుప గుగ్గిళ్లు, జాగ్రత్త, గొంతు దిగవు. నీయాగడములు సాగనిచ్చుటకు సింగన్న వెఱ్ఱిపప్ప గాడు. నాముందర మీకనకరాజులు శునకరాజులు పనికి రారు. నేను లౌక్యులలో అతిలౌక్యుడను. వైదికులలో పరమవైదికుడను. నీగుండెలలో నిద్రపోగలను కవడ్దార్.

నాగ—మీమాత్రము ప్రయోజకత్వము మాదగ్గర గూడ యున్నది. మేము గాజులు తొడిగించుకొని యుండలేదు. మీ బెదిరింపు లిక్కడ పనికిరావు. తాటియాకుల చప్పుళ్లకు కుందేళ్లు బెదరవు.

సింగ—నీకోతలు గట్టిపెట్టు; వేడినీళ్లకు యిండ్లు గాలవు.

నాగ—నోరుమూసుకో, సంగీతమునకు చింతకాయలు రాలవు.

సింగ—గాడిదకొడకా! తెగనీలుగుచున్నావేమి అని జారీతో నెత్తిమీద కొట్టెను. ఆదెబ్బతో నాగన్న నెత్తిమీద గాయము పడెను. క్రొత్తనెత్తురు దొటదొట కారెను.

శేష—అరి నీయమ్మకడుపుకాల చంపివేసినావురా! మాకుఱ్ఱవాడిని అనిలేచి సింగన్న నొక్క తన్ను తన్నెను.

మరి—(పీటమీదనుండిలేచి) ఓరి దొంగతొత్తు కొడకా! నీకాలు గాలిపోను తన్నుచున్నావా (యని శేషయ్యను జుట్టుపట్టుకొని వంగదీసి నాలుగు గ్రుద్దులు గ్రుద్దెను.)

ఆగడబిడ లోపలనుండి చూచి పరుగెత్తుకొని వచ్చి అయ్యో! నాయెనో! చంపివేసినారు అని పెద్దపెట్టున యేడ్చెను. ఆయేడ్పు విని చుట్టుప్రక్కల నున్న మగవారు నాడవారు వచ్చి నాగన్న తలనుండి కారుచున్న నెత్తురు జూచి యేదో దెబ్బలాట జరిగినదని తెలుసుకొని నెత్తురు కట్టించుటకు నొకరు తాటి పువ్వారము కొఱకు పరుగెత్తిరి. కొందరు గుడ్డమాడ్చి పంచదార తెచ్చి యామసియు చక్కెరయు గాయములో కూరిరి. దానితో నెత్తురు గారుట మానెను. పిమ్మట నక్కడకు వచ్చినవారు కలహ కారణము తెలుసుకొని వారినందరిని మందలించిరి. అంతట శేషయ్య మేనల్లుని పిలిచి "వీడు మాలవాడు గాని బ్రాహ్మణుడు గాడు వీనియింట మనముండకూడదు పద పోదము. ప్రాప్తమున్న పక్షమున యీడువచ్చిన తరువాత మనపిల్ల

# మృతసంజీవిని



(అనువాదకులు—శ్రీపాద కామేశ్వరరావుగారు)

## పాత్రములు

శుక్రాచార్యులు, వసంతరావు, చలపతిరావు, వైద్యభూషణుడు, కులపతి, జోగన్న, పోలీసుసూపరెంటు, ఇనస్పెక్టరు, జవాను, అన్నపూర్ణమ్మ, వరహాలు, అనంతమ్మ, శారద, బంధువులు, బ్రాహ్మణులు.

రంగస్థలము—రామచంద్రపురము.

కచేరి సావడి, ఎడమవైపుగది. దాని నంటి పెద్దవరండా దాని పక్క రెండు పెద్దగదులు. వాటివెనక భోజనశాలముందు గదులకు రెండు ద్వారబంధాలు—దానికి ఉత్తరాన చిన్నవసారాగది. కచేరి సావడిలో కొన్ని కుర్చీలు, బల్లమంచము, మరికొన్ని బల్లలు.

సావడి తుడుస్తూ వరాలు ప్రవేశిస్తుంది. దానిచుట్టూ ఇత్తడి సరుకులు, కొన్ని తడపవలసిన చీరెలు, చీపురు, బుట్టదట్ట—తుడుస్తూ ఆగుతూంటుంది. అప్పుడప్పుడు చీదుతూ కళ్లుతుడుచుకొంటుంది.

వీధితలుపు ఎవరో తట్టగా ఒకతలుపుతీసి చూసేసరికి గడపవద్ద ఒకయోగి దండము, కమండలువు, గెడ్డము జడలు, రుద్రాక్షపేర్లు, విభూతి రేఖలతో నిలబడును.

వర—ఇది నూరోసారి తలుపుతియ్యడానికి. ఇంకోడు ఒచ్చాడు, ముష్టోడు కామోసు—ఆఁ. ఏటంటావు?

శుక్రా—లోపలికి రానీ.

వర—ఒద్దొద్దు—రోడ్డు దుమ్మంతా ఇక్కడ రాలుతుంది. అక్కడే ఉండు. ఏంకావాలి.

శుక్రా—లోపలికి వస్తాను.

వర—ఎందుకూ?

శుక్రా—అన్నపూర్ణమ్మగారిని బతికించడానికి.

వర—అన్నపూర్ణమ్మోర్ని బతికిస్తావా? ఎవరు నువ్వు?

శుక్రా—శుక్రాచార్యులు.

వర—గుడ్డయ్యోరువా?

శుక్రా—అవును (యోగదృష్టి— తేజస్సు.)

వర—అమ్మయ్యో! నిజమే! (తలుపు బార్లాతీసి ఆయన కాళ్లకు మొక్కి కళ్లుమూసుకొని, చేతులుజోడించి, తలవంచి ఆతనిబట్ట కళ్లకద్దుకొని, కళ్లుమూసుకొని లెంపలు వేసుకుంటూ) బాబూ! అయ్యోయ్యా! రచ్చించు! తప్పొచ్చింది! మహాప్రభో! రచ్చించు!!

శుక్రా—తలుపువెయ్యి.

వర—(కోపముతో) బూడిదె కాళ్ళతో వెళ్లుతున్నావా?

శుక్రా—(అవకతవకగా దులుపుకొనును).

వర—కాదయ్యా! గట్టిగా తుడుచుకో—బూడిదెపోసీ (తలుపువేయును)

శుక్రా—(వసారాగదిచూపి) అందులోకదూ అన్నపూర్ణమ్మ నుంచి నారు?

వర—(సంతోషాశ్చర్యములతో) ఔను, కాని, ఏలా తెలిసిందయ్యా నీకు? చిత్రంగాఉందే! అక్కడేఉంది. పాపమాయమ్మ! అరవై యేళ్లైనాలేవంట! సచ్చేకాలం రానేలేదు. ఏమాంటావు. ఎంత మంచిల్లాలు! ఆయమ్మని తల్చుకుంటే కడుపునిండుతుంది. అబ్బా! ఏంబాధ పడ్డాదయ్యా! మాతీసుకుంది! బంగారుపిచికసుమా

ఆయమ్మ. అబ్బో ఎంత డబ్బుందనుకొన్నావు. కొట్లుకొట్లునిండా డబ్బే.

శుక్రా—అవును.

వరా—అది ఆమేనల్లుళ్ల కెళ్లిపోద్దట. వసంతమ్మగారికీ చలపతిగారికి కామోసు? ఊళ్లో ఎంతమందికో యిచ్చింది. యిరజల్లిందన్నమాట, గుళ్ళకి, గుడ్డోళ్లకి, కుంటోళ్లకీ, బీదోళ్లకీ, సోములకీ, ఈళ్లాళ్లేమిటి, కనబడ్డోళ్లకందరికీ చిత్తమొచ్చినట్టు పారేశింది. నౌకర్లకి చాకర్లకీ—పాతోళ్లకీ, కొత్తోళ్లకీ ఇచ్చేసింది. నాను శిన్నప్పటికాడ్నుంచీ ఉన్నాను, నాకు ముప్పై రూపాయిలిచ్చింది. చూశావా ఆ తెగవు.

శుక్ర—నిజమే.

వరా—నాకేమీ బాకీలేదుసుమా, ఆయమ్మ, ఎప్పటిజీతమప్పుడే యిచ్చేశేది. నువ్వేవటనుకో అటువంటి మాయిల్లాలు ఎక్కడా ఉండబోదు. ఒకరేనా బతికున్నప్పుడిస్తారు, కాని ఈయమ్మలాగు సచ్చిపోయినాక ఇస్తారా? ఈయమ్మ ఆడాళ్ళలో మేసూపూస. ఇలాంటితల్లి మరి పుట్టబోదు. ఈయాళ సాయంత్రం దానంచేస్తారంట. ఎవరోరావాలంట—బాబోనచ్చాపనచ్చులు పంపారు. ఏం పువ్వులు, ఏం దండలు ఏం పళ్లు. ఇల్లంతా నిండిపోయినయి ఎటుచూసినా పువ్వులే, కాయలే, పళ్లే. ఇల్లు చూడు చూడుమనుంది. (తలుపు తట్టబడును. వెళ్ళితీసి రెండుదండలు తెచ్చును) ఇవిగో ఇంకోరెండు. ఎంతబాగున్నాయి! నాపనైనదాక పట్టుకొంచెము (శుక్రాచార్యులందుకొనును) సాయంత్రం శవాన్ని తీసుకోపోతారు. అప్పటి కిల్లంతా శుబ్బరంగా ఉండాలి. పొద్దస్తమానం నాకు తీరికేలేదు.

శుక్రా—శవందగ్గిరకి నన్ను తీసుకోనిపో
వరా—అమ్మయ్యో! శవందగ్గిరకే? ఇప్పుడే
శుక్రా—ఆ—ఇప్పుడే.
వరా—ఒద్దొద్దు. ఇప్పుడోల్లకాదు. అందరూ బోంచేస్తున్నారు. ఒక్క శిటముండు.
శుక్రా—ఆలస్యము కూడదు. వేగమే వెళ్లాలి.
వరా—శవంతో నీకేంపని? ఏంచేస్తావయ్యోయ్యా!
శుక్రా—చెప్పలేదూ, అన్నపూర్ణమ్మను బతికిస్తానని.
వరా—ఆయమ్మని బతికిత్తావా? నిజమే? సచ్చినమ్మకి జీవంపోస్తావా?
శుక్రా—అవును.
వరా—చచ్చి మూడుదినాలయింది.
శుక్రా—అందుకే బతికిస్తాను.
వరా—ముందుటినాగే ఆయమ్మ బతుకుతుందా?
శుక్రా—ఆహా.
వరా—అయితే వారసు లుండరన్నమాట.
శుక్రా—ఉండరు.
వరా—ఒసంతయ్యగా రేమంటారో?
శుక్రా—నాకు తెలియదు.
వరా—అయితే, అయ్యోయ్యా! ఆయమ్మ సచ్చిపోయినాక నాకిచ్చిందే ముప్పైరూపాయిలు. అవి పుచ్చుకుంటుందా?
శుక్రా—తప్పకుండా.
వరా—అన్నా శిక్కే
శుక్రా—నీకింక వేరుసొమ్ములేదా? నీవు మిగల్చలేదూ?

వరా—ఒకడబ్బైనాలేదు. నాసొత్తంతా మా అక్కరోగానికే చాలిందికాదు.

శుక్రా—నీసొమ్ము పోతుందని నీకు బెంగగా ఉన్నదా?

వరా—ఒకటా, రెండా, ముప్పైప్రహూవాయియాలు.

శుక్రా—నీడబ్బుపోతుందని నీకు బెంగగానుంటే, పోనీ, బతికించనులే.

వరా—ఆడబ్బు నాకూడకక్కేలాగు బతికించలేవా?

శుక్రా—అవ్వా బువ్వారాదు. సొమ్ముకావలెనంటే ఆయమ్మ బతకదు; ఆయమ్మకావలిస్తే డబ్బురాదు. ఏదికావలెనో ఎంచుకో. నీవేకదా నన్ను ప్రార్థించింది. నీమాటచొప్పున చేస్తాను.

వరా—(కొంచెమాలోచించి) సరే. ఆయమ్మని బతికించు, నామాటకేమి (దివ్యకాంతి) అదేటయ్యా! నిప్పంటుకొంది!

శుక్రా—నాకు సంతోషము కలిగింది.

వరా—అలాంటప్పుడల్లా మండుతుందా?

శుక్రా—అవును.

వశా—ఇదిశిత్రవే! నీదగ్గిరుండను బాబో. నాబట్టంటు కొంటుంది.

శుక్రా—పర్వాలేదు—ఇది దివ్యజ్యోతి—శవము దగ్గిరికి వెళ్లుదామా?

వరా—నాను శెప్పనేదా? శెటమాగు. లోపలి కెళ్లకూడదు. బొంచేస్తున్నారుకా.

శుక్రా—ఎవరు?

వరా—మా యజమాని, కుటుంబమంతాను. ఒసంతయ్యోరు, శలపతిగారూ, ఆళ్లపెళ్లాలూ, పిల్లలూ—ఇంకా ఎంతమందో సుట్టాలు, బందుగులూ, సాలమంది కూకున్నారు—ఆళ్లందరినీ నాకు తెల్దు—సాలా బాగ్యవంతులు.

శుక్రా—అలాగా?

వరా—ఈదులో సూశావా?

శుక్రా—ఏవీధి.

వరా—మాయీదే— మాయిల్లున్న యీదే.

శుక్రా—చూసినాను.

వరా—మాసక్కగుంటుంది మాయీాడ. ఇందులో కుడికేసిళ్లన్నీ అన్నపూర్ణమ్మగారివే. ఎడమవైపువి ఒసంతయ్యగారివి. అన్నీ ముప్పైఎయిళ్లు. ఎంతసొమ్ము బాబో! లచ్చరూపాయీలాస్తి!

శుక్రా—సందేహమేమి?

వరా—నీదీప మారిపోతూంది.

శుక్రా—ఔను, అదేభయము.

వరా—సాలసేపు మండదేం?

శుక్రా—ఆలోచిస్తూంటే సరి.

వరా—గొప్పాస్తి. తోటలున్నాయి—దొడ్లున్నాయి—పొలముంది. కావలశినన్ని యిళ్లు—ఒసంతయ్యగారికి బియ్యమ్మగుంది. ఒసంతయ్యోరి బియ్యమెరుగవూ? ఇనుంటావు. కుటుంబము. సాలా పెద్దది. ఆళ్ళకేం పనిలేదు. కూసోని తింటవే—అది మేలంటావా, కాదా? బాబో అద్దెకున్నోళ్ళు బందుగులూ, ఎరిగినోరూ సచ్చాప నచ్చాలు. ఈరందరు ఆయమ్మ దినాలకొచ్చినోరే. రెండుమూడు రోజులు రాత్రి పగలూ ప్రయాణం చేసొచ్చారంట. ఎంతమందను కున్నావు. సూపుతానుండూ. ఆళ్లంతా బోంచేస్తున్నారు. ఇంకా విస్తళ్లకాడనుంచి లేవనేలేదు. నానిప్పుడు లోనికెళ్లకూడదు. పెద్ద సంతప్పన. ముప్పైఏమంది కూకున్నారు కంచాలకాడ—ఎన్ని కూరలనుకొన్నావు. చారూధప్పళంచేశారు—ధప్పళం అంటే నీకు తెలుసునా?

శుక్రా—ఎరుగను.

వరా—నాకూ తెల్దు. ఎంతో రుసిగా ఉంటుందంట. నీకూ నాకూ అలాంటిదెట్టారా? పాయసం బూరెలూ లేవు. దినవారాలట—ఇచారం—గార్లోన్నాయిలే—మిగిల్తే నీకు తెచ్చిస్తా, పసిసూతువు గాని—ఉండు. సూశొస్తాను, ఏంశేస్తన్నారో—గా స్లేతింటున్నారు. ఇంకో గంటాలస్యముండొచ్చు—రొవ్వంత సేపు కూర్చో. (శుక్రాచార్యులు బల్లమీద కూర్చోబోగా) ఉండుండు—నీబట్టలు మాసినాయి. చిన్నబల్లమీద కూకో—నాపనిలో నేనుంటా (బిందెలో నీళ్లు చెంబుతో ఇముంచి) కాళ్లు పైకెట్టుకో గదిలో నీళ్లు జల్లుతా—కాదు, కాదు, అక్కడుండకు నీళ్లొడతాయి. ఆమూలకిపో (శుక్రా॥ అట్లేపోవును వరాలు నీళ్లుజల్లి) ఇంక దుమ్మెగరదు, కాళ్లు బాడీకావు. నీ కాకలేస్తున్నదా?

శుక్రా—లేదు—నేనుత్వరగా పోవలెను. లోనికిపోయి మీయజమానితో చెప్పు.

వరా—అంతతొందరేమి? నువ్వేం సెయ్యాల?

శుక్రా—ఇంకా యిద్దరి ముగ్గుర్ని బతికించాలి.

వరా—భోజనాలయితేనే కాని నేను లోనికి పోరాదు. ఆళ్ళు తిండయ్యేదాకా ఆగాలి. లేకుంటే ఒసంతయ్యోరు కోపగిస్తారు—ఆరు నిన్ను సూశేవంటారో, బీదోళ్ళింటికొస్తే ఆయనగ్గిట్టదు. నీవు బాగ్యమంతుడు నాగలేవు.

శుక్రా—మునులు భాగ్యవంతులు కారు.

వరా—ఆరి కెందరో సామ్మిస్తారే.

శుక్రా—మునులకిచ్చే సొత్తంతా స్వర్గానికిపోదు.

వరా—నిజవేఁ? అమ్మోర్లకిచ్చే సొమ్మంతా ఆళ్లు కాజేస్తారేంటి? అందరలాగ నోరు, కాని నేనాన్నమ్మలే......ఓహో! నీళ్ళయి పోయినాయి! బాపనయ్యో!

శుక్రా—ఏమి?

వరా—దగ్గిరే పైపుంది చూశావా!

శుక్రా—అవును—చూశాను.

వరా—ఈబిందెడు నీళ్లు నాకోసం పట్టావా?

శుక్రా—అవశ్యం—దానికేమి?

వరా—చూడూ మనిషిసాయం లేకుంటే పనంతా ఒక్కతె వల్ల కాదు. సాయవేలేదు. ఈళ్లందరికీ మతులు పోనాయి వల్లమాలి నంత పని. ఇంట్లో అమ్మోరు చచ్చింది, నీకు తెలుసుకదా. ఇలా రోజూ ఉంటే బాబో నావొల్లకాదు—ఒసంతయ్యో రొచ్చేసరికి రొవ్వంత దుమ్ముండకూడదు. అయ్యసూస్తే గోలపెట్తాడు. అయన్ని మెప్పించలేము. ఇంకా అంట్లుతోమాలి—బిందెతో నీళ్లు తెచ్చిపెట్టు బాబూ, చచ్చినీకడుపున పుట్తాను—బట్టెగట్టు లేకుంటే తడుస్తుంది—దండలు జాగ్రత్త—బల్లమీదుంచు—అలాగాలాగా—(శుక్రా. నీళ్లు తెచ్చును) బాబూ, నీకుదండం—మంచయ్యోరివి—ఇంకొక్కబింది. (లోపల ధ్వని) ఇను, లోపల గోలలాగుంది. నేను పోయి సూస్తానుండు—(వెళ్లి) ఓహోయి! భోజనాలయినట్టుంది—ఏటది—దెబ్బలాడుతున్నారు కామోసు—లేదు. లేదు. కొందరింకా లేవలేదు. ఒసంతయ్యగోరు ఒస్తున్నారయ్యో! రాగానే నీవొచ్చావని శెప్తానుండు.

శుక్రా—సరే! వేగమే చెప్పు.

వరా—అలాగే. బిందెదించినావా? పైని పెట్టు. సూడు—ఈచీపు రట్టుకో—అలాగుకాదు—ఇలాగ—కూకో (దండమీద కూర్చోగా) హిహీ! అదేటది? దండమీద కూకొంటావా?

శుక్రా—తప్పు తప్పు—కళ్లు గుపడలేదు.

వరా—ఉన్నదే ఒక్కకన్నుగా? కళ్లంటావేం?—ఏపనీ చేతకాదు. దండలిలాగే? (సర్ది) ఇప్పుడు సూడు. ఒసంతయ్యసూస్తే ఎంత కోపమేనా పడిఉండును—ఇప్పుడు బయంలేదులే—సర్దేసినాను. ఆడ కూకో- ఒళ్లోదండవెట్టుకో, ఉలుకూ పలుకూ లేకుండు. అయ్యోరయా! దండం—నాకోమేలు చేసిపెట్టవూ?

శుక్రా—భయంలేదు. అడుగు.

వరా—నన్ను దీవించు, ఇప్పు డెవరూ లేరు. ఆళ్లంతారాగానే నన్ను పంపేస్తారు, ఇకమరి నీక్కనపడను. ముసలిదాన్ని నన్ను దీవించు బాబూ నాలుకాలాలు సుకంగా బతుకుతాను.

శుక్రా—(జ్యోతి—నిలబడి దీవించును) నీమనస్సు నిర్మలము హృదయము పవిత్రము; నీకు నదురు బెదరు లేవు. వంచన ఎరుగవు; నీపని చేసుకోవడములో కుట్ర కుత్సితము నెరుగవు—సుఖంగా బ్రతుకు—పోయి నీయజమానులతో చెప్పు.

[వరాలు పోగా శుక్రాచార్యులు కూర్చొనును—వసంతరావు వెనుక ఆమె ప్రవేశించును.]

వసం—(కోపముతో) ఇదంతా ఏమిటి? నీవెవరు? ఏమి కావలెను?

శుక్రా—(నమ్రతతో లేచి) నేను శుక్రాచార్యులను.

వసం—నీకు పిచ్చి పట్టిందా ఏమి?

శుక్రా—రాక్షస గురువును.

వసం—ఏమిటీ వేళాకోళము ? ఇప్పుడు నవ్వేసమయము కాదు. మధురసము సేవించినావా ఏమి ?—విను. ఇక్కడికి ఎందుకు వచ్చినావు? నీ కేమి కావలెను ?

శుక్రా—మీ అత్తని బ్రతికించడానికి వచ్చినాను.

వసం—ఏమిటీ ? చచ్చిన మాఅత్తను బ్రతికించడమా—(వరాలుతో) ఇతను తాగినాడు. ఎందుకు రానిచ్చినావు లోపలికి ? (శుక్రునితో) చూడు—ఏమయ్యా ! తెలివి తెచ్చుకో- నీతో వేళాకోళాలాడడానికి నాకు తీరికలేదు. మాఅత్తను దహనము చెయ్యవలసి ఉంది—నీవు రేపురా—ఇదిగో ! దీనిని తీసుకొనిపో.

శుక్రా—నేడే ఈమెను బ్రతికించవలెను.

వసం—అలాగే— ముందుదహనముకానీ — ఆవెనుకనీపని — పో ! దొడ్డిగుమ్మాన

శుక్రా—బ్రతికించకుండా నేను ఈయిల్లు వదలను.

వసం—(కోపముతో) ఇదిగో ! నీగోల చాలించు—నాకు విసుగు వస్తున్నది. నాబంధుగులంతా కనిపెట్టుకొని ఉన్నారు. అదిగో గుమ్మము పైకి నడువు—ఊ—వేగం దయచెయ్యి

శుక్రా—ఆమెను బ్రతికించక నేను పోరాదు.

వసం—వెళ్లవేమి ?—ఏదీ, ఏలాగున వెళ్లవో చూస్తాను. జోగన్నా ! జోగన్నా !

జోగ—ఏం బాబూ !

వసం—ఈ తాగుబోతుని గెంటు—త్వరగా !

జోగ—(శుక్రునితో) రావయ్యా, బాపనయ్యా ! నీకు చెముడు కూడానా ? వేషం వేసుకొని వచ్చావుగాని నడువు బైటికి—నా మాట విని చడీ చప్పుడు లేకుండా రా లేకపోతే విచారించవలసి

వస్తుంది—నేను తలచుకొన్నానంటే చూసుకోమరి—వెళ్లవా! ఉం
డుండు—తలుపు తియ్యవే వరాలూ——

వసం——ఉండు నేను తీస్తాను తలుపు (తీసును)

జోగ——బాపనయ్యను పంపేస్తాను. (సడ్డికట్టి) ఉంఃుండు బామ్మడా
నాసత్తువ చూపుతాను. (శుక్రాచార్యుని గట్టిగా పట్టుకొని వీధి
లోకి విసరివేయ యత్నించగా ఆచార్యుడు కదలకుండడమునకు
ఆశ్చర్యపడి,) బాబూ!

వసం——ఏమిరా! ఏమంటావు?

జోగ——ఏమోకాని, బాపనయ్య కదలడు. ఎంతగుంజినా ఉఁఉఁ.
(తలా చేతులూ ఆడించును.)

వసం——నేనుసాయము చేస్తానుండు (ఇద్దరూ కదల్ప యత్నిస్తారు కాని
ఆచార్యుడు కదలడు) అన్నా! కొంపముంచే టట్లున్నాడు. జాగ్రత్త.
భీమబలుడు లాగున్నాడు. సామముతో పంపివేతాము—(శుక్రా
చార్యునితో) అయ్యా! నామాటవినండి—ఈరోజుచాలా చిక్కు
దినం మాఅత్త చనిపోయినది, ఆమెను దహనం చెయ్యవలెను—
ఈసంగతి మీారెరిగినదే.

శుక్రా——ఆమెను బ్రతికించ డానికేకదా నేను వచ్చినాను.

వసం——ఇదాసమయము—నాబంధుగులు మిత్రులు అందరూ ఆమెను
దహనము చేయవలెనని తొందర పడుతున్నారు—ఇది హాస్యము
నకు వేళకాదు.

చలపతి——అంతా సిద్ధముగా నున్నారు. ఎందుకాలస్యమన్నా! అత
డెవరు?

వసం——ఎవడో పిలవకుండానే వచ్చినాడు— పొమ్మంటే పోనంటాడు,

చల——మద్యము సేవించినాడేమో?

వసం—సందేహమేల ?

చల—ఒక్కతాపుతన్ని వెడలగొట్టు—ఈతాగుబోతు సైంధవుడు లాగుఅడ్డుపడ్డాడేమి—గెంటివేయండి.

వసం—వెళ్లకున్నాడు.

చల—అదేమిటి ? వెళ్లడూ ? చూతామా వెళ్లకపోవడ మేమిటో—

వసం—రా ! నీవొక చెయ్యిచూడు.

చల—ఈమూర్ఖుని నేనంటను-జోగన్న ఏమయినాడు ? గుర్రపువాడేడీ ?

వసం—మావంతైంది-లాభంలేకపోయింది—తన్నడమే తరువాయి.

[ఇద్దరు బంధుగులు వస్తారు]

1. బంధు—ఏమిటేమిటి ?

2. బంధు—ఏంచేస్తున్నావు వసంతరావూ ?

1. బంధు—ఏమంటాడా మహానుభావుడు ?

2. బంధు—ఎక్కడనుండి అవతరించాడు ?

వసం—ఎంతచెప్పినా వెళ్లనంటాడు—ఈతిప్పు వరాలుది. ఏబికారివాడు కనపడ్డా దానికి మతిపోతుంది. ఇదో చిలిపిచేష్ట—ఈపిచ్చివాడిని లోనికి రానిచ్చింది ; ఇక వీడు అన్నపూర్ణమ్మను బ్రతికించి తీరుతానని పట్టు పట్టుతున్నాడు.

1. బంధు—పోలీసువాళ్లకి కబురంపు. ఇదివరకే ఆపని చెయ్యవలసింది.

వసం—ఒద్దొద్దు. ఆరట్టువద్దు. ఇలాంటిసమయంలో వాళ్లు ఇంటికి రావడము నాకిష్టములేదు.

చల—వసంతన్నా !

వసం—ఎవరది ?

చల—గదిలో జెండాలు రెండు విరిగినవి చూశావా ?

వసం—చూశాను. వాటితో మనకి పనిలేదు.

చల—ఔను, ఉన్నవాటితోనే కానియ్యొచ్చును. తక్కువైతేనే తమాషాగా ఉంటుంది.

వసం—ఆతలుపూ తెరా తీసివేసి రంగులకిటికీ పెట్టించి దానిమీద చెట్లు జంతుల బొమ్మలూ రంగులతో వ్రాయిస్తాను.

చల—బాగుంది. కిటికీ ఉండడమే మేలు.

వసం—నా కచేరిసావడి పక్కనే గుమాస్తాగది కట్టిస్తాను.

చల—ఎప్పుడు?

వసం—ఉత్తరక్రియలైన తర్వాత. ఇప్పుడే మొదలుపెట్టితే బాగుండదు.

చల—ముందీపెద్దమ్మని వదల్చుకోవడ మేలాగు?

వసం—అదే చూస్తున్నాను. తిష్ఠవేసుకొని కూర్చున్నాడు.

చల—(శుక్రునితో) కుర్చీమీదికి దయచేయండి.

శుక్ర—చిత్తము. కుర్చీవద్దు. నేనలసిపోలేదు.

చల—ఇతనిని పైకి పంపే పూచీ నాది. (శుక్రునిసమీపించి) మిత్రమా, నీవెవడవు?

శుక్రా—నేను శుక్రాచార్యుడిని.

చల—సరే, మీమాటనిజము. అయ్యలారా? ఇతనివల్ల మనకెట్టి హానియు చేకూరదు. కులపతిగారూ! మీకు సిద్ధులభోగట్టా చక్కగా తెలుసును, కనుక మీరు వీరికి తగిన మర్యాదచెయ్యండి. మాకా గొడవ తెలియదు. ఇదిగో ఈతడు స్వర్గమునుండి భూతలము కరుగుదెంచినాడు. రాక్షసలోకమున కంతటికీ గురువు, శుక్రాచార్యుడు. మీరు వీరితో సంభాషించండి (మెల్లగా) ఇతనిని బైటకి పంపవలెను. ఒకసారి గడప దాటించితిరా మీకు చాలా పుణ్యంవుంటుంది. తరువాత ఇతనిగోల వినేవారెవరు?

కుల—దేవా, శుక్రాచార్యోత్తమా-మిమ్మోమ్మభూతలమునకు ఆహ్వానించినందున తమరు ప్రయప్రయాసముల నోర్చి విచ్చేసినందున మీకు స్వాగతము. పూజ్యపాదులైన మీరు దయచేసిన కార్య విశేషము నెరుగ గోరుతున్నాము.

శుక్రా—అన్నపూర్ణమ్మను పునర్జీవినిచేయ వచ్చినాను.

కుల—ఆమె మరణించుట సత్యము. మీబోటి మహాప్రభావుల కామెకు ప్రాణ మొసంగుట దుష్కరము కాదు. ఆమెకు దేవతా పూజయం దాసక్తి మెండు. పూజ్యపాదులు నాతో వచ్చినయెడల ఆమె మృతశరీరము చూపువాడను. (వీధితలుపు దగ్గిరకుపోయి) రండు. ఇదే మార్గము.

శుక్రా—(గదివేపుచూపి) త్రోవ అదికాదు. ఆగదిలోనుంది ఆమె శరీరము. బైటలేదు.

కుల—మీమాట కాదన్నందుకు నన్ను క్షమింప వేడుతున్నాను. ఆశవము మొదట అక్కడే ఉండెను, కాని బంధువులు పలువురు వచ్చినందున దానిని ఎదుటింటిలో నుంచినారు. ఆయిల్లుకూడా ఆమెదే.

శుక్రా—శవము గదిలోనే ఉన్నది.

కుల—మీమాటకడ్డు వచ్చినందుకు నన్ను క్షమించండి. నామాటపై మీరు వీధిలోనికి వచ్చి చూస్తే మీకు నిజము బోధపడుతుంది.

శుక్రా—నేనాగదిలోనికి వెళ్లుతాను.

1 బందు—తల తిక్క ఇదే.

వసం—చూచినారా! నుతి మించుతున్నది.

2 బందు—పదండి. అందరమూ కలిసి యీయనను ఇల్లు దాటించి వత్తాము.

వసం—వద్దు వద్దు, గోలచెయ్యకండి. ఆయనకు కోపము రాగలదు. మనకు హానితప్పదు. అతడు కడు బలవంతుడు. మీరాద చేతులు వేయకండి. జోగన్నా నేనూ బలిష్ఠులమైనా ఈయనని కదల్చ లేక పోయినాము. వటావృక్షమువలె నేరు తన్నినాడు. ఉపాయం చేతనే కార్యం సాధించుకోవలెను. ఇతని నైజము కడు చిత్రము.

చల—శవము గదిలోనుండని ఎవరు చెప్పినా రితనితో.

వసం—ఇంకెవరు, వసంత! దాసినోటికి వచ్చినట్లు కూసింది.

వరా—నేనా! కాదు కాదు. నేను చెప్పినానా? లేదు. నామానాన్ని నాపని చేసుకుంటున్నాను. నేనతని మాటలకు ఔను కాదని మాత్రమే అన్నాను. ఏమయ్యోయి! నాను చెప్పినానా?— మొద్దునాగ మాటాడవేమి?

శుక్రా—ఆమె చెప్పలేదు నాతో

వరా—చూశారా? ఆయన సిద్ధుడు, ఆయనికంతా తెలుసు. నా మాట నమ్మండి. ఆయనికి తెలియందేదీ లేదు.

చల—(శుక్రుని చెంతకేగి మెల్లగా తట్టి) అయ్యా! దయచేసి ముందడుగు పెట్టండి. కానీండి.

1 బందు—వెళ్లుతాడా, వెళ్లడా?

చల—నాకో ఆలోచన తట్టింది.

వసం—ఏమిటది?

చల—వైద్యుడెక్కడ?

2 బందు—అతను భోంచేస్తున్నాడు. ఈపాటికి కావచ్చును.

వసం—జోగన్నా, నీవుపోయి అతన్ని తీసుకొనిరా (జోగన్న పోవును) మీమాట నిజమే, ఇతడు పిచ్చివాడు. వైద్యుడు రానీ.

(జోగన్న, వైద్యుడూ వస్తారు)

వైద్యు—ఏమొచ్చింది. ఇతనికి పిచ్చిపట్టిందా ? రోగమా? లేక తాగినాడా ? (శుక్రునిపారచూచి) బిచ్చగాడయ్యా ! ఇతని విషయమైనాప్రమేయము లేదు. ఏమయ్యా ! విశేషములేమి ? నీకేమి కావలెను ?

శుక్రా—అన్నపూర్ణమ్మగారిని బ్రతికించవలెనని వచ్చాను.

వైద్యు—అలాగా! నీకు వైద్యము తెలిసినట్లు లేదు. ఏదీ చెయ్యి చూస్తాను (నాడిచూసి) నీకు నొప్పిబాధ ఉన్నదా ?

శుక్రా—లేదు.

వైద్యు—(తలపట్టి చూసి నుదుటిమీద చెయ్యివేసి) ఇక్కడేమైనా ఉన్నదా ? వేలుతో నొక్కితే నొప్పిగా ఉందా ?

శుక్రా—లేదు.

వైద్యు—సెబాసు—ఎప్పుడే నా తలదిమ్మెంటుందా ?

శుక్రా—ఎప్పుడూ లేదు.

వైద్యు— లోగడ—దెబ్బతగిలిందా ? పడడంవల్లకాని, రాయి రప్ప తగలడంవల్లగానీ ? గ్రహచారం తక్కువైకానీ. ఏదీ చాతీచూతము—ఆ-అదీకారణము. తెలిసింది. ఏదీ ఊపిరిపట్టు. ఒదులు, ఇంకోసారి-ఇంకా ఇంకా సరిపోయింది-ఏమంటావు ? ఇప్పుడుచెప్పు.

శుక్రా—ఆగదిలోకి వెళ్ళవలెను.

వైద్యు—ఏమి పనుంది ?

శుక్రా—అన్నపూర్ణమ్మను బ్రతికించడానికి.

వైద్యు—ఆమె అక్కడ లేందే !

శుక్రా—ఉంది. నాకు కనబడుతుంది.

వైద్యు—నీకెలాగు కనబడ్డది. మాకు కనబడదేమి ?

శుక్రా—నాకు దివ్యదృష్టి ఉంది.

వసం—అదే. ఇతనికున్న తెగులు.

చల—ఏమండీ, డాక్టరుగారూ! ఇంజెక్షను ఇస్తే ఇతనికి?

వైద్యు—దేనికి?

చల—నిద్రపట్టడానికి-అప్పుడు పైకి దాటించడము సులువు.

వైద్యు—వద్దు వద్దు. తెలివితక్కువపని. అదికాక అపాయకరము.

చల—అదతని కర్మము. పిచ్చివాళ్ళు, దేశదిమ్మర్లు, తాగుబోతులూ మొదలైనవాళ్ల జోక్యము మనకులేదు.

వైద్యు—నా అభిప్రాయము చెప్పనా?

వసం—సెలవివ్వండి మహాశయా!

వైద్యు—ఇతడు తలతిక్కమనిషి—మనోదార్ఢ్యము కాస్తతగ్గింది. ఇతడీ స్థితిలో అపాయదాయకుడు కాడుగాని ఇతని ధోరణి మార్చడానికి యత్నిస్తిమా వీనివల్ల మనకు తప్పకుండా కీడుమూడుతుంది. ఇలాటివారి నెందరినో నేనెరుగుదును. మనలోమాట—ఇతను చేయ దలచినపని స్వర్గస్థురాలైన అన్నపూర్ణమ్మగారి గౌరవమునకు భంగము కలుగ జేసేదికాదు—అట్టి సందర్భములో నిరపాయమైన కోరికనితడు కోరుతున్నాడు కావున ఇతని నాగదిలో కొంతసేపుండ నిచ్చుట కెట్టి అభ్యంతరమూ ఉండనక్కరలేదు.

వసం—వల్లకాదు. చచ్చినవారిని బ్రతికించడము మనమెక్కడా చూడ లేదు సరేకదా వినలేదు. ఇట్టి అసంగతమైన పనితాను చేస్తానని వంకపెట్టి ప్రతివాడూ ఘరానామనుష్యుల ఇళ్లలోకి నిరాటంక ముగా పోగల్గితే ఇక ప్రపంచమేమి కాగలదు?

రెండోది అన్నపూర్ణమ్మగారు ఇతని కేవిధమైనహాని కలుగ జేయలేదు. అట్టి సాధ్వీమణి హాయిగా స్వర్గసుఖ మనుభవిస్తూంటే ఆమెను తిరిగీ పాపపంకిలము దుఃఖాకరమైన ప్రపంచమున ఇంకా

కొన్నాళ్లుండుమని శిక్షించుట కితడెవ్వరు? ఆమె యోగక్షేమములకు బాధ్యులము మేము. ఆమెను సుఖపెట్టడమే మాముఖ్యకర్తవ్యము. అందుకు ప్రతికూలమైన పనికి పూనుకొన్న ఈ ప్రచ్ఛన్నసిద్ధుడామెకూ మాకూ శత్రువు. కాబట్టి ఇతనికోర్కె కొనసాగనివ్వము. పెద్ద పేరు పెట్టుకొని వచ్చిన ఈతనికోర్కె అన్నపూర్ణమ్మగారికీ మాకూ కూడా మహానర్థదాయకము.

కుల——మీచిత్తము. మీరే యీవిషయమున నిర్ధారణ చేయతగిన వారు——ఇతడు అభ్యాగతి ఔటచేత విష్ణువవలె అర్చనీయుడు. అట్టివాడు కోరినకోర్కె నెరవేర్చడము గృహస్థులవిధి. పోగొట్టుకొన్న వస్తువు సమకూర్చడము లాభముగాని నష్టముకాదు. అన్నపూర్ణమ్మగారి ప్రాణాలు పోయినవి. వాటి నీతడు తిరిగీ సమకూర్చ గల నంటున్నాడు. ఉత్తమ బ్రాహ్మణుడు. కోరినది మహద్విషయము కావున దానిని తీర్చుట మంచిపని అందువల్ల మీకు అగడు రాదు. బాగా ఆలోచించుకొని యుక్తమైనరీతి నాచరించండి.

వైద్యు——మీ కేమీ భయమువద్దు, నాదపూచీ, మనమందరమూ గది లోకి పోదాము.

1 బంధు——వైద్యభూమణుడు చెప్పినది బాగున్నది.

2 బంధు——కులపతి చెప్పినదీ సరిగానే ఉన్నది.

వసం——సరే, అదేదో కానిత్తాము. ఏమటకానీ, ఈసంగతి బైటకు పొక్కనివ్వకూడదు. సిగ్గుచేటు—రహస్యముగా ఉంచండి.

చల——అత్తగారి నగలన్నీ ఎక్కడున్నావో జాగ్రత.

వసం——నేను వాటిపై కన్ను వేసియున్నాను. అబ్బో! ఇతనినెవరు నమ్ముతారు. (శుక్రునితో) రావయ్యా గదిలోకి; ఇదిగో త్వరగా కాని య్యాలి—చాలాపనియున్నది.

(గదిలో కందరూ పోవుదురు)

వసం—ఇదిగో శవము—చూచినారా ప్రాణాలు పోయినవి—సంశయము లేదుకదా ?—ఇక దయచేయండి—మీపని యైనట్లేనా ?—జోగన్నా, ఈయన్ని తోటగుమ్మమునుండి పంపిరా.

శుక్రా—కొంచెముండండి. (గదిమధ్య మంచము కాళ్లకడ నిలబడి గట్టిగా) లే.

వసం—అయిందా మీపని ?—ఇక మీదారి పట్టండి, లేకుంటే కాళ్లకీ చేతులకీ పని కల్పించవలసి వస్తుంది. మామనస్సులు నొచ్చేటట్లు మీరు మమ్మవమాన పరుస్తూంటే చేతులు నలుపుకొంటూ మేము నిలబడజాలము—

శుక్రా—కొంచెము తాళండి (మంచముపై చెయియుంచి) లేలే.

వసం—(కోపముతో) చాలునయ్యా ! ఈపాటి నీవుపోవచ్చును.

శుక్రా—ఉండవయ్యా—చాలాదూరాన ఉన్నదామె—అన్నపూర్ణమ్మ గారు, లేవండి. (శవము కదిలి, కళ్లువిప్పి చేతులతో ఆనుకొని కూర్చొని బట్ట సర్దుకొని గదినలుపక్కలాచూచి మంచంమీద పువ్వులు పట్టుకొని వాసనచూసును—వరాలు తటాలున ఆమెను కౌగిలించుకొనును,)

వరా—అన్నపూర్ణమ్మగారు బతికింది—చూడండి పువ్వువాసన చూసింది—ఏమికావాలమ్మా మీకు ? అయ్యా బాపనయ్యా ! ఎంతోడవయ్యా నువ్వు. అచ్చంగా దేవుడవే—అందరూ మొక్కండయ్యా ! మొక్కండి.

వసం—ఉండుడు ! గోలచెయ్యకు—ఏమిటీకూతలు అల్లరిన్నీ — ఇది సంతోషానికి వేళకాదు—

చల—అబద్ధం—కాదు—ఈమె జీవించేయున్నది-

1 బందు—ఇది సంభవమేనా ? ఇతడేమి చేసినాడు ?

వసం——నిజమనుకొన్నారా? ఈమె మళ్లీ చచ్చిపోతుంది.

చల——కాదు, కాదు. చూడు గుడ్లెర్రచేసి ఏలాగు చూస్తూన్నదో మనవైపు?

వసం——నేను నమ్మజాలను. ఇంకా, సృష్టినియమాలేవీ?

వైద్యు——(బిక్కమొగముతో) ఏమనగలము? ఏమి చెప్పమంటారు ఇందు నాప్రమేయములేదు, ఇది నాపనికాదు. ఇది అసందర్భమే కాని అతి సులభవేద్యము. ఈమె బ్రతికుంటే లోగడ చావలేదన్నమాట. ఇందేమి ఆశ్చర్యమున్నది. ఇది నూతనసృష్టికాదు, అతి మానుషమూకాదు.

వసం——నీవే అన్నావు కాదటయ్యా?

వైద్యు——నేనేదీ ఇదమిత్థమనలేదు. ఈమె చనిపోయినట్లు నేను సర్టిఫికెట్ వ్రాతమూలకంగా యివ్వలేదు. నాకు చాలా అపనమ్మకముండెను, అలాగని మీతో చెప్పితే మీకు లేనిపోని ఆశలను కలిగించినవాడ నౌతానని మానివేశాను——ఇంతకూ ఇప్పుడేమి నిర్ధారణ మయింది? ఈమె ఇకనెంతోకాలము జీవించదు.

చల——అంతవరకు మనకగపడినది నమ్మి తీరవలెను.

వరా——ఔను. మనము నమ్మకోవాలి, సందేహములేదు ఆబామ్మడు సిద్ధుడే—చాలా గొప్పోడు—అతని మాహాత్మ్యం గొప్పది. మునీశ్వరుడు—దేవుడు. ఇంకోడవుతాడా? చూడండి—అమ్మగారు బతికున్నారు—కలకలలాడుతున్నారు.

వసం——అన్నపూర్ణత్తా, నువ్వేనా?

చల——నన్నెరుగుదువా అత్తా! నేను చలపతిని, నీమేనల్లుడ్ని, జ్ఞాపకముందా?

అనంత——అత్తా! నీమేనకోడల్ని అనంతమ్మని.

శారద—నేను శారదను. నీవెండిసామానంతా నాకిచ్చావు. జ్ఞాపక ముందా ?

వసం—అదిగో నవ్వుతూంది.

చల—కాదు, కాదు విచారిస్తూంది.

వసం—మనందరిని పోల్చింది.

అన్న—(నోరుపిప్పి పెదవులు కదులుస్తూంది)

చల—వినండి. ఏదో మాటాడబోతూంది.

వరా—మహాప్రభూ ! దేవుడా ! నమస్కారము. అన్నపూర్ణమ్మగారు దేవుణ్ణి చూసొచ్చింది. స్వర్గములోని చిత్ర విచిత్రములైన వింతల గురించి చెప్పుతుంది. దండం పెట్టండి, మొక్కండి.

చల—వినండి వినండి.

అన్న—(శుక్రుని కోపముతో చూసి) ఇతడెవడు ? ఇలాటి అభాగ్యుని నాయింట్లోకెవరురానిచ్చినారు ? ఇల్లంతా దుమ్మురాల్చుతు న్నాడు. వేగం పొమ్మనండి...వరాలూ, ఇలాంటి బికార్లను రాని య్యవద్దని ఎన్నిసార్లు.

శుక్రా—చెయ్యెత్తి వూరుకో !

(అన్నపూర్ణమ్మ నోరు తెరచి మాటాడకుండును)

వసం—అయ్యా. ఈమెను క్షమించవలెను తమరు. మీరామెకు చేసిన మేలు ఎరుగదు. అది మేమెరుగుదుము. మీరుచేసిన మహత్కా ర్యమింకెవ్వరికీ సాధ్యముకాదు. ఆకస్మికమే అనండి. లేదా ఇంకో పేరుపెట్టండి. మాకందరికీ దురూహ్యముగాఉన్నది. ఇట్టి మహా త్ముని దర్శనము మాకమితగర్వాపహము, ఆనందదాయకము. ఏదీ ఒక్కసారి (కౌగలించుకొనును)

శుక్రా—ఇక నేనుపోవలెను. పనిఉన్నది.

వసం—ఓహో! ఇంత తొందరపడకండి. మిమ్మెలాగు పోనిస్తామా? వట్టిచేతులతో మీరు పోవల్లకాదు. మా అత్తగారు మిమ్మెలాగు సత్కరించునో ఆమెయిష్టం, ఆమెతరఫున నేనేమీ చెప్పజాలను. నావిషయమున నాతమ్మునితో నాలోచించవలెను. ఈకార్యమెట్లు మీరు నిర్వహించినారో ఆవిషయము మప్రస్తుతము, దానికి తగిన పురస్కారము తప్పకుండా చేస్తాను. అందువల్ల మీకార్యము సఫలముకాగలదు. ఏమి చలపతీ!

చల—తప్పకుండా. ఎందుకు చేసినానా అని మీరు విచారించకూడదు.

వసం—మేము సామంతులముకాము. మాకూ భార్య పిల్లలూ ఉన్నారు, ఖర్చువెచ్చములున్నవి. అయినా చేసినమేలు మరచేవారముకాము. అయాచితముగా క్రొత్తవారు మాయింటికి వచ్చి మహోపకారమొనర్చి మాచేత యథోచిత పురస్కృతి బడయకుండా—మాస్థితి మీకు విన్నవించినాను—రిక్తహస్తాలతో వెళ్లిపోయినారంటే మాకులగౌరవము నిలుస్తుందా? కొన్నిరకాల మేళ్లకు తగిన పురస్కృతియే ఉండదని నేనెరుగకపోలేదు, అట్టివాటికి పురస్కృతి యివ్వనేయివ్వరు—ఈసంగతి నేనెరుగుదును, ఇదినాకు బాగా తెలుసును. కొండంత దేవుడికి కొండంత పత్రిపూజ చేయగలమా? అలాగని మాని వేయ వీలుంటుందా? చంద్రునికి నూలుపోగు. కానీండి—మేమెలాగు తగిన పురస్కారము చేయవలయునో మీరే చెప్పండి. పురస్కృతివిలువ మీరే నిర్ణయించవలెను. హెచ్చుగా మాత్ర మభిలషిస్తారా మీబోటి మహాత్ములు—మా శక్తికి మించిన విత్తము మీరు కోరేవారుకారు. కోరినా మేమివ్వజాలము. మీకు సబబని తోచినంత అడగండి—మీయాజ్ఞకు మేము బద్ధుల మౌతాము.

చల—మా అన్నగారు యుక్తమైన మాటే చెప్పినారు. మీరిద్దరు సంప్రతించేలోపున నేను మాలోనే చందా జమచేస్తాను—ఆజో క్యము మీకనసరములేదు, మీపని మీరు చూసుకోండి.

శుక్రా—నేను వెళ్లిపోవలెను. చేయవలసినపని చాలాఉంది.

వసం—చాలాపనిఉందా! జరూరుపని! మీకేమింపని ఉంటుంది—అది ధర్మముకాదు. ఆమాట మీరనరాదు. చనిపోయిన మాఆప్త బంధువును బ్రతికించిన మిమ్మూర్మరక ంపించినామని విని నలుగురూ మమ్మేమంటారు? మీరు ధనము గ్రహించకుంటే—మీమొగ మాటము నాకు స్ఫురించకపోలేదు, దానికి మేమెంతో కృతజ్ఞు లము—విన్నారా! మీరు మాధనమును స్వీకరించకుంటే, మాపే రుగా ఏదైనా స్మారకచిహ్నము మీరు పుచ్చుకోక తప్పదు. మీరు వెనకతీయకండి—ఏదో తృణము—చుట్టలపెట్టె, సిగరెట్టు కాల్చే పైపు—మధురసంపుచ్చుకొనేగ్లాసు—లేకుంటే పొడుంకాయ— మీరు గ్రహిస్తామంటే, దానిపైని మీపేరు, విలాసము చక్కని బంగారక్షరములతో చెక్కించి అర్పించుకొంటాము.

శుక్రా—వద్దు, వద్దు, నేనేమీ పుచ్చుకోగాదు.

వసం—ఇది లంచములో చేరదు. అభ్యంతరము చెప్పకండి—ఇదేపాటి?

శుక్రా—లేదండి—పుచ్చుకోనండి.

చల—పోనివ్వండి—ఈలంకాకుచుట్టకాల్చి మమ్ము సంతోషపెట్టండి. లేకుంటే ఈపంపుపొగాకూ తీసుకొనిపోయి పొడుము చేసుకోండి. జ్ఞానపత్రి కావలెనంటే క్షణములో తేగలము. కారాకిల్లీ నల్ల మందుమాత్ర కావలెనంటే సిద్ధమే—ఇవి పుచ్చుకొంటే ప్రమాద ముండదు కదా?

శుక్రా—క్షమించండి—ఇవేవీ నాకభ్యాసములేదు.

వసం—ఏఅభ్యాసమూ లేక ఇంతకాల మెలాగు గడపినావయ్యా ?- పోనీ-ఏదైన నీకిష్టమైన దుంటుందిగా, అదే చెప్పవయ్యా-నీదే ఆల స్యము. మీరుచెప్పడమే తడవుగా జాగ్రత్త చేస్తాము-చూడండి- మాకెవరూ కలుగజేయనేరని సంతోషము కలిగించినారు-కనుక ఈయిల్లు, మాసర్వస్వమూ మీది. ఇంతకన్న ఏమిమనవి చేయ గలము ? మీకేది ప్రీతికరమో దాన్ని సెలవియ్యండి-మమ్మిట్లు హతాశులను చేయడము మీకు భావ్యముకాదు.

చల—ఇదిగో-నాకొకఊహ స్ఫురించింది, అదంత వ్యర్థముకాదు. ఈయన మోమోటమునకు మనమందరమూ సంతసించినాము. అందువల్లనే కదా ఈయనఏదీ పుచ్చుకోనంటున్నాడు-ఇతడు మనకు చేకూర్చినది జీవముకదా, అది అనర్ఘము-ఈయన స్వార్థపరిత్యా గముచేసి మనతో సమానుడైనాడు కావున మనపంక్తిని భోజనము చేసి మనకు ఆనందము కలుగజేయ వచ్చును-మీరేమంటారు- (సరే సరే చాలబాగుందని కేకలు.)

వసం—అదే, అదే, దానితో అన్నిచిక్కులూ విడిపోవును. ఈయూహ నీకు తట్టినందున నీకుశాగ్రబుద్ధి రాణించినది. (శుక్రునితో) ఏమండీ, మీరేమంటారు ? మీకగ్రాసన మేర్పాటు చేస్తాము. పదార్థమంతా కొంచెము చల్లబడి ఉంటుంది- ఐనా మీరాకలి మొగమున ఉంటారు, వంట, రుచి-ఈవిషయములో అంతపట్టుదల ఉండదు. ఇదిమీకు సమ్మతమేనా ?—ఆర్బాటమేమీ ఉండదు, మేము సామాన్య గృహస్థుల మన్నసంగతి మీకు తెలుసును.

శుక్రా—నన్ను క్షమించండి-నేను మీమాట త్రోసివేయవలసి వచ్చి నందులకు చాలావిచా రిస్తున్నాను. ఇంకో-చోటికి నేను వెళ్ల వలసిఉంది- వాళ్లు నాకోసము వేచియుంటారు.

వసం—మీకెంత జరూరు పని ఉన్నాసరే. మామాట మీరు తోసి వేయ వల్లకాదు—ఇంతకూ మీకై వేచియున్న వారెవరు?

శుక్రా—ఇంకో శవము.

వసం—ఓస్సి! ఇంతేనా?, శవమేకదా? ఎక్కడికీ పారిపోలేదులెండి. మాఅందరికంటె శవమెక్కువా మమ్మి తోసివేయడానికి?

చల—సరి సరి. బోధపడ్డది. ఈయన వంటసాలలోకి పోవలెనని త్వర పడుతున్నాడు. ఏమయ్యా! అంతేనా?

వసం—అలాగైతే తీసుకొనిపోయి అరకప్ కాఫీ పుచ్చుకొని తిరిగీ రావచ్చును.

చల—ఆ. వద్దనలేదు. ఈయనకు ప్రియతమమైన పదార్థము కాఫీ. తెలిసింది. వరాలూ అత్తయ్య దగ్గర నీకు పని ఉండదు. కనుక ఈమునీశ్వరుణ్ణి వంటవసారాలోకి తీసుకొనిపోయి ప్రతి వస్తువూ కాస్తకాస్త పెట్టి కడుపు నిండించి తీసుకొనిరా. (శుక్రుని కడుపు మీద మెల్లగా తట్టి) ఇంకేమి. ఇదిగో మీభక్తురాలు వెంట పోయి నీకు కావలసిన వన్నీ కాస్త కాస్త రుచి చూచి రండి. దాని దగ్గర మీకు మొగమాట మక్కరలేదు.

వరా—అయ్యగారండో!

వసం—ఏమిటే?

వరా—అన్నపూర్ణమ్మగారు మాటాడలేకుండా ఉన్నారు.

వసం—ఏమీ! నోరు పడిపోయిందా?

వరా—ఔను బాబూ—ఇదే సూడండి నోరెల్లబెట్టి పెదవులు కదల్చడము చేతులాడించడమే కాని మాటాడలేకుండా ఉన్నదీయమ్మ ఎంచేతనో తెలుసుకోండి.

వసం—ఏమత్తా? మాతో ఏదో చెప్పదలచుకొన్నావా?

అన్న—(ఔనని తల ఆడించును.)

వసం—మాటాడలేవా? ఏదీ వింటాము మాటాడు. పక్షవాతము కాబోలు. త్వరగా పోతుందిలే.

అన్న—(మాటాడలేనని సంజ్ఞచేయును.)

వసం—ఎంచేత మాటరాదు? ఏమి కావాలి?(శుక్రునితో)ఇదే మయ్యా!

శుక్రా—ఈమెకు మాటరాదు. వాక్కు బంధింపబడ్డది.

వసం—మాట ఎప్పుడూరాదా? ఇప్పుడు మాటాడింది, మనమంతా విన్నాము.

శుక్రా—నా అసడ్డే దానికి కారణము. ఇటుపైని మాటరాదు.

వసం—మళ్లీ మాటాడించలేవా?

శుక్రా—మాటాడించను.

వసం—కొన్నాళ్లు పోయిన తరువాతనైనా?

శుక్రా—ఎప్పటికి యింతే.

చల—ఏమీా? బ్రతికున్నాళ్లూ మూగదవుతుందా?

శుక్రా—ఔను.

చల—ఎందుచేత?

శుక్రా—ఈమె చూసిన రహస్యాలు బైట పెట్టరాదు.

వసం—రహస్యాలా? ఏం రహస్యాలు?

శుక్రా—మృతులైనవారి రహస్యాలు.

వసం—చచ్చినవారి రహస్యాలా? ఏమి వేళాకోళము. మాతోనా హాస్యాలు? అయ్యా! ఈవేషాలు మాను. ఇప్పుడే మాటలాడింది, మేమంతా విన్నాము. కావలసినంత సాక్ష్యముంది. నీదారాత్మ్యము చేత ఆమె నోరు కట్టినావు. నీదురుద్దేశము మాకందరికీ విదితమైనది. నీయాటలు మావద్ద కట్టిపెట్టి తిరిగి ఈమె మాటాడేటట్లు చెయ్యి. లేదా—

# స్వవిషయము

ఇది మూడవసంపుటముయొక్క తుదిసంచిక

ఈ సంచిక రెండు నెలలక్రిందటనే వెలువడవలసియుండెను. రెండు మూడు సంపుటముల తాలూకు చందాలు రెండుమూడు నెలలకు సంవత్సరాంతము అగుననగా చాలావఱకు వసూలుఅయి యుండెడివి. ఈ మూడవసంచికయొక్క చందాలు ఆ ప్రకారముగా వసూలుచేసు కొనుటకు నాకు యితరచిక్కులవలన వీలుగాకుండెను. ఈ తుది సంచిక మే నెలలో చందాదారుల కందవలసియుండెను. మే జూను నెలలు పాఠశాలలకును కలాశాలలకును కచేరీలకును విశ్రాంతిదినములగుటచే, నేను వి. పి. చేసినచో చందాదారులు గ్రామాంతరము లందుండుటచే సరిగా చేరకపోవుటయు నవి త్రిప్పివేయబడుటయు తటస్థించును. నేను చాలావఱకు స్వయముగా వెళ్లి యీయదలిచినను చందాదారులు దొరకుట కష్టము. అందుచే జూలై నెలలో ప్రకటించినచో పత్రిక సరిగా చేరుటయు నాకు చందాలు సరిగా అందుటయు జరుగునని ఆ రెండు నెలలును ప్రకటన మానితిని. జూలై నెలలో నేను జ్వరపడి 10, 15 రోజులు జబ్బుగా నుండుటచేత జూలైలోకూడ మొదటనే వేయించ నశక్తుడనుగా నుంటిని. ఇన్ని హేతువులచే నిది యింత ఆలస్యమయి నది. చందాదారులు మన్నింతురుగాక.

నాలుగవసంపుటపు ప్రథమసంచిక సెప్టెంబరు మొదటివారమున ప్రచురింపబడును. ఈ సారి పత్రికయందు చాలామార్పులు చేయ నెంచుచుంటిని. వార్తలు, విమర్శనములు, అభిప్రాయములు మొదలగు ప్రకీర్ణవిషయములు కూడ చేర్చి సైజుకూడ కొంచెము వృద్ధిచేయనెంచి తిని. చందాదారులు వెనుకటివలెనే యాదరించి పోషింతురుగాక.

చిత్తగింపవలెను.

చె. వెంకటరామయ్య
సంపాదకుడు

రాజమండ్రి
30—7—37

# మాహేశ్వరి అర్ధశతి

విద్వాన్, పాలెపు వేంకటరత్నము



శా. యోగీంద్రుండగు రామకృష్ణుఁడొకచో యోగాఢ్యుఁడై నిశ్చలుం
డై గూఢంబగు సత్తపోనియతి నభ్యాసంబుఁ గావింపఁగా
నేగంభీర మహాస్వరూపమున మానీంద్రున్విలోకించితో
యాగంభీర స్వరూపదర్శనమె నేనాశింతు; మాహేశ్వరీ!

మ. సరసీజాసనముఖ్య సర్వసురసన్సంఘార్చితా! నీకుశర
త్సరసీజంబులఁ బూజసేయు నరుఁడీ సంసారఘోరాబ్ధి సం
తరణంబుం బొనరించు నశ్రమమునం ద్వద్భక్తిహీనుండు దు
ర్భరసాంసారిక రజ్జుబంధితుఁడగున్ భావింప మాహేశ్వరీ!

శా. జాతీచంపక మల్లికావకుళపుష్పవ్రాత ముందెచ్చి సం
ప్రీతిన్నీకు సుమార్చనంబు లిడెదన్ ప్రేమన్విలోకింపుమా,
జోతల్నీ కొనరింతు భక్తిమెయి నోశుంభాదిదైత్యాంతకీ
శీతగ్రావకుమారి! భీతహరిణాక్షీ! దేవి! మహేశ్వరీ!

శా. దాసాభీష్టప్రదంబు; శ్రీనిలయమున్; దారిద్ర్యనాశాఢ్యమున్;
నాసాగ్రస్థితమున్; నిమీలితము, నానందైకధామంబు; నై
వాసింగాంచిన యట్టి నీశుభదదృగ్వ్యాపార మేవేళలన్
నేసేవించెద నన్నుబ్రోవుము భవానీదేవి! మాహేశ్వరీ!

మ. తలమే? నిన్నుతియింప మానవులకో తల్లీ! భవానీశుఁడున్
జలజాతాసనుఁడున్, రమాపతియు; నీసాతత్యసేవావిధిన్
బలముం బొందఁగఁ జూచుచుందురఁటగీర్వాణుల్ త్వదంఘ్రిద్వయా
తలనమ్రాననులై భజింతురఁటనిన్ దధ్యాంబ; మాహేశ్వరీ!

## అన్నవరపు సత్యనారాయణస్తవము

శా. శ్రీమన్నైజ జగత్కుటుంబమును బ్రవర్ధిల్లఁగా, బ్రీతిన్, దంపతి
గ్రామంబుల్ సమకూర్చి కూరిమి, సదా కల్యాణముల్ సల్పు నీ
పై మాభక్తి నొనర్చుకొందుము నిటు సేవార్థకకల్యాణ, మో
స్వామీ! యన్నవరోచ్చరత్నగిరి దివ్యత్సత్యనారాయణా!

మ. పరగున్ వేంకటనాయకుండు కలిలోఁ బ్రత్యక్షదైవంబు నా;
నరసింహేశ్వరుఁ డించుమించుగ సమానస్కంధుఁడా స్వామి; క
య్యెరువుర్ విశ్రమ మొందఁగా నెలసితీవి కొండ సత్యంబుగా;
వరదా! యన్నవరోచ్చరత్నగిరి దివ్యత్సత్యనారాయణా!

మ. మనుజుల్ పెక్కురభీష్టదైవతములం బిల్కంగ నోరారఁ; నం
దను నప్పేరటఁ బిల్చుకొందురు; భవన్మాహాత్మ్యమేమందు? నిన్
జనసామాన్యపుఁ శ్రేష్ఠదైవమనుచుం జాటుం బ్రజాభిఖ్యలే
యనిశం; బన్నవరోచ్చరత్నగిరి దివ్యత్సత్యనారాయణా!

శా. మేలుల్ నూఱు గనంగఁగంటను బడన్ మేల్కొకుండంచుం బ్రమ; నీ
ప్రేమం బ్రత్యహమున్ బ్రవర్తిలు శుభంబుల్ వేనవేల్; గాన, ది
వ్యాలంకార రమాసమాకలన కల్యాణాప్తినీ, కార్తిమ
ర్త్యాలంబాన్నవరోచ్చ రత్నగిరిదివ్య త్సత్యనారాయణా!

శా. శ్రేయఃప్రాప్తికి లక్షమార్గకములు, లక్ష్మీశనాథ! యాదృచ్ఛికం
బాయుస్సౌఖ్య నిరామయ ప్రదఁ ద్వదీయన్ బంచరత్నస్తుతిన్
జేయం గంటి; వసూక్తులాదరమునం జేకో, మనంబొంద నా
ప్యాయం; బన్నవరోచ్చరత్నగిరి దివ్యత్సత్యనారాయణా!

కం. నరసింహోద్యాకృతులను
బరమాత్ముఁడు దాల్చి వెలయుఁ బర్వతముల నా
కిరవులగు నిట్టి భక్త
స్థిరోన్నత హృదయములనుచుఁ దెలుపుననంగన్.

---

## శ్రీ తా క ళ్యా ణ ము

కం. ఆమని మామిడి యెక్కఁడు
రాముఁడు కళ్యాణ పుష్పరథమెక్కఁ ; వనా
రామములను గలకంఠులు
గ్రామములందుఁ గలకంఠులు, పాడన్.

ఆ. వె. మేఘపుష్పవృష్టి మింటను బగలు, రే
చక్షువులను దన్పు చందమామ,
చైత్ర శుద్ధ నవమి జరుగునుత్సవములు
చాటు, రామరాజసౌఖ్యగరిమ.

ఉ. ఏయవి పద్మరాగమణులి వ్వనిపించెను సీతదోయిటన్,
బోయగమల్లెమొగ్గలనఁ బొల్చెను దామెవి రామునౌదలన్
గాయరుచిన్ మసారములకై వడి నే వలరారెజాఱుచున్,
శ్రీ యిడు మీకు నారఘువరేణ్యుని పెండ్లి సుపాణిముత్తెముల్.

ఉ. రామునిపుట్టు, పెండిలి, పరాక్రమ, మేల్బడి లోకరంజనం
బీమెయినంచుఁ జాటు, నవమీాద్యదినంబున నేగుఁ బెండ్లి రే ;
వ్యోమమగల్చు వాద్యముల, బుస్సని ధామ్మని యద్భుతారవా
క్రామిత దిక్కుడుంగ వివరంబగు పద్దెగబాణసంచులన్.

శా. ఆకౌసల్యకు రామచంద్రుఁ డుదయంబౌ వాసరంబాది, సీ
తాకళ్యాణము రాణ్మహేంద్రమున నుత్సాహంబునన్ సల్పెదర్
లోకుల్ వత్తురు వేనవేలు మహిమాలోకింప ; నేనుంగుపై
నేకావించిన సీతకున్ వరునకూరేగింపు, ప్రోల్ చాలునే?

---

## కవి తిక్కన

చం. పలుదెఱఁగైన రంగులను భాసిలు పువ్వులు ప్రోగువోసి య
య్యలరుల నేసుమంబె చటనందముఁ దెచ్చున యట్లుగ్రుచ్చి కౌ
శలమున, భక్తిఁదత్పరము స్వామికి నర్పణసేయు పూజరిం
దలఁచుకొనంగ, భారతకథం గవితిక్కన గూర్చెఁ దెల్గునన్.

ఉ. నన్నయకన్నతండ్రి చనినం జననా, డయి దిక్కు, పెంచెఁ ది
క్కన్న తెలుంగుబాస ; నతఁడాదట నాదుకొనంగఁ బెద్దదై
కన్నది పెక్కుబిడ్డలను, గాంచుచునున్నది ; గాన దానికా
యన్నయె ముఖ్యుడంచతని కార్యులొసంగిరి తాతసంజ్ఞ మున్.

ఉ. తిక్కన నన్నపార్యు వినుతించె రచించుచు భారతంబు ; నా
తిక్కనఁ బాపరాజు ప్రణుతించెను, రామకథన్ రచించుచో,
నెక్కువవారి లక్షణము లివ్వియశోధనముం గడించుటో ;
దక్కువవారి లక్కనము తద్విపరీతము కీరితింగనన్.

చ. తెలియదు వ్యాసభారతముఁ దెల్గొనరించిన యజ్వకేమి వే
ల్పులదగుబాస ; యంచను ప్రబుద్ధులు నేర్తురుపల్క ; బాహువుల్
గలుగని యాతఁడీఁదెఁ బెనుకంధియటంచొక పెద్దలాగునన్
వలిమల దాఁటఁజాలెను జవాలునఁ గాళులులేనివాఁడనిన్.

ఉ. ప్రాతలయందు నున్న్యలను భారతిన్రుం బ్రతిమలన్ విసుర్వకుల్
చూతురు పాతిభేదములు ; సోమున్న తెల్గున కేదిమూలమో !
ధాతయటంచు నాంధ్రకవి తిక్కనుతెల్గుదు భక్తియుక్తులై
చేతులు మోడ్చి తిక్కకవి సింహముదాటుట, గేరు సేశివున్.

చ. హరిహరనాథభక్తుఁడ ! మహాంధ్రకవీంద్రుల కాఱువేల భూ
సురులకు మూలపూరుషుఁడ ! సోమపుఁడా ! యుభయజ్ఞమిత్రుఁడా !
పరమపవిత్ర మౌను కృతపంచమ వేద సుధాపయోనిధిం
దరిచిన సుప్రసన్నవచనా ! కవితిక్కన ! బ్రహ్మ ! మ్రొక్కెదన్.

## కృష్ణదేవరాయలు

మ. జయలక్ష్మీశ్రుతిభారతుల్, ప్రియత నక్రాంత స్వయంగ్రాహ త
న్మయ సౌఖ్యామృతసాగరోర్మి చయసమ్యక్కేల నవ్యాపృతా
శయుఁ గావించిన కృష్ణరాయని బిడౌజః కాంతివైదుష్య దు
ర్యయశస్సాంద్రుఁడుఁ వలిత ద్రవిడ కర్ణాటాంధ్రుఁ డింపుండిలన్.

## రాజమహేంద్రవర కవిత్రయము

శా. శ్రీమన్నన్నయ రాజమహేంద్రమున వేసెన్ బంచమామ్నాయ స
న్నామం బ్రాఁకృతి మున్నె తెల్గునకు నేఁడా, డాయె వేయేండ్లు ; గో
దావరీ శిక్ష్య మొ, ఘోరమిసార మ్ము, యుటన్ దివ్యవృక్షమూలాన, నె
ర్వామిన్ లేక యొ, ప్రస్ఫురద్రసముతో యిద్దాం ఫలించున్ గృతుల్.

ఉ. వాదులు, వీర వాసు వ. సు. పద్యాలఁ బల్కరిమున్, ప్రబోధ చం
ద్రోదయ నాటకద్వితయ మున్పతిలన్, గుణతారతమ్య సం
వేదులు, రాజమహేంద్రపుఁ గవిత్రయమంచును, గాసి జాదివా
ద్యాదులు, లాది కాదు, లట రాదులు, సాదులు నేఁడు పల్కవుల్.

## శ్రీ లక్ష్మీనృసింహ కవి షష్టిపూర్తి



ఉ. రాజమహేంద్రపట్టణవరంబు, తెలుఁగున నాఁడె నన్నభ
ట్టాజయ భవ్యకావ్యమను సత్తరువోసిన బుద్ధి నూఁ ; కవి
ద్ర్భాజిత ; మిప్పుడున్ గృతిపరంపరగుమ్మెను ; షష్టిపూర్తియన్
వ్యాజమునన్ బయల్వెడలు సాత్త్వులు దాని నృసింహ సత్కృతుల్.

ఉ. కాలగతిం గ్రమంబుగను గాలిని గీలిని ధూళిగాక యొ
క్కాలము నిల్వ, భాషకుపకారముగాఁ, బురవాసులైన స
చ్ఛీలురు చిల్కమర్తి నరసింహకృతుల్ పదిసంపుటాల్గ, మే
లౌలిపి షష్టిపూర్తి తఱి నచ్చొడిరాతని సత్కరింపఁగన్.

ఉ. గుంపుగ నొక్కెడం గొడుకు గూఁతులు నల్వురుఁ గూడి కాసరా,
నింపధికంబుగా దెపిత? కివ్వితె మించి నృసింహ కబ్బముల్
సంపుటముల్గ నచ్చొడి యొసంగిరి కర్తకు షష్టిపూర్తి క
ర్హాంపు సభాజనంబుగను, రాజమహేంద్ర మహాజనుల్ కృతుల్.

చ. నవలలు, నాటకాలు, వచనంబునఁ బద్యమునన్, స్వతంత్రతన్
నవరసముల్ దొలంకఁ గవనంబున నల్లుటె కాక, భాష స
త్కవికృత దృశ్యముల్ తెలుఁగుగా నొసరించిన చిల్కమర్తి, వం
శవిబుధ రత్నమెల్లరకు మాన్యుఁడనన్ వ. సు. రాయఁడీసభన్.

ఉ. స్థానము పాపి, చూపు విధి జవ్వనమందె డఁ జిల్కమర్తి ల
క్ష్మీనరసింహమూర్తి కవికిన్ హృది ; గీడును మేలె యొక్కచో ;
నీనయనంపు మార్పున, సదృక్కున దృక్కునునై, యనూనలో
కానుభవంబుగాంచి, యతఁడద్భుతమేధఁ బొగడ్తఁగాంచెడున్.

ఉ. కంగున మ్రోగు కంఠమున, గాంగఝరిం బురుడింప సత్సభా
రంగములన్ బ్రసంగము విరామములే కొనరించునన్ బ్రశం

సంగను వాగ్మి, యీచిలకమర్తి నృసింహము తోటయర్వాపే
ర్వం గడపుం బికంబు, శతవర్షములున్ మనుతన్ ధృఢాంగతన్.

ఉ. ఎల్లరు షష్టిపూర్తి మహమెందులకై జరిగించుకొందురో,
యల్లఫలంబు, శ్రీహరికటాక్షమునన్ హితబంధుకోటిరం
జిల్లఁగఁ జిల్కమర్తి నరసింహునకున్ ఘటియిల్లుఁ గావుతన్ ;
బల్లవితంబుగాఁగనమె మాధవుప్రాపున వృద్ధభూజముల్ ?

ఉ. భానువిచిత్ర భానుసితభానుల భానులలోన, నేదియేఁ
గాని స్వకృత్యమైన యుపకారమొనర్పని కన్నులున్నల
క్ష్మీనరసింహమూర్తి కవికిన్, గురురాజసభన్ నిజాకృతిం
గానఁగఁ జేసినట్టి హరి, గావుతసాయము జీవయాత్రకున్.

క. దేశోద్ధారక బిరుదుం
గాశీనాథాన్వయుం జగద్విశ్రుతనా
గేశాహ్వయు షష్టి సభా
ధీశు నభవుఁ డాంధ్రపత్రికేశుం బ్రోచున్.

---

## రాజమహేంద్రకళాశాల దినోత్సవము

శా. శ్రీగోదావరి యన్నపానములెటే జిల్లాకు, నల్లాగునన్
దాఁగల్గింపను విద్య, బుద్ధి, నరకార్యాల్గింట, కేదీయుద
గ్భాగస్థాపిత రాజకీయము సమగ్రం బాకలాశాల, స
ద్వాగీశోరుకృపన్ బ్రవర్ధిలెడుఁగాతన్ రాణ్మహేంద్రంబునన్.

శా. ఉన్నారెల్లెడలన్ సుతుల్, ధర, బహూద్యోగంబులన్ ధన్యులై
యన్నల్ దమ్ములు నేటి కొక్కపరియే, నమ్మన్ గనన్ రా రాకో
యన్నీతిన్, దమినేఁడు ప్రత్నినవవిద్యార్థుల్ గుముల్ గూడి త
త్సాన్నిధ్యంబునఁ జెంగలించుటఁ, గళాశాలాంబ యుప్పొంగెడున్.

చ. వసుధను నీకు లేదు బహువల్లభదోషము, హూణసాహితీ
రసికుఁడు నిన్ను మున్ను గఁ గరగ్రహణం బొనరించె మెట్టకా
ఘనపుఁ దిరంపుమైన భవదంతికమందు వసించి నీచిరా
యుసు నతిఁడీను వేఁడుసతి ; మొందెనితోధిక శోభ కాలెజీ!

ఉ. సర్వకళాలయంబునకు స్థానము త్వన్నగరం బటంచు మున్
పర్వినవార్త రిత్తయయినన్, సరసాంధ్రసరస్వతీ ప్రసూ
త్పర్వములైన పర్వములభాసిలు కబ్బపు జన్మభూమి నీ
యుర్వఁట! యాంధ్రదేశమున కెల్లను మాళివిగావె కాలెజీ!

సీ. మేటిమొద్వర్డు పార్కెటాక్కుపు నుపకృతి
మతి సంస్మరించు సమాజమొకటి ;
బుధనుతస్థితిఁ బదేండ్లధిపుఁడౌనో. జె. కూ
ల్డ్రి మేల్మిఁ దలఁచు కూటంబదొకటి ;
ప్రతివత్సరము కళాభవనదినమని స
త్తీర్థుల సమకూర్చు సార్థమొకటి,
మఱి చరిత్రాదులు గఱపునుపాధ్యాయ
జనులఁ బ్రశంసించు సమితులిన్ని,
పగటు దేశికులెడ నిజభ్రాతలయెడ
నీయెడలఁ నెదఁ దలఁ గలనీకొమరుల
భక్తివిశ్వాసరక్తి సంపత్తిఁ బ్రజకుఁ
గాలెజీ! యిట్లువర్ధిల్లు కడుపుఁజలువ!

---

## ELECTRIC LIGHTS AND WATER WORKS.

### విద్యుద్దీపములు, నీటివసతులు.

క. క్షయమాఘ బహుళమునను వి
దియరాజేంద్రపురి మెఱపుదీపపు యంత్రా
లయమునకు మూలబంధ శి
లయనుచు సభజరిపినా రలఘుపౌరజనుల్.

ఉ. ముందుగఁ జంచలానిచయముం దదనంతర మంబుధారలా
నందముగా మహేంద్రుఁడు జనంబులకుం గలిగించుచుండు, నా
పొందికనే ఘటింపఁ దలపోసెనొ రాజమహేంద్రపట్టణం
బుం దొలుతన్ బెడంగు మెఱపుం దివియల్ పిదపంగొళాయులున్.

క. ఎఱజాలదిబ్బ లేచును
మెఱుంగు దీపాల మరలమేడలు; గోదా
వరిఁ బొందమ్మల నెఱయెర
కొఱకు దిగిన యంచ లంద్రు కొంగలనింకన్.

మ హా రా జ వి క్ర మ దే వ వ ర్మ.

---

మ. గుణాలుబ్ధంబు లటంచు సంపదలఁ జేరొక్కొంద్రజార్య; లమ్మాటయం
దణుమాత్రంబును లేదు సంశయము; నేఁడయ్యెన్ మహారాజు స
ద్గుణుఁడౌ విక్రమదేవవర్మ జయపూర్వ(శ్రీ)ఖ్యాత రాజ్యాసకుం;
బ్రణుతించున్ వ. సు. రాయుఁడీశు హితువర్మన్ జేయదీర్ఘాయుష్మన్.

మ. అనుచుంద్రేగద కోవిదుల్ "సుకవితాయద్యస్తిరాజ్యేనకి"
మ్మనుచున్; విక్రమదేవవర్మకిట మున్నాద్యంబు చేకూరుటల్
జనసామాన్య మెఱింగినట్టిదియ; ప్రాజ్యంబైన రాజ్యంబు నా
యనకుం దేవుఁడనుగ్రహించెనిప్పు; డింకారాజు భోజుండెయగా.

మనయింటికే వచ్చెను. పద పద యని పయన, మయ్యెను. సింగన్న మహాకోపముతో "నేనుమాలవాడను నీవు మాదిగవాడవు మొండి తొత్తుకొడకా! పిల్లమీాయింటికి వచ్చునా? పిల్లను రంగం మోల్మో నుల కైన బంపుదును గాని నీయింటికి బంపను. ఈవెధవనాగన్నతో కాపురము జేయుటకంటె తలగొరిగించుకొని యింటనే కూర్చుండుట మంచిది." శేషయ్య "నీయిష్టము వచ్చినట్లు పేలుకో" యని మేనల్లుని తీసుకొని మనుగుడుపులు ముగియకుండగనే వెడలి పోయెను. ఈమనుగుడుపుల ముచ్చట్లు తోకలపూడిలోను గొల్లపాలెములోను గూడ స్త్రీలు పురుషులు గుంపులు గుంపులుగ గూడి వింతవింతలుగ జెప్పుకొన జొచ్చిరి.

---

## పదునెనిమిదవయుల్లాసము



ఆంధ్ర దేశమున ప్రతిగ్రామమునకు నొక దేవత యుండును. అది గ్రామదేవత యనబడును. దానికే అమ్మవారు అని పేరుగూడ గలదు. ఈదేవత శూద్రజనుల చేతనే ఆరాధింప బడుచుండును. ఆదేవతాలయము గ్రామమునకు వెలుపలనుండును. అర్చకులు కుమ్మరులు. ఆ దేవతా మహిమలు కొనియాడి పంబవాయించువాడు పంచముడు. ఆ దేవత జాతరలలో మాలలు మాదిగలు డప్పులు వాయింతురు. వేద సంబంధమైన మంత్రములు గాని పూజలుగాని యీదేవతలకు లేవు. బ్రాహ్మణాదులు విశేషముగ దానిని సేవింపరు. అంత్యవర్ణముల వారే యీమొకుత్సవములు జాతరలు చేయుచుందురు. వారే కోళ్లను మేకలను గొఱ్ఱెలను దున్నపోతులను బలియిచ్చుచుందురు. అదిశూద్రజన సేవిత మైన దేవత యనుటకు గొప్ప తార్కాణ మొకటి గలదు. ఈ దేవతలకు సంస్కృత నామము లెక్కడను లేవు. పసుపులమ్మ, పల్లాలమ్మ, మరిడమ్మ, మామిళ్లమ్మ, నూకాలమ్మ, పోలేరమ్మ, మెంటాలమ్మ మొదలయిన నామములే తరుచు వినుచుందుము. బ్రాహ్మణులు మొదలయిన అగ్రజాతులవారు తమకాపదరాకుండ జేయుమని మ్రొక్కుకొందురు గాని దగ్గరకు బోయి యభిషేకాదులు జేసి యర్చింపరు. ఈగ్రామ దేవతలకు విశూచి మశూచి మొదలయిన జాడ్యములు తెప్పించి జనులను చంపుకొని పోవునట్టి మహాశక్తి కలదని ప్రతిగ్రామమందు జనులకు విశ్వాసముగలదు. అందువలన గలిగిన భయమువలన వారు గ్రామ దేవతలకు విశేషభక్తితో నైవేద్యములు కానుకలు నర్పింతురు.

రాయకుదురుగ్రామదేవత మామిళ్ళమ్మ యని పాఠకమహాశయుల కిదివరకే తెలియును గదా! మామిళ్ళమ్మ భీమవరంతాలూకాలో తూర్పువైపున నున్న గ్రామములలో నున్న దేవతలన్నిటికంటె నెక్కువ ప్రసిద్ధి గలది. భీమవరము లోని గొల్లలమ్మకన్న మంచిలి పల్లాలమ్మకన్న మరియేయితర గ్రామ దేవతలకన్న మామిళ్ళమ్మ యత్యధిక ప్రభావము గలదని రాయకుదురు గ్రామవాసులకే గాక చుట్టుప్రక్కల పల్లెయలలోనున్న నెల్లవారికి మిక్కిలి నమ్మిక గలదు. మామిళ్ళమ్మకు సంవత్సరోత్సవము ప్రతిసంవత్సరమున జ్యేష్ఠమాసమున బహుళపక్షమున నమావాస్యనాడు జరుగును. ఆజాతర నాయుత్సవముల గన్నులార జూచి దేవతకు మ్రొక్కి సేవించి యామె యనుగ్రహము బడయవలయునని పరిసర గ్రామములలో నున్న జనులు ముఖ్యముగ స్త్రీలు వందల కొలది యానాటికచ్చటం జేరుదురు. సింగన్న భార్యయైన మామిళ్ళమ్మకు రాయకుదురు పుట్టినింటి వారిగ్రామమగుటచే ప్రతి సంవత్సర మమ్మవారి యుత్సవమునకు నామె బిడ్డలతీసుకొని పోవుచుండును. దుందుభి వివాహమయిన మరుచటి సంవత్సరమున మామిళ్ళమ్మ యొక్క జాతరకు రమ్మని తండ్రి పిలుచుటచే మామిళ్ళమ్మ ప్రియపుత్రిక యైన దుందుభిని తోడ్కొని రెండు దినములకు ముందే పయనమై పోయెను. అమావాస్యకు మూడుదినములు ముందుగనే దేవతోత్సవములు రాయకుదురులో ప్రారంభమాయెను. కుమ్మరవాండ్రు పెద్ద పెద్ద పరికిణీలు కట్టుకొని కాళ్ళకు గజ్జెలు కట్టుకొని నెత్తిమీద నిత్తడి ఘటములు పెట్టుకొని చేతులలో వేప రొట్టలు పట్టుకొని ప్రతియింటి ముంద ర నిలుచు చుండిరి. వినువారి చెవులు బ్రద్దలగునట్లు ఒకరిమాట ఒకరికి వినపడకుండునట్లు మాదిగలు చెడత్రాగి డప్పులు వాయించుచుండిరి. ఘటముల నెత్తుకొనిన కుమ్మరులు కాళ్ళగజ్జెలు ఘలుఘల్లు

మనునట్లు నృత్యము చేయుచుండిరి. ప్రతిగృహమునుండి ఆడువాండ్రు బిందెలతో నీళ్లు తెచ్చి యమ్మవారికి వారుపోయుచున్నామని కుమ్మరుల కాళ్లమీద పోయుచుండిరి. అది గ్రామదేవతకు మిక్కిలి ప్రీతియని వారి యభిప్రాయము. తరువాత పళ్లెములలో తవ్వెడో మానెడో బియ్యము పోసుకొనివచ్చి యమ్మవారికి యిల్లాండ్రు సమర్పించిరి. అనగా కుమ్మరి చేతి కిచ్చిరి. ఘటవాహకుడైన కుమ్మరి బియ్యమును తనతలమీద నున్న ఘటమునకు నైవేద్యముబెట్టి యాతండులములను ప్రక్కనున్న కావటి వానికిచ్చి దేవతాప్రసాదమని కొంచెము పసుపు నాలుగువేపాకులును పళ్లెములో బెట్టి యిల్లాండ్ర కందించుచుండెను. అంగనలు చేతులు జోడించి యమ్మవారికి మ్రొక్కి లోపలకు బోవుచుండిరి. ఈవిధముగ మూడుపగళ్లు దేవతను తీసికొని కుంభకారులు గ్రామసంచారముచేసి యష్టాదివర్ణములవారిదగ్గిర బియ్యము తీసికొనిపోయిరి. రేపుతీర్థమనగా యానాటిరాత్రి మామిళ్లమ్మకు గొప్ప జాతర జరిగెను. జాతర యనగ నూరేగింపుటుత్సవమని చెప్పవచ్చును. క్షుద్రజాతులవారు వేలకొలది కల్లుసారాయములుత్రావి యాయుత్సవములో పాల్గొనిరి. మామిళ్లమ్మ గొప్ప దేవత యగుటచే యావరకు మ్రొక్కుకొన్నవారలాగ్రామము నుండియు పరగ్రామముల నుండియు బలియిచ్చుటకై జంతువులను దీసికొని వచ్చిరి. తక్కినయూళ్లలో గ్రామదేవతలకు మేకలు కోళ్లు మొదలయినవే బలియొసంగబడును గాని మామిళ్లమ్మకు దున్నపోతునే బలియిత్తురు. దున్నపోతుకు మొగమునకు కాళ్లకు పసుపు రాసిమొగమున కుంకుమ బొట్టుపెట్టి యానిర్భాగ్యపుజంతువును దేవతాలయమునకు ముందు విగ్రహమునకు ఎదురుగ నిలువబెట్టిరి. దయాదాక్షిణ్యములులేని హృదయమును గొంకుజంకులేని మనస్సునుగల యొక భయంకరాకారుడు చేత మిక్కిలి పదునుగల ఖడ్గమును పట్టుకొని జనులందరు

జయజయ ధ్వనులిచ్చుచుండ డప్పులు మ్రోగుచుండ దానిశిరస్సు నొక్క యేటున ఖండించెను. తల తెగి గజముదూరమున పడెను. దున్నపోతు నేలబడి రెండుఘడియలు గిజగిజ తన్నుకొని ప్రాణములు విడచెను. జంతువు బలాత్కారముగ జంపబడినందుకు జాలిపడువా రొక్కరు లేరైరి. ఆజంతువు శరీరమునుండి కారిననెత్తురుతో దేవతా హృదయము చల్లబడునని యెల్లవారి విశ్వాసము. ఎన్నికోళ్లు తెగినవో ఎన్నిమేకలు జచ్చినవో చెప్ప శక్యముగాదు. ప్రతిఫలాపేక్ష గలవారు క్రూరకృత్యములు జేయునప్పుడు జాలి నొందుదురా? తన పొట్ట రుచివంతములైన మాంసముతో నింపుకొన దలచువాడు కోడిని మేకను జంపుటకు వెనుదీయునా? మాంసము నమ్ముకొని ధనమార్జింప దలచిన కటికవాడు జంతువులమీద జాలి జూపునా? తనవినోదము నకై వేటలాడువాని హృదయము ప్రాణభీతిచేత ఎటెటో పరిగిడు చున్న లేళ్లను పక్షులను జూచి కనికరముచే కరగునా? యజ్ఞముచేసి మరణానంతరము రంభాసంభోగము సంపాదింపవలెనని యువ్విళ్లులూరు వేదపారగుడైన బ్రాహ్మణుడు తననిమిత్తము కుమ్మరులు నవరంధ్రములు మూసి మేకను హింసించుచుండగ నయనోత్సవముగ జూచునే గాని విచారించునా? యుద్ధమున జయలక్ష్మీ పాణిగ్రహణము చేయ దలంచి పరదేశములనాక్రమింప సంకల్పించిన శూరుడు తనకెన్నడు నపకారమెంతమాత్రము చేయని పరసైనికుల ప్రాణముల దీయుటలో నుత్సాహమొందునేగాని కటకటం బడునా? అట్లే గ్రామదేవతానుగ్రహమునకు పాత్రములు గాదలచిన గ్రామములలోని జనులు నిష్కారణముగ వేలకొలది ప్రాణములు బలియగు చుండుటకు దుఃఖింతురా? అమ్మవారి ప్రభావమునకు వెరచి వారట్లు నిర్దయులైరి. గ్రామదేవతకు విశేషప్రభావము గలదని పెద్దలవలన వారువిని జంతుబలిచేత

నామె ప్రీతురాలగునని యేసంశయమును లేక గుండియలురాళ్లు జేసు
కొని యాఘోరకృత్యమును జూచి యానందించిరి. అమ్మవారికి నిజ
ముగ మహిమ యున్నదో లేదో వితర్కించి విచారించువారు ఆజను
లలో లేనేలేరు. ఆమెకు మహిమము గలదా లేదా యని శంకించినంత
మాత్రముననే యామె యమాంతముగ నింటిమీదబడి యందరిని
విరుచుకొని తినునని యాస్త్రీపురుషుల నమ్మిక. క్రైస్తవమతబోధకులు
వచ్చి యాతిరునాళ్లలో గ్రామదేవత కేప్రభావము లేదనియు నామె
యనుగ్రహము సంపాదించుటకై నోరులేని జంతువులను నిష్కారణ
ముగ జంపగూడదనియు బోధించిరిగాని వారిమాటలను శ్రద్ధతో
నాలకించినవారేలేరు. కొందరు వారిని పరిహాసము చేసిరి. వారిచ్చిన
కాగితములను కొందరు వారియెదుటనే చింపివేసిరి. వారుబోధించినట్లు
తాముగూడ యేసమాటలతో పదిమందినిజేర్చి బోధించి కొందరు
వారిని వెక్కిరించిరి. విశూచి మశూచి మొదలయినవి గ్రహణిజ్వరము
మొదలయిన వానివలెనే రోగములన్నియు గ్రామదేవతా కల్పిత
ములు కావనియు నిజముగ దేవతా ప్రభావమేదైన యెడల నామెను
మిక్కిలి శ్రద్ధాభక్తులతో నారాధించునట్టి క్షుద్రజాతులకే యారో
గము లేలరావలయు ననియు క్రైస్తవులు గట్టిగ నొక్కిచెప్పిరి.
కాని యామాటలు నోరుగాలిలో బెట్టిన దీపమువలె పనికిరాక
పోయెను. ఆయుత్సవ దినమున నమ్మవారికి కొందరు ఇత్తడి ఘటము
లను కొందరు వెండిఘటములను సమర్పించి మ్రొక్కులు దీర్చుకొనిరి.
సింగన్నభార్య మామిళ్లమ్మ తన మగనికి జబ్బుచేసినప్పుడు మ్రొక్కు
కొన్న మ్రొక్కు చెల్లించుకొనుటకై దుందుభిని తీసికొని యాలయ
మునకు పోయి ఇత్తడి ఘటమును దేవతకర్పించెను. మామిళ్లమ్మ
యాలయము రాయకుదురు గ్రామమున తూర్పున నున్నది. జ్యేష్ఠ

బహుళామావాస్యనాడు గుడిచుట్టూ జనమహాసముద్రము నిల్చి యుండెను. దేవతమీఁది భక్తి పెంపున వచ్చినవారు కొందరు; కాలము వినోదముగ వెళ్లబుచ్చుటకు వచ్చినవారు కొందరు; దొంగతనములు చేయుటకు వచ్చినవారు కొందరు; దొంగలను బట్టుకొనుటకు జేరిన పోలీసువారు కొందరు; అమ్మవారి మహిమలు చెప్పుకొనుచు కొందరు ప్రొద్దు పుచ్చిరి. అమ్మవారి గుడిగోడకు ఒక చిన్న కన్నము కలదు. ఆకన్న మేమిటని యొకకాపు చెంతనున్న యొకబ్రాహ్మణుని అడిగెను. ఆబ్రాహ్మణు డతని కిట్లనియె. "పూర్వకాలమున మాయిల్లమ్మ నర బలి కోరుచుండెడిది. ఏయేట జ్యేష్ఠబహుళామావాస్యనాడు తనకు మనుష్యుని బలి యీయవలయు ననియు లేకున్నచో గ్రామస్థుల నందర నొక్కసారి చంపివేయుదు ననియు నామె యొక చాకలి దానికి పూని చెప్పినదట. గ్రామవాసులందరు సభచేసి యింట్లవరుసను నేఁడాదికొక్క మనుష్యుని బలి నిమిత్తము బంపుటకు నిశ్చయించిరి. అది వంతు ప్రకారము జరుగుచుండెను. ఒక యేఁడు వంతొక గొల్లవానికి వచ్చెను. ఆగొల్లవాఁడు పెందలకడలేచి యమావాస్యనాఁడు కాల్యకృత్యముల దీర్చుకొని తలయంటుకొని క్రొత్తబట్టలు కట్టుకొని మొగముమీఁద కుంకుమబొట్టు పెట్టుకొని పాదములకు పసుపు పారాణి రాచుకొని వేపరొట్ట చేతబుచ్చుకొని యమ్మవారి గుడికి బోయెను. వానితల్లి దండ్రులు చుట్టములును గట్టిగ నేడ్చినపక్షమున నమ్మవారికి గోపము వచ్చునని దుఃఖము దిగమ్రింగి వానిని బంపిరి. గొల్లవాడును దేవా లయము ప్రవేసించి తలుపులు గడియలు వైచి దేవతకు సాష్టాంగ నమస్కారము చేసి నిలువబడెను. అప్పుడా దేవత వానిం జూచి యాలయమంతయు నలికి వేయుమని యాజ్ఞాపించెను. "అమ్మా, నేను మగవాఁడను ఎన్నఁడును నేనిల్లలుక లేదు అలుకుట నాకు తెలియదు"

యని యాగొల్ల బదులు చెప్పెను. అప్పు డమ్మవారు మనుష్యరూప మున ప్రత్యక్షమై "నేనలికి చూపెదను చూడు" మని వంగి యులుకు గుడ్డ చేత బట్టుకొని తన యాలయములుక నారంభించెను. అంతట గొల్లవాడు దేవత మనుష్యబలి గోరుచున్నందులకు మిక్కిలికోపించి వంగియున్న యమ్మవారి కొప్పు గట్టిగ నెడమచేతితో బట్టుకొని తన చేతిలో నున్నదుడ్డుకఱ్ఱతో నాదేవత వీపుమీద పెడేలు పెడేలుమని కొట్ట నారంభించెను. ఆదెబ్బల కాగలేక మామిళ్లమ్మ గుడికోడ బ్రద్దలు చేసికొని పారిపోయెను. ఆమె పారిపోయిన కన్నమే యిది." ఆకథ విని కాపు చిరునవ్వు నవ్వి "దేశములో నందరిని జాడ్యములు తెప్పించి చంపగల యమ్మవారు యొకగొల్లవానిచేత దెబ్బలు తిని పారిపోయెనా ఆమె మహిమ లెక్కడికి పోయినవండి" అని యెగ తాళిగ పలికెను. "అయ్యో తప్పుతప్పు నవ్వకు యెగతాళి చేయకు. మొండివాడు రాజుకన్న బలవంతు డన్నమాట వినలేదా? ఆలాగే దేవతలు గూడ మొండివాండ్రకు జంకుదురు. పూర్వమొక తురక గ్రామదేవతమీద కాలు పెట్టెనట. ఆకాలు తీయించుమని యామె పూజారిని బలవంతపెట్టెనట. మన దేవతల మహిమ లిట్టివే. తిరుపతిలో నున్న శ్రీవెంకటేశ్వరస్వామివారు తనకు మ్రొక్కుకొన్న జనులను మ్రొక్కులు చెల్లించువరకు బెత్తములతో కొట్టి వారికనేక రోగములు కల్పించి బాధించునట. అర్థరాత్రము వేళ తనగుడిలో ప్రవేశించి తన నగలను తనకిదివరకు భక్తులు సమర్పించిన ధనమును దొంగిలించుకొని పోయిన మేటిదొంగల నేమియు జేయలేకపోయెను. అయినను మనము దేవతల నెగతాళి చేయగూడదు. ఆదేవతల కాగ్రహము వచ్చెనా మన వంశములు నాశనమొందును" అని యాబ్రాహ్మణుడు ప్రత్యుత్తర మిచ్చెను.

కొందరు దొంగలు స్త్రీల మెడలలో నున్న నగల తెంపుకొనిరి. నానుకోళ్లు మొదలగు వానిని కత్తెరతో కత్తిరించి యపహరించిరి. "ఓలమ్మో నాపట్టెడ పోయిండే నానుకోళ్లు యెరువు తెచ్చుకొన్నానే దానివెల క్రింద వార్కికి ముప్పది రూపాయలు దండుగ యిచ్చుకోవలెనే" యని కొందరు స్త్రీలేడ్చిరి. "అమ్మయ్యో, మాపిల్ల తప్పిపోయినది యేమైనదో గదా!" యని విలపించుచు బిడ్డను వెదకు కొనుచు కొందరు తిరుగులాడిరి. "దొంగదొంగ పట్టుకొను" డని ఒకని వెనుక పదుగురు పరుగులెత్తిరి. "నాకు సరిగ నైవేద్యములు జరుగ లేదు మీకింతపొగరా! చూడండి మిమ్ములనందర మ్రింగివేసెద" యని ఒక యెరుకల పడతి తలవిరియ బోసుకొని చేతులతో వేపరొట్ట బుచ్చుకొని శివమాడ జొచ్చెను. ఆమెచుట్టూ పదుగురు జేరిరి. ఒకరు కడవెడు నీరభిషేకము జేసిరి; ఒకరు పండ్లు పసుపు కుంకుమ దెచ్చి యిచ్చిరి. శాంతింపుమని కొందరు కాళ్లమీద బడి బ్రతిమాలిరి.

గుడివెనుక నొకపొలములో నొక కొందరు కోడిపందెములు వేయ జొచ్చిరి. చిరకాలము లెస్సగా మేపి యుద్ధములు నేర్పి కొందరు లాభములు సంపాదింప వలెనని కోళ్ళను తీసుకొని వచ్చిరి. కోళ్ళ యారెలకు పదునైన కత్తులు కట్టి కయ్యమునకు పురికొల్పి రంగములో వదలిరి. వందలకొలది జనులు చుట్టుప్రక్కల నిలిచి లేనికోపము దెచ్చుకొని పరస్పరసంహారము చేయదలచి పోరాడుచున్న యాకోళ్ళను జూచి యానందింప జొచ్చిరి. వందలకొలది రూపాయిలు పందెము లొగ్గి కోళ్ళ యజమానులూ పోరాటములు జరుపు చుండుటచే గెలిచిన వాడు మహానందమొందిరి; ఓడినవాడు తనకోడిని తిట్టుచూ తన యదృష్టమును నిందించుచు నేడ్చుచు పోయెను. గెలిచినవాడు మీసములు దువ్వుచు పందెపుసొమ్ము పుచ్చుకొని హాయిగ గృహమునకు

పోయెను. మరియొక ప్రక్కను జూదమునందారి తెరిన మేటిజూదరులు కాసులు పందెములొగ్గి జూదమాడ జొచ్చిరి. పోలీసువారు కోడిపందె ములు వేసినవారి వద్దను జూదగాండ్రవద్దను దమకు రావలసిన పను ములు స్వీకరించి యావలకు దాటిరి.

ఆయమ్మవారి యుత్సవమునకు మిఠాయి దుకాణములు, కంచర దుకాణములు, బట్టల దుకాణములు, బొమ్మలు మొదలయిన యాట వస్తువుల దుకాణములు చాల వచ్చును. ఊరంతయు మిక్కిలి సందడిగ నుండును. కంచరదుకాణములు, బట్టలదుకాణములు ఉత్సవము జరిగిన తరువాత రమారమి నెలరోజులవరకు ఉండును. ఉత్సవదినములలోను తరువాతను గూడ పరిసర గ్రామవాసులు కంచములు, పళ్ళెములు బిందెలు, చెంబులు, వస్త్రములు కొని తీసుకొని పోవుచుందురు. కావల సిన వంట సామానులు పనిముట్లు మొదలయినవి దూరప్రదేశము పోకుండ నిచ్చట దొఱకుచుండును. అందుచేత నీయుత్సవములు వ్యాపా రమునకు కూడ సాయపడుచుండును.

---

పంచోత్తర నవత్యుల్లాసము



అమ్మవారి తిరునాళ్లలో దుందుభి తనకొక మంచిచీరకొని పెట్టుమని తల్లి నడిగెను. మరియొకప్పుడు కొని పెట్టుదునని తల్లి యెన్నోవిధముల బ్రతిమాలి చెప్పినను వినక దుందుభి గట్టిపట్టు పట్టెను. అందుచేత మాణిక్యమ్మ కూతురు ముద్దు చెల్లించుటకై యామెను వెంట బెట్టుకొని బట్టల దుకాణమునకు వెళ్లెను. పాలకొలను గ్రామము నుండి వచ్చి ముగ్గురు నలుగురు బట్టల వర్తకులు దుకాణములు బెట్టిరి. మాణిక్యమ్మ కూతురుతో గలసి యాదుకాణము లన్నిటికిబోయి వారిదగ్గర నున్న చీరల నన్నిటిని చూపుమని కోరి సామాన్యపు చీరలను విలువగల చీరలను గూడ చూచెను. నల్లశరీరము మీద నెఱ్ఱనిచీర బాగుండునని కొంతసేపు తెల్లని కోక బాగుండునని కొంతసేపు చిలుకల చీర బాగుండునని కొంతసేపు పసుపుపచ్చని చీర బాగుండునని కొంతసేపు దుకాణముల ముందర మాతాపుత్రికలు చర్చించుకొనిరి. వారివితర్కములు విని దుకాణదారులు విసుగు జెంది "ఏదికొన దలచుకున్నారో యది యింటివద్ద నిర్ణయించుకొని యిక్కడకువచ్చి కొనవలెనుకాని మాదుకాణము ముందర వినువారికి తలనొప్పి వచ్చునట్లు పెద్ద గొడవ చేయవచ్చునా! ఇవి వేడుక బేరములు గాని కొనదలచిన బేరములు గావు వెళ్లండి" యని మందలించిరి. తల్లికూతుళ్లు దుకాణదారులతో వాదము చేసి కయ్యమాడిరి. చిట్టచివరకు ఒకదుకాణదారునియొద్దకు బోయి మాణిక్యమ్మ పువ్వులుగల యెఱ్ఱచీర యొకటి పదిరూపాయలకు బేరమాడెను. ముప్పది రూపాయలు విలువగల జరీచీర కొనిపెట్టుమని దుందుభి పట్టుబట్టెను. పదిరూపాయల చీర మాణిక్యమ్మ చేత బట్టుకొనెను. ముప్పది రూపాయలచీర దుందుభి చేత బట్టుకొనెను.

పదిరూపాయలు వర్తకునకిచ్చి మామిళ్లమ్మ పువ్వులచీర పుచ్చుకొనెను. అంతలో నలుగురైదుగురు కాపు పడతులు చీరలు కావలయునని బేరము చేయ జొచ్చిరి. వర్తకు డాసందడిలో నుండగ దుందుభి ముప్పదిరూపాయలచీర పట్టుకొని తల్లికంటెముందుగ యింటికి బోయి మాతామహుని యింట యాచీర బియ్యపు గూనలో బెట్టెను. ఆ విషయమై మామిళ్లమ్మగాని యామెతల్లి గాని యెరుగరు. బేరములు గొడవ ముగియగానే వర్తకుడు ముప్పది రూపాయలు చీర దుకాణమున లేకపోవుట కనిపెట్టి వెదకుకొని నలుగురితో జెప్పి గొడవజేసెను. దుందుభి యాచీర పలుమారు పట్టుకొని కొనిపెట్టుమని తల్లిని యడుగుట యితడెరుగును గావున యాపిల్ల యాచీర సంగ్రహించుకొని పోయినదని యాతడనుమానించెను. కాని యీపిల్ల పొరుగూరిదో యాయూరిదో యతడెరుగక భోగట్ట జేసెను. అక్కడ జేరిన మనుష్యులలో నొకడు ఆపిల్లను నేనెరుగుదును. అప్పుడు నేనుగూడ చీర బేరమునకు వచ్చితిని ఆపె మాయూరిలో లంకమరిడయ్యగారి మనుమరాలు ; దాని పేరు దుందుభి యని చెప్పెను. వెంటనే వర్తకుడు తనయంగడిమీద నమ్మకగల సేవకుని గూర్చుండ బెట్టి మరిడయ్యగారి యింటికి నొకరిద్దరు మధ్యవర్తులను తీసుకొని పోయి మరిడయ్యను బిలిచి "నీమనుమరాలట నల్లగ లావుగ ఉండును మాచీర మాతో జెప్పకుండ దెచ్చినది. ఆమెను మందలించి మాచీరె మాకు యిప్పించండి" యని యడిగెను. తాత దౌహిత్రిని బిలిచి నీవు చీర దెచ్చితివటే యని యడిగెను. అడుగుటయు దుందుభి గుండెబాదుకొని "అయ్యో అయ్యో నేను తేలేదు" అని గొంతెత్తియేడ్చెను. మామిళ్లమ్మగూడ "మాపిల్లయటువంటి

పను లెరుగదు ఇటువంటి యన్యాయముండునా ? ఎవరు తీసికొన్నారో మేమెరుగము ” అని యొట్టు పెట్టుకొని యేడవ నారంభించెను. మరి డయ్యకూడ షావుకారుతో గొంతుచించుకొని కలహమాడెను. వారితో వాదము కార్యము కాదని వర్తకుడు పోలీసు వారితో ఫిర్యాదు చేసెను. పోలీసు హేడ్డు మరియిద్దరు జవానులు మరిడయ్యగారి యిల్లు సోదా చేసిరి. యేపెట్టెలోను చీరగనపడలేదు. అటకమీద గూడ వెదకిరి గాని యచ్చటను గనపడలేదు. కుండమైల పడిపోవును గావున దానిని ముట్టుకొనవద్దని లబలబ మొత్తుకొని మరిడయ్య ఎంతవేడుకొన్నను వినక హేడ్డు బియ్యపుగూన వెదకెను. అందులో చీరకనబడెను. వెంటనే హేడ్డు దుందుభిని పిలిచి “ నిన్ను అరెస్టు చేసినాను నడు పోలీసు స్టేషనుకు నడు ” అని గట్టిగ పలికెను. మామిళ్లమ్మయు నామెతల్లియు దుందుభియు గొంతులెత్తి పెద్దపెట్టున నేడువ నారంభించిరి. మరిడయ్య భయమున గజగజ వడకుచు కన్నీరు విడచెను. చుట్టుప్రక్కలవారు పదిమంది జేరిరి. అందు మరిడయ్య బంధువుడు మరిడయ్యను దూరము బిలిచి “హేడ్డుగారికి పోలీసు జవానులకు ఏదైన కొంత పారవైచి పరువు దక్కించుకొనవయ్యా లేనిచో కొంపమునిగి పోవును దొంగసొమ్ము దాచినందుకు నీకు గూడ శిక్షపడును” యని హితోపదేశము చేసెను. అప్పుడు చేతిలో డబ్బులేకపోవుటచే మరిడయ్య భార్యమెడలో నున్న నాను ఒక వర్తకునియొద్ద తాకట్టుపెట్టి డెబ్బదిరూపాయలు తెమ్మని యాబంధువునితో చెప్పెను. ఈలోపుగ మరిడయ్య హేడ్డుగారిని గది లోనికి బిలిచి రెండుకాళ్లు బట్టుకొని “ మహాప్రభూ రక్షించండి గౌరవము కాపాడండి పిల్ల చీర దొంగిలించిన సంగతి మేమెరుగము. దాని యత్తవారు విన్నపక్షమున దాని కాపురము చెడిపోవును కొంప నిల

పండి" యనియేడ్చుచు బ్రతిమాలెను. హేడ్డు చాల బెట్టుసరి మాటలు పలికెను. అంతలో బంధువుడు వస్తువుమీద డెబ్బది రూపాయలు తెచ్చి మరిడయ్య చేతిలో బోసెను. అందులోనుండి యాబదిరూపాయలు హేడ్డునకును జవానులకు చెరి పదిరూపాయలను యిచ్చి చంద్రునకు నూలుపోగన్నట్లు మీకు స్వల్పముగ యిచ్చినాను పేదవాడను రక్షించండియని మరల బ్రతిమాలెను. ఎట్లో కష్టముమీద నాహిరణ్యశ్రాద్ధముతో పోలీసు దేవతలు తృప్తిపొంది చీర సావుకారుకు యిప్పించి దుందుభికి బంధులకు హానిచేయకుండ వెడలిపోయిరి.

ప్రథమభాగము సంపూర్ణము



# దుందుభి

## (ప్రథమ భాగము)

హాస్యరసప్రధానమగు నవల

చిలకమర్తి లక్ష్మీనరసింహకవి

ప్రణీతము

భాషామణినుండి పునర్ముద్రితము

మొదటికూర్పు 200

సరస్వతీ పవర్ ప్రెస్ నందు ముద్రితము

రాజమహేంద్రవరము

# పీ ఠి క

నాటకములకువలెనే నవలలకుఁగూడ నేదో రసము ప్రధానముగ నుండవలెను. సాధారణముగ నవలలన్నిటిలో శృంగారరసము వర్ణించుట యాంగ్లేయరచయితల సాంప్రదాయము. అట్లే తెలుఁగులో కూడ నవలల రచించుచున్నవారు కథలో నేదో వివాహము దానినిఁ బురస్కరించుకొని కొంతశృంగారరసము వర్ణించుట యాచారమైనది. శృంగారరసముకంటె హాస్యరసప్రధానముగ నున్నసవలలనుఁ గొన్నిటి రచియింపవలెనని నాకుఁ జిరకాలమునుండి కోరిక కలదు. తదనుగుణముగ నే నింతకుమున్ను గణపతియను హాస్యరసప్రధానమగు యాఖ్యాయికను రచియించితిని. గుణగ్రహణపరాయణులైన యాంధ్రప్రముఖు లనేకులు గణపతి యనునవల మిక్కిలి రసవంతముగ నున్న దని పలుమారు ప్రశంసించి యట్టిది మరియొకటి వ్రాయుమని నన్ను గోరిరి. ఆకారణమున నేను నవీనముగ దుందుభి యనునవలను వ్రాయ బూని ప్రథమభాగమును సంపూర్ణము చేసితిని. గణపతిలో విచిత్రగుణవిశిష్టుడైన యొకానొక పురుషుని చరిత్రము వర్ణింపఁబడినది. ఈ నవలలో నద్భుతగుణవిశిష్టయైన యొకానొక స్త్రీచరిత్రము చిత్రింపఁబడుచున్నది. నాసంకల్పమునందు నేనెంతవరకుఁ గృతకృత్యుఁడనైతినో యాంధ్ర మహాజనులే నిర్ణయింతురుగాక !

రాజమహేంద్రవరము
22—7—38

చిలకమర్తి లక్ష్మీనరసింహం
గ్రంథకర్త.

చల——అమ్మ నో[illegible] కే ప్ర[illegible]?

వసం——సీ[illegible] తాల గించు. [illegible] అని పిలువని [illegible] ?

చల——నీవుచేసిం [illegible], నీకే ఆలోచించుకో.

వసం——[illegible] ?

చల——తప్పకుండా మోసమేఇది-ఇట్టి చిలిపిచేష్టలు చేస్తావయ్యా ఆచార్యుడని పేరుపెట్టుకొని ?

వసం——మమ్మల్ని జడిపిస్తావా ? ఇంతతో నీ బెదరిపోతా మనుకొన్నావా ?

చల——మేమేమీ చేతకాని మూర్ఖుల మనుకొంటున్నావు కాబోలు ?

వసం——నిన్నెవరయ్యా బొట్టుపెట్టి పిలిచారిక్కడికి రమ్మని ? అన కూడదు కాని ఇట్టిసిద్ధిగల ప్రతిక్రియ చేసుకుంటే ఈమె చనిపోవుటే మంచిది. ఆమె బంధుగులమైన మాకందరికీ ఈమె ప్రస్తుతస్థితి ఎంతబాధాకరమో కొంచెమాలోచించు. నీక్రూరత అప్పుడు తేట పడుతుంది—అతి మానుష మగపరుస్తానని సాకుపెట్టి నీకట్టి హాసియూ చేసియుండని మాబోట్ల చిత్తశాంతి చెరచి మమ్మంద రినీ దుఃఖసముద్రమున ముంచినావు ! గొప్పపని చేసినావులే ! ఇప్పటికైనా మంత్రము సురలిస్తివా కొంతనయము.

వైద్యు——అయ్యలారా ! కొంచెము శాంతించి నామాటవినండి. ఈతడు చేసినది చెఱుపే, సందేహము లేదు, కాని మనమతన్ని నిందించరాదు. అతని చేష్టలకితడు ఉత్తరవాది కాకపోవచ్చును. (శుక్రునితో) నీకళ్లు పరీక్ష చేయనియ్యవయ్యా, అద్గదీ ! నాకు తెలుసును. ఈతడు చనిపోయిన ముసలమ్మను బ్రతికించినందుకు మీరందరూ హృదయపూర్వకముగా ఈతనిని మెచ్చుకుంటూ

ఉండగా నేను తటస్థుడనై చూస్తున్నాను నాకెందుకని—నాకు సంబంధించని విషయములో కలుగజేసుకోలేదు. యథార్థస్థితి నేనెరుగుదును-వస్తుతః అన్నపూర్ణమ్మగారు చనిపోలేదు- కనుక ఇతడు చేసినది అతిమానుష మెంతమాత్రమూ కాదు—ఇతనికి సర్వ జన సామాన్యముకాని మనోవశీకరణ శక్తి (hypnotic power) ఉంది. దానిని సరిగా ఉపయోగించలేక స్వలాభ మపేక్షించి అసంగతమైన మార్గము పట్టినాడు. చచ్చిన లేపడానికి తారసిల్లినాడు. అంతేకాని ఇందు విశేషమేమీలేదు. తమరేమి చెప్పినా అన్న పూర్ణమ్మగారికి మనలో నెవరైనా తెలిసి చెప్పించి యుందాము.

వసం—సరే—ఇప్పుడు మనము చేయవలసిన దేమి ?

వైద్యు—ఏమున్నది ? ఇతనింకా యిట్టి అల్లరి చేయకుండా ఒక గదిలో పెట్టి తాళము వెయ్యడమే—ఇతనిని విచ్చలవిడిగా వదలితే అపాయము తప్పదు.

వసం—మీమాట నిజము -ఇతని కుట్రలాటకీడా తెలిసెను- ఇప్పటికే నిర్భరమైంది. జోగన్నా !

జోగ—అయ్యా !

వసం—పోలీసుస్టేషనుకి పరుగెత్తి ఇద్దరు జవానులను వెంటబెట్టు కొనిరా—వచ్చేటప్పుడు సంకెళ్ళు కూడ పట్టుకొని రమ్మను. ఇతడు దేవాంతకుడు ; కుమార్గ ప్రవర్తకుడు ; ఎంతకైనా తగుదును. ఇతనిజాడ తెలసిందిగా !

జోగ—చిత్తము (పోవును.)

శుక్ర—అయ్యా, నాకు సెలవిప్పండి.

వసం—బాగుబాగు- ఏటూ తెలియనివాని వేషము వెయ్యి—నీవు చేయగలవని పూర్తిఅయింది. సెలవు పుచ్చుకొందువుగాని ఉండు తగిన తోడురానీ, కొంచెమాగు.

([illegible] ఇన్స్పెక్టరు [illegible] ప్రవేశించుచున్నాడు)

ఇన—ఇక్కడేనా [illegible] ?

జవాం—చిత్తం

ఇన—(శుక్రుని చూచి) [illegible] !

శుక్రా—ఏం కావాలి [illegible] ?

జవా—ఏమి [illegible] ? నేనడుగుతున్నా. చెప్పు.

శుక్రా—శుక్రాచార్యులు.

ఇన—ఏమిటి? శుక్రాచార్యులా !—ఇదేమిటి—ఈ పేరెప్పుడూ వినలేదు—నీ నిజమైన పేరు ? [illegible] ?

శుక్రా—నాకింకొక పేరు లేదు.

ఇన—[illegible] [illegible] [illegible] ఎక్కడెత్తుకొని వచ్చినావు ?

శుక్రా—నేనెత్తుకొని రాలేదు—ఇది నాదే.

ఇన—ఐతే నామాట అబద్ధమా ? ఇదేనా నీ ఊహ ! చెప్పు నన్నెరుగుదువా ?

శుక్రా—ఎరుగను. మీరు—బహుశా [illegible].

ఇన—పెడసరము మాట రానీయకు—ఎక్కడనుంచి వచ్చినావు.

శుక్రా—స్వర్గమునుండి.

ఇన—స్వర్గమా ? ఏమల్లా ? ఎక్కడుంది.

శుక్రా—భగవద్భక్తులు ఈ దేహమును త్యజించినవెంటనే చేరేప్రదేశము.

ఇన—ఓహో ! తెలిసింది ! నాతో టక్కరిమాట లాడుతావా ? నన్ను టోపీవేస్తున్నావా ? మొదట పెడసరం తరువాత జిత్తులా ? తెలి

మాఅత్త నోటికట్టు విద్యయని నేనెంత ప్రార్థించినా ఆమె-మాటలాడేటట్లు చేయనంటాడు. ఇలాగు నమ్మిక కలిగించి వంచించి మావద్ద డబ్బు బలాత్కారముగా లాగవలెనని బిర్రబిగిసి కూర్చున్నాడు—ఈవృత్తాంతము యథాసంభవమని నాననుమాని—ఇతనిపై నేరము మోపవలెననే దురుద్దేశముతో చెప్పుటలేదు—దీనియథార్థము, ముహూర్తానికి నిజము - మాఅందరియెదుటా జరిగినది—నేచెప్పదలచినదంతే—ఇతర విషయములనుగూర్చి వైద్యభూషణుని అడిగి మీరు తెలుసుకోవచ్చును.

వైద్య——సూపరింటెండుగారివద్ద కావలసిన సమాధాన మిస్తాను; నాను కోరితే రిపోర్టు వ్రాస్తాను.

చల——ఇతను నేరస్థుడైనా కావలె లేదా పిచ్చివాడైనా కావలెను; రెండూ కావచ్చును. మొత్తముపైని ప్రమాదజనకుడైన వ్యక్తి కాబట్టి ఇతన్ని గదిలోనుంచి తాళమువేసి భద్రము చేయవలెను.

ఇన——సందేహమా? మీకితనివల్ల తొందరకల్గకుండా చేస్తాము. బేడీలు తెచ్చినావా?

వసం——మా ప్రార్థన అంగీకరించి జవానును వెంటబెట్టుకొని మీరు దయచేయడము మేలైంది—ఏదో కొంచెము ఫలాహారము స్వీకరించి మమ్మానందింప జేయగోరుతూన్నాను.

ఇన——మీమాట తోసివేయను. మొత్తముమీద యీ నేరస్థుడు ఘటికుడే.

వసం——కాస్త ఫలాహారము తీసుకొనిరా జోగన్నా! (అతడుపోవును)

ఇన——చులకనగా తేల్చండి. ఆట్టెఅయితే అరగదు.

వసం——ఎంతోనా? ఇంకా చిమకుతూందా?

ఇన——పెద్దవాన కురుస్తున్నది. చూడండి మేమెలాగు తడిసినామో?

చేస్తారు. [illegible] లేకుండా [illegible] చేస్తారు, [illegible] [illegible] చేస్తారు (శుక్రాచార్యులు [illegible]) [illegible] నాడు. [illegible] [illegible] ఉంది, [illegible].

వసం——దొడ్డిద్వారమునుంచే తీసుకొనిపొండి. ఎవరికంటా పడరు (శో[illegible])

చల——ఇంకా జల్లుకొట్టుతూన్నది. (శుక్రాచార్యుని ద్వారమువరకి తీసుకొని పోవుదురు)

వరా——అయ్యో! తొంటికి జోడు లేదు, పాపము.

వసం——ఐతేనేమి కొంపమునిగింది? బండి తెప్పించుచున్నావా? లేకుంటే కారు తెప్పిస్తున్నావా?

వరా——కాదుకాదు ఈపావలు తొడుక్కోనీయండి. ఇవి ఆయనవే.

శుక్రా——(పుచ్చుకొని తొడుగుకొనును.——దివ్యజ్యోతి)

వరా——నెత్తిమీద కేమీలేదూ? పాపము తడిసిపోతావు. గొడుగు తెస్తానుండండి బాబూ (పోవును)

చల——తెలివి తక్కువమ్ముండ,

వసం——బాగానే ఉంది. జల్లుకొట్టుతున్నది——త్వరగా స్టేషనుకి తీసుకొనిపోయి వ్యవహారం సాంతం చేయండి.

వరా——(గొడుగు తెచ్చియిచ్చును)

శుక్రా——(చేతులుచూపి) చేతులకు బేడీలు వేసినారు.

వరా——పోనీ, నేను పట్టుకుంటాను. (అందరూ పోవుదురు) తుదకెలాగైతేనేమి, సాగనంపినాము.

చల——శని వదలినాది.

వసం—అత్తా! (మంచముదగ్గరకు పోవును)

చల—ఎలాగుంది? నీరసించి పోతూంది. పరుపుమీద పడుతున్నది.

వైద్య—ఏమీ తెలియకుంది—బ్రదికేనా ?

వసం—అత్తా! అత్తా! ఎలాగున్నావు?

వైద్య—ఈసారి మరి జీవించునట్లు లేదు. నేను చెప్పలేదూ?

వసం—చనిపోతుందా ?

వైద్య—ఇప్పుడు, చేసేదేమిటి? నాకు తోచలేదు.

(అందరూ మంచం చుట్టూ మూగుతారు)

వసం—ఏమి గడ్డుదినమయ్యా!

చల—వర్షమొకటి లంకించుకుందే?

వసం—పాపమూ బ్రాహ్మణ్ని చాలా బాధించినాము. నిజంగా మన కేమీ హాని చెయ్యనేలేదు.

(తెర వాలును)



# కథలు

## తీరని సమస్య

“ వాళ్ళది పాత పేటలో ఉంది ఇల్లు. మేము కొత్త పేటలో ఒక అద్దెయింట్లో ఉండేవాళ్లము. హైస్కూల్లో ఫోర్తుఫారము చదువుతూండేవాళ్లము. ఎర్రగా పొడుగ్గా ఉండేవాడు. నాకూ అతనికీ చాలా స్నేహాము. ఇస్కూల్లో ఉన్నప్పుడు యింటికి వచ్చినప్పుడు బజారుకి వెళ్లినప్పుడూ ఎప్పుడూ కలిసే వుండేవాళ్లము. నాకతనితో స్నేహమయ్యేటప్పటికే అతని పెళ్లాము కాపరానికి వచ్చింది. తల్లీ తనూ పెళ్లామూ ముగ్గురూ ఉండేవారాయింటోను. సాలుకు రెండుమూడు వేలరూపాయిలు వచ్చేవి అతనికి భూములమీద. వేషములోనూ తిండిలోనూ చాలాదర్జాగా ఉండేవాడు. మాతో తిరిగేటప్పుడూ అప్పుడూ చాలాసరదాగా ఉండేవాడు గాని యింటికి వెళ్ళేటప్పటికి మాత్రము మొఖము మటమట లాడ్చుకునేవాడు. ఏంచేతచెప్మా అనుకుంటూండేవాణ్ణి.

ఇల్లా ఉంటూండగా మేము కాపురమున్నయింట్లో యింకో వాటాలో ఉన్నవాళ్లింటికి యెవళ్లో చుట్టాలొచ్చారు. వచ్చినవాళ్లల్లో వొకావిడ ఆయింటోఉన్న ఆవిడతో యేమిటో చెబుతోంది. ఆమాటలు నా చెవిని పడ్డాయి. “ వాళ్లజానికిరాముడు పెళ్లాము మొఖము చూడనే చూడట్ట. అత్తగారికి కోడలంటే అసలే పడదుట. దాసీదాన్ని జూసినట్లు చూస్తుందట. ఆమొగుడు యింటికే రాట్ట. వస్తే పదిమంది స్నేహితులతో వచ్చి పిచ్చాపాటీ మాట్లాడుకుని చదువు

కుంటే చదువుకుని వెళ్లిపోతూంటాట్ట. డబ్బుచూసి యిచ్చాడు ఆ మామగారు. ఆతల్లికొక్కతే కూతురు"

జానికిరాముడు అనేసరికి మావాడే అనుకున్నాను.

"ఊరంతా పెళ్లినాడే అనుకున్నారు పరహీనం వరహీనమని"

వీడిమొఖంమటమట నాకిర్థమయింది. అర్థమయి చేసేదేమిటి. అయినా స్నేహితులమయివుండి వీడెదో పరితాపంలో ఉన్నప్పుడు కారణము తెలుసుకుని ప్రతిక్రియ యేమన్నా వుంటే చేస్తే బాగుం టుందని మాత్రము అనుకున్నాను. తరుచు వాళ్లింటికి వెళ్లేవాణ్ణి గాని వాడిపెళ్లాము ఆట్టే కనుపడేదికాదు. ఇంతకూ సావిడి దాటి లోపలికి వెళ్లేవాళ్లము గాము. ఆవిడమాత్రము మాయింటికి అప్పుడప్పుడు పేరం టానికి వచ్చినప్పుడు చూసీ చూడ్డంగా చూసీవాణ్ణి. చక్కగానే ఉం డేది బొద్దుగా ఎఱ్ఱగా. చదువుకుందిట కూడాను. అంద చందము విష యములో వీడు అసహ్యించుకో నవసరము కనబడదు. ఇంక అత్తారు యివ్వడము పుచ్చుకోడాల్లో యేమన్నా తేడా వచ్చిందాంటే. అదీ యెప్పుడూ వినలేదు. ఇంతకూ వాళ్లు చాలా బాగావున్నవాళ్లు అదీ గాక వొక్కత్తే ఆడపిల్ల. మరేమిటిరా వీడికి సంసారసుఖం లేకపోవ డానికి కారణము. ఏం తెలుస్తుంది కుర్రాళ్లకును. పెద్దవాళ్లతో మాట్లాడే విషయముకాదు. నాకు యేమీ తోచిందికాదు. వాణ్ణే అడుగుదా మనుకుని యే మనుకుంటాడో పాప మని ఊరుకునేవాణ్ణే.

కొన్నాళ్లకి ఆవిడపుట్టింట యేదో శుభకార్యమని వాళ్లవాళ్లెవళ్లో వచ్చి ఆవిడ్ని తీసుకెళ్లారు. ఆవెళ్లడం వెళ్లడం యెన్నాళ్లకీ రానే లేదు. వాళ్లంతట వాళ్లు తీసుకురాలేదు సరేగదా వీడైనా వెళ్లిగాని ఉత్తరం వ్రాసిగాని తీసుగురాలేదు........

ఓనాడు వాళ్లమేడమీద కూర్చుని ఉండగా టపాబంట్రోతు ఒకవరుత్తరము యిచ్చాడు. పైపేరు చూడగానే ఆడవాళ్ల దస్తూరిలా తోచింది వెంటనే,

"ఏమిరా వదెవ్వి తీసుకొచ్చేనేకావు"

"........................."

"నిన్నే"

"ఇదిగో ఈజాబదే విప్పి చదువు" అన్నాడు.

"నేచదివితేం నువుచదివితేం చదివి సంగతేమిటో చెప్పరాదూ"

మామూలుగా యెంతస్నేహితుడి ఉత్తరమైనా చదవడానికి యెల్లాగో ఉంటుంది. వాడు చదవమన్నాడు అనుకుందాము అయినా వాడి భార్య వ్రాసిందికూడాను. చదవడానికి సంకోచ మేసింది. చాలా సేపు ఊరికే కూచున్నాను. వాడు యేమీ మాట్లాడలేదు. జాబు చదివేడు కాడు. కూచునికూచుని చివాలునలేచి చక్కావచ్చాను యింటికి. ఆ వుత్తరప్రశంస మళ్లీ మేమిద్దరము యెప్పుడూ అనుకోలేదు.

ఎవళ్లు తీసుకుని వచ్చారో జ్ఞాపకము లేదు గాని, ఓనాడు అవిడ వొచ్చేసింది.

రెండుమూడురోజు లయ్యాక మా ఆవిడ కెదో జబ్బుగా ఉందట, ఆడాసుపత్రికి తీసుగెడదాం వస్తావా అన్నాడు. అల్లాగే అన్నాను. ముగ్గురమూ వెళ్లాము. దొరసాని చాలాసేపు పరిక్ష చేసింది. ఏదో జబ్బు అని చెప్పింది కాని (Pregnant) ప్రెగ్నెంటులా తోస్తుంది అంది. ఆ సంగతి అతనికీ ఆవిడకీ తెలియాలి నా కేమి తెలుస్తుంది. అతడుమాత్రము ఈమాట వినగానే కొంచెము తెల్లబోయి మళ్లీ నిల్దొక్కుకుని, "సరే మందు రేపు ప్రారంభిద్దా" మని దొరసానితో చెప్పి వెడదాము పదండి అన్నాడు. ఇంటికొచ్చేసాము.

ఈవిడ యేడెనిమిది నెల్లాయె ఊరికెళ్లింది. కడుపేమిటి? ఊఁ! దొరసానుల మాటలు నిజమా యేమిటి. కడుపులో బల్ల పెరిగితే కడుపంటారు. కడుపు వస్తే బల్లంటారు. పట్నములో యిల్లాగే నోనాయుడుగారి భార్యకి కడుపొస్తే దొరసానులంతా బల్ల బల్ల అన్నారు. తరువాత ఆవిడ నీళ్లాడింది. కాకపోతే బల్లకోసము చేసినవైద్యాలు కట్లుపల్ల పుట్టినపిల్ల చాలారోజులు నీరసంగా ఉంది.గాని. ఇల్లాగే వాళ్లభిప్రాయాలు తారుమారుగ ఉంటాయి కడుపూలేదు కాలులేదు. కాపరానికొచ్చిన పదేళ్లకి అసలు కడుపేమిటి అనుకున్నాను నేను వాడేమనుకున్నాడో నాకేమీ తెలియదు.

మా పెద్దక్కయ్యకూడా అప్పుడు కడుపుతోంది. వాళ్లింటికీ మా యింటికీ కూడా రోజూ యెవరో సూడిదలు తేవడము. చెపితే నమ్ముతారో లేదో గాని ఆ రోజుల్లో మిఠాయీ జంతికలూ రాని రోజే లేదు. లడ్డూ అంటే ఆరోజుల్లో చాలాగొప్ప, చాలాఖరీదుండేది. మణుగు అయిదారు యింకా యేడెనిమిది రూపాయిలుకూడా ఉండేది. పంచదారవైతే చెప్పనే అక్కరలేదు. ఇప్పుడేమిటి మణుగు రెండు రూపాయిలు. అయితే అప్పుడు యీవాలాజానూనెలూ అవీ లేవు. పప్పునూనెకూడా యెక్కడోగాని దొరికేది కాదు. అంతా నెయ్యి, పైగా యిన్ని దుకాణాలెక్కడ యేడశాయి. మార్కెట్టుదగ్గిర వొకటుండేది. బజారులో మధ్య రెండో మూడో తెలగపిండి మిఠాయి దుకాణాలుండేవి. అయితే స్టేషనుదగ్గిర వొకమారువాడీ దుకాణముండేది. అక్కడ అన్ని వస్తువులు పచ్చగా నుండేవి పసు పేసినట్లు. ఖరీదులు మండిపోతూండేవి. ఆ దుకాణములో వస్తువులు తింటారో ఆడుకుంటారో బొమ్మలబీరువాల్లో పెట్టుకుంటారో కూడా తెలిసేదికాదు. మణిసి మహాసుభ్రంగా ఉండీ వాడు. తెల్లనిచొక్కా చిన్న గుండ్రని

తెల్లటోపీ. బట్టమాత్రము అసహ్యంగా ఉండేవి. అక్కడ పన్నీరు లడ్డూ అని నొకటుండేది. జానికిరాముడు అత్తారు అదే కొన్నారు, ఊళ్లో పంచిపెట్టడానికి ఇంట్లోవాళ్ళకి జంతికలు వండించారు.

వాళ్లింటిదగ్గిరో మాయింటిదగ్గిరో రెండుచోట్లానో మేము మిఠాయి తిననిరోజులేదు. మా యింటివద్ద తిన్నప్పుడు సరదాగా కబుర్లు చెపుతూ తింటూండేవాడు. వాళ్లింటిదగ్గిర తినవలిస్తే విసుగుదలగా నాకోసముతిన్నట్టు తినేవాడు.

ఒకనాడు మధ్యాహ్నము ౧_౨ గంట్లబండీమీద వొంటిగంటకి ఆవిడతమ్ముడు పురిటికి తీసుకెళ్లడానికి వచ్చాడు. జానికిరాముడు తీసుకెళ్లమన్నాడు గాని అత్తగారు,

“ అప్పుడే యెందుకు యేడోనెల నిన్ననేగా వచ్చింది ”

“ ఏడోనెల కనకనే తీసుకెడదామని వచ్చాము ”

“ తొమ్మిదోనెల్ని తీసుకువెళ్లొచ్చు నేను పెద్దదాన్నయినాను వొక్కత్తినీ చెయ్యలేనూ పెట్టాలేనూ ”

“ అదేమిటమ్మా తొలిసారిపురుడు మాకు అచ్చటా ముచ్చటా జరగనక్కరలేదూ ? తరువాత నిండుగర్భిణీమీద ప్రయాణముకూడా ప్రయాసా ప్రమాదముకూడాను ”

“ మీ యిష్టము మీ బావిష్టము నా మాట నేను చెప్పాను ”

“ ఏ మంటావోయ్ ”

“ ఆవిడ అల్లా అంటూంటే నేను పంపిస్తే యేం బాగుంటుంది. తొమ్మిదోనెల రాగానే తీసుకువెద్దుగాని లే ” అన్నాడు. మే మిద్దరమూ కాలేజీకి వెళ్లిపోయాము.

మధ్యాహ్నము వాడూ నేనూ మా యింటిదగ్గిరే భోంచేశాము. సాయంకాలము కాలేజీ విదిలిపెట్టగానే పుస్తకాలు యింటిదగ్గిర పారేసి

వాళ్లింటికి వెళ్లాము. మూడుగంటల బండికి తమ్ముడూ ఆవిడా వెళ్లిపోయారని వాళ్ళమ్మ చెప్పింది. మొగుడికి అత్తగారికి కూడా యిష్టము లేనప్పుడు యెల్లా వెళ్లిందో అనుకున్నాను. గొప్పవాళ్ళాడబడుచులయితే యిల్లాగే కామాన్ను అనుకుని ఊరుకున్నానుగాని మొదట, చివరకి ఉండబట్టలేక.

“ఏమిరా యిల్లా జరిగింది అల్లా వెళ్లిపోవడమే ”

“ .. ..................... ”

“నీ వెదోజవాబు చెబితేగాని ఊరుకోను. ముసుపూ యిల్లాగే ఊరుకున్నావు. స్నేహముంటే షికార్లుతిరగడమూ పకోడీలు తినడము తో సరా! కష్టసుఖాల్లో వొకరి కొకరు సాయపడవద్దా? ఆప్తులతో చెప్పుకుంటే సంతోషము ద్విగుణ మవుతుందని విచారము సగ మవుతుందని అంటారు. మాతో ఎంతోకులాసాగా తిరుగుతావు చేస్తావు. ఇల్లంటే హెల్లా (Hell) చూస్తావు వదినెకి నీమీద యిష్టము లేదా? నీకు వదినెమీద యిష్టములేదా? రెండూ కాదా? నాకేమీ తెలియడము లేదు నీధోరణి. నీడబ్బుకోసమూ నీతిండికోసమూ యేదో ఆత్మలాభము చూసుకుని చేరేవాళ్లేగాని యీస్నేహితులంతా అవసరానికి అక్కరకొస్తారా! భార్య అంటే యేమిటో యెరగవా అర్ధాంగి: హాఫ్ అన్నదాకా అన్యోన్యము ఎంత ఎల్లా ఉండాలి! నీ వావిషయమేమీ ఆలోచిస్తున్నట్టే లేదు. చూస్తూ ఊరుకోడము నాకూ బాగా లేదు” అన్నాను.

వినివిని నాలెక్చరు, కూర్చున్నవాడు కూర్చున్నపాట్ని కళ్లంట నీళ్లెట్టుకున్నాడు. ఇదేమిట్రా నిక్షేపములా నవ్వుతోఉన్నవాణ్ణి యేడిపించాను అనుకుని కాస్సేపు కూచుని తిన్నగా యింటికి చక్కావచ్చాను. వాడితో చెప్పకుండా గూడాను.

కొద్దిరోజులకే వుత్తరము వచ్చింది పిల్లాడు పుట్టాడని. నక్షత్రము వగయిరా వాళ్లేమి అందులో వ్రాయలేదు. వారమూ టైమూ మాత్రము రాశారు. వీడు కూడా నక్షత్ర మేమిటో చూద్దా మను ప్రయత్నము చెయ్యలేదు. నేను మాత్రము చూసి శాంతినక్షత్రమే అనుకున్నాను. స్నేహితులతోటీ వాళ్లతోటీ యీసంగతేమీ అంత చెప్పలేదు వీడు. అత్తవారికి జవాబూ రాయలేదు.

రోజులు గడిచాయి వారాలు గడిచాయి పక్షాలూ నెల్లూ అయిపోతున్నాయి. బారసాల చేసుకోమని అన్నప్రాశనీ యేమిటేమిటో చేసుకోవలసినదనీ రమ్మనీ ఉత్తరాలూ కబుర్లూ వస్తూండేవి. ఉత్తరాలు చింపి పారేస్తూండేవాడు. ఆయేడు పరీక్ష ఫేలయాడు. నిత్యమూ యేదో మనోవ్యాధిచేత బాధ పడుతున్నట్టుండేవాడు. చిక్కిపోతున్నట్టుకూడా ఉండేవాడు. స్నేహితుల మెంత హెచ్చరిక చేసినా ఆకాస్సేపూ యెదోహుషారుగా కనబడేవాడు గాని మొత్తముమీద దిగాలువడి ఉండేవాడు. పోయినపరీక్ష పోనేపోయింది మళ్ళీ చదివిన క్లాసే కదా చదివేది తీరుబాటు యెక్కువ ఉంటుంది. యేదైనా జెనరల్ స్టడీ చెయ్యవచ్చునని భగవద్గీతొకటి కొన్నాడు. అంటే ఆనిబిసెంటమ్మగారి ఇంగ్లీషుట్రాన్స్లేషను మూలము నాగరిలిపి. నాగరిలిపి రాకపోయినా యింగ్లీషుతర్జుమా చదువుకోవచ్చుగా? సంస్కృతము అసలు రాదు. తెలుగు బాగారాదు మనవాళ్లకి. దాంతోపాటు స్వామి వివేకానందుని వాల్యూములు రెండు కొన్నాడు. తోచనప్పుడు అవి చూస్తూండేవాడు.

పదినెల్లు గడిచాయి.

ఒకనాడు హఠాత్తుగా, పెత్తల్లినీ వో చాకలాణ్ణి సాయము తీసుకుని పిల్లాణ్ణితీసుకుని ఆవిడ సాయంకాలపు బండిమీద దిగింది.

పెత్తల్లి పుణ్యస్త్రీ చాలా పెద్దది. అయిదారురోజు లుండి వెళ్ళిపోయింది. ఆ అయిదారు రోజుల్లోనూ మూడో నెల్కి చేసే ముద్దగుడుములూ గడప దాటేటప్పుడు వండే గార్లూ అడుగు వేశేటప్పుడు వండే అరిశెలూ అత్తవారింటికి పంపేటప్పుడు చేసే చొంగ చక్కిలాలూ (అప్పటికప్పుడే బాగా అన్నమే తింటున్నాడు పిల్లాడు) ఏమిటేమిటో చేసింది ఆవిడ. పంచిపెట్టారు. వీడు ఆపిల్లాణ్ణి యెత్తుకోలేదు. ముద్దెట్టుకోలేదు. చూశా డోలేదో కూడాను: మేమంతా పిల్లాణ్ణి చూపించరా అంటే, కొత్త నాదగ్గర, యింకా అలవాటు కాలే దనేవాడు. ఆఖరికి వోమాటుగా మాన్ను తీసుకువచ్చి చూపించాడు. పిల్లాడికేం నిక్షేపములా గున్నాడు. దబ్బపండులాగ వంటినిండా వంటిడునగలు తుమ్మెద రెక్కల్లాగ మొఖంమీదికిపడుతూ పుట్టెంటికలు. సీతాకాలమో యేమిటో ఎట్టిదీ చారలఫ్లానలుజుబ్బాతొడిగారు, బాగున్నా డంటే బాగున్నా డనుకున్నాము—మాలోవొకడు

"పేరేమిట్రా"

"........." మరి యొకడు

"ఆఁ, పేరేమిటి వాళ్ళనాన్నగారి పేరే"

మరియొకడు

"మామగారి పేరేమోని"

నేను

"దేముడుపేరు పెడతాము పదన్నా. తండ్రీలేదు తాతలేదు. కొత్తగా ఉండేది చిన్నదిగా ఉండేదీని"

అన్నాను. పిల్లాడు కార్ మని యేడిచాడు. యింట్లోకి తీసికెళ్లాడు. బారసాల చెయ్యలేదు పేరుపెట్టలేదు. ఏమీ లేదూ.

రెండుమూడు నెల్లకి——కాకినాడలో యేదోపని ఉందనీ జానికిరాముడు రెండుమూడురోజుల్లో వస్తాననీ సాయంకాలము స్టీమరుకి వెళ్లాడు రెండురోజు లయింది. మూడు అయింది. నాలు గైంది. నేను యెప్పుడూ వాణ్ణి విడిచిపెట్టి ఉండలేదు, నాకు పిచ్చెత్తినట్టుంది. ఉత్తర మేనా రాశాడుకాడు. చూసిచూసి నేనే కాకినాడ వెళ్లాను. వాడా పూటే రాలేదన్నారు వాళ్లవాళ్లు. ఏమయినాడు? నాకు కంగారెత్తింది. నిలువునా నీరై పోయినాను. తల తిరిగి నట్లయింది. సరే; కొంత సేపటికి తట్టుకుని వాళ్లింట్లో ఆపూట భోంచేసి యింటికివచ్చేశాను. వచ్చా నంటే సరా వాళ్లింటికి వెళ్లి చెప్పాలి? ఎల్లా వెళ్లను. యేమని చెప్పను? నాకేమీతోచలేదు. చివరికి వెళ్లాను. వెళ్లి యేంచెప్పానో తెలియదు. వాళ్లమ్మ పెద్దపెట్టున యేడువసాగింది. ఆయేడుపు విని కోడలు పిల్లాణ్ణెత్తుకుని వాకిట్లోకి వచ్చింది. "మీ నాన్న దేశాంతరం పాలై పోయాడు బాబూ! మీఅమ్మ..." అంటూ పిల్లాణ్ణి లాక్కుంది. నే నున్నానని కాబోలు ఆమాట పూర్తిగా అందికాదు. ఏమన్నా! కోడలిమొగం మీద యేలక్షణమూ నాకు కనుపించలేదు. అత్తగార్ని ఊరడించాలేదు. ఇంట్లోకి వెళ్లిపోయింది.

ఆనాడు కొన్నిచోట్లకి టెలిగ్రాములూ కొన్నిచోట్లకిజాబులూ కొన్నిచోట్లకి మనుష్యుల్ని పంపి జవాబులకోసము కాచు కూర్చు న్నాము. జాడాజవాబూ యెక్కడా పికరులేదు. నాకు మతిపోయింది. వాళ్లమ్మ సంగతి చెప్పనే అక్కరలేదు. నా కప్పటికే కవిత్వమువచ్చు, భర్తృహరి——

పెక్కుదివియలున్న జక్కవచెలియున్న
రిక్కరాయ డున్న జుక్క లున్న
చిన్నిలేడిచూపు చేలియ నెడబాయు

నష్టాంధకార మయ్యె జగము."

అని తనభార్యా వియోగమునుగూర్చి వ్రాసుకున్నాడు. స్నేహముయొక్కమజా వాడికేం తెలుసు మహారాజుకి అని అనుకుని శ్రీ, ర పాదాలు "నిష్కళంకహృదయు నెచ్చెలి నెడబాయు నష్టాంధ కార మగును జగము"

అని మార్చుకున్నాను. అప్పుడు యింకా స్నేహమువిూద చాలాపద్యాలు వ్రాశాను కాని యీపత్రికలో వెయ్యరేమో తీరా యీకథ అని యిక్కడ యెక్కించలేదు.

డబ్బుకి వాళ్లకు లోపములేదు. ఆలోచనకు నాకు లోపము లేదు. డబ్బు విరచిమ్మి కాశీ రామేశ్వరాలు వెతికించాము. యేమీ ఆ చోకీ తెలియలేదు. మాశాయశక్తులా తంటాలు పడ్డాము. లాభము లేకపోయింది.

* * * * *

నేను మధ్యాహ్నము కాలేజీనుంచి వచ్చేటప్పటికి నాడ్రాయరు విూద కవరుత్తర మొకటున్నది. కవరు కొత్తమోస్తరుగా ఉంది. టపాముద్ర చూస్తే బాగా కనపడడము లేదు. ఎప్పుడూ టపాముద్రలు అల్లాగే ఉంటాయి. అవసరములేక చూడముగాని చూస్తే యెప్పుడూ యింతే. భూతద్దము పెట్టి చూడండి యేమి చెయ్యండి చస్తే తెలియదు. చింపి జాబు చదివాను. ఇంగ్లీషున వ్రాయబడినది. భాష జానికిరాముడిదే. వ్రాత మరొకడిదిలాఉంది బాగా పరకాయిస్తే అక్కడక్కడ అక్షరాల్లోకూడా వాడిఅక్షరాలపోల్కి ఉన్నట్టుంది. విషయమేమి టంటే?

ఈజాబు నాపరిచయిస్తుడొకడు వ్రాయమంటే వ్రాస్తున్నాను. అతడు మీకు చాలా స్నేహితుడట. తాను కొన్ని కారణములచేత

సన్యసించినానని, తనవారి కెవరికీ తనవిషయమైనయాశ యింక యీ ప్రపంచములో ఉండనక్కరలేదనీ, దీనికంతకు కారణము నూతనశిశువనీ, యీ సంగతులు నాకుకూడా కొంత తెలుసుననీ, యింతే. క్రింద సిరీషకుమార్ అని సంతక మేదో ఉంది. స్టేషను తారీఖు వగయిరా యేమీ లేవు.

బ్రతికున్నాడుగదా పోనీ అనుకున్నాను. కాని నాడు కాకినాడలో తిరిగినకన్నా యెక్కువగా నాతల తిరిగిపోయింది.

"సరే బాగానే ఉంది సన్యసించాడు. ఈపుట్టినపిల్లాడి సంగతి నాకేమి తెలుసు. తెలిస్తే తనకు తెలుసును కాబోసు. నాతో చెప్పాడా యేడిశాడా. వీడు తనసంతతి కాదన్నమాట. ఈలేచిపోవడమూ యీసన్యాసమూ వీడిముఖం చూడలేకే వీడిదిగులుకే యేదో గృహకల్లోలమనీ భార్యాసంబంధమనీ అనుకుంటూవచ్చి వాణ్ణిగాని యిందాకా ఆలోచించలేకపోయినాను. ఎంతటివాళ్లయినా ఉంటారు. "స్త్రీణా మశిక్షితపటుత్వ మమానుషీష సందృశ్యతే కిముతయాః ప్రతిబోధవత్" అన్న కాళిదాసు వెఱ్ఱివాడా? ఆసుపత్రిలో దొరసాని గర్భిణీఅనుకుంటూ నన్నప్పుడు వీడు నిర్ఘాంతపోయాడు మొదట. ముఖముమీద కత్తివాటేసినా నెత్తురుచుక్క లేనట్లయింది. కాని వెంటనే నిల్దొక్కుకున్నాడు. ఏమిటిచెప్మా అనుకున్నాను. ఏం తెలుస్తుంది. మనుష్యుడు సర్వజ్ఞుడా యేమిటి. ఏమయితే యిప్పుడేమి చేస్తాము" అనుకుని గొంతుక ఆర్చుకుపోతే కొంచెము మంచినీళ్లు తాగి ఉత్తరము జేబులో పెట్టుకుని వాళ్లింటికి వెళ్లాను. గుమ్మాని కెదురుగుండా తల్లి మడిగట్టుకుని పత్తి విడదీస్తోంది. కొంచెము దూరంగా ఉత్తరముఖముగా చిత్రాసనముమీద పురాణం చెప్పేబ్రాహ్మడు కూచుని వ్యాసపీఠముమీది పుస్తకంలోనుంచి యేవో శ్లోకాలు చదివి అర్థము

చెబుతున్నాడు ఆశ్లోకాలర్థమో ఏమేమున్నానో. వినేది యీవిడ వొకత్తే గాని ఆయన గట్టిగా చెబుతున్నాడు. వళ్లంతా చెమట బట్టినట్లయింది కసరతు చేస్తున్నట్టు విరిగి ముక్కలవుతున్నాడు. వొకరికి చెబితేం ఊరందరికీ చెబితేం ఆయనకది అలవాటు.. కుమారుడు లేచిపోయినప్పటినుంచీ తల్లికి యేమీతోచక కాలక్షేపముకోసము నెలకు పదిరూపాయి లేర్పాటు వేసుకుని యీబ్రాహ్మడిచేత పురాణం వింటోంది.

నన్ను చూడగానే ఆయన చెప్పేది పురాణము ఆపుచేసి "దయ చెయ్యండి పంతులుగారూ" అని అక్కడున్న భద్రాచలము తుంగచాప కొంచెము తనదగ్గరగా లాగాడు. చిత్తము అని నేను కూచుని కానియ్యండీ అన్నాను. కానియ్యడానికి ఆయన యెక్కడ ఆపాడో ఆయనకి తెలిస్తేగా? నేనైనా చెప్పాలి సోదెకైనా వెళ్లాలి. దగ్గరనున్న పొడుంకాయ తీసి చిటికెడు పొడుముపీల్చి చెయ్యి గోడకురాసి ఉద్ధరిణెడు నీళ్లు వేళ్లమీద పోసుకుని కొల్లాయితో తుడుచుకుని పత్రాలు తిరగేస్తున్నాడు.

"ఏమిటి విశేషాలు బాబూ పిల్లలు క్షేమమా" అంది ఆవిడ.

"విశేషాలేమున్నాయి? ఆదివారము సెలవుగదా మళ్లీ ఆదివారముదాకా తీరుబడి ఉండదు. చూసిపోదామని వచ్చాను." అని కాస్సేపు పురాణం విని యింటికొచ్చేశాను.

ఏమీ తోచిందికాదు. రాత్రి భోంచేసి మళ్లీ వెళ్లాను. ఆవిడ ఫలహారము చేస్తోంది. కోడలుతమ్ముడు యిక్కడే ఉండి చదువుకుంటున్నాడు. ఈజాబు తీసిచేతి కిచ్చి "చదివి మీఅత్తకి అక్కయ్యకి అర్థము చెప్పు. నేను పొద్దున్నే వస్తాను" అని జాబిచ్చి చక్కా వచ్చాను. నాకు తెల్లవార్లూ నిద్దర పట్టనే లేదు.

ఉదయాన్నే లేచి వాళ్లింటికి వెళ్లాను. తల్లికి ఘట్టమంటూ జ్వరము. తెల్లవార్లూ పేలాపనేట. ముందు పూజారి గౌరయ్యకి కబురంపి చెయ్యి చూపించి మందు తెప్పించి వేయించి కాస్సేపు మంచం దగ్గర కూర్చున్నాను గాని నాతో మాట్లాడ్డానికి పెట్టేంత తాపంగా ఉంది ఆవిడకి. రెండుపూట్లా నేను చూస్తూవున్నాను. గుణము కనుపించడము లేదు. వైద్యుణ్ణి మారుద్దామంటే, ఆ గౌరయ్యమాత్రమే గాని ఆవిడ మింగదు. జ్వరము అంతకంతకు యెక్కువైంది. సంధించింది. చివరకి ౧౨ రోజునో ౧౩ రోజునో జ్ఞాపకంలేదు హఠాత్తుగా తెలివి వచ్చినట్టు లేచికూర్చుని "అదుగో నానాయన ఇల్లారమ్మంటే రానంటున్నాడు. నేనే వాడిదగ్గరకు వెడతాను. బాబూ! నారాయణా ఇల్లు జాగ్రత్త. నేను వాడిదగ్గరకే వెడతా" అంటూ వెనక్కి వాలి ప్రాణములు విడిచింది. జ్ఞాతులూ చుట్టాలూ చాలా మందున్నారు. ఉత్తరక్రియలు యెల్లాగో జరిగాయి. ఆగుతాయా యేమిటి?

ఆజాబుకి జవాబు రాద్దామంటే విలాసము తెలియదు. ఆవైపులకు వెడదామంటే ధనమూ కావాలి, తీరుబడీ కావాలి. ఇంతకీ నా కోసముగాని తల్లి యెల్లాగా చచ్చింది. ఏమీ చెయ్యలేక ఊరుకున్నాను. ఆపై సంవత్సరమే గామాను నేను మాస్వగ్రామము వెళ్లిపోయినాను.

పదిపదహారేళ్లయింది. ఆవూరు రాట్టే వెళ్లనూ లేదు నా కా కుఱ్ఱాడు ఎక్కడా కనుపించనూ లేదు. కనపడ్డాడేమో ఆనవాలు పట్టడానికి వాణ్ణి యెరిగుంటేగా?

ఏడాది యేడన్నర్థమప్పుడు యెప్పుడో వొకటి రెండుసార్లు చూశాను. ఎదో అక్షరాభ్యాసమనీ ఒడుగనీ పెళ్లనీ యేవో శుభలేఖలుమాత్రము వస్తూండేవి. కానైతే నేనెప్పుడూ వెళ్లలేదు. వెళ్ల

డానికి యెల్లాగో ఉండీది. ఇంతకూ స్నేహమనేది ఆవ్యక్తితోనే ఉంటుందిగాని చుట్టరికములాగా ఆవంశమంతటితోనూ ఉంటుందా, వొకప్పుడు కొంచెము ఆమనిషినుండి వానిఅన్నదమ్ముల దాకానూ పెద్ద వాళ్లుగాఉంటే సంతాన్నముదాకాను పాకచ్చు గాని ఈకుఱ్ఱాడి జన్మ మీదే అనుమానమాయెను.

ఏదోకోర్టుపనిమీద ఆవూరు వెళ్లాను. మాచుట్టాలింట్లో బస. ఆరాత్రి యేదో టాకీసినీమాఅంటే వెళ్లాను. తెనుగు కాదు. నేను వెళ్లేటప్పటికే ఆట ప్రారంభమయింది. ఆచీకట్లోనే యేదో కుర్చీ మీద కూర్చున్నాను. పార్టు అయిపోగానే గప్పున లైటు వెలిగింది. అంతట్లోనే, నాపక్కనుకూర్చున్నవాడు యథాలాపంగా కనపడ్డాడు. లైటారిపోయింది. ఈమనిషిని యెక్కడో చూచినట్లుంది యెక్కడ చూశాను చెప్మా సరే మళ్లీ లైటువేస్తారుగదా చూద్దా మనుకున్నాను. లైటు మళ్లీ వెలిగింది బాగా చూసిన మొఖంలా వుంది. ఆట చూడడం మరచేపోయాను. హఠాత్తుగా మాజానికిరాముడు జ్ఞాపకం వచ్చాడు. లావూ పొడుగూ ఆసన్ననిముక్కూ అంతా అచ్చంగా జానికిరాముడే. వాడే వచ్చుంటాడా అనుకున్నాను. వస్తే రావచ్చు గాని అంతయవ్వనములో యెల్లా వుంటాడు? ఉంటే వుండొచ్చు. కొన్నాళ్లు సన్యాసిగా ఉన్నాడు గనుక దేహాన్ని యవ్వనములో ఉంచుకోగలిగాడేమో అనుకుంటూ ఏదో ఆలోచిస్తున్నాను. ఆట అయిపోయి లైట్లన్నీ వెలిగాయి. ఆమనిషి వెనకాలే వీధిలోకి వచ్చాను. కొంచెము ముందుకి వెళ్లి

" ఏమండీ మీదేవూరు "

" మా దీవూరే "

" మీ పేరు "

"జానికిరామారావు"

"మీయింటి పేరు"

"కరావారు"

"మీరు నన్నెరుగుదురా"

"ఎఱగ నండి"

"నా పేరు సుబ్బరాజు అంటారు లెండి. ఎక్కడైనా చూసి నట్లుగాని పేరువిన్నట్లుగాని ఉందా"

"అన్నట్టు చూడలేదుగాని మావాళ్లు మీ పేరు తరుచు చెప్పాగుంటూంటే విన్నాను.

"మావాళ్లంటే?

"మా బాబయ్యా మా అమ్మ వాళ్లూను. మీకూ మాతండ్రి గారికీ చాలా స్నేహమట. నేను మిమ్మల్ని చూడడము తటస్థించ లేదు."

అప్పటి కప్పుడే హైరోడ్డుమీదికి వచ్చాము.

"మీ రాయింట్లోనే వున్నారుగాదూ"

"ఆ బాగుచేయించి అంతా మార్పుచేశాము లెండి"

"మీ అమ్మగారు బాగున్నారా?"

"ఆమె నిరుడీరోజుల్లోనే చనిపోయిందండి."

"అయ్యో పాపము"

"మీరు తప్పకుండా రేపు మాయింటికి దయచెయ్యాలి. బస ఎక్కడచేశారు? తప్పకుండా రావాలిసుమండీ, కాఫీ కక్కడికే రావాలి"

"ఆ కాఫీలు గీఫీలు మాకు అలవాటు అవలేదు నాయనా, ఇప్పుడు పెద్దలేదు పిన్నలేదు మంచిలేదు చెడ్డలేదు అగ్రజాతిలేదు అంత్యజాతిలేదు అందరికీ వొకటే కాఫీ. మా పురోహితుడు తాగుతాడు మా పాలు పితికే గొల్లాడు తాగుతాడు. ఇంతకూ కాలమహిమ"

“చిత్రము పోనివ్వండి. తాగితే తాగొచ్చు మానితే మా నొచ్చు. పేరుమాత్రము లేకపోతే దయచేసి ఉన్నాను. మా నాన్నగారిని నే నెఱుగనే యెఱుగను. ఇప్పుడున్న ఫోటో అమ్మ వ్రాసిన్నుంది. బహుశా యెక్కడో చెప్పాను కాదు. కనిపెట్టుకొని వున్నాను. సెలవు.”

“నేను వస్తానుగా దూరం. నీ కెందుకు శ్రమ”

ఇద్దరము చెరియొకదారిని ఎవరింటికి వాళ్లము వెళ్లిపోయాము. నా కారాత్రి నిద్ర పట్టలేదు. “ఏమిటీ చిత్రము. మొదట జానకిరాముడే అనుకున్నాను. తీరా అడిగితే పేరుకూడా అదే. పేరు పెట్టక మునుపే తండ్రి లేచిపోవడముచేత ఆపేరు పెట్టారు గామాన్ను. పిల్లణ్ణి చూస్తే వాణ్ణి చూడక్కరలేదు. అచ్చంగా వాడిఫోటో. మేము పొరపాటుపడ్డాము పాపము. నేను పొరపడవచ్చునుగాని జానకిరామునకు యెందుకు పొరపడాలి. ఆవిడచరిత్ర పాపము నిర్దోషమే. స్త్రీజాతి ఎంత చులకన అయిపోయింది. ఇన్నాళ్లు పడినఅభిప్రాయము మార్చుకోవలసి వచ్చిందే. వాడేమైనాడో అతీ గతీ లేదు. ఇంతకూ యిన్నాళ్లనుంచీ అయిష్టంగా చూచినచోటికి వెళ్లడమా వెళ్లకపోవడమా. వెడితే తప్పేమిటి యెన్నిచోట్లకి వెళ్లడములేదు.” అని అనుకుంటూ ఓకునుకు తీసాను. తెల్లారింది. కాల్యకృత్యాలు తీర్చుకుని వాళ్లింటికి వెళ్లాను. నాలుగ్గంట్లబాకా అక్కడే కుర్చీవేస్కు మాట్లాడుకున్నాము. తండ్రిఫోటోగ్రాఫు ఎన్లార్జి చేయించి హాల్లో యెదురుగుండా పెట్టాడు. అంతా బాగానే ఉంది. వాడితో కొడుకు. వాడిచేతిలో ఓపూసాయి పెట్టి ఎప్పుడైనా వస్తే కనుపడుతూంటాన్లే అని బసలోకివచ్చి ఆనర్నాడు మా వూరొచ్చాశాను. అప్పుడప్పుడు ఆవూరు వెళ్లినప్పుడు కలుసుకుంటూనే వుండేవాళ్లము తరువాత, కాని అప్పటికీ యిప్పటికీ నా కీసమస్య విడనేలేదు.